# యమపాశం

గోపీచంద్

నవోదయ పబ్లిషర్స్
విజయవాడ 2

# మున్నుడి

లోకవృత్త పరిశీలన, ప్రతిభ రచయితకు వుండవలసిన ముఖ్యలక్షణాలని ప్రాచీన అలంకారిక శాస్త్రవేత్త రాజశేఖరుడు అన్నాడు. అది నాడూ, నేడూ కూడా సత్యమే. త్రిపురనేని గోపీచంద్‌గారి రచనల్లో మనకు ప్రస్ఫుటంగా కనుపించే లక్షణాలు ఇవే. అందుచేతనే వారి రచనలకు ఆధునికాంధ్ర సాహిత్యంలోనే కాకుండా, విశ్వసాహిత్యంలో కూడా ఒక విశిష్టస్థానం వుంది. వారి కథానికలుకాని, నవలలు కాని, చదువుతున్నంతసేపూ మనలో కొత్తరక్తం ప్రవహిస్తున్నట్లుగా వుంటుంది. చదవడం పూర్తి అయ్యాక, పునర్జన్మ ఎత్తినట్లుగా వుంటుంది. అలాంటి పరిపూర్ణత్వం వారి రచనలకు సిద్ధించింది. ఉత్తమ సాహిత్య స్వరూపానికి వుండవలసిన లక్షణాలన్నింటినీ వారి రచన పుణికిపుచ్చుకొని, తీర్చిదిద్దిన ఆణిముత్యంలా మనముందు మెరిసిపోతూ వుంటుంది. వారి అమృత లేఖినినుండి అవతరించిన ఆఖరి నవల ఈ 'యమపాశం'.

చీఫ్ సెక్రటేరియట్‌లో గుమాస్తాగా పనిచేస్తున్న నారాయణరావు జీవితం ఈ నవలలోని ఇతివృత్తం. ప్రభుత్వ యంత్రాంగం ఒక పరమపద సోపాన పటమనుకొంటే, అందులో తొలిసారిగా పావును కదలించేవాడు నారాయణరావు. అతని జీవయాత్రలోని ముఖ్యమైన ఘట్టాలను గోపీచంద్‌గారు మిక్కిలి మనోహరంగా చిత్రించారు.

నారాయణరావు ఆఫీసులోని కార్యభారంవల్ల ఇంటికి ఆలస్యంగా వచ్చాడు. అప్పటికి చీకటిపడింది. నవల చివర తెల్లవారుతుంది. ఈ ఆద్యంతాల మధ్యలో నారాయణరావు చాలా అనుభవించాడు. మహోన్నతంగా భావించాడు. పాశవిక ప్రవృత్తికి లోనయ్యాడు. ఈ అనుభవాల సంపుటీకరణమే నారాయణరావు.

గోపీచంద్‌గారు తాము చెప్పదలచిందంతా ఈ నవలలోని భిన్న పాత్రల ద్వారా చెప్పించక, పాఠకులకు కొంత వదలివేసి, వారి ఊహాశక్తికి పనికల్పించారు. ఈ నవలలోని వివిధ సంఘటనల చిత్రీకరణ, కథ అల్లిక పాఠకుని చివరంటా లాగుకొని వెళ్ళి ఏకబిగిన చదివింపజేస్తుంది. ఇది వారి నవలా శిల్పంలోని ప్రత్యేకత.

యం. యల్. ఏ. చలమయ్య చేపట్టిన పనయిందా? సంధ్యారాణి తన పలుకుబడిని వుపయోగించి పనులు చేసిపెడుతుందా? గోపీకృష్ణ పైలా పచ్చీస్‌గా

4



జీవిస్తాడా ? ఈవమ్మ నర్సింగ్ హోమ్ నుండి రాజమ్మ బయట పడుతుందా?' అన్న ప్రశ్నల పరంపర చదువరులలో బయల్దేరి, నవలను పూర్తిచేసేవరకూ వారిని విశ్రాంతి తీసుకోనివ్వదని అనడం మాత్రం అతిశయోక్తి కాదు.

ఒకసారి ఉపయోగించిన రచనా శిల్పాన్ని మళ్ళీ మళ్ళీ ఉపయోగించడం గోపీచంద్‌గారి అభిమతం కాదు. వారి 'అసమర్థుని జీవయాత్ర' ఒక మార్గాన పోతే, 'మెరుపుల మరకలు', 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా' భిన్న భిన్న మార్గాలలో నడిచాయి. 'యమపాశం' వెళ్ళిన త్రోవ సరికొత్తది.

ఇందులోని ప్రతివారికీ యమపాశాలు తగుల్కొని ఉన్నాయి. ఆ పాశాల్లో వారు వుండనూలేరు. తెంపుచేసుకొని బయట పడనూలేరు. ఈ అంతర్ బహిర్ సంఘర్షణే 'యమపాశం.'

గోపీచంద్‌గారి ఉద్దేశంలో అన్నింటికంటే పెద్ద యమపాశం ప్రభుత్వ యంత్రాంగం. "నారాయణరావు టేబుల్ మీద వున్న ఫైళ్ళలోకి తల దూర్చటానికి ప్రయత్నించాడు. యమపాశం లాంటి ఎర్రని గుడ్డపీలికలతో (పేగులతో) కట్టబడి ఆ ఫైళ్ళలో కూరుకుపోయివున్న శతకోటి జీవాలు వొక్కుమ్మడిగా మూలిగాయి. ఆ మూలుగులు తన పేగుల కూతలవలే వినిపించాయి."

గోపీచంద్‌గారు సమాచార పౌర సంబంధాలశాఖలో సంయుక్త నిమంత్రణాధికారిగా గడించిన అనుభవంతో ఈ నవల వ్రాశారు. బ్రహ్మాండమైన ప్రభుత్వ యంత్రాంగంలోని లోటుపాట్లను నిశితంగా విమర్శించారు. ఈ విమర్శలో ఏమాత్రం కటుత్వంలేదు. క్రోధం అంతకన్నా కనుపించదు. అపారమైన వ్యంగ్యంతో గొడ్డలిపెట్టుగా విసరబడిన గొప్ప విమర్శనాత్మకమైన నవల ఈ 'యమపాశం.'

ప్రభుత్వ వ్యవస్థ ఎలాంటిదో, ప్రభుత్వోద్యోగులు ఎలాంటి వాతావరణంలో జీవిస్తున్నారో గోపీచంద్‌గారు హృదయంగమంగా చిత్రించారు. అలాంటి సాంఘిక వ్యవస్థను సంస్కరించవలసిన ఆవశ్యకతను ఈ నవల నొక్కి పక్కాణిస్తున్నది. ప్రభుత్వోద్యోగం అనేది సామాన్యుని జీవితానికి 'యమపాశం' వంటిదనీ, దానిలో చిక్కుకోకుండా జాగ్రత్తపడాలనే సందేశం ఈ నవలలో అంతర్గర్భితంగా మనకు లభిస్తున్నది.

—త్రిపురనేని సుబ్బారావు

5

# యమపాశం

ఆనాడు నారాయణరావు ఇంటికి వచ్చేటప్పటికి రాత్రి ఏడు గంటలయింది.

అతను ఛీఫ్ సెక్రెటేరియెట్‌లో గుమ్మాస్తా పని చేస్తున్నాడు. అతను అయిదు గంటలకు తన పని పూర్తి చేసుకొని ఇంటికి బయలుదేరబోతుంటే అతని సెక్షన్ సూపరింటెండెంట్ అర్జంట్‌గా వొక ఫైలు పుటప్ చేసి వెళ్ళమని చెప్పటంతో ఆనాడు ఇంటికి రావటం ఆలస్యం అయింది. ఆ ఫైలు త్వరగా పంపవలసివుంది. ఆ ఫైలు త్వరగా పంపమని మంత్రిగారు సెక్రటరీకి ఫోను చెయ్యగా సెక్రటరీ డిప్యూటీ సెక్రటరీకీ, డిప్యూటీ సెక్రటరీ అసిస్టెంట్ సెక్రటరీకీ, అసిస్టెంట్ సెక్రటరీ సూపరింటెండెంట్‌కి ఫోనుచేసి చెప్పారు. సూపరింటెండెంట్ తన సెక్షన్లో పనిచేస్తున్న

నారాయణరావు మీదకు వచ్చిపడ్డాడు. ఇక నారాయణరావుకి తప్పేది ఏముంది? 'అయిదు గంట లయింది నేను వెళ్ళిపోవాలి' అనలేడుగదా! అంటే ఉద్యోగం నిలవదు. ఇన్సబార్డినేషన్ క్రింద, వొక నోటు పైకి వెళ్ళడమూ, అతని కాన్ఫిడెన్షల్ రిపోర్టులోకి ఎక్కడమూ జరుగుతుంది. అతను కష్టపడి పనిచేస్తే మాత్రం కాన్ఫిడెన్షల్ రిపోర్టు చెడకుండా వుంటుందనే గ్యారంటీ ఏమున్న దంటారా? అది వేరే విషయం. ఆ మాట మీరు అడుగనూ కూడదు. నేను చెప్పనూ కూడదు.

ప్రభుత్వ యంత్రాంగం అనేది ఒక పరమపద సోపానపటం. ఆ పటంలో ఏ గదికి ఆ గదికే ఒక పాము వుంటుంది. ఆ పాము ఎప్పుడు ఎక్కడ కాటువేసినా వెయ్యవచ్చు. ఆ పాముకాటుకు గురి అయిన వుద్యోగి, కనురెప్ప పాటులో బయలుదేరిన స్థలానికివచ్చి కూర్చుంటాడు. ఎక్కటం కష్టం. దిగటాని కేముంది? భూమితగిలే వరకూ జర్రున జారటమే.

ఎప్పుడో ఒకప్పుడు పాము కాటువెయ్యక పోదనీ, జర్రున జారక తప్పదనీ అనుకొని ఎక్కటం మానుకోడు గదా మానవుడు. అందుకని, అంటే ఎక్కగలందులకు, కష్టపడి పనిచేస్తాడు. పై అధికారి, 'నీకు బుద్ధిలేదు' అంటే, 'యస్, సర్!' అంటాడు. అంతకీ కోపంవస్తే ఆ కోపం పైకి కనపడనివ్వకుండా పెదవులు బిగబట్టి, 'నాకే కాదండీ, చాలా మందికి లేదండీ' అంటాడు. అలా కష్టపడి

పనిచేస్తూ 'యస్, సర్' అంటూ 'అప్పుడప్పుడూ బుద్ధి నాకే కాదండీ, చాలామందికి లేదండీ' అంటూ తిరిగే వాళ్ళల్లో నారాయణరావు వొకడు.

నారాయణరావు కూడా ఎక్కాలనే అభిలాష కల వాడవటం వల్ల సూపరింటెండెంట్ చెప్పగానే 'యస్, సర్' అని ఇంటికి వెళ్ళటానికి గాను తగిలించుకొన్న కోటును తీసి, మళ్ళీ కుర్చీకి తగిలించి కూర్చుని ఫైలు తీశాడు. ఆ ఫైలు క్షుణ్ణంగా చదివి, అందులో వున్న విషయాలను క్రోడీకరించి వొకనోటు వ్రాసి, సూపరింటెండెంట్‌కి పుటప్ చేశాడు.

"ఫైలు చదివావా? అడిగానని మొక్కు తీర్చుకున్నావా?" అన్నాడు సూపరింటెండెంట్.

"క్షుణ్ణంగా చదివే నోట్ పెట్టానండీ."

"అసలు సంగతేమిటో చెప్పు," అన్నాడు సూపరింటెండెంట్.

ఫైల్లోవున్న విషయాలన్నీ పూసగుచ్చినట్లు చెప్పాడు నారాయణరావు.

"సరే, నేను చూస్తాను. ఇక నీవు వెళ్ళు" అన్నాడు సూపరింటెండెంట్.

అతను క్రింది ఉద్యోగి కండ్లలో చులకన కాకుండా వుండగలందులకు అలా అన్నాడు గాని, చూచేది ఏమీ వుండదని నారాయణరావుకి తెలుసు. అతను దస్కత్తు పెట్టి అసిస్టెంట్ సెక్రటరీకి ఆ ఫైలు సబ్‌మిట్ చేస్తాడు. అసిస్టెంట్ సెక్రటరీ డెప్యూటీ సెక్రటరీకీ, డెప్యూటీ సెక్రట

సెక్రటరీకి, సెక్రటరీ మంత్రిగారికీ వొకరి తర్వాత ఒకరు దస్కత్తు పెడుతూ సబ్ మిట్ చేస్తూ వెళ్తారు. చివరికి మంత్రి గారు ఆ ఫైలుమీద ఫైనల్ ఆర్డర్సు వేస్తారు. మంత్రిగారు ప్రజాప్రతినిధులు అవటంవల్ల వారి ఆర్డరుకు తిరుగు వుండదు.

తనచేత కదిలింపబడిన ఫైలు ఎక్కే సోపానాలను గురించి ఆలోచించుకుంటూ ఇంటికి బయలుదేరాడు నారాయణరావు.

తను నోటు పెట్టిన ఫైలు సెక్రటరీ దగ్గరకూ, మినిస్టరు దగ్గరకూ వెళ్ళటం అనేది, దానంతట అదే అతనికి సంతోషాన్నిస్తుంది. తాను పెట్టిన నోటు అంతవారు చూడటం గర్వపడవలసిన విషయమేనని అతని అభిప్రాయం. దీనికితోడు ఫైలు సోపానపంక్తిని అధిరోహిస్తున్నప్పుడల్లా అతనికి ఒక ఆశకూడా ఉంటూ వుంటుంది.

అతని అక్షరాలు ముత్యాలవలె వుంటై. ఫైలు క్షుణ్ణంగా చదివి శుద్ధంగా నోటు పెట్టగలడు. అతని ఇంగ్లీషు కూడా మిగిలిన గుమాస్తాల ఇంగ్లీషువలె 'బాబ్స్' ఇంగ్లీషు కాక, ఇడియోమాటిక్‌గా వుంటుంది. అందువల్ల తన నోటు చూచి ముచ్చటపడి ఎప్పుడో ఒకప్పుడు సెక్రటరీ గానీ, మినిస్టరుగానీ తనను పిలిపించి మెచ్చుకొని ప్రమోషన్ ఇవ్వకపోరనే ఆశ అతనిని నిరంతరం వెన్నాడుతూ ఉంటుంది. అది ఇంతవరకు జరగకపోయినా త్వరలోనే జరగగలదని అతని విశ్వాసం.

'యిప్పుడు సోపానపంక్తి ఎక్కుతున్న ఫైలే ఆ అదృష్టాన్ని తెచ్చిపెట్టవచ్చేమో ఎవ్వరు చెప్పగలరు?' అనుకుంటూ ఇంటికి జేరుకున్నాడు నారాయణరావు. పైగా మెట్లమీద గదుల్లో వున్న పాములు మనుష్యులను కాటువేసినంత వేగిరంగా ఫైళ్ళను కాటువెయ్యవు.

అలా ఆలోచించుకుంటూ, నారాయణరావు ఇంటికి జేరాడు

నారాయణరావు యిల్లు చాలా చిన్నది. వంటగది మినహాయించి మూడుగదులు వుంటాయి. తనూ, భార్యా, పిల్లలూ ఆ మూడుగదుల్లోనే వుంటారు. పిల్లలంటే ఒకరా, ఇద్దరా ఏడుగురు పిల్లలు వున్నారతనికి. ఆ ఏడుగురు పిల్లలతో అంత చిన్న యింట్లో కాపురం వుండటం అతనికి కష్టంగానే వుంది. కాని ఏం చేసేటట్టు? ప్రభుత్వం గుమాస్తాలను కనికరించి కట్టించి ఇవ్వబట్టి ఆ ఇల్లయినా దక్కింది, లేకపోతే అదీ కష్టమే అయ్యేది.

మామూలుగా అతను ఇంటికి వచ్చేటప్పటికి కనీసం ఏ ముగ్గురు నలుగురు పిల్లలైనా ఇంటి ముందు ఆడుకుంటూ వుండేవారు. అవాళ ఎవ్వరూ కనపడలేదు. యిల్లు నిశ్శబ్దంగా వుంది. లోపల గదిలోనుంచి పాత్రల మోత వినవస్తూవుంది. భార్య వంట చేసుకుంటూ వుండి వుంటుందనుకున్నాడు. అతని భార్యపేరు రాజమ్మ.

కోటు వంకెకు తగిలిస్తూ, "ఏమయ్యారు వీళ్ళు ?" అని అడిగాడు వంట యింట్లో వున్న భార్యకు వినబడేటట్లు బిగ్గరగా

"పెద్ద పిల్లలు పేరంటానికి వెళ్ళారు. చిన్న పిల్లలు ఎక్కడో ఆడుకుంటూ వుండి ఉంటారు," అన్నది రాజమ్మ వంట యింట్లోనుంచి.

"యిప్పుడు టైమెంత అయిందో తెలుసా?" అని అడిగాడు నారాయణరావు.

"నాకేం తెలుస్తుంది?" అని లోపలనుంచి సమాధానం వచ్చింది.

ఆ సమాధానంతో ఏ కారణంవల్లో రాజమ్మ కోపం మీద ఉన్నదని గ్రహించాడు నారాయణరావు. రాజమ్మ మంచిదే కాని కోపిష్ఠి. ఆ కోపంకూడా ఎప్పుడు వస్తుందో ఎప్పుడు పోతుందో ఎవ్వరూ చెప్పలేరు. వచ్చినప్పుడు ఇక పట్టపగ్గాలు ఉండవు. భర్త అని కూడా చూడదు. నోటికి ఎంతమాటవస్తే అంతా అని వేస్తుంది. అందుకని భార్య అంటే భయం ఎప్పుడూ ఒక మూల వుంటూనే వుంటుంది నారాయణరావుకి.

"చీకటిపడేటప్పటికి పిల్లలు యింట్లో వుండేటట్లు చూడమని నీ కెన్నిసార్లు చెప్పాను" అన్నాడు నారాయణరావు.

"నా వల్లకాదు," అన్నది రాజమ్మ వంట యింట్లో నుంచే.

"ఏమిటి నీవల్లకానిది?"

"ఎందుకట్లా యింటికి రావటం రావటమే రుసరుసలాడుతూ వస్తారు?" అంటూ వంట యింట్లోనుంచి బయ[illegible] [illegible] రాజమ్మ. పొంగు [illegible] కూర మాడ[illegible]

తిప్పుతూ వ్రాసేనో చేతిలో గరిటెకూడా వుంది. "శ్రాద్ధ స్తమూవం నే నీ వంటతో సతమత మాతుంటే, ఒకమంచి మాట అనకపోగా, ఈ సరాగం ఏమిటి? మీకేం? అన్నం ఉడకగానే, యింత నోట్లో వేసుకొని ఆఫీసుకు వెళ్ళి ఇప్పుడొస్తారు. మీకేం తెలుస్తుంది: ఈ వంటతోనూ పిల్లలతోనూ నేను పడే యాతన. పిల్లలంటే వీళ్ళు మామూలు పిల్లలా! రాక్షసులు. ఇంతమంది ఇంట్లో ఉన్నారన్నమాటేగాని ఇక్కడ పుల్ల అక్కడ పెట్టేవాళ్ళు ఒక్కళ్ళు లేకపోయిరి పైగా మిమ్మల్నిచూచి వాళ్ళు కూడా నా మీద పెత్తనం చెలాయిస్తూ వుంటిరి," అన్నది.

యిక మాట్లాడే ప్రయోజనం లేదని గ్రహించాడు నారాయణరావు. తను గట్టిగా ఒకమాట అంటే ఆమె శృతి తప్పక తప్పుతుంది. అలా తప్పిన శృతి దారికి వచ్చేటప్పటికి కనీసం నాలుగైదు రోజులయినా పడుతుంది. ఆ నాలుగయిదు రోజులూ యిల్లు యిల్లుగా వుండదు. తేనెతుట్టెలాగు, అంబులపొదిలాగు తయారవుతుంది.

వెనుక ముందులు ఆలోచించుకొని తగ్గాడు నారాయణరావు. అతని వృత్తి, అతనికి నేర్పిన విద్య అది.

"నీ మీద పెత్తనం చెలాయిస్తున్నారూ వాళ్ళు!" అన్నాడు అమిత సానుభూతిని ప్రకటిస్తూ.

"ఒక పెత్తనం చెలాయించటం ఏమిటి! నేను అసలు వాళ్ళకి మనిషిగాకనపడుతున్నానా? ఒకతల్లి అనీ,తల్లిని గౌర

వించాలనీ ఆగుంపులో ఒకళ్ళకయినా వుందా ? ఎవ్వరికి వాళ్ళు ఒక వంటదాన్ని చూచినట్లు చూస్తారామె. మాటి మాటికీ విసురు కుంటారు; కసురుకుంటారు వీళ్ళు నాకు పెట్టి పోషిస్తున్నారు గనుక నేను పడాలా ?" అన్నది.

తన భార్య నోటినుంచి వస్తున్న ఈ మాటలు చాలా చిత్రంగా వినిపించినై నారాయణరావుకి. ఆమెకు పిల్లలంటే యిష్టమే. తను ఎప్పుడన్నా కసురుకున్నా పిల్లలను వెనుక వేసుకొచ్చే దామె. 'పిల్లలమీద, అట్లా పరాయి వాళ్ళమీద నోరు చేసుకున్నట్లు చేసుకుంటా రేమిటి ?' అనేది. 'చీటికీ మాటికీ వాళ్ళని వెనక వేసుకు రావద్దు.' అని తానంటే 'కన్న కడుపు తీపి మీకేం తెలుస్తుంది.' అనేది.

అటువంటి ఆమె పిల్లలను నిందిస్తుంటే నారాయణ రావుకి ఆశ్చర్యం వేసింది. తన పిల్లల్లో తలిదండ్రుల పట్ల గౌరవం లేనివాళ్ళు ఎవ్వరూ లేరు. పిల్లలు గనక తెలిసీ తెలియక అసందర్భపు మాటలు ఏమన్నా అంటే అని వుండ వచ్చు. దానికి తన భార్య అంత ఆర్భాటం చెయ్యటానికి పైకి కనబడని, ఆమె చెప్పని కారణం ఏదో వుండి వుంటుంది అనుకున్నాడు నారాయణరావు.

అజ కనుక్కున్నట్లు వుండటం ఎందుకైనా మంచిదని "వాళ్ళల్లో ఎవ్వరు నీ మీద పెత్తనం చెలాయిస్తున్నది?" అని అడిగాడు.

భర్త కొంచం సాదరంగా మాట్లాడేటప్పటికి ఆమె కోపం తగ్గి, కంఠం రుద్ధమయింది. "ఒకరేమిటి, అందరూనూ," అన్నది చీరె చెంగుతో కండ్లు అద్దుకుంటూ. "మొన్నటికి మొన్న కూరలో కాస్త వుప్పు తగ్గేటప్పటికి 'వంట ఎక్కడ నేర్చుకున్నావు ?' అని ముఖాన అడిగింది పెద్దది. నేను కూరలో రామములక్కాయ వెయ్యనట—అందుకని నా వంట పాత వంటట. నిన్న ఆ రెండోది ఏమన్నదో విన్నారా? నాకు ఇరుగుపొరుగు వాళ్ళతో మాట్లాట్టమే చేతకాదట. కట్టెవిరిచి పొయ్యిలో పెట్టినట్టు మాట్లాడుతానట. ఆ పిల్ల తన స్నేహితుల ఇళ్ళకు, ఎవరి యిళ్ళకు వెళ్ళినా వాళ్ళ అమ్మలు కాఫీపెట్టి వెండి గ్లాసుల్లో పట్టుకువచ్చి యిస్తారుట. కూర్చుని పిల్లలతోపాటు వాళ్ళూ కబుర్లు చెపుతారుట. మన యింటికి దాని స్నేహితులు వస్తే నేను మాట్లాడకుండా వెళ్ళి పొయ్యి దగ్గర కూర్చుంటానట—దానికి చాలా అవమానంగా ఉంటుందట! వింటున్నారా? నన్ను చూస్తే దానికి అవమానంగా ఉంటుందటండీ!" అన్నది.

"పిల్లలుగదా! వాళ్ళేదో అంటూ వుంటారు. ఎందుకు వాళ్ళ మాటలు అంత పట్టించుకుంటావ్?" అన్నాడు నారాయణరావు.

"ఎంత పిల్లలు అయితే మాత్రం? ఇతర ఇండ్లలో

పిల్లలు వాళ్ళ అమ్మలను పట్టుకొని ఇంతలేసి మాటలు అంటారుటండీ? - వీళ్ళకు వచ్చింది గానీ పోయేకాలం? మొన్న ఆ రెండోది 'అమ్మా నువ్వెప్పుడూ ఇంత మురికిగా వుంటావేమే' అని అడిగింది. అస్తమానం పొయ్యిదగ్గర పడి చచ్చేదాన్ని మురికిగావుండక వాళ్ళకుమల్లే శుభ్రంగా వుండమంటే ఎట్లా వుంటాను? అక్కడికీ వాళ్ళతో మాటలు ఎందుకు పడాలని విన్న స్నానంచేసి పండక్కి మీరు తెచ్చిన కొత్తచీరె కట్టుకున్నా. అదిచూచి పెద్దది, 'చిన్నపిల్లకి మల్లే నీకెందుకమ్మా ఈ కొత్తచీరె? ఏది కట్టుకుంటే సరిపోదు?' అన్నది పుటిక్కిన. ఏంచేసినా తప్పేనయిపోయె. ఇదిగో చెపుతున్నా వినండి. ఈ కాపరం నేను సాదలేను. నావల్ల కాదు. తరవాత మీ యిష్టం" అన్నది. అని చరచరా లోపలకు వెళ్ళిపోయింది.

నారాయణరావు ఆలోచిస్తూ కూర్చున్నాడు. అతనికి పెండ్లిముచ్చట జ్ఞాపకం వచ్చింది. అతను కాలేజీ విద్యార్థిగా వున్నప్పుడు వివాహం అయింది. అతని కుటుంబం పట్టణానికి చెందిందికాదు. అందువల్ల కాలేజీ చదువుకి పట్టణంవచ్చి, ఒక గది అద్దెకు తీసుకుని వుంటూ వుండేవాడు. హోటల్లో భోజనం.

కాలేజీలో చదువుకునే రోజుల్లో అతను మంచి అభ్యుదయభావాలు కలవాడిక్రింద లెక్క. విద్యార్థి జీవితానికి సంబంధించిన కార్యక్రమాలలోనేకాక, బయటి ప్రపంచంలో నడుస్తున్న అన్ని అభ్యుదయ ఉద్యమాల

లోనూ పాల్గొంటూ వుండేవాడు. మంచి పేరులో వుండే వాడు. అంతా అతనికి ఉన్నతమైన భవిష్యత్తు ఉందని భావించేవారు. అదే రోజుల్లో అతను రాజమ్మను ప్రేమించటం జరిగింది. అదికూడా భగవంతుని నిర్దేశంలాగు జరిగింది.

రాజమ్మకు ఒక అన్న వుండేవాడు. అతను అతి సున్నితంగా వుండి ఆడపిల్లలాగు వుండేవాడు. అతనిని విద్యార్థులందరూ 'రోజా' అని పిలుస్తుండేవారు. అతనికీ, నారాయణరావుకీ స్నేహం. స్నేహమంటే, నారాయణరావంటే అతనికి గాఢమైన అభిమానమూ, గౌరవమూనూ. అతనంటే నారాయణరావుకి జాలీ, సానుభూతీనూ. ఏ విద్యార్థి అతనిని ఆటలు పట్టించినా తను వొచ్చి నారాయణరావుకే చెప్పకుంటూ వుండేవాడు. విద్యార్థుల ఎగతాళినుంచి అతనిని కాపాడటం తన బాధ్యత అనుకునేవాడు నారాయణరావు.

రోజా అసలు పేరు గోపీకృష్ణ.

ఈ పరిస్థితుల్లో కాలేజీ వార్షికోత్సవం దగ్గరపడింది. ఆ వార్షికోత్సవానికి షేక్స్పియర్ వ్రాసిన ఒథెల్లో వెయ్యాలని విద్యార్థులు నిర్ణయించారు. నారాయణరావు అంతకుముందే సాంస్కృతికోత్సవాల్లో పాల్గొంటూ, పేరు సంపాదించివుండటంవల్ల, ఒథెల్లో పాత్ర ధరించవలసిన బాధ్యత అతనిమీద సహజంగా పడింది. అతను హృదయపూర్వకంగా అంగీకరించాడు. షేక్స్పియర్ నాటకాల్లో అభినయించటం అతనికి గర్వకారణం అయింది.

అయితే డెస్టమోనా వేసేది ఎవ్వరు?

ఆ రోజులు ఈ రోజులలాగు లేవు. కాలేజీల్లో చదువుకునే విద్యార్థినులు ఎక్కువమంది లేరు. ఒకరో యిద్దరో వున్నా ఈనాటి విద్యార్థినులంత ఫార్వార్డుగా వుండేవారు కాదు. తమ చదువేమో తామేమో తప్ప ఇతర విషయాలలో పాల్గొనేవారు కాదు. అందులో నాటకాల్లో వేషం వెయ్యటం తప్పుగానే భావించబడుతూ వుండేది. అందువల్ల స్త్రీ పాత్రలను పురుషులే ధరించవలసివస్తూ వుండేది. ధరిస్తూవుండేవారు.

డెస్టెమోనా పాత్రను గురించి విద్యార్థులు ఆలోచించి ఆలోచించి, చివరకు ఆ పాత్రను గోపీకృష్ణ ధరిస్తే బాగుంటుందని నిర్ణయించారు. అతను అంగీకరించాడు.

నాటకం చూడటానికి రాజకుమారికూడా వచ్చింది. (రాజకుమారి ఆనాటి రాజమ్మ పేరు). రాజకుమారికి నాటకం నచ్చింది. ముఖ్యంగా ఒథెల్లో పాత్ర ధరించిన నారాయణరావు మరీ నచ్చాడు.

డెస్టెమోనాను చంపటానికివచ్చిన సీనులో, 'అదే కారణం; అదే కారణం; చెప్పకుండా వుండనుకాక' అని అంటూ అతను ప్రవేశించినప్పుడు, ఆమె భయంతో ఒణికిపోతూ, కెవ్వున కేక వెయ్యటానికి సిద్ధపడింది. అదృష్టవశాత్తు ఆపని జరుగలేదు. 'దీపం ఆర్పి, జ్యోతి ఆస్పతాను' అని అతను అన్నప్పుడు, ఎక్కడ మూర్ఛపోతానో అనే భయంతో ప్రాణాలను బిగబట్టుకొని కూర్చుంది.

ఇక ఆసీను చివరిభాగంలో ఆమె పడిన యాతన వర్ణించ నలవికానంతగా వుంది.

ఒథెల్లో డెస్టెమోనామీద కోపియాగో ఆమె అవినీతిగా ప్రవర్తించిందనే నేరం మోపినప్పటినుంచీ ఆమె హత్య గావింపబడేవరకూ రాజకుమారి కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ కూర్చుంది. అప్పుడామెకు ఇతరులు తనను చూస్తారనే గమనంకూడా లేకుండాపోయింది.

"అయ్యో! అతను మోసగించబడినాడు. నేను సర్వనాశనమైనాను" అన్నది డెస్డెమోనా.

"కులటా! నాముందే అతనినిగురించి జాలిపడుతున్నావా?" అని కోపోద్రిక్తుడైనాడు ఒథెల్లో.

"నన్ను బహిష్కరించండి. చంపకండి" అని కోరింది డెస్టెమోనా.

"నిన్ను మట్టిపాలుచేస్తాను" అన్నాడు ఒథెల్లో

"ఈ రాత్రికి నన్ను బ్రతకనీయండి" అన్నది డెస్టెమోనా.

"వీల్లేదు" అన్నాడు ఒథెల్లో.

"ఒక్క అరగంట" అన్నది డెస్టెమోనా.

"ఆగను" అన్నాడు ఒథెల్లో.

"ప్రార్థన చెప్పుకునే వరకైనా" అన్నది డెస్డెమోనా.

"ఆలస్యం అవుతుంది" అన్నాడు ఒథెల్లో

ఆమెను చంపాడు.

అంతకుముందునుంచీ ప్రబల ప్రయత్నంతో ఆపుకుంటూవచ్చిన కేక, ఆమె హృదయాన్ని చీల్చుకొని బయ

ల్పోడలింది. కెవ్వుమన్నది. కాని ఎవ్వరికీ వారు ఏడుస్తూవుండటంవల్ల ఆమె కేక ఎక్కువమంది దృష్టిని ఆకర్షించలేదు.

మరునాడు నారాయణరావుని చూడాలనిపించింది రాజకుమారికి. అన్నద్వారా ఇంటికి ఆహ్వానించింది.

వారిద్దరికీ ఈ విధంగా పరిచయం అయింది. ఒకరి నొకరు ప్రేమించుకోవటం జరిగింది. ప్రేమ దినదినాభివృద్ధి చెందింది. చివరకు వివాహం చేసుకున్నారు.

నిజానికి రాజకుమారి తనకంటే ఉన్నత కుటుంబానికి చెందింది. అప్పుడామె తండ్రి ప్రభుత్వ కార్యాలయంలో డిప్యూటీ సెక్రటరీ పదవిలో వున్నాడు. మొదట్లో తన కూతురు నారాయణరావుని వివాహం చేసుకోటానికి అతను అంగీకరించలేదు. కాని రాజకుమారి పట్టుపట్టుకు కూర్చుంది. ఆమెకు గోపీకృష్ణ వత్తాసుగా నిలబడ్డాడు. వివాహం జరిగింది.

తనను అంత గాఢంగా ప్రేమించి, తండ్రికి ఎదురు తిరగటానికి కూడా వెనుదీయని రాజకుమారి, ఇప్పుడీ స్థితికి వచ్చింది. ఇందుకు ఆమెను అనవలసిన పనిలేదు. కాన్పులు మీద కాన్పులు వచ్చి ఆమె ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. పిల్లలు ఎక్కువ అవటంతో తన సంపాదన చాలక, ఇల్లు చీదరకు పుట్టినిల్లయింది. జీవితంలో వివాహంనాడు తాము ఊహించిన ఏపనీ జరగలేదు. ఆమెకు అచ్చటా, ముచ్చటా తీరలేదు. ఆమెను అని ఏం ప్రయోజనం? ఆ మాటకువస్తే ఎవ్వరినని ఏం ప్రయోజనం? సర్దుకుపోయే వాడిది రాజ్యం.

నారాయణరావుకి ఏమీ తోచక ఆవులించి వొళ్ళు విరుచుకున్నాడు. నెమ్మదిగా లేచి భార్య ఏంచేస్తున్నదో చూద్దామని వంట ఇంట్లోకి వెళ్ళాడు. వంట పూర్తయింది. ఆమె వంట పాత్రలు సర్దుతూవుంది.

"పిల్లలు ఎక్కడికి వెళ్ళినట్లు?" అని మళ్ళీ అడిగాడు.

"చెప్పాను గదా!"

"పేరంటానికి వెళ్ళినవాళ్ళు ఇప్పటిదాకా ఏంచేస్తున్నారు?"

"ఆసంగతి నాకెట్లా తెలుస్తుంది?" అని అడిగింది రాజమ్మ.

"చిన్నవాళ్ళు ఆటలసందునపడి ఎక్కడికన్నా వెళ్ళారేమో!"

"ఎక్కడికీ వెళ్ళరు. వాళ్ళే తిరిగివస్తారు," అన్నది రాజమ్మ నిర్లక్ష్యంగా. "వెళ్ళేవాళ్ళు పట్టుకుంటేమాత్రం ఆగుతారు గనకనా!" అని కలిపింది.

ఆమె నిర్లక్ష్యానికి అతనికి చికాకు కలిగింది. మిగిలిన వాళ్ళమాట అటుంచి, చిన్నపిల్లవాడికి మూడేళ్ళు. మాటలు కూడా సరిగ్గారావు. ఆమె ధోరణిచూస్తే వాడు తప్పిపోతాడేమో అనే భయంకూడా వున్నట్లులేదు.

"చీకటి పడగానే వాళ్ళు ఇంటికి వచ్చేటట్లు చూడటంమంచిది" అన్నాడు తనకుతానే చెప్పుకుంటున్నట్లు.

"అయితే వాళ్ళతోపాటు నన్నుకూడా బజార్లు పట్టుకొని తిరగమంటారా ఏమిటండీ?" అని కసురుకుంది రాజమ్మ.

"నిన్ను తిరగమని నే నెట్లా అంటాను. కాస్త అజ కనుక్కుంటూవుంటే సరిపోయె" అన్నాడు నారాయణరావు.

"ఆడుకోటానికి వెళ్ళినవాళ్ళు తిరిగి రాకపోతే వాళ్ళని వెతుక్కుంటూ నేను వెళ్ళవలసిందేగా? మీరు పెట్టిన నౌకర్లను పంపి వెతికించమంటారా?" అని అడిగింది రాజమ్మ ముక్కు పుటాలు ఎగరవేస్తూ.

'అదీ నిజమే' అనిపించి వూరుకున్నాడు నారాయణ రావు. ఇంట్లో నౌకరులేదు. ఆఖరికి అంట్లుతోమేది కూడా లేదు. అన్ని పనులూ రాజమ్మే చేసుకోవాలి. అందులో పిల్లలు స్వతహాగా గుండగొయ్యాలు—వాళ్ళమాట వినే వాళ్ళుకాదు.

ఇక మాట తప్పించటంకంటే గత్యంతరం లేకపో యింది నారాయణరావుకి. "ఏం కూర చేశావు?" అని అడి గాడు.

"ఏదో చేశాను" అన్నది రాజమ్మ.

ఆమెను మురిపిద్దామని, "నేను చెప్పుకోనా?" అని అడిగాడు.

"చెప్పండి" అన్నది.

"నిన్న వేపుడువెయ్యగా మిగిలిన పెండలంముక్క ఇవ్వాళ పాలుపోసి వండి వుంటావు" అన్నాడు.

"అది ఇప్పటిదాకా వుండనిచ్చారా! పొద్దున్నే పొయిలో పెట్టి, పొడిచేసి, ఇంత పంచదార వేసుకొని తిన్నారు పిల్లలు" అన్నది రాజమ్మ.

"అయితే ఏంచేశావు?"

"నెల మొదట్లో తెప్పించిన శనగపప్పు కాసిసి మిగిలివుంటే కూర చేశాను" అన్నది.

"శనగపప్పుకూర బాగుంటుంది. కోడిగుడ్డు పొట్టులా గుంటుంది." అన్నాడు నారాయణరావు.

"ఎలాగైనా ఉండనివ్వండి, వున్నకూర అది."

ఆమెకోపం కొంచం తగ్గిందనుకొని, "ఎందుకు ఈ పూట ఇలావున్నావు?" అని అడిగాడు నారాయణరావు.

"ఇవ్వాళ నామనస్సు ఏమీ బాగాలేదు. నన్ను విసిగించకండి. అవతలకు వెళ్ళండి," అన్నది రాజమ్మ.

నారాయణరావు వంట ఇంట్లోనుంచి బయటకువచ్చి ముందుగదిలో కూర్చున్నాడు. తన భార్యకు కోపం రావటానికి కారణం ఏమిటా అని ఆలోచించాడు. ఉదయం నుంచీ జరిగిన సంగతులన్నీ జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. తన వల్ల ఏ పొరపాటూ జరిగినట్లులేదు. మామూలుగా ఆమెకు కోపం వచ్చే కారణాలను స్ఫురణకు తెచ్చుకున్నాడు. మామూలుగా ఆమె ఇల్లు విడచి బయటకు వెళ్ళదు. తను రమ్మన్నా ఎప్పుడోతప్ప సినిమాలకూ, పార్కుకీ రాదు. తనకు అప్పుడప్పుడూ ఆమెతో కలిసి సినిమాకు వెళ్ళాలని పార్కుకి షికారు వెళ్ళాలనీ అనిపిస్తుంది. అటువంటి సమయాల్లో పిలిస్తే రాదు.

"నాకు అదొక్కటే తక్కువయింది," అంటుంది.

కాని వొక్కొక్కరోజు ఆమెకు ఏమేమి జ్ఞాపకం వస్తాయో, "నన్ను బయటకు తీసుకువెళ్ళకుండా ఇంట్లో కుక్కి ఎందుకూ పనికిరాని దానిని చేశారు." అని పోట్లాట వేసుకుంటుంది.

"పోనీ ఇప్పుడు వెళ్దాంరా," అంటాడతను.

"పిలిచి తద్దినం పెట్టించుకున్నట్టు వుంది," అంటుంది ఆమె.

ఎప్పుడో వొకటి రెండుసార్లు ఆమెను బ్రతిమాలి సాయంకాలం సినిమాకు వచ్చేటట్టు వొప్పించి, తను సమయానికి రాలేకపోయాడు. అప్పుడు పెద్దయుద్ధమే జరిగింది.

రెండు సంవత్సరాల క్రిందట మరొకసంఘటన జరిగింది.

ఆఫీసులో తనువుండే గదిప్రక్కనే, తను పనిచేసే డిపార్టుమెంట్‌కి సంబంధించిన లైబ్రరీ వుండేది. అప్పుడు లైబ్రేరియన్‌గా వొక అమ్మాయిని అప్పాయింట్ చేశారు. అమ్మాయికి దగ్గర దగ్గర ఇరవై సంవత్సరాలు వుంటాయి. పెండ్లికాలేదు. పేరు శారద.

శారద నిజంగానేమంచిపిల్ల. ప్రక్కగదిలో వుండటం వల్ల తనకూ ఆమెకు పరిచయం అయింది. పరిచయం స్నేహంగా మారింది. పుస్తకాలు సర్దటంలోగానీ, పుస్తకాల లెక్కలోగానీ, ఏ అనుమానం వచ్చినా శారద తన సలహా తీసుకుంటూ వుండేది. తను చెప్పినట్లు నడుచుకునేది.

శారదకు తల్లీ తండ్రీ ఎవ్వరూలేరు. వొక్కత్తె

వుంటూ వుండేది. ఆఫీసుకు వచ్చేటప్పుడే భోజనం చేసుకొని మధ్యాహ్నానికని టిఫిన్ వండుకొని ఆఫీసుకు తెచ్చుకుంటూ ఉండేది. నారాయణరావు భార్యను బాధపెట్టటం ఎందుకని టిఫిన్ తెచ్చుకునేవాడుకాదు. లంచ్ టైములో ఇంటికి వెళ్ళివొద్దామంటే అనవసరంగా రిక్షా డబ్బు దండగ. అందుకని ఆఫీసు కాన్టీన్‌లోనే ఏదో ఇంతతిని వొక అరకప్పు కాఫీ త్రాగి ముగించుకునేవాడు.

ఒకరోజు శారదకు సలహాలు చెపుతూ లంచ్ టైం వరకూ లైబ్రరీలోనే వుండిపోయాడు తను. తనతో పాటు టిఫిన్ చెయ్యవలసిందని కోరింది శారద. అతను అంగీకరించాడు ముఖమాటం పడినట్లు నటిస్తూ.

ఆరోజు మొదలుకొని శారద రోజూ ఇద్దరికీ టిఫినూ, కాఫీ తెచ్చేది. ఇద్దరూ కలిసి తినేవారు. గిట్టనివాళ్లు వాళ్ళిద్దరిని గురించీ పుకార్లు వెయ్యకపోలేదు. కాని వాళ్ళు లక్ష్యపెట్టలేదు.

టిఫిన్‌తింటూ, "ఏమన్నా అర్థం వుందా" అనేవాడు నారాయణరావు.

"ఏ విషయమండీ?" అని అడిగేది శారద.

ఆఫీసులో అనుకునే పుకార్లు చెప్పేవాడు నారాయణరావు.

"అనుకోనివ్వండి. వాళ్ళ బుద్ధులే బయటపడతై," అనేది శారద.

"నాకిప్పుడు కనీసం నలభై అయిదేళ్ళయినావుంటై

నీకు ఇప్పుడు పద్ధెనిమిదీ ఇరవై ఏళ్ళకంటే ఎక్కువలేవామె అంటె యించుమించు నా పెద్దకూతురు వయస్సన్నమాట. పుకార్లు వెయ్యటానికి మాత్రం వొకపద్ధతి వుండక్కర్లేదా!" అనేవాడు నారాయణరావు.

"వాటికేమొచ్చెలెండి? మనదేశంలో పుష్కలంగా పండే పంట అదేనాయె," అనేది శారద. అని ఇంకొక్క పెసరట్టు వడ్డించేది.

అతను భోజనప్రియుడు. అందువల్ల మొదట్లో కొంచం ముఖమాటపడినా తరువాత తరువాత తృప్తిగా తినేవాడు. దానికి తగినట్లు ఆమె చేసుకువచ్చేది.

ఒకరోజు శారద అతనిని తన ఇంటికి ఆహ్వానించింది. ఆమె రెండుగదులు అద్దెకు తీసుకొని వుంటూవుంది. ఆగదులుచూస్తే నారాయణరావుకి అమితాశ్చర్యం కలిగింది.

ఆమె గదులు చాలా శుభ్రంగా అట్టి పెట్టింది. ముందుగదిలో వొకకుర్చీ, టేబిలూ, ఫానూ వున్నయి. అట్టలు వేసిన పుస్తకాలతో నిండివున్న నాలుగు రాక్సువున్నాయి. గోడకున్న శరశ్చంద్రుని ఫొటో వొక్కటే తగిలించివుంది. రెండవగది ఆమె వంటచేసుకునే గది. వంటసామగ్రి తళతళ మెరిసిపోతూవుంది. గదులనూ, వస్తువులనూ ఇంత పరిశుభ్రంగా వుంచినందుకు ఆమెను మనస్సులో చాలా మెచ్చుకున్నాడు నారాయణరావు.

అతనిని అక్కడ కూర్చోబెట్టి క్షణంలో కాఫీపెట్టి

ఇచ్చింది శారద. ఆ ఇంటితో అతను తన ఇంటిని పోల్చు కొని చాలా చికాకుపడ్డాడు. తన భార్యకు ఇల్లు సరిదిద్దటం తెలియదని అక్కడ కూర్చుని నిశ్చయించుకున్నాడు.

అటుతరువాత ఆమెను తనఇంటికి రావలసిందని అహ్వానించాడు. ఆమె అప్పుడప్పుడూ వొచ్చి వెళ్తుండేది. కొన్నిసార్లవరకూ రాజమ్మ ఆమెను బాగానే చూచింది. వొకరోజు 'ఆమెను మన ఇంటికి రావద్దని చెప్పండి,' అని గట్టిగా తేల్చి చెప్పింది. ఈమాట అతను శారదకు చెప్ప లేదు. కాని తనువచ్చి వెళ్లటం రాజమ్మకు హితవుగాలేదని గ్రహించి శారద తనంతతానే అతని ఇంటికివెళ్లటం మాని వేసింది.

మరొకరోజు అతను ఆఫీసునుంచి ఇంటికి వచ్చేటప్ప టికి ఇల్లంతా కంగారుగావుంది. పిల్లలు ఎక్కడవాళ్ళు అక్కడ బొమ్మలకువలె నిశ్శబ్దంగా కూర్చునివున్నారు. ఆ వాతావరణంచూచి ఏదో కొంపమునిగిందే అనుకున్నాడు నారాయణరావు.

అనుకున్నట్టే జరిగింది.

ఇంట్లో అడుగుపెట్టగానే కస్సుమనిలేచింది రాజమ్మ. ఏం జరిగిందో కాస్త ముందుగా తెలుసుకునే అవకాశం కూడా ఇవ్వలేదు. "ఇన్నేళ్ళు వొచ్చినపిదప, ఇంతమంది పిల్లలను పెట్టుకొని, ఇప్పుడు మీకు తిరుగుళ్ళు కావలసి వచ్చాయా? మీరింత అప్రదిష్టకు పాల్పడతారని నేను కలలోకూడా అనుకోలేదు. మీరేదో శ్రీరామచంద్రమూర్తి

అనుకున్నాగాని, ఇన్నాళ్ళనుంచీ నాకళ్ళల్లో కారం జల్లుతున్నారు అనుకోలేదు. మీరిలాంటి పనులు చేస్తుంటే ఈ పిల్లలందరూ ఏంకావాలని మీ ఉద్దేశం? మీనుంచి వాళ్ళు నేర్చుకునేది ఏమిటి? ఇక వీళ్ళు బాగుపడతారా?," అని నోటికివచ్చిన మాటలన్నీ అన్నది.

"ఏం జరిగింది" అని తబ్బిబ్బుపడుతూ అడిగాడు నారాయణరావు.

ఏం జరిగిందీ చెప్పకుండా ఆమె నోటినుంచి వచ్చే అవకాశంవుందని అతను ఎన్నడూ ఊహించని మాటలు ఆమె అనటం మొదలుపెట్టింది.

"ఏం జరిగిందమ్మా, నువ్వన్నా చెప్పు," అని పెద్ద కూతురుని అడిగాడు నారాయణరావు. ఆమెపేరు అరుంధతి.

తండ్రి ప్రశ్నకు సమాధానం చెప్పకుండా తల వంచుకొని కూర్చుంది అరుంధతి.

"ఇంకా ఆపిల్లని చెప్పమంటారా? అబంసుబం తెలియని ఆపిల్ల ఏం చెపుతుందనుకున్నారు? మీరుచేసే పనులు వర్ణించటానికి నోరెట్లా వస్తుందనుకున్నారు; ఇక ఈ ఇంట్లో పిల్లలనుకూడా మీరు సరిగ్గా బ్రతకనిచ్చేటట్లులేరు మానవజన్మ ఎత్తినతరువాత మొహానికు సిగ్గనేది వొకటివుండాలి." అన్నది రాజమ్మ.

నిజంగానే రాజమ్మ ఆనాటి ఆకారంచూస్తే గుండె బేజారెత్తిపోయింది నారాయణరావుకి. అతనికండ్లకు ఆమె మహాకాళిగా కనుపించింది. అమాట అంటుంది ఈ మాట అనదు అనే ప్రసక్తి లేదు. ఆసమయంలో మీదపడి కొట్టినా కొట్టవచ్చునుకున్నాడు.

చివరికి తేలినసారాంశం, నారాయణరావు రోజు మధ్యాహ్నంపూట శారదతో కలిసి ఆమె తెచ్చిన టిఫిన్ తింటున్నాడని ఆమెకు తెలిసింది. అతనికోసం ఆమె ప్రత్యేకం టిఫిన్ చేసుకొని రోజూ తీసుకువస్తూవుందని కూడా తెలిసింది. దానికి చిలవలు పలవలు ఊహించుకుంది. ఉగ్ర స్వరూపిణి అయింది.

ఆమె అతనిని అనటం ఆపలేదు. ఏదో అంటూనే వుంది. అతను తాను శారదతో కలిసి టిఫిన్ తింటున్నాననే విషయం ఆమెకు ఎట్లా తెలిసిందా అని ఆలోచిస్తున్నాడు.

తటుక్కున అతనికితోచింది. ఉదయం ఆఫీసుకి వెళ్ళేటప్పుడు అతను కొన్నికాగితాలు ఇంటిదగ్గర మరచిపోయి వెళ్ళాడు. వాటిని తేవలసిందని ఆఫీసునుంచి ప్యూన్‌ని పంపాడు. అతను చెప్పేవుంటాడు. అతను నారాయణరావుకి ఇబ్బంది కలిగించటానికి కారణంవుంది. రెండు మూడుసార్లు అతను నారాయణరావుని కాఫీకి డబ్బులు అడిగాడు. సమయానికి దగ్గర డబ్బుల్లేక అతను ఇవ్వలేదు?

అసలువిషయం, దానికికారణం తెలిసి అతనికి కొంచం ధైర్యం వచ్చింది. "నామీద ఎవరు చెపుతున్నారు నీకీ పితూర్లు?" అని అడిగాడు.

"ఎవ్వరో ఏమిటి? చూచినవాళ్ళే చెప్పారు!" అన్నది రాజమ్మ.

"ఎవ్వరేమిటి చూచింది?"

"ఎవరైతేం? మీరు దానితోకలిసి టిఫిన్లుతిని తిరుగు

తున్నారా లేదా చెప్పండి," అని నిగ్గదీసి అడిగింది ఇంటికి వచ్చిననౌకరు తనపేరు చెప్పవద్దని బ్రతిమాలి చెప్పాడు. తను చెప్పినట్లు తెలిస్తే ఆఫీసులో చాలా చిక్కులు పెడతారని చెప్పాడు. అందుకని వీలైనంతవరకు అతనిపేరు బయటపెట్టవద్దనుకుంది రాజమ్మ.

నారాయణరావు, ఆలోచించగా తనకు అప్పుడే జ్ఞాపకంవచ్చినట్లు నటిస్తూ, "ఓహో అదాసంగతి?" అన్నాడు.

"ఏమిటాసంగతి? మీలో దాచుకోవటం ఎందుకు? బయటకు చెప్పండి. నేనూ పిల్లలూకూడా విని సంతోషిస్తాం," అన్నది రాజమ్మ.

"నీకు చెప్పిందెవరో నాకు తెలుసు."

"ఎవరు?"

"హద్దున్న నేను కాగితాలకు పంపించిన నౌకరు."

"వాడా? వాడు కానేకాడు,"

"వాడే! ఇటువంటిది ఏదో చేస్తాడని నేను అనుకుంటూనే వున్నా. వాడు పని సరిగ్గా చెయ్యకపోతే నేను వాడి మీద రిపోర్టు చేశాను వాడికి నాలుగు రూపాయీలు జరిమానా వేశారు. అప్పటినుంచీ నా మీద కక్ష పట్టాడు వెధవ."

ఇలా చాలా మాటలు చెప్పాడు నారాయణరావు. కాని రాజమ్మ వొక్కమాటకూడా నమ్మలేదు పైగా 'రంకునేర్చినవారు బొంకు నేర్వకపోతారా?' అంది.

రాజమ్మ మాట్లాడుతుంటే ఒక్కొక్కప్పుడు ఈ రాజమ్మ తాను ప్రేమించిన రాజకుమారేనా అని అనిపిస్తూ వుంటుంది నారాయణరావుకి. ఇవ్వాళ అలాగే అనిపించింది.

"సరే, నీ యిష్టం వొచ్చినట్టు అనుకో" అని వూరుకున్నాడు. మామూలుగా ప్రభుత్వోద్యోగుల్లో ఒక ఆచారం వుంది. వారిలో ఎక్కువమంది జీతంరాగానే ఇంటి దగ్గర భార్యలకు ఇచ్చివేస్తారు. అలా ఇచ్చివేసి ఏరోజు కారోజు వారికి కావలసింది భార్యలను అడిగి తీసుకుంటూ వుంటారు. అదే విధంగా నారాయణరావు కూడా జీతం రాగానే అణాపైసలతో సహా రాజమ్మ చేతుల్లో పోసేవాడు. ప్రతిరోజూ ఆఫీసుకు వెళ్ళటానికి రిక్షాకి మూండణాలు, మధ్యాహ్నం అక్కడ కాఫీతాగటానికి ఒక నాలుగణాలు మొత్తం ఏడణాలు భార్యను అడిగి తీసుకొని వెళ్ళేవాడు. ఆఫీసునుంచి తిరిగి వచ్చేటప్పుడు వీలైతే నడిచి వచ్చేవాడు. లేకపోతే రిక్షామీద వచ్చి భార్యను అడిగి బాడుగ ఇప్పించేవాడు.

మెదలకుండా కూర్చున్న నారాయణరావుని చూచి "అయితే ఒక మాట అడుగుతా చెపుతారా?" అన్నది రాజమ్మ.

"అడుగు."

"మధ్యాహ్నం కాఫీ ఏడబ్బు పెట్టి తాగుతున్నారు?" అని అడిగింది.

"ఇంటిదగ్గరనుంచి తీసుకువెళ్ళిన డబ్బే!"

"మరి రోజూ తీసుకువెళ్ళినడబ్బు ఎట్లా తిరిగి తీసుకు వస్తున్నారు?" అని అడిగింది.

అతను తృళ్ళిపడి, వెంటనే సర్దుకొని "ఓ, అదా! మా ఆఫీసు క్యాంటీన్లో ఖాతా పెట్టాను,జీతం వొచ్చినప్పుడు వొక్కసారిగా ఇచ్చివెయ్యవచ్చుగదా అని" అన్నాడు.

"ఎన్నాళ్ళయింది ఖాతా పెట్టి?"

తాను ఎన్నిరోజులనుంచీ శారద తెచ్చుకున్న టిఫిను తింటున్నదీ జ్ఞాపకం తెచ్చుకుంటూ,"రెండు నెలలకు పైనే అయివుంటుంది" అన్నాడు.

"మరి ఈ రెండు నెలలనుంచీ ఒక దమ్మిడీ కూడా జమవెయ్యలేదేం?" అని అడిగింది రాజమ్మ కండ్లు ఇంతంత చేసి.

అతను 'దొరికిపోయాను' అనుకున్నాడు. పిల్లికి దొరికిన ఎలుకవలె కొట్టుకులాడాడు. వేరు దారిలేక ఎదురు తిరిగాడు. "ఏమిటి నువ్వు నన్ను క్రాస్‌పరీక్ష చేస్తున్నావు? నే నేమన్నా దొంగననుకున్నావా? నాడబ్బు యిష్టమయితే ఖర్చుపెడతాను. లేకపోతే లేదు. ఎక్కడ ఖర్చుపెట్టావు? ఎంత ఖర్చుపెట్టావు? ఎందుకు ఖర్చుపెట్టలేదు? ఏమిటి ఈ ప్రశ్నలు?" ఇంత ఎత్తున లేచాడు. కాని ఆమె అణుమాత్రం కూడా జంకలేదు.ఆనాటినుంచీ ఎంత ఖర్చయినా సరే టిఫినుకి మధ్యాహ్నం ఇంటికి రావలసిందే అని శాసించింది. అతను అలాగే రావటం మొదలుపెట్టాడు.

ఒక్కొక్కసారి శారదతో కలిసితిని ఇంటికి వచ్చేవాడు. ఆలస్యంగా వచ్చినందుకు రాజమ్మ పోట్లాడేది. కాని శారదతో కలిసి తిని వస్తున్నాడని ఊహించలేక పోయింది.

ఆనాటినుంచీ ఆమె ఎన్ని అంటున్నా వినిపించుకోకుండా, పెట్టింది తిని మళ్ళీ ఆఫీసుకు వెళ్లేవాడు నారాయణరావు. కాని అతని మనస్సుమాత్రం ఏ మాత్రం బాగుండేది కాదు. శారదతో కలిసి టిఫిన్ తింటున్నప్పుడూ బాగుండేదికాదు. ఇంటిదగ్గర తింటున్నప్పుడూ బాగుండేది కాదు. శారదతో కలిసి తింటున్నంత సేపూ, ఆలస్యం అయిపోతూ వుంటే, ఇంటికి వెళ్ళింతరువాత భార్య ఏమంటుందో అనే భయంతోనే వేదన పడుతుండేవాడు. అతనికి పెసరట్లు ఇష్టం. అందుకని శారద ఎక్కువసార్లు పెసరట్లే పట్టుకు వస్తూ వుండేది. భార్య భయంతో త్వరగా ఇంటిదగ్గర హాజరు కావాలనే ఉద్దేశంతో ఒక్కొక్కసారి పెసరట్టు పెసరట్టు బొక్కుకునేవాడు. మళ్ళీ ఒక ప్రక్క తన అవస్థ శారద ఎక్కడ గహించిపోతుందోఅనే అనుమానం పీడిస్తూ వుండేది. ఒక సమయంలో ఎందుకనో టిఫిన్ తింటూ తింటూ వుండగా తను ఏంచేస్తున్నదీ చూడటానికి తన భార్య ఆఫీసుకు వస్తుందని అనుమానం కలిగేది. తనకు తెలియకుండానే ఒణుకు పుట్టేది. ఆమె వొచ్చి చూస్తే ఇంకేమన్నా వుందా?

ఆమె తన ఉద్దేశాన్ని ఏమాత్రం దాచుకునే మనిషి కాదు. ఇతరులను లక్ష్యపెట్టే మనిషి అసలే కాదు.

తన కడుపులో వున్నవన్నీ అనేస్తుంది. పైగా గతం కూడా పెద్దది. ఆఫీసులో వున్నవాళ్లంతా పోగవుతారు. ఆ పరిస్థితుల్లో తన గతేంకాను? తను ఏ విధంగా ఇతరులకు తన మొహం చూపగలుగుతాడు!

ఆక్షణం ఆడవాళ్ళు ఆత్మహత్య చేసుకోవటం అనే అంశం మీద అతనికి అమిత సానుభూతి కలిగేది. కండ్లలో నీళ్ళు తిరిగేవి.

తన పరిస్థితి శారదకు తెలియదని అతని నమ్మకం. అప్పుడప్పుడూ ఆమెకు చెప్పుకోవాలని అనిపించేది. కాని చెప్పుకోలేక పోయేవాడు. కంఠంలో ఏదో అడ్డుకున్నట్టయి, ఉక్కిరిబిక్కిరి అయ్యేవాడు. కాని శారద అతని పరిస్థితి ఏనాడో పసిగట్టింది. అతని బాధ పెంచటం ఎందుకని తెలియనట్లు నటించేది.

అలా బ్రతకటం అతనికి చాలా కష్టంగా వుండేది. ముళ్ళకంచెను గుర్రంగా చేసుకొని, ఉరితాటిని కళ్ళెంగా చేసుకొని, అగ్నికణాలను జీనుగా చేసుకొని స్వారి చేస్తున్నట్లు వుండేది. రాత్రిళ్ళు నిద్ర పట్టేదికాదు. కాని ఆ పరిస్థితి నుంచి తప్పించుకొను బుద్ధి అయ్యేది కాదు. అలా అవక అనుకూలమైన కారణాలను అల్లుకుంటూ కూర్చునేవాడు. తను ఏంచేస్తున్నాడు? శారదతో మాట్లాడుతున్నాడు. కలిసి టిఫిన్ తింటున్నాడు. ఎందుకు అలా ప్రవర్తిస్తున్నాడు? ఆమె మంచిది గనుకా, తనంటే అభిమానంగా వుంటుంది గనుకా. ఇందులో తప్పేమి వుంది? ఏమి తప్పు వుంది గనుక తను మానుకోవాలి? తనకు కలుగుతున్న వేదన తన భార్య

వల్ల కలుగుతూ వుంది. తనను వేధించటం తన భార్య తప్పు. తప్పు చేస్తున్నది తన భార్య. ఆమె చేస్తున్నది తప్పని తెలిసీ తదనుగుణంగా తానెందుకు ప్రవర్తించాలి? ఇక అబద్ధాలాడటం మొకరైన విషయాలా? దానికీ ఆమే కారణం. అబద్ధాలాడటం వల్ల పాపం చుట్టుకోవటం అనేది నిజమైతే అది ఆమెనే చుట్టుకుంటుంది. ఆమె సవ్యంగా వుంటే, తాను ఉన్నది ఉన్నట్టు చెప్పేవాడు. అబద్ధాలే ఆడేవాడుకాదు. ఆమెబుద్ధి సరిగ్గా లేకపోవటంవల్లే గదా తాను అబద్ధాలాడవలసివచ్చింది! తనదేముంది? తాసి విషయంలో నిమిత్తమాత్రుడు.

అలా ఆలోచించేవాడు.

అంతేగాని ఆమెమనస్సును వేదన పెట్టే పని తనెందుకు చెయ్యాలి? అని అతనికి అనిపించేది కాదు. శారదతో తనకు వున్న స్నేహం ఎటువంటిది అని తరచి చూచుకో బుద్ధి అయ్యేదికాదు. ఈ స్నేహంవల్ల పెండ్లికావలసిన శారదకు మాత్రం ఏం లాభం? అని ఆలోచించ బుద్ధి అయ్యేది కాదు. అంతకా ఆలోచించబుద్ధిఅయితే తనుతండ్రిననీ ఆమె కూతురనీ అనుకునేవాడు. కూతురు అవటానికి తన భార్యకే జన్మించవలసిన అవసరం లేదు. భౌతికసంఘటన కన్నా భావం ముఖ్యం. కాబట్టి తండ్రిగా ఆమె యోగక్షేమాలు విచారించవలసిన బాధ్యత తనమీద వున్నదనుకునేవాడు. పాపం ఆమెకు మాత్రం ఎవ్వరున్నారు గనుక!

కాని ఈ ఆలోచన అతనికి తాత్కాలిక శాంతిని మాత్రమే ఇచ్చేది. పైపూతగా మాత్రమే ఉపకరించేది.

నిత్యమైందీ,సత్యమైందీ లోలోపలివేదన. అది రగులుతూనే వుండేది.

ఆ పరిస్థితుల్లో శారదకు ట్రాన్స్‌ఫర్ అయింది. ఆ మాట విన్నప్పుడు అతనికి విచారంకంటే సంతోషమే కలిగింది. నిజానికి గుండెమీదనుంచి పెద్దబరువు దింపినట్లయింది. శారదలో కూడా అతను ఊహించినంత విచారం కనపడక పోవటం అతనికి ఆశ్చర్యం కలిగించింది.

ఆమె రేపు వెళ్ళిపోతుందనగా ఆ రాత్రి అతనిని తన ఇంటికి భోజనానికి ఆహ్వానించింది. అతను, ఇంటి దగ్గర ఆరోజున ఛీఫ్ సెక్రటరీగారిని చూడవలసి వుందనీ, ప్రొద్దుపోయి వస్తాననీ చెప్పాడు.

ఛీఫ్ సెక్రటరీని చూడటం అంటే రాజమ్మకు గొప్ప. అందుకని పరమసంతోషంగా "వారితో మాట్లాడి త్వరగా రండి!అన్నం ఆరిపోకుండా పొయ్యిప్రక్కన పెట్టి వుంచుతాను." అని అన్నది.

ఆరోజు సాయంకాలం ఆఫీసునుంచి సరాసరి శారద ఇంటికి వెళ్లాడు నారాయణరావు. దారిలో అతనికి అనేక ఆలోచనలు వచ్చినై. అందులో ముఖ్యమైంది శారద తననుగురించి ఏమనుకుంటున్నది 'అనేది.

ఆమె ఎప్పుడూ తమ స్నేహాన్నిగురించి మాట్లాడేది కాదు. మర్యాద తప్పిప్రవర్తించేదికాదు. తను ఎప్పుడన్నా సెలవు పెట్టి ఆఫీసుకు వెళ్ళకపోతే, తనకోసం ఎదురు చూస్తున్నట్లు కనుపించేది. కనుపించేదేగాని తను ఎందుకు

సెలవు పెట్టిందీ కూడా అడిగేదికాదు. తనేచెప్పేవాడు కారణం. ఆమె వినేది.

ఆమె సినిమాలకు ఎక్కువ వెళ్తుండేది. కాని తనను సినిమాకు వస్తారా అని గానీ, తీసుకువెళ్ళమని గానీ ఎప్పుడూ అడగలేదు.

ఒక రోజు, అప్పుడు ఊళ్లో ఆడుతున్న సినిమా సంగతి వొచ్చింది. ఆ ప్రసక్తి శారదే తెచ్చింది.

"చాలా బాగున్నదంటున్నారు" అన్నది.

"నేనూ విన్నాను." అన్నాడు తను.

"నిన్న వెళ్దామనుకున్నాను. తలనొప్పిగా ఉండి ఊరుకున్నాను" అన్నది.

అకస్మాత్తుగా తనను సినిమాకు తీసుకువెళ్ళమనిఆమె భావమనే అనుమానం కలిగింది నారాయణరావుకి.

"నాకూ చూడాలనివుంది." అన్నాడు తనకు తాను చెప్పుకుంటునట్లు.

"చూడవలసిన పిక్చరే," అన్నది శారద.

రేపు వెళ్దామా అని అడుగుదాం అనుకున్నాడు భార్యకు ఏదో వొకటి చెప్పలేక పోతానా అనే ధైర్యంతో. కాని భయం వేసింది. ఆమె అడగ వచ్చు అనే ఆశతో కాసేపు ఎదురు చూశాడు. ఆమె మాట్లాడలేదు.

అన్నాళ్లనుంచి స్నేహం చేస్తున్నా తన పట్ల ఆమె ఉద్దేశం అతనికి బోధపడలేదు. రేపు ఎలాగూ వెళ్ళిపోతూ వుంది అతని మనస్సులో తీవ్రమైన అసంతృప్తి చెలరేగింది.

ఎలాగూ పెండలాడ ఆమె ఇంటికి వెళ్తున్నాను. ఎలాగూ ఇంటికి ఆలస్యంగా వస్తానని రాజమ్మతో చెప్పాను. ఆమెను అడిగి సినిమాకు తీసుకువెళ్తాను అని మనస్సులో నిశ్చయించుకున్నాడు. ఆమె మరునాడు వెళ్ళిపోతూవుంది గనుక, సినిమాకు రమ్మని ఆహ్వానించటానికి తనకు తగిన కారణం కూడా వుంది. ఆమె అపార్థం చేసుకోటానికి వీల్లేదు.

మనస్సులో అలా నిశ్చయంచేసుకొని శారద ఇంటికి వెళ్ళాడు నారాయణరావు. కాని ఆమె ఇంటికి వెళ్ళేటప్పటి పరిస్థితులు తారుమారుగాకనుపించినై. ఆమె ఇంట్లో ఆమెతో పాటు మరొక యువకుడు వున్నాడు.

“మా మేనమామ. పేరు మురళీమోహన్. ఈ సంవత్సరమే ఎప్రెంటిస్ పూర్తిచేసుకున్నాడు. మద్రాసులో ప్రాక్టీసు పెడదామనిఅనుకుంటున్నాడు. నాకు ట్రాన్స్‌ఫర్ అయిందని తెలిసి నన్నుతీసుకు వెళ్ళటానికనివచ్చాడు” అని ఆ యువకుణ్ణి పరిచయం చేసింది శారద.

ఆ యువకుడు నిడుద కన్నులూ, వెడదయురమూ కలిగి చాలా అందంగా వున్నాడు. అందంగా వుండటమే కాదు మంచి వర్చస్సు కలిగిన ఆకారం అతనిది. అతనిని చూచీ చూడగానే నారాయణరావుకి వృద్ధాప్యం వచ్చినంతపని అయింది. తను వేసుకున్న దుస్తులు నూనె గుడ్డలవాని దుస్తులకువలె శరీరం మీద జీరాడుతున్నట్లు అనిపించింది. అక్కడికి తనకివున్న సూటుల్లోకి మంచిసూటే

వేసుకువచ్చాడు. ఆ సూటు తన ప్రభుత్వ ఫంక్షన్స్‌కి హాజరవగలందులకు కుట్టించుకునే సూటు. ప్రభుత్వం అప్పుడప్పుడూ కొన్ని ఫంక్షన్స్ జరుపుతూవుంటుంది. ఆ ఫంక్షన్స్‌కి ప్రభుత్వోద్యోగులందరూ చిన్నా పెద్దా తారతమ్యం లేకుండా హాజరు కావాలి. ఆ ఫంక్షన్స్‌లో స్వతంత్రదినోత్సవం, ఆంధ్రరాష్ట్ర అవతరణోత్సవం మొదలైనవి ముఖ్యమైనవి. ఆ ఫంక్షన్లుకి అందరూ వీలైనంత శుభ్రంగా డ్రెస్ చేసుకొని వెళ్తారు. వొచ్చిన అతిథులను ఆహ్వానించి కూర్చోబెట్టవలసిన బాధ్యత చిన్నచిన్న ఉద్యోగస్థుల మీద ఉంటుంది. ఆఫంక్షన్లుకి ఛీఫ్‌సెక్రటరీ, మంత్రులూ మొదలైనపెద్దలు హాజరవుతారు. గవర్నరు ఉపన్యసిస్తాడు. మామూలుగా పదిమందిలో కలిసే అవకాశం, ఉత్సవాల్లో పాల్గొనే అవకాశం వుండకపోవడంవల్లో ఎందుకోగాని ఇటువంటి ఫంక్షన్స్‌కి పెండ్లంత హడావుడిగా చేస్తారు. ఉద్యోగులు వొక నెలరోజుల ముందునుంచీ ఈ విషయమే మాట్లాడుకుంటూ వుంటారు. సన్నద్ధం అవుతూ వుంటారు.

సన్నద్ధం అవటం అంటే ఏమిటి? అనే అనుమానం మీకు కలగవచ్చు. చెపుతాను.

మామూలుగా ప్రభుత్వోద్యోగం చేసేవారికి చీటికీ మాటికీ ఫంక్షన్లులో పాల్గొనే అవకాశం వుండదు. పది గంటలనుంచి అయిదు గంటల వరకూ వారు ఆఫీసులో పని చెయ్యవలసివుంటుంది. అర్జంటు పనివున్నా, ఏదన్నా

పని చూసుకుంటూ పై అధికారి ఉండిపోయినా, తాము కూడా అందుకు దాటేంతరువాత ఉండిపోవలసివస్తుంది. ఆ పిదప వారు ఇంటికి వెళ్ళి కాళ్ళు ఆరజాపటం కంటే చేసేది ఏమీ వుండదు. పైగా కొన్నికొన్ని ఫంక్షన్లలో పాల్గొన టం వారికి ప్రమాదంగా కూడా పరిణమించవచ్చు.

ప్రభుత్వోద్యోగం చేసేవారు అసిస్టెంట్ సెక్రటరీ పదవికిరాగానే కారు కొనటం రివాజు. ప్రభుత్వోద్యోగులు వాకరకంహోదాను పాటించవలసివుంటుందనీ కారుఅందుకు అవుసరమనీ వారి భావం. అసిస్టెంట్ సెక్రటరీ కాకముందే కారు ఎందుకు కొనగూడదూ. అసిస్టెంట్ సెక్రటరీ కావ, టంతోనే ఆ అభిప్రాయం యెందుకు కలగాలీ అంటే,అంతకు ముందు కారుకొనలేకపోవటం మాట అటుంచి, అసిస్టెంట్ సెక్రటరీకి దిగువన వుండే ఉద్యోగాలన్నీ నాన్‌గజెటెడ్ ఉద్యోగాలు. గజెటెడ్ ఉద్యోగం అనేది అసిస్టెంట్ సెక్ర టరీ పదవితోనే ప్రారంభం అవుతుంది. సామాన్యులు ఈ భేదాన్ని అట్టే పాటించకపోవచ్చు. పాటించేవాళ్ళు నాన్ గజెటెడ్ ఉద్యోగస్థుణ్ణి కళ్ళెంలేని గుర్రంగానూ, గజెటెడ్ ఉద్యోగస్థుణ్ణి కళ్ళెం జీనూ ఉన్న గుర్రంగానూ పరిగణించ వచ్చు. గుర్రానికి జీనూ కళ్ళెం ఉండటం స్వారీచేసే పై అధికారికి సుళువు. వాటిని అలంకారాలుగా తీసుకొని గుర్రం సంతోషిస్తే ఎవ్వరు చేసేదీ ఏమీ ఉండదు.

కాని గజెటెడ్ ఆఫీసరు భావన వేరుగా ఉంటుంది. అతను గజెటెడ్ ఆఫీసరు కాగానే గుడిసెమీద నుంచి మేడమీదకు కాపురం మార్చిన వానికివలే, అంధకారం

నుంచి వెన్నెలలోకి అడుగుపెట్టిన వానికివలె, నరకంనుంచి స్వర్గలోకం ప్రవేశించిన వానికివలె ఫీలవుతాడు. ఆ హోదాకు తగిన హుందాతనం తెచ్చుకోటానికి ఒక కారు మెయిన్‌టెయిన్ చెయ్యటం తప్పనిసరి అనుకుంటాడు. కాని కారుకొనటం ఎలా? అప్పటికే అతని కుటుంబం పెద్దదయి వుంటుంది. అతను వెనుక వున్నవాడయి వుండడు. వెనుకవుంటే యల్. డి.క్లర్కుగానో, యు. డి. క్లర్కుగానో జేరివుండడుగదా. కనీసంకం ట్రాక్టరయినాఅయివుండేవాడు. ఇక ఎలా కారుకొనటం?

క్రొత్త కారు కొనటం అనే ప్రశ్నే లేదు. భార్య తరఫున ఏ కాస్త ఆస్తన్నా వొచ్చి వుంటే అది అమ్మో, లేకపోతే ఆమె వొంటిమీదవున్న ఏ నగో అమ్మో ఒక థర్డ్‌హాండ్ కారు కొంటాడు. అంతకంటే అతను చెయ్య గలిగింది ఏమున్నది గనుక? క్రొత్త కారు కొనలేడు. పాత కారు కొనక తప్పదు. ఎలాగూ కొత్తది కొనప్పుడు, సెకండ్‌హాండ్ కొనవలసిన కర్మం పట్టింది, అందుకని థర్డ్‌హాండ్ కొంటాడు.

అయితే కారు పాతది గనుక వొచ్చినప్పటినుంచీ అది ట్రబుల్ ఇస్తుంది. అందుకు దానినని ప్రయోజనం లేదు. ఆగుణం దాని స్వభావంలోనేవుంది. దానికి సెల్ఫ్ ఉండదు. అందుకని దానిని స్టార్ట్ చెయ్యటానికి హాండిల్ కొట్టాలి. హాండిల్ కొట్టినంత మాత్రాన స్టార్ట్ అవుతుందనే గ్యారంటీ కూడా లేదు. దాని ఇష్టం.

వొకొక్కసారి పెద్ద మోతతో పొగలు చిమ్ముకుంటూ స్టాబ్బయి సరిగ్గా నాలుగు బజార్లు కలిసినచోట ఆగుతుంది. జనంఅంతా దానిచుట్టూ పోగవుతారు. 'ట్రాఫిక్‌కి అడ్డంగా వున్నది అవతలికి తోల' మని పోలీసు కేకలు వేస్తుంటాడు. అటువంటి సమయాల్లో అది కదలదు. యజమాని దిగి నెట్టవలసి ఉంటుంది. లేకపోతే తలకొక అణా ఇస్తానని ఆశపెట్టి నలుగురు పిల్లలను పోగుజేసి నెట్టించవలసి ఉంటుంది.

ఇటువంటి బాధలు పడలేక, డ్రయివరుని పెట్టుకుందామంటే, ఆ పద్ధతికి వుండే బాధలు దానికి వున్నాయి. మామూలు ఉద్యోగి డ్రయివరుకి జీతం ఇవ్వగలిగిన స్థితిలో వుండడు. వొకవేళ తెగించి పెట్టుకున్నా, అతను పెట్రోలు కాజేస్తున్నాడనే అనుమానం అస్తమానం మనస్సుని పీడిస్తూనే వుంటుంది. వొకొక్కప్పుడు రాత్రిళ్ళు నిద్రకూడా పట్టదు. పైగా యజమానికి కొన్నాళ్ళు జరిగేటప్పటికి డ్రయివరుని అనవసరంగా మేపుతున్నామనే భావం వొకటికలుగుతుంది. కారుకి పెద్దపనేమీ ఉండదు. పదిగంటలకు ఉద్యోగిని ఆఫీసుకి తీసుకు వెళ్ళటం, అయిదు గంటలు దాటిన పిదప ఇంటికి తీసుకురావటం-అయితే. ఈమధ్య డ్రయివరు కారుకి ఎదురుగా వూరికే కూర్చుంటాడు. వాచాలుడైతే, ఉద్యోగి ఇంట్లో జరిగే సంగతులన్నీ-భార్యా భర్తల కలహాలతోసహా-ఇతరులకు చెప్పి నవ్వులు పట్టిస్తూ వుంటాడు. ఇది భరించలేక తానుదిగి కారు ఇంటికి పంపితే గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్న డ్రయివర్ని ఉద్యోగి భార్య సహించ

లేదు. అతను ఆమె గుండెలమీది కుంపటి అవుతాడు. కూర్చోబెట్టి జీతం ఇవ్వటం ఇష్టంలేక, ఆమె అతనికి ఇంటి పనులు చెపుతుంది. అతను 'నేను చెయ్యను' అంటాడు. తగాదా ప్రారంభం అవుతుంది.

ఎంత చెడ్డా ప్రభుత్వోద్యోగులు తెలివిగలవారూ బ్రతక నేర్చినవారూ అవటంవల్ల తమను నిత్యం వేధించే ఈ ప్రముఖసమస్యకు వొక పరిష్కార మార్గం కని పెట్టారు.

గెజెటెడ్ ఆఫీసర్లు ఇండ్లలోవున్నప్పుడు చేసే ఆఫీసు పనికి తోడ్పడటానికి గాను,వొక ప్యూన్ని ప్రభుత్వం ఇవ్వ టం రివాజు. ప్యూన్ పని చేసే వాళ్ళల్లో కొంతమందికి డ్రైవింగ్ కూడా వచ్చి వుంటుంది. అటువంటివారిని ఇండ్ల దగ్గర ప్యూన్లుగా వేయించుకుంటారు గెజెటెడ్ ఆఫీసర్లు. అప్పుడు సర్కారు ఇచ్చే జీతంలోనే డ్రయివింగ్ సౌలభ్యం కూడా వారికి లభిస్తుంది.

ఏదయినా పెద్ద ఫంక్షన్ జరుగబోయేటప్పుడు వొక నెలరోజుల ముందు నుంచీ తమతమ కార్లను ఆయత్త పరిచే ప్రయత్నంలో వుంటారు గెజెటెడ్ ఆఫీసర్లు. దానికి సర్వీసింగ్ చేయిస్తారు. దానికి పోలిష్ చేయిస్తారు. అది ఫంక్షన్‌కి వెళ్ళే దారిలో ట్రబుల్ ఇవ్వకుండా అన్ని జాగ్ర త్తలూ తీసుకుంటారు. ప్రభుత్వాంగంలో అటువంటి ఫం క్షన్సుకి వెళ్ళకపోవటంగానీ, ఆలస్యంగా వెళ్ళటంగానీ నేరంగా పరిగణించబడుతుందనే విషయం అందరూ గమనించ దగిన విషయం.

ప్రభుత్వోద్యోగులందరూ ఆఫీసుకు వచ్చేటప్పుడు ఒక రకమైన దుస్తులను ధరించాలని జి. వో. ఒకటి వుంది. జి. వో. అంటే గవర్నమెంట్ ఆర్డర్. గవర్నమెంట్ ఆర్డరుకి బ్రహ్మ నుదుట వ్రాసిన వ్రాలుకున్నంత విలువ వుంటుంది. 'అలా చెయ్యకూడదు అని జి. వో. ఒకటి వుంది,' 'ఇలా చెయ్యాలని జి.వో. ఒకటి వుంది' అని నిత్యం చెప్పుకుంటూ వుంటారు ప్రభుత్వోద్యోగులు ఈ జి.వోలు పరమపదసోపానపథంలో వున్న మెట్లు.

అటువంటి జి. వో.ఒకటి ప్రభుత్వోద్యోగులందరూ క్లోజ్ కాలర్ కోటు వేసుకు రావాలని ఆదేశించింది. ప్రభుత్వం ఏర్పాటు చేసే ఫంక్షన్స్‌కి యావన్మందీ నిర్ణయించబడిన డ్రెస్‌లో, పరిశుభ్రమైన డ్రెస్‌లో వొచ్చి ఒక అరగంట ముందే ఎవరిసీటుల్లో వారు కూర్చొని వుండాలని ఆదేశించింది. అటువంటి ఫంక్షన్స్‌కి ప్రతి ఉద్యోగీ భార్యాసమేతంగా రావాలనికూడా ఆ జి.వో.లో ఉండి వుంటుందనుకుంటాను.

ఈ సంగతులన్నీ నారాయణరావుకి తెలుసు. తెలియటమేకాదు. తూచా తప్పకుండా ఆచరిస్తాడు

ప్రభుత్వఫంక్షన్స్ అటెండ్ అవటానికిగాను అతను ఒక సూట్ కుట్టించుకున్నాడు. అది ఫంక్షన్ వొచ్చినప్పుడు ధరించి తరువాత పెట్టెలో దాచి వుంచుతాడు. ఆ సూట్‌లోని పాన్ట్ తెల్లనిది. కోటు నల్లని క్లోజ్డ్ కాలర్‌ది. అతనికి వున్న సూటుల్లో చెప్పుకోదగ్గది అదే.

ఆ సూటు వేసుకొని శారద ఇంటికి వచ్చాడు నారాయణరావు. తెల్లవారి లేచి ఆసూటు వున్న ట్రంక్ పెట్టె తెరిచి ఆ సూటు దులుపుతుంటే అతని భార్య రాజమ్మ "ఇప్పుడెందుకండీ ఆ సూటు తీశారు?" అని అడిగింది.

ఆ సందర్భంలో చెప్పాడు నారాయణరావు 'సాయంకాలం ఛీఫ్ సెక్రటరీని చూడవలసి వుందని'.

"ఆయన్ని ఈ నలిగిపోయిన సూటుతో చూస్తారుటండీ. పెద్దవారిని చూసేటప్పుడు వారి తాహతుకు అనుగుణంగా దుస్తులు వేసుకొని వెళ్ళాలి." అనిచెప్పి, ఆ సూటు పెట్రోలువాష్ చేయించి, భర్తచేత ధరింపజేసి, "వారు ఏమడిగినా మర్యాదగా మాట్లాడండి. సమయం కనిపెట్టి మన ఇబ్బందులు కాస్త వారి చెవిని వెయ్యండి," అని చెప్పి సాగనంపింది.

ఎక్కడ మడతలుపడి పాడైపోతుందో అని ఆ కోటును ఆఫీసుటైం అయ్యేవరకూ అతను కుర్చీకి తగిలించే వుంచాడు. పాంటుని అలా చేసే అవకాశం లేనందున కుర్చీమీద హాన్కర్చీఫ్ పరచి మట్టికాకుండా దానిమీద కూర్చున్నాడు. ఆఫీసు టైమైన పిదప జాగ్రత్తగా ధరించి శారద ఇంటికి బయలు దేరాడు.

శారద ఇంట్లో మురళీ మోహన్‌ని చూసేటప్పటికి అంత మోజుపడి వేసుకొని వచ్చిన ఆసూటు ముండ్ల తొడుగువలె వున్నదనిపించింది నారాయణరావుకి. కోటు

దళసరి గుడ్డతో కుట్టింది అవటంవల్ల, లోపల శరీరంకు కుతకుత ఉడికిపోతూవుందని అప్పుడతనికి అనిపించింది. అసలు నల్లకోటు వేసుకు రావటం ఏమిటి నాబొంద అను కున్నాడు. నలుపు రంగు విచారచిహ్నమని అప్పుడతనికి గుర్తుకు వచ్చింది.

"మీరు మొదటినుంచీ చీఫ్ సెక్రటరీయేట్‌లోనే పనిచేస్తున్నారా?" అని అడిగాడు మురళీమోహన్

"లేదు. మీ ఫుజులో వుంటూవుండేవాణ్ణి. ఇక్కడకు ట్రాన్స్‌ఫర్ అయిఆరేళ్ళయింది. అప్పటినుంచీ ఇక్కడే వుంటున్నాను," అని సమాధానం చెప్పాడు నారాయణ రావు.

"మీకు న్యాయం జరిగివుంటే ఏనాడో సూపరింటెం డెటు అయివుండేవారని చెప్పింది శారద," అన్నాడతను.

"ఏదోలెండి," అన్నాడు నారాయణరావు ముభా వంగా.

"శారద ఇక్కడకు వచ్చిందగ్గరనుంచీ ఆమెకు చాలా చేదోడు వాదోడుగా ఉంటున్నారని విన్నాను. అం దుకు ఆమె తరఫున నేను కృతజ్ఞత తెలుపుతున్నాను." అన్నాడతను.

ఈ మాటకు నారాయణరావు మనస్సు కతుక్కు మన్నది శారదకు. తనకంటే అతనే దగ్గరనే భావం అతని మాటలు స్ఫురింపజెయ్యటమే ఇందుకు కారణం. గుక్క త్రిప్పుకొని, "నేను ఆమెకు చేసిన సహాయం వొక్కటే.

ఆమె తెచ్చుకున్న టిఫిన్లో రోజూ భాగం పంచుకుంటూ వుండే వాళ్లు" అన్నాడు.

శారద చిరునవ్వు నవ్వి వూరుకుంది.

మాటలనుబట్టి మురళీమోహన్ బాగా చదువుకున్న వాడూ, మంచి కామన్ సెన్స్ కలిగిన వాడూ, అభ్యుదయ భావాలు గలవాడూగా కనుపించాడు నారాయణరావుకి. అతనిది మంచి తేజస్సు కలిగిన ముఖం అవటంవల్ల ఆ తేజస్సు ముందు పూర్తిగ కళావిహీనుడైపోయి కూర్చు న్నాడు నారాయణరావు.

మురళీమోహన్ కాసేపు ఆ సంగతులూ, ఈ సంగ తులూ మాట్లాడి ప్రభుత్వోద్యోగం స్వభావాన్ని పరిశీలిం చాడు.

"ప్రభుత్వోద్యోగం అనేది కబంధునివంటిది. అది తన చేతికి అందిన వారిని వొదిలిపెట్టదు. తన ఇనుప కౌగిలిలోకి తీసుకొని కబళించి తీరుతుంది. దాని చేజిక్కి విశిపించుకొని ఎవ్వరూ బయట పడరు," అన్నాడు.

తలవంచుకుని వింటున్న నారాయణరావు "వొక బ్రహ్మాండమైన యంత్రంలో చిక్కుకున్నట్టే," అన్నాడు.

"స్వరాజ్యం గాకముందు, రాజకీయ ప్రభోద్యం లోనూ, సంఘసేవలోనూ నిమగ్నులైన వారి మాట అటుంచి మిగిలినవారిలో విద్యావంతులూ, మేధావంతులూ ప్రభు త్వోద్యోగాల్లో జేరటానికి కుతూహలపడుతుండేవారు. ఎందు రే!

కంటే ఆనాడు జీవనావకాశాలు ఎక్కువ వుండేవికావు. ప్రభుత్వోద్యోగం అంటే వొక విధమైన గౌరవం కూడా వుండేది. అప్పుడు పరిస్థితులు మారిపోయినై. పరిశ్రమలు పెరిగినై. తెలివిగలవాడు తన తెలివిని ఆచరణలోపెట్టి బ్రతకటానికి అనేక అవకాశాలు వున్నయి. పైగా ప్రభుత్వోద్యోగం అంటే ఇదివరకువున్న గౌరవం ఇప్పుడులేదు. ఆలోచిస్తుంటే వొక్కొక్కప్పుడు వ్యక్తులు తమ తెలివిని చంపుకుంటున్నందుకు ప్రభుత్వం జీతాలిస్తున్నదా అని అనిపిస్తూ వుంటుంది."

"యంత్రంలో ఫిట్ ఇన్ అయినందుకు," అన్నాడు నారాయణరావు తనకు తానే చెప్పుకుంటున్నట్లు.

"యంత్రంలో ఫిట్ ఇన్ అవటం అంటే స్వీయ ప్రతిభను చిదమకోవటం అన్నమాటేగదా," అన్నాడు మురళీమోహన్.

నారాయణరావుకి ఆఫీసులో నిత్యం జరిగే అనేక విషయాలు జ్ఞాపకం వచ్చినై. ఆఫీసులో ప్రతి ఉద్యోగీ తనను రక్షించుకోటానికే ప్రాధాన్యత ఇస్తాడు. అస్తమానం అందుకే ప్రయత్నిస్తాడు. ఏ ఫైలు మీద నోటు పెట్టవలసి వచ్చినా అందుకే ప్రయత్నిస్తాడు. ఎవరి దగ్గర నుంచి ఎటు వంటి అభ్యర్థన వచ్చినా ఎలా వీల్లేదో చెప్పటానికే ప్రయత్నిస్తాడు. అందరు ఏదో వొక జీ. వో. ను ఉదహరించటానికే చూస్తాడు. అది తనకి తేలిక మార్గం. సురక్షిత మార్గం. ఆ

మార్గాన్నే అనుసరిస్తాడు. తన తెలివి తేటలను ఆ మార్గాన వెళ్ళటానికి వినియోగిస్తాడు.

ఫైళ్లను, ఏం జరిగినా తమకు అపకారం జరగకుండా నడపటంలో చాకచక్యం చూపడమే ఎక్కువమంది ప్రభుత్వోద్యోగులు చేసే పని. ప్రతి ఫైలు వెనుకా వొక ప్రాణి తహతహ లాడుతూ, ఫలితం కోసం వొళ్ళాంతా కళ్ళు చేసుకొని కనిపెట్టుకుని కూర్చుని వుంటుందనివారికి తట్టదు. కాఫీకి వొక చోటుకి జేరి ఉద్యోగులు చెప్పుకునే విషయం ఈ ఫైళ్లను గురించే. తాము ఎంత తెలివిగా తమ మీద నేరం వాలకుండా,ఇతరుల మీద వాలేటట్టు ఫైళ్ళను నడుపు తున్నదీ చెప్పుకొని మురుసుకుంటూ వుంటారు. వాళ్ళది ఫైళ్ళ ప్రపంచం, మానవ ప్రపంచం కాదు.

ఇటువంటివి అనేకం జ్ఞాపకం వచ్చి, "నిజమే" అన్నాడు నారాయణరావు.

మురళీమోహన్ చెప్పుకుపోయాడు. "బ్రిటిష్ వారి హయాంలో వారిది పరప్రభుత్వంగనుక. ప్రజలను ప్రభుత్వానికి దూరంగా అట్టి పెట్టవలసిన అవుసరం వుంది గనుక ఈ ఫైళ్ళవిధానాన్ని సృష్టించింది. ప్రభుత్వోద్యోగులకూ, ప్రజలకూ సంబంధం లేకుండా చేసింది. కాని స్వరాజ్యం వొచ్చిం తరువాత కూడా ఈ విధానం మారకపోవటం విచారకరం. ప్రభుత్వోద్యోగులుతమమనస్తత్వాన్ని మార్చుకోకపోవటం అంతకంటే విచారకరం. వొకప్పుడు ఉద్యోగుల సమర్థతకూ శీలానికీ కొలబద్దలుగావున్న కాన్ఫిడెన్షియల్ రిపోర్టులు ఇప్పుడు

ఏ విధంగా ఉపయోగ పడుతున్నవీ మీకు తెలిసిన విష యమే గదా ?" అన్నాడు.

మురళీమోహన్‌కి పరిపాలనా విధానాన్ని గురించి ఇన్ని విషయాలు ఎలా తెలుసా అని సంభ్రమాశ్చర్యా లకు లోనై అతనిని వింతగా చూస్తూ కూర్చున్నాడు నారా యణరావు.

నారాయణరావు ఆలోచనలను కనిపెట్టాడు మురళీ మోహన్. చిరునవ్వు నవ్వుతూ, "మా నాయనగారు ఢిల్లీ సెక్రటరీయేట్‌లో డిప్యూటీ సెక్రటరీ చేశారు. మేము చాలా కాలం ఢిల్లీలోనే వున్నాం" అని "శారద ఈ విష యం మీకు ఎప్పుడూ చెప్పలేదా ?" అని ప్రశ్నించాడు.

నారాయణరావు శారదను చూశాడు. "ఎప్పుడూ ఆ ప్రస్తావన రాలేదు," అన్నది శారద.

"ఈ గొడవంతా నేను చిన్నతనం నుంచీ ప్రత్య క్షంగా చూచిన వాడినవటంవల్ల శారదను గవర్నమెంట్ సర్వీస్‌లో జేరవద్దన్నాను. ఆమె నా మాట వినకుండా జేరింది," అన్నాడు.

తరువాత వారు కాసేపు పిచ్చాపాటీ మాట్లాడు కున్నారు. ఆ సందర్భంలో అతను శారదను గురించి నారా యణరావుకి తెలియని కొన్ని విషయాలు చెప్పాడు.

శారద తండ్రి ప్లీడరు. బాగా డబ్బు గడిస్తున్నప్లీడరే. అతనికి ముగ్గురు ఆడపిల్లలూ ఒక మొగపిల్లవాడూ వున్నారు. అందరిలోకీ శారద పెద్దది. మగపిల్లవాడు చిన్నవాడు.

ఆ పిల్లవాణ్ణి ప్రసవించి శారద తల్లి మరణించింది. శారద స్కూలుఫైనలు ప్యాసయిం తరువాత, తండ్రి చదువు మాన్పించటానికి ప్రయత్నించాడు. ఆమె అంగీకరించలేదు. తండ్రి ఇంట్లోనుంచి వెళ్ళిపొమ్మన్నాడు. అప్పటినుంచీ ఆమె మురళీమోహన్ తండ్రి ఇంట్లోనే వుండి చదువుకుని బి. ఏ. పూర్తి చేసుకుంది. ఉద్యోగంలో జేరింది. శారద తండ్రి ఇటీవలే మరణించాడు.

శారద వ్రాయగలదు. కొన్ని ఖండ కావ్యాలు వ్రాసింది. రెండు నవలలూ, చాలా కథలూ వ్రాసింది. ఆమె ఇంతవరకు తన రచనలను పుస్తకరూపంలో ప్రచురించలేదు గాని, కథలను ఇంగ్లీషులోకి తర్జుమా చేసి పత్రికల్లో ప్రచురించింది. విమర్శకులు ఆ కథలను చాలా మెచ్చుకున్నారు.

ఈ సంగతులన్నీ ఆశ్చర్యంగా విన్నాడు నారాయణ రావు.

"శారదకు సాహిత్యంలో అభిరుచి వున్నదనే నాకు తెలియదు," అన్నాడు.

"ఇతరులకు తెలియనివ్వదు," అన్నాడు మురళీ మోహన్.

"నాతో మాటమాత్రమైనా అనకపోతివి గదా?" అని శారదను ప్రశ్నించాడు నారాయణరావు.

"నాకు తోచినప్పుడల్లా వ్రాస్తూ వుంటాను. దానికి ఏ మంత విలువ ఇవ్వవలసిన అవసరం లేదు," అన్నది శారద.

"నాకు తెలిసి వుంటే చదివి సంతోషించే వాణ్ణి," అన్నాడు నారాయణరావు.

శారద నవ్వి వూరుకుంది

"శారద చాలా అభ్యుదయ భావాలు కలదండీ. అందుకని ఆమె రచనలు ఎప్పుడూ విప్లవపూరితమైన భావాలతో విలసిల్లుతూ వుంటై. అప్పుడప్పుడూ ఆమె ప్రభుత్వాన్ని విమర్శించటం కూడా కద్దు. ఆ విమర్శ చాలా నిష్పాక్షికంగానే ఉంటుంది. ఆ విమర్శను సహృదయంతో అర్థం చేసుకుంటే ప్రభుత్వానికి చాలా మేలు కలుగుతుంది. కాని అలా అర్థం చేసుకునే అవకాశం ఎక్కడుంది. ఎవ్వరో గిట్టనివాళ్లూ, అసూయపరులూ ప్రభుత్వానికి వొక ఉత్తరం వ్రాస్తారు. దానిమీద నోట్ పెట్టమని సెక్రటరీ క్రిందకు పంపుతాడు.....

"అవును, పరమపదసోపాన పటంలో ఆ ఉత్తరం జర్రున క్రింద గదిలోకి వస్తుంది," అన్నాడు నారాయణరావు చిరునవ్వు నవ్వుతూ.

"బాగా చెప్పారు"...అని "క్రింద గదంటే ఎల్. డి. క్లర్కే గదండీ ?" అని అడిగాడు మురళీమోహన్.

"అవును. నా క్రింద ఉంటాడు. నా క్రింద ఇన్నేళ్ళుగా ఎలా వుంటున్నాడో నాకు అర్థంకాదు. నాకు అప్పుడప్పుడూ పరమపదసోపానపటంలోని నిచ్చెనవెక్కాలని అనిపిస్తూ వుంటుంది. అతనికి అదీ వుండదు. తన్మయుడై, ఆ పటంలోని నిచ్చెనలనూ, పాములనూ, పావుల కదలికనూ

వొక చెయ్యివిరిగిన కుర్చీలో కూర్చుని తిలకిస్తూ వుంటాడు"
అన్నాడు నారాయణరావు నవ్వుతూ.

నారాయణరావు తన క్రింద పనిచేసే ఎల్. డి. క్లర్కుని ఉదాహరణం క్రింద మాత్రమే తీసుకొని మాట్లాడుతున్నాడని గ్రహించి నవ్వాడు మురళీమోహన్. నవ్వి ఇలా అన్నాడు.

"అటువంటి ఎల్. డి. క్లర్కేగదా ముందు శారద పుస్తకం మీద నోటు పెట్టేది. శారద అత్యద్భుతమైన సృజనశక్తి గలది. అసమానమైన ప్రతిభ గలది. నేను ముఖప్రీతికి ఈ మాటలు చెప్పటం లేదు నారాయణరావు గారూ, వున్న యదార్థం చెపుతున్నాను. వొక్కొక్కప్పుడు ఆమె వెలిబుచ్చే భావాలు నన్నే తికమక పెడుతాయి. ఇక ఎల్. డి. క్లర్కుకి ఏ మర్థమవుతుంది? శారద పుస్తకం చదువుతాడు. చదవడంలో లోపం చేస్తాడని నేను అనను. అందులో ప్రభుత్వాన్ని విమర్శించిన భావాలు కనపడతై. ఆ విమర్శ పరిపాలన సక్రమంగా నిర్వహింప బడటానికి తోడ్పడేదో, ప్రభుత్వాన్ని కూలద్రొయ్యటానికి నిర్దేశింప బడిందో, అతనికేం తెలుస్తుంది? వెంటనే ఆ పుస్తకంలో ప్రభుత్వ వ్యతిరేక విషయాలు చాలా వున్నాయని నోటు పెడతాడు. వీలైతే నాసికాపుటాలకు కమ్యూనిస్టు వాసన తగులుతూ వుందని అన్నా అనవచ్చు. అలా వ్రాసి ఆ ఫైలును మీ రన్నట్లు పరమపదసోపానపటంలోని పై అంతస్థులకు ఎక్కగలందులకు వొక నిచ్చెన దగ్గర విడిచి

పెడతాడు. ఆ ఫైలు మొదటి మెట్టు ఎక్కి పై అధికారి దగ్గర ఆగుతుంది."

"ఆ అధికారిని నేనే," అన్నాడు నారాయణరావు.

"మీ దగ్గర వచ్చి ఆగిన ఆ ఫైలును మీరేం చేస్తారు ?"

"వెంటనే డిస్పోజ్ ఆఫ్ చేస్తే చదువకుండా దస్కత్తు పెట్టానని పై అధికారి ఎక్కడ అనుకుంటాడో అని కనీసం నాలుగైదు రోజులైనా నా దగ్గర ఊరికే వుంచుకుంటాను. ఈలోగా సూపరింటెండెంట్ అడిగితే సమస్య క్లిష్టమయిందనీ, స్టడీ చేస్తున్నాననీ చెపుతాను."

"తరువాత ?"

"తరువాత ఆ పుస్తకంలో ప్రభుత్వ వ్యతిరేక భావాలు చాలా వున్నవనీ, ఆ భావాలు కలిగిన మనస్తత్వం ప్రమాదకరమైందనీ వ్రాసి ఫైలు సూపరింటెండెంట్‌కి సబ్‌మిట్ చేస్తాను. సూపరింటెండెంట్ అసిస్టెంట్ సెక్రటరీకీ, అసిస్టెంట్ సెక్రటరీ డెప్యూటీ సెక్రటరీకీ, డెప్యూటీ సెక్రటరీ సెక్రటరీకీ సబ్‌మిట్ చేసుకుంటూ పోతారు. సెక్రటరీ దగ్గరనుంచి ఫైలు మినిస్టరు దగ్గరకు వెళ్తుంది. ఫైనల్ ఆర్డర్స్ ప్యాసవుతాయి. ఆ గ్రంథకర్త ఉద్యోగం వూడుతుంది. ఉద్యోగం వూడటమే కాదు. ఆ గ్రంథకర్తను ప్రభుత్వం ఎప్పుడూ వోకకంట కనిపెట్టే ఉంటుంది."

"ఫైలు చదివి వున్నది వున్నట్టు వ్రాసేవారు ఉండరా ?"

"వుంటారు. కాని ఉద్యోగంమీద అపేక్ష వున్న వారెవ్వరూ ఆపని చెయ్యరు. ఆ గ్రంథంలో ప్రభుత్వ వ్యతిరేకత లేదనిగానీ, ఆవ్యతిరేకత నిర్మాణాత్మకమైంది గనుక ప్రభుత్వం సక్రమంగా నడవటానికి అవుసరమైందనిగానీ వ్రాస్తే, పై అధికారులు అలా వ్రాసిన ఉద్యోగే ప్రభుత్వ వ్యతిరేకి అని అనుకోవచ్చు. అటువంటి ప్రమాదం ఏరి కోరి ఎవ్వరు తెచ్చుకుంటారు. అందుకని ఆర్డరు పడేవరకూ ఫైలు తారాజువ్వలాగు పైకి వెళ్ళిపోతుంది. ఇటువంటి ఫైళ్లని కరవటానికి, పరమపద సోపానపటం గళ్ళలో కాటు వెయ్యటానికి ఎవ్వరు దొరుకుతారా అని కాచుకు కూచున్న పాములు కూడా భయపడతై.

"ఇవన్నీ ఆలోచించే శారదను నేను ప్రభుత్వోద్యోగంలో జేరవద్దని సలహా చెప్పాను. ఆమె నామాట విన్నది కాదు" అన్నాడు మురళీమోహన్.

వారు అలా మాట్లాడుకుంటూ కూర్చున్నారు వారు మాట్లాడుకున్నంతసేపూ శారద అక్కడ కూర్చోలేదు. లోపలకు వెళ్తూ బయటకు వస్తూ వుండేది. మధ్య మధ్య ఏదన్నా వొక మాట అంటూ వుండేది.

చివరికి, "మీమాటలకు అంతూపొంతూ వుండేటట్టు లేదు. లేవండి, భోజనాలు చేద్దాం" అన్నది.

"కోటుతీసి కాళ్లు కడుక్కోండి" అన్నాడు మురళీమోహన్. అకస్మాత్తుగా నారాయణరావుకి వొక సంగతి

జ్ఞాపకం వచ్చింది. అతను ప్యాంట్‌కి బెల్ట్ లేకపోయేటప్పటికి నెక్ టై కట్టుకున్నాడు. అది కూడా పాతది. పనికిరాక పార వేసింది. కోటువున్నది గనుక ఎవ్వరికీ కనపడదు అని అనుకున్నాడే గాని, భోజనాలదగ్గర కోటు విడవవలసి వస్తుందనే గమనం అతనికి ముందుగా లేకపోయింది. తాను ప్యాంట్‌కి నెక్ టై కట్టుకున్న సంగతి చూస్తే మురళీమోహన్ శారదలు నవ్వుతారేమో ! ఎంత ముదనష్టమైందీ ప్రపంచం.

"కోటు తియ్యకపోయినా పరవాలేదులెండి" అన్నాడు నారాయణరావు.

"అసలే ఉడకబోస్తూవుంది. వొక ఫానన్నా పెట్టింది కాదు శారద. ఊడదీసి ఈ వంకెకు తగిలించండి" అన్నాడు మురళీమోహన్.

మొత్తానికి కోటు వూడదియ్యక నారాయణరావుకి తప్పిందికాదు.

అతను భయపడ్డాడేగాని మురళీమోహన్ శారదలు అతని నెక్ టై సంగతి గమనించినట్లు లేదు. వొకవేళ గమనించినా పైకి తెలియనివ్వలేదు.

భోజనాలు ముగిసినై. నారాయణరావు సెలవు తీసుకొని ఇంటికి బయలుదేరాడు.

మరునాడే శారద వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిన వొక నెలరోజులకు శారదా మురళీమోహన్‌లు వివాహం చేసుకుంటున్నట్లు నారాయణరావుకి ఆహ్వానం వచ్చింది. అంతే. ఆ తరువాత మళ్ళీ శారద సంగతి అతనికి తెలియలేదు.

శారద వెళ్ళిన నాలుగైదు నెలలవరకూ నారాయణ రావుకి ఏమీ తోచేది కాదు. ఆమె తరచు జ్ఞాపకం వొస్తూ వుండేది. జ్ఞాపకం వచ్చినప్పుడల్లా మనస్సు వేదనపడుతూ వుండేది. కాని క్రమక్రమేణా ఆమె మరుపున పడింది.

శారదను అతను మరిచిపోయాడు కాని రాజమ్మ మాత్రం మరచిపోలేదు. జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఆమెని తిట్టేది. ఏదోవొక నెపంతో భర్తతో పోట్లాడేది.

"నేను ముందు పసిగట్టబట్టి సరిపోయిందిగాని, లేకపోతే యీ పాటికి ఈ కొంపను గుల్లచేసి, దానితో లేచిపోయే వారే," అనేది.

కాపురం ఈమాత్రం అన్నా గడుస్తున్నదంటే దానికి తనే కారణం అనుకునేది రాజమ్మ. భర్త చిల్లరగా తిరగకుండా ఇంటిపట్టున వుంటున్నాడంటే దానికి తనే కారణం అనుకునేది. డబ్బు చాలకపోవడంవల్లా, కోర్కెలు తీరకపోవడంవల్లా, కాన్పులు ఎక్కువ అవడంవల్లా కలిగిన అనారోగ్యఫలితంగా చీటికీ మాటికీ వొస్తున్న కోపాన్ని ఈ విధంగా సరిపెట్టుకునేది రాజమ్మ.

తన భార్యకు ఆరోజు అంతకోపం ఎందుకు వచ్చిందా అని ఆలోచిస్తూ కూర్చున్న నారాయణరావుకి ఈ విషయా లన్నీ జ్ఞాపకంవచ్చి మనస్సు బాధపడింది. ఆమెకు శారద సంగతి స్ఫురణకు రాలేదుగద!

అంతలో పేరంటానికి వెళ్లిన పెద్దపిల్లలు తిరిగి వచ్చారు. పెద్దమ్మాయి సరాసరి తండ్రివున్న గదిలోకివచ్చి

కాసిని నానబోసిన శనగలూ, వొక అరటికాయా పెట్టింది.

"చిన్నపిల్లలు ఎక్కడికి వెళ్లారమ్మా" అని అడిగాడు నారాయణరావు.

"వొస్తున్నారు నాన్నా. మేము వొస్తుంటే రోడ్డు చివర కనుపించారు".

"అమ్మ పనిమీద వుంటుందిగదా. వాళ్ళు చీకటి పడకముందే ఇంటికి వచ్చేటట్లు నువ్వు చూడగూడదా" అన్నాడు నారాయణరావు.

"ఆడుకుని వొస్తాం అని చెప్పి వెళ్తారు నాన్నా. మళ్ళీ కనపడరు. రోజుకి వొక ఇంటికి వెళ్తారు, ఎన్ని ఇళ్ళని వెతికేటట్టు?" అన్నది అరుంధతి.

"రోజులు బాగాలేవమ్మా. పిల్లల్ని ఎవరో ఎత్తుకు పోతున్నారని వూళ్ళో పుకారుగా కూడా వుంది. ఆ చిన్న వాడు మారిపోతే ఇంటి ఎడ్రస్ కూడా చెప్పలేడు. 'మీ నాన్న ఎవ్వరుది?" అని అడిగితే నా పేరుకూడా చెప్పలేడు. ఏదన్నా జరిగితే చచ్చేదాకా ఏడుస్తూ కూర్చోవాలి. కాస్త అజ కనుక్కుంటూ వుండమ్మా." అన్నాడు నారాయణరావు.

"అలాగే నాన్నా."

"అది సరేగాని, ఎందుకమ్మా ఇవ్వాళ అమ్మ కోపం మీద వుంది"?

"ఏమో నాన్నా," అన్నది అరుంధతి.

"చూడమ్మా. అమ్మ ఆరోగ్యం సరిగా లేదు. వొక్కర్తే పని చేసుకోలేదు. నువ్వు ఏదన్నా అప్పుడప్పుడు సహాయం చేస్తూ వుండమ్మా."

"అమ్మ నన్నసలు పని చెయ్యనివ్వదు నాన్నా. ఏదన్నా పని చెయ్యబోతే 'నాకు అడ్డం రాకండి' అని కసురుకుంటుంది. చేసిన పనులన్నిటికీ వంకలు పెడుతూ కూర్చుంటుంది. ఏమాటపడితే ఆమాట అంటుంది," అని చెమ్మగిల్లిన కండ్లను వొత్తుకుంటి అరుంధతి.

ఆపిల్లను చూస్తే నారాయణరావుకి కండ్లలో నీళ్లు తిరిగినై.

ఎక్కువ చదివితే వివాహం కాదని ఆమెను ఒకప్పుడు చదువు మాన్పించేశాడు నారాయణరావు. అది అతడికి స్వతహాగా కలిగిన భావంకాదు. భార్య పోరు పడలేక చేసిన పని. ఆతరువాత ఆమెకు ఎన్నెన్నో సంబంధాలు చూశారు. వాటిలో వాళ్ళకు చాలా నచ్చలేదు. నచ్చిన సంబంధాలకు అంతకట్నం ఇచ్చుకోలేక మానుకున్నారు. ఆతరువాత విసుగుపుట్టి అరుంధతి చదవటం మొదలుపెట్టింది. మెట్రిక్యులేషను పాసయింది. ఇప్పుడు ఇంటరు ప్రైవేటుగా చదువుతోంది.

ఆపిల్ల చాలా తెలివైంది. చాలా నెమ్మదిస్వభావం కలది కూడా. తల్లీ తండ్రీ చెప్పినట్లు వినాలనే కాంక్ష కలిగింది. కాని మరీ తెలివితేటలు కలిగుండటంవల్ల ఇతరులకు

పెద్దపెద్ద సమస్యలుగా కనబడేవి ఆపిల్లకు అలా కనపడవు. ప్రతి విషయాన్నీ ఇట్టే ఆలోచించి ఒక నిర్ణయానికి వస్తుంది. లౌకికవిషయాలకు మామూలు మనుష్యులు ఇచ్చేవిలువ, ఆపిల్ల ఇవ్వలేదు. అందువల్ల ఆపిల్ల మాటలకు రాజమ్మ వొక్కొక్కసారి ఉగ్రురాలై నోటికివచ్చిన తిట్లన్నీ తిడుతుంది. ఇతరులు రహస్యంగా ఉంచుకునే విషయాలను ఆపిల్ల ఇట్టే చెప్పుకుపోతుంది. అటువంటి సమయంలో రాజమ్మ, "ఇంత సిగ్గులేనిదానివి నాకడుపున ఎట్లా పుట్టావే?" అని పుటికీపుటికి అనరానిమాటలన్నీ అంటుంది. వెంటనే, "ఇంతఅమాయకురాలివి ఈలోకంలో ఎట్లా బ్రతుకుతావే"? అని ఏడుస్తుంది.

ఇవన్నీ జ్ఞాపకంవచ్చి మాట్లాడకుండా కూర్చున్నాడు నారాయణరావు.

మాట్లాడకుండా కూర్చున్న తండ్రినిచూచి, "మేమే దాన్నా అన్నామని అమ్మ చెప్పిందా నాన్నా"? అని అడిగింది అరుంధతి.

"లేదమ్మా, మాటవరుసకు అన్నాను" అన్నాడు నారాయణరావు, భార్య మాటలు కూతురుకి చెప్పి బాధ పెట్టటం ఎందుకనే ఉద్దేశంతో.

"అమ్మని నొచ్చుకునే మాటలు మేమెందుకు అంటాం నాన్నా? మేమేమంత వివేకం లేని వాళ్ళమా? కాకపోతే అమ్మకు ఈమధ్య ఆరోగ్యం సరిగ్గాలేక, ప్రతిమాటకూ పెడర్థాలు తీస్తుంది. నిరాధారంగా వొకదానినుంచి వొకటీ,

దానినుంచి మరొకటీ ఊహించుకొని అన్నవాళ్లకి లేని పోయిన ఉద్దేశాలు అంటగడుతుంది. ఏదైనా మాకోసం ఆమె పడుతున్న కష్టం మాకు తెలుసు. ఒకవేళ ఆమె ఏదన్నా అన్నా మేము ఓర్చుకోగలం,” అన్నది.

తనభార్య వంటఇంట్లో పనిమీద వున్నదనుకున్నాడు నారాయణరావు. తమసంభాషణ వినటంలేదుఅనుకున్నాడు. కాని అలా జరుగలేదు. ఆమె ఏదో పనిమీద బయటకు వచ్చి, తండ్రీ కూతురూ మధ్య జరుగుతున్న సంభాషణ అంతా విన్నది. అసలే ఆపూట చీకాగ్గా, కోపంగా వున్న దేమో,మండిపడి గబగబా గదిలోకి నడిచి,“ఏమిటే నామీద కొండాలు చెపుతున్నావు? నేను మిమ్మల్ని రాసి రంపాన పెడుతున్నానా?” అని అడిగింది.

ఆమె ఒక్క అడటున ప్రవేశించి ఉరిమేటప్పటికి తండ్రీ కూతుళ్లు తబ్బిబ్బుపడి, నిర్విణ్ణులై చూస్తూ వూరుకున్నారు.

“మాట్లాడవేమే?” అని కేకలేసింది రాజమ్మ. “మీ అందరికీ చేసిపెట్టలేక నా వళ్లు హూనం హూనం అవుతూ వుంది. మీరేమో తల్లిననే గమనం కూడా లేకుండా నామీద చాడీలు చెపుతూ తిరుగుతున్నారు. ఇటువంటి పిల్లల్ని నేను ఎక్కడా చూడలేదు” అన్నది.

“ఎందుకు అంతకోపం తెచ్చుకుంటావ్? ఇప్పుడు మేము ఏమన్నామని?” అన్నాడు నారాయణరావు. మర్యాదగానే అన్నాడు. ఆమెను సముదాయించాలనే ఉద్దేశంతోనే అన్నాడు. కాని అతని వాక్కు ఆమెకు బాకై గుచ్చు

కుంది. పొగగొట్టానికివలె ఇంతఎత్తున లేచింది.

"ఇంకా నన్నంటున్నారా! అసలు చేస్తుందంతా మీరే. అసలు నన్నుగురించి పిల్లలతో మీకు రహస్యాలేమిటి? అలా రహస్యాలు మాట్లాడే హక్కు మీకు ఎవరిచ్చారు? నేను గ్రహించలేదు అనుకున్నారు కాబోలు. ఈ ఈ ఇంట్లో అందరినీ నామీదకు మీరు కట్టు కడుతున్నారు" అని భర్తను నోటికివచ్చినట్లల్లా అన్నది.

తలిదండ్రులు పోట్లాడుకోవటం విని మిగిలిన పిల్లలంతా అక్కడకు జేరారు ఆఖరిపిల్ల, పిల్లవాడు తమ కండ్ల ముందు జరుగుతున్నది అర్థంకాక భయం భయంగా బిత్తరి చూపులు చూస్తూ గడపలో నిలబడ్డారు.

తన తలిదండ్రుల పోట్లాట పక్క ఇంటివాళ్ళకు కూడా వినబడే అవకాశం వుందని అరుంధతికి తెలుసు. వాళ్ళ దృష్టిలో పరువుపోవటం ఆమెకు ఇష్టంలేదు.

"ఊరుకో అమ్మా, ఎవ్వరన్నా వింటారు" అన్నది.

ఆమాటతో రెచ్చిపోయింది రాజమ్మ. కూతురితో సలహా చెప్పించుకునే స్థితికి తాను దిగజారినందుకు తనమీద తనకు వొచ్చినకోపమే దీనికి కారణం కావచ్చు. కారణం ఏదయినా ఆమె రెచ్చిపోయిన మాట యదార్థం. రెచ్చిపోవటంలో కూడా అలా ఇలా కాదు. తాను నిందిస్తున్నది తన గర్భవాసాన్న పుట్టిన కూతుర్ని అనే సంగతి కూడా ఆకోపంలో మరచిపోయింది. నోటికి వచ్చినవన్నీ అన్నది.

ఆమె సహజంగా అటువంటి మాటలు అనే మనిషి కాదు. అందులో పిల్లలు అంటే ఆమెకు మమకారం లేదా అంటే వుంది. అందులో పెద్దపిల్ల మనస్థాయి ఆమెకు తెలియంది కాదు.

అరుంధతి చాలా తెలివిగలది. అతి తెలివిగలది అని చెప్పుకోవచ్చు. ఆపిల్ల ఎక్కువ చదివినట్లు కనపడదు. కాని రాజకీయాలు మొదలుకొని వేదాంతంవరకూ ఆమె ప్రతి విషయం మీాదా మాట్లాడగలదు. మాట్లాడటం అంటే కవులూ, కాంగ్రెస్ వాదులూ ఉపన్యాసాలు చెప్పినట్లు కాదు. ఎన్నాళ్ళ నుంచో ఆయా సమస్యలను మననం చేసుకొన్న మేధావివలె మాట్లాడ గలదు. సునిశితమైన బుద్ధితో ప్రతి విషయం మీాదా తన అభిప్రాయాన్ని చెప్పగలదు.

రాజమ్మ అలా మాట్లాడటానికీ, ఆమె పతనానికీ, తానూ, తాను సృష్టించిన కుటుంబ పరిస్థితులే కారణం అని నారాయణరావుకి తెలుసు. తనే ఇంకా ఎక్కువ డబ్బు సంపాదించ గలిగివుంటే, కుటుంబం ఇంత నిస్పృహకు ఆకరం అయి వుండేది కాదు. కుటుంబంలోని సభ్యులు వొకొక్కరూ వొకొక్క నిరాశాకణంగా రగులుతూ వుండేవారు కాదు. రాజమ్మ ఏ మహిళా సంఘానికో, సంస్థకో ప్రెసిడెంట్ అయి కబుర్లు చెపుతూ, యువతులకు నీతులు బోధిస్తూ ఆనందంతో కలకలలాడే ముఖంతో తిరుగుతూ వుండేది. తాను జీవితంలో

ఉన్నత పదవిలోకి రాలేకపోవటం, ఇతరత్రా డబ్బు సంపాదించలేక పోవటం, దానికి తగినట్లు పిల్లలు ధారా ప్రవాహంగా పుట్టుకురావటం ఈ పతనానికి దారితీసింది. కుటుంబం వున్నతిని పొందటానికైనా, పతనం అవటానికైనా బాధ్యత పురుషునిదే. పురుషుడు వేసిన పట్టాల వెంట 'కృష్ణా, రామా' అనుకుంటూ దొర్లుకుపోయే స్త్రీదేమి వుంది.

అందుకని తన కుటుంబంలో జరిగే ప్రతి అల్లకల్లోలానికీ బాధ్యత తనదే అనే భావం వొకటి నారాయణరావుని నిరంతరం వెన్నాడుతూనే వుంటుంది. అయినప్పటికీ అతను భార్య మాటలను సహించలేక పోయాడు.

"ఎందుకట్లా ప్రేలతావు ? మనిషై పుట్టిన తరువాత నోటికి హద్దూపద్దూ వొకటివుండాలి. ఎవ్వరిని అంటున్నాం? ఏమంటున్నాం? అనే జ్ఞానం వొకటి వుండాలి. యిప్పుడు నువ్వు అన్నమాటలు కూతురుని అనవలసిన మాటలేనా ? వయస్సు వొస్తున్న కొద్దీ నీకు మతిపోతున్నట్లు వున్నది" అన్నాడు.

ఈ మాటలతో వెర్రి ఎత్తినట్లు అయింది రాజమ్మకి. అసలే కడుపులో మండుతూ వుందేమో ఆ మంట వొక్కసారి గుప్పుమన్నది. పమిటె చెంగు నడుముకి బిగించి భర్త మీదకు మహాకాళివలె వెళ్తూ, "నాకు మతిపోయిందా ? సరే పోతే. వొకప్పుడు వుంది గనుక ఇప్పుడు పోయింది. మీ కసలు మతి వున్నదెప్పుడో? మీకే గనక మతివుంటే, నా ముందు, కన్నతల్లినైన నా ముందు, ఇట్లా పిల్లలను

వెనక వేసుకొని వస్తారా? పిల్లలను వెనక వేసుకొని ఇట్లా నా మీద దాడి చేస్తారా? తల్లికీ పిల్లలకూ కాకుండా చేస్తారా? పిల్లలను మీ వైపుకి తిప్పుకొని, ఈ ఇంట్లో నాకు 'నా' అనేవాళ్ళు లేకుండా చెయ్యటానికి మీరు ఈ ఎత్తు ఎత్తారు. చూస్తాను మీరు ఆపని ఏ విధంగా చెయ్యగలరో! పదండే, పదండి. ఎందుకట్లా వెర్రిమొగాలు వేసుకున్నారు. పదండి, అన్నాలు తిందురుగాని," అన్నది.

"ముందు నాన్నకు పెట్టమ్మా. తరువాత మేంతిం టాం," అన్నది అరుంధతి.

"ఎవరికి ముందు పెట్టాలో నువ్వు నాకు నేర్ప వచ్చావా? నేను ఏమంత తెలివితక్కువ దద్దమ్మను అనుకున్నావా? నాకు అన్నీ తెలుసు. నోరు మూసుకొని పద వొస్తే వచ్చారు. లేకపోతే ఇవ్వాల్టికి మీరు అన్నాలు లేకుండా పడుకోవలసిందే. కదలండి." అంటూ వంట ఇంట్లోకి వెళ్ళింది రాజమ్మ. తల్లికి భయపడి మిగిలిన పిల్లలందరూ ఒకరి వెనుక ఒకరు వంట ఇంట్లోకి వెళ్ళారు. ఒక్క అరుంధతి మాత్రం తారట్లాడుతూ అక్కడే ఉంది.

ఆమెకు తనతో ఏదో మాట్లాడాలని వుందని గ్రహించాడు నారాయణరావు. కాని ఆ మాట్లాడే విషయం ఏమిటో, దానికి తాను ఏ విధంగా సమాధానం చెప్పాలో తెలియక కాసేపు తటపటాయించి, "అన్నానికి వెళ్ళకపోయావా అమ్మా?" అన్నాడు.

"అన్నానిదే ముందిలే నాన్నా?" అని అట్లానే నుంచుంది అరుంధతి.

ఆమె ఏదో తనకు చెప్పదలచిందని నిర్ణయించు కున్నాడు నారాయణరావు. ఆ చెప్పదలచింది ఎలా మొదలు పెట్టాలో తెలియక తికమక పడుతూవుందని కూడా గ్రహించాడు.

"ఏమమ్మా?" అని అడిగాడు త్వరగా తెముల్చుకోవాలనే ఉద్దేశంతో.

"కుటుంబం ఈ పరిస్థితుల్లో వుంటే పిల్లలు కూడా చెడిపోతారేమో అని అనిపిస్తూ వుంది నాన్నా," అన్నది.

"మరి నేనేం చెయ్యను?"అని ప్రశ్నించాడు నారాయణరావు, కూతురు ముఖంలోకి చూడలేక భారంగా తల వంచుకొని.

"దగ్గర్లో ఎక్కడన్నా వాక గది దొరికితే తీసుకో నాన్నా. భోజనం ఇక్కడ చేసుకొని, మేమంతా అక్కడ వుంటాం. మాకు చదువు సాగుతుంది. అమ్మకు కొంత గజిబిజి తగ్గి, మనస్సుకు కొంత ప్రశాంతత చేకూరవచ్చు," అన్నది.

కూతురు మాటలకు, "డబ్బెక్కడిదమ్మా?" అనే ప్రశ్న నోటిదాకా వొచ్చింది నారాయణరావుకి. కాని కూతురితో ఆ మాట అనటానికి అతనికి మొహం చెల్ల లేదు. "చూద్దామమ్మా," అని ఊరుకున్నాడు.

అంతలో తండ్రీ కూతుళ్లు తనమీదే ఏదో మాట్లాడు కుంటున్నారనే ఉద్దేశం కొద్దీ వంట ఇంట్లోనుంచి రయిన

వొచ్చింది రాజమ్మ. "వంట యింట్లో అన్నాలు వడ్డించి కూర్చుంటే ఇంకా ఇక్కడే వున్నావేం? నేనేం వంటదాన్ని అనుకున్నావా, పళ్ళాల్లో అన్నం వడ్డించి మీ కోసం ఎదురు చూస్తూ కూర్చోటానికి ?"

"వస్తున్నానమ్మా ?"

"ఏమిటి వొచ్చేది ? నీ కోసం మాటిమాటికీ ఒచ్చి పిలవటానికి నేనేమీ ఈ ఇంట్లో దాసీదాన్ని కాదు. మీ అందరికీ వున్న హక్కు నాకూ వుంది. మీ రెవ్వరూ నాకు అన్నం వూరికే పెట్టటంలా. పగలనక రాత్రనక ఎముకలు విరగ్గొట్టుకు పనిచేస్తే మూడు పూటల పూటకు గుప్పెడు మెతుకులు వేస్తున్నారు" అన్నది రాజమ్మ.

తల్లి మాటలు మొదలకుండా విన్నది అరుంధతి. కూతురు తల్లి మాటల కేదో సమాధానం చెపుతుందనీ, రగడ పెరిగి రసాభాసం అవుతుందనీ ముడుచుకుని కూర్చున్నాడు నారాయణరావు. కాని అలాంటిదేమీ జరగలేదు. కూతురు కండ్లల్లో నీరు ఎండిపోయింది. పెదవులు పాలిపోయి వున్నాయి. ఆ పిల్లను చూడటమే కష్టం అనిపించింది నారాయణరావుకి.

"ఈ విషయాలు నెమ్మదిగ మాట్లాడుకుందాంగాని నువ్వు వెళ్ళి అన్నం తినమ్మా" అన్నాడు నారాయణరావు.

"నువ్వు రావా నాన్నా ?"

"మీరు ముందు కానివ్వండి. రేపు అర్జెంటుగా వెళ్ళవలసిన ఫైలు వొకటి వుంది. అది చూచి వస్తాను. నాకు కొంచం ఆలస్యమైనా ఇబ్బంది లేదు" అన్నాడు నారాయణరావు.

ఆ పిల్ల వంట ఇంట్లోకి వెళ్ళింది. రాజమ్మ ఇంకా అక్కడే వుంది. ఆమె వంకకు చూడటానికే మనస్సు ఒప్ప లేదు నారాయణరావుకి.

ఉండి ఉండి, "ప్రతిదానికీ అట్లా మాట్లాడకుండా కూర్చుంటే సరిపోతుందనుకున్నారా? ఇంతకు ముందు ఈ గుణం లేదు. ఇప్పుడు ఇది ఒకటి క్రొత్తగా నేర్చుకున్నారు" అన్నది.

అయినా నారాయణరావు కాస్సేపు మెదలకుండా వూరుకున్నాడు. ఆమె వెళ్ళగలందులకు ఫైలు తీసి తిరగ వేస్తూ కూర్చున్నాడు.

"మళ్ళీ ఆ ముదనష్టపు కట్టతీసారు. ఎందుకండీ ఆఫీసులో చేస్తున్న చాకిరీ చాలదూ. పంచాంగం కట్టకు మల్లే దానిని చంకలో పెట్టుకొని తీసుకు వస్తా రెందుకండీ రోజూ? ఆ ఎర్రగుడ్డని చూస్తే నా వొళ్ళు మండుతుందని మీకు ఎన్నోసార్లు చెప్పాను. నా మీద పంతం కట్టేసట్లు ఆ ఎర్ర గుడ్డ ఫైళ్ళే తెస్తారు మీరు."

ప్రభుత్వంలో ప్రతి ఫైలునీ ఒక ఎర్రగుడ్డ పీలికతో కడుతుంటారు. ఫైలు వుండే అట్టకు రెండు వైపులా అట్టకే

అతికించి, రావణాసురుడి మీసాలకు మల్లే, వానికివుండే చేతులకు మల్లే, రెండు రక్తధారలకు మల్లే, ఆ రెండు పీలికలూ వేళ్ళాడుతూ వుంటై. తనభార్య ఆ రెండు గుడ్డపీలికలనుగురించి అంటూ వుందని నారాయణరావుకి తెలుసు. అంతే కాదు. ఆ రెండు గుడ్డ పీలికలంటే ఆమెకు ఇష్టంలేదని కూడా అతనికి తెలుసు. వొక రోజు ఆమెకు తన మీద కోపం వచ్చి తాను ఇంటికి తెచ్చిన ఫైలుకుండే పీలికలను చింపి, చిన్న కూతురుకి రెండు జెడలు వేసి, వాటిని రిబ్బన్లుగా వాడింది. వాడి అంతటితో వూరుకుందా? "వెళ్ళి మీ నాన్నకు చూపవే, ఎట్లా వుందో చెపుతారు," అని చెప్పి తన దగ్గరకు పంపించింది.

నిజానికి ఆ గుడ్డ పీలికలు రిబ్బన్లుగా బాగున్నయి. వాటిని చూచినంతసేపూ రిబ్బన్లుగా వుండవలసిన వాటిని, ఫైళ్ళకు అతికించి ప్రభుత్వం వాటికి ఘోరాన్యాయం చేసింది అనిపించింది నారాయణరావుకి. అయినా ప్రభుత్వ నిర్ణయాన్ని తారుమారు చేసే హక్కు, మహా మహా వాళ్ళకే లేదు, తన భార్య కెక్కడిది? దేనిని దేనికి వాడే హక్కయినా ప్రభుత్వానికి వుంది. అది ప్రజలను తుపాకీలకు ఇంధనంగా చెయ్యవచ్చు. ప్రజలకు బదులు తుపాకీలను నెలకొల్పి రాజ్యం ఏలవచ్చు. పెట్రోలును నీళ్ళుగానూ, నీళ్లను పెట్రోలుగానూ వాడవచ్చు. పార్టీని దేశంగానూ, దేశాన్ని పార్టీగానూ మార్చవచ్చు. తెలివిగల వాళ్ళను పూచిక పుల్లలు గానూ, పూచిక పుల్లలను తెలివిగల వాళ్ళుగానూ పరిగణించవచ్చు. కాని తన భార్య అందుకు వూనుకోవ

టంగానీ, ఇటువంటి పనుల్లో ప్రభుత్వంతో పోటీ పడటం గానీ అర్థంలేని పని. అందులో ఆమె ఎవ్వరో కాదు, ఎక్కడ నుంచో దిగి రాలేదు. ఆమె ఒక యు. డి. క్లర్కు భార్య. యు. డి. క్లర్కు భార్య అయి ఇటువంటి పనులకు దిగటం నిప్పుతో చెరలాడటం వంటిది.

రిబ్బన్ల సంఘటన జరిగినప్పుడు ఈ మాటే తన భార్యతో అన్నాడు నారాయణరావు. కాని తన సలహాలో నిగూఢంగా వున్న లౌకికనీతిని ఆమె అవగాహన చేసుకోలేక పోయింది.

"ప్రభుత్వంతో నాకేం పని?" అని అడిగింది.

"నీవు నా భార్యవు."

"అవును. కాని ప్రభుత్వం భార్యను కాదుగదా," అని రెట్టించింది.

"ఇది హేళనకు సమయం కాదు," అని సర్వ ప్రభుత్వ దృష్టిని విపుల పరిచాడు నారాయణరావు. ప్రభుత్వంలో నే నిప్పుడు ఉద్యోగం చేస్తున్నాను. అంటే నేను స్వామిభక్తి పరాయణుడనై వుండాలి. నే నంటే నేను ఒక్కణ్ణే కాదు. నా కుటుంబం అంతా స్వామిభక్తి పరాయణత కలిగి వుండాలి. అలా వున్నప్పుడే ప్రభుత్వోద్యోగం కుదురుతుంది. ప్రభుత్వం సహిస్తుంది."

"అదేమిటండీ అలా అంటారు? అయితే నేను మీకు భార్యనైనంత మాత్రాన నాకు వ్యక్తిత్వంలేకుండా పోవాలంటారు- అయితే పెద్ద లందరూ "స్త్రీ స్వాతంత్ర్యా

నికి మేము సుముఖులం అని ప్రకటనలూ, ఉపన్యాసాలూ చేస్తూ వుంటారు. ఇక స్వాతంత్ర్యం ఎక్కడ వుందండీ? ఇది భర్తల స్వాతంత్ర్యం కావచ్చు. లేకపోతే ప్రభుత్వం తయారు చేసిన 'తాజా క్రొత్తరకం స్వాతంత్ర్యం కావచ్చు' అన్నది. ఇంకా చాలా అన్నది. మొత్తానికి ప్రభుత్వ పరంగా తను చెప్పిన విషయాలేమీ ఆమె చెవికి ఎక్కలేదు. "భర్తలు ప్రభుత్వాలక్రింద పని చేస్తారు. అందుకు భర్తలకు ప్రభుత్వాలు జీతాలు ఇస్తవి. దానికీ దానికీ సరి. ఇక భార్యలజోలి ఈ ప్రభుత్వాల కెందుకు?" అని అడిగింది.

"మరి ప్రభుత్వం ఇచ్చే డబ్బు భర్తలతోపాటు భార్యలూ పిల్లలూ కూడా తింటున్నారుగదా! అందువల్ల వారుకూడా స్వామిభక్తి పరాయణులై వుండవలసిన అగత్యం కలిగింది" అన్నాడు నారాయణరావు.

దీనికి సమాధానంగా, "అసలు ప్రభుత్వానికి డబ్బెక్కడిదండీ? మనం ఇచ్చిందేగా. మనంఇచ్చిన డబ్బు తిరిగి మనకే ఇవ్వటానికి ఇన్ని కరకు నిబంధన లెందుకండీ? చూడగా చూడగా ప్రభుత్వంకంటే కాబూలీవాలాయే మెరుగా అనిపిస్తూవుంది" అన్నది.

అప్పటినుంచి కదలిస్తే ఇంకేమేమి అంటుందోనని ప్రభుత్వవిషయాలేవీ లోతుకుదిగి చర్చించటం మానివేశాడు నారాయణరావు. అదేవుద్దేశంతో ఆమె ఫైళ్ళసంగతి ఎత్తేసరికి మాటలు పెంచితే ఎక్కడ ప్రభుత్వం సంగతి వొస్తుందో

నని మెదలకుండా వూరుకున్నాడు. ఫైలుమూసి నెమ్మదిగా ప్రక్కన పెట్టాడు.

"మాట్లాడరేం ?" అని కవ్వించింది రాజమ్మ.

"చూడూ...." అని ఏమో చెప్పబోయాడు నారాయణరావు.

"చూస్తూనేవున్నాగదండీ! చూడక కండ్లు చిల్లులు పొడుచుకున్నాననుకున్నారా?" అన్నది రాజమ్మ.

"నామాట విని నువ్వు ఎవరి మనస్సూ కష్టపెట్టకు" అన్నాడు నారాయణరావు. తనకు వట్టుకు తాను లౌకికంగానే చెప్పాను అనుకున్నాడు.

కాని ఆమె అలా అనుకోలేదు. ఉవ్వెత్తున లేచింది. అనేకవిధాల భర్తను నిందించింది. అతనిమూలాన కుటుంబం నాశనం అయ్యేస్థితికి వొచ్చింది అన్నది. అతనిమూలాన పిల్లలుకూడా చెడిపోతున్నారు అన్నది. అడిగినప్పుడల్లా కొనుక్కుతినటానికి డబ్బులిచ్చి పిల్లలను ఎందుకూ పనికిరాని వాళ్లని చేసింది అతనే అన్నది. ఇంకా అనేకం అన్నది. ఆమె నోటివెంట వాక్కులు బాకులవలె వెలువడి అతని మనస్సును గాయపరచినై. చివరికి "ఇట్లా అయితే ఈ ఇంట్లో వొక్కక్షణం వుండను. నాదారి నేను చూసుకుంటాను" అనిచెప్పి గబగబా అడుగులు వేసుకుంటూ, వంటఇంట్లోకి వెళ్ళిపోయింది.

నారాయణరావుకి నోరు పెగలలేదు.. పిచ్చివాడివలె గదిగోడలు పరీక్షిస్తూ కూర్చుండిపోయాడు. ఆమె ఏమన్నా

తను మాట్లాడకుండా వుండవలసిందని అప్పు డనుకున్నాడు. నిజంగానే ఏ కన్నవారింటికో ప్రయాణం కడుతుందేమో నని భయపడ్డాడు.

ఆమె కన్నవారి ఇంట్లో అతనికి ఎక్కువ పరువు లేదు. అందుకు ముఖ్యకారణం వాళ్ళు ఆసించినట్లు అతను పెద్ద ఉద్యోగంలోకి రాలేకపోవడమే. ఆమె నిజంగానే కన్నవారంటికి వెళ్ళి ఇక్కడి పరిస్థితి అంతా చెపితే, వాళ్ళు అతనిని క్షమించరు. వాళ్ల చూపుల్లో అతను మరీ చులకనైపోతాడు. అందులో రాజమ్మ చెప్పటం మొదలు పెడితే ఆమె నోటికి అడ్డు వుండదు. ఇది చెప్పవచ్చూ, ఇది చెప్పగూడదూ అని కూడా ఆమెకు తోచదు. కొంపతీసి శారద వ్యవహారం కూడా చెప్పదు గదా! ఆ సంగతి చెపితే వాళ్లకు సహజంగా పట్టరానికోపం వొస్తుంది. 'తనకు చూరకంత లేదు, మొడకొకడోలుకూండానా' అని ముక్కుమీాగ వేలు వేసుకుంటారు. ఇక అతని మామ గారి సంగతి చెప్పనే అవుసరంలేదు. ఇప్పుడాయన ప్రభు త్వోద్యోగంనుంచి రిటైరు అయి పింఛను పుచ్చుకుంటు న్నాడు. కాని ప్రభుత్వోద్యోగం చేసేటప్పుడు తాపడం అయిన వాసనలు ఆయనకు ఇంకా పోలేదు. పోయే అవ కాశం కూడా లేదు. ఆ వాసనలు ఆయన స్వభావంతో ఏకమై వున్నాయి. ఆయన తప్పకుండా తన పలుకుబడిని ఉపయోగించి శారదకు అపకారం చెయ్యటానికి ప్రయత్ని స్తాడు. అపకారం చెయ్యటం అంటే ఏ పిడుగురాళ్లో ట్రాన్స్ఫర్ చేస్తే చాలదూ! ఇంకేం కావాలి. పిడుగు

రాళ్లల్లో ఆమె ఉద్యోగం చెయ్యటానికి ప్రభుత్వ గంథాలయం లేదుగదా అంటారా? ఆమెకోసం వొకటి పెడితే సరిపోయె.

అలా ఆలోచిస్తూ కూర్చుంటే అతనికి తన బావమరది గోపీకృష్ణ జ్ఞాపకం వచ్చాడు. గోపీకృష్ణ అప్పుడు ఢిల్లీలో ఒక పెద్ద వ్యాపారసంస్థకు మేనేజరుగా వుంటున్నాడు. అతని పని చాలా బాగుంది. అతని కిప్పుడు ఇద్దరు మొగపిల్లలు. భార్య ఆరోగ్యం చెడిపోతుందని పిల్లలు ఎక్కువ అయితే వాళ్లని పెద్ద పెద్ద చదువులు చదివించి, జీవితంలో మంచి స్థితిలోకి తెచ్చే అవకాశాలు సన్నగిలుతాయని భావించి అతను ముందే జాగ్రత్తపడ్డాడు. ఈ విషయం నారాయణరావుకి ఒకరోజు గాయత్రమ్మ చెప్పింది. అప్పటికి వాళ్లకు నలుగురు పిల్లలు. అయినప్పటికీ గోపీకృష్ణ చేసిన పని అతనికి నచ్చలేదు.

“పిల్లలవల్ల ఇబ్బందులు వుండవచ్చు. కాని వాళ్లవల్ల వచ్చే ఆనందం కూడా వుంది. పదిమంది పిల్లలు వుంటే ఏ ఏడోవాడో, ఎనిమిదోవాడో గొప్పవాడు కావచ్చు. దేవకీ వసుదేవుల గర్భాన శ్రీకృష్ణ పరమాత్మ ఎనిమిదవ వాడుగా జన్మించాడు. వాళ్లే సంతానాన్ని నిరోధిస్తే శ్రీకృష్ణ పరమాత్మ జననమే వుండేది కాదు. అప్పుడు ప్రపంచానికి ఎంతలోటు చేకూరేది. అదీ కాక, పుట్టిన పిల్లలను హత్య చెయ్యటానికీ, పుట్టబోయేవాళ్లని చెయ్యటానికీ తేడా ఏముంది?” అన్నాడు.

అప్పుడు తన సోదరునివలె తన భర్త కూడా పిల్లలు కలగకుండా ఆపరేషన్ చేయించుకుంటే బాగుండునని లీలా మాత్రంగా రాజమ్మ మనస్సులో వుంది. కాని ఆమెకు అప్పటికి ఇంకా భర్తమీద గురి చెడలేదు. భర్త గొప్ప వాడని, ఏనాటికైనా ఘనకార్యాలు సాధించకపోడనీ ఆమెకు నమ్మకం వుండేది. అందుకని మెదలకుండా వూరుకుంది.

తరువాత ఈ సంగతి ఆలోచించటానికి ఆమెకు వోపికా లేకపోయింది, అతనికి తీరికా లేకపోయింది. పిల్లలు ఒకరి తరువాత ఒకరు తరుముకువచ్చారు. ప్రస్తుతానికి ఏడు గురు స్థిరపడ్డారు. అంతా ఒక కలగా జరిగిపోయింది. కన్ను మూసి తెరిచేటప్పటికి జీవితం తారుమారై కూర్చుంది. ఇప్పుడు వెనక్కు జరగటం బ్రహ్మతరం కూడా కాదు.

ఒక స్వల్పవిషయం జీవితాన్ని ఎంత మార్చి వేస్తుందో ఊహకు వచ్చేటప్పటికి సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యాడు నారాయణరావు. ఆనాడు తాను ఒక చిన్న ఆపరేషన్ చేయించుకొని వుంటే. తన జీవితం ఇప్పుడు గుర్తు పట్టటానికి వీల్లేని ఉన్నతపథాలలో నడుస్తూ వుండేది తనకు ఒకరిద్దరు పిల్లలు మాత్రమే వుండేవారు. వాళ్లిప్పుడు ఉన్నత విద్యాభ్యాసం చేస్తూ వుండేవారు. కూతురికి పెద్ద కట్నం ఇచ్చి మంచి సంబంధం తెచ్చేవాడు. ఆమె జీవితం సుఖవంతంగా నడుస్తూ వుండేది. ఒకవేళ ఆమెకూ భర్తకూ పడగూడకపోయినా, ఆమెను ఏ ఇంగ్లాండో పంపించిన

మంచి డిగ్రీ వచ్చే చదువు చెప్పించేవాడు. ఆమె తన జీవితం తనకుగా తాను సరిదిద్దుకునే స్థితిలో వుండేది. తనకు ఏ చీకూ చింతా వుండేది కాదు.

ఢిల్లీ వెళ్ళిన తరువాత నారాయణరావు గోపీకృష్ణను ఒకసారి మాత్రమే చూశాడు. అతను ఒకసారి వ్యాపారం పనిమీద హైదరాబాద్ వచ్చాడు. ఒక పెద్ద హోటల్లో దిగాడు. తాను వస్తున్నట్లు ముందుగా తనకుగాని, తన భార్యకు గాని అతను తెలుపలేదు. వూళ్ళోకి వచ్చిం తరువాత కూడా ఎవ్వరో చెపితే అతనికి తెలిసింది. తను వూళ్ళో వుండగా తన ఇంటికి రాక, హోటల్లో దిగినందుకు అతనికి చాలా కష్టం వేసింది. తన ఇంటికి వచ్చే ఆప్యాయత అతనికి లేనప్పుడు తాను మాత్రం అతనిని చూడటానికి ఎందుకు వెళ్ళాలి అనుకున్నాడు. కాని అతని భార్య వూరుకోలేదు. "మన ఇంటికి వస్తే మాత్రం ఎక్కడ వుంటాడండీ! నెలకి పదిహేను వందలు సంపాదిస్తున్నాడు వాడు. పైగా వాడు వచ్చాడని తెలిసి వూళ్ళో పెద్దమనుష్యులు ఎవ్వరో ఒకరు చూచి పోవటానికి వచ్చి పోతూ వుంటారాయె. ఇక్కడ వుంటానికి వాడికీ వోపిక? వాడు వాడు మన ఇంట్లో దిగకపోవటం మంచి పనే అయింది? మీరు వెళ్ళి రాత్రికి భోజనానికి రమ్మనమని చెప్పండి. వాడు వూళ్ళోకి వస్తే పిలిచి భోజనం పెట్టకపోవటం బాగుంటుందా?" అన్నది.

అతనికి తప్పలేదు. గోపీకృష్ణ వున్న హోటలుకి వెళ్లాడు. ఆహోటలు హైదరాబాద్‌లో వున్న హోటళ్లన్నింటిలోకీ పెద్దది. చాలా పెద్ద పెద్దవాళ్ళు గాని అక్కడ దిగరు. మద్యపానం సేవించేవారికి ఆక్కడ మంచి వసతులున్నాయని ప్రఖ్యాతి. నారాయణరావు అంతకు ముందు ఆహోటలు పేరైతే విన్నాడే గాని, అక్కడికి ఎప్పుడూ వెళ్ళలేదు.

ఆ హోటలు చాలా సందడిగా వుంది. హైక్లాసుకి చెందిన స్త్రీ పురుషులు కార్లల్లో వచ్చి పోతున్నారు. నారాయణరావుకి ఎందుకనో హైక్లాసు స్త్రీ పురుషులను చూచినప్పుడు మనస్సు కలవర పడుతుంది. బెరుకుగా తప్పుకుపో బుద్ధి అవుతుంది. అప్పుడు కూడా అతనికి అలాగే అనిపించింది. ఇంటికి వెళ్ళిపోదామనుకున్నాడు. ఇంటికి వెళ్తే భార్యకు ఏమి సమాధానం చెప్పాలో తోచక ముందుకు అడుగు వేశాడు.

గేట్లో అడుగు పెట్టగానే ఆ హోటలుకు ముందున్న పచ్చని బయలు కనుపించింది. ఆ బయలులో అక్కడక్కడ చలువరాతితో చేయబడిన తిన్నెలు వున్నాయి. ఆ తిన్నెల మీద స్త్రీ పురుషులు జంటలు జంటలుగా కూర్చొని సరస సల్లాపా లాడుకుంటున్నారు. వకమూల చిన్న టీ పార్టీ జరుగుతూ వుంది. భార్యాభర్త లిద్దరు చెట్టాపట్టాలు పట్టుకొని కిల కిల నవ్వుతూ తన ప్రక్కగా లోపలకు వెళ్లారు. అక్కడున్న మనుష్యుల్ని వాళ్ళ వేషభాషల్ని చూస్తూంటే

వాళ్ళు తన లోకానికి సంబంధించిన మనుష్యులు కాదని పించింది నారాయణరావుకి. తనలోకం నియమాలు వేరు. తన లోకంలో స్త్రీ పురుషులు అలా కలిసి వుండటంతప్పు. పురుషునితో సమాన ఫాయిదాలో స్త్రీ ప్రవర్తించటం తప్పు. అంతకు ముందు తన ప్రక్కనుంచి వెళ్ళిన భార్యా భర్తలకు మల్లీ స్త్రీ పురుషులు చెట్టా పట్టాలు పట్టుకొని వెళ్తే ఇంకేమన్నా వుందా? కొంపలు అంటుకోవూ? పురుషుల మాట అటుంచి. అమ్మలక్కలు వూరుకుంటారా? కాకులను పొడిచి చంపినట్లు చంపరూ?.

తన లోకంలో భార్య భర్త మాటకు ఎదురాడ గూడదు. భార్య మాట భర్త వినగూడదు, భార్య పరపురుషుని ముఖం చూడగూడదు. భర్త పరస్త్రీతో కలుపుగోలుగా వుండగూడదు. భార్య భర్త పెట్టే హింసకు లోనై వుండవలసిందే గాని, విడాకులు అర్థించగూడదు. భర్త కూడా అంతే. తన లోకంలో స్త్రీలు అందాలకు పరదాలు కట్టటం ధర్మం. ఈ లోకంలో అందాలను ప్రదర్శించటం ధర్మం. తన లోకంలో భోగాలను వ్యసనాలక్రింద జమ కట్టటం ధర్మం. ఈ లోకంలో భోగాలను అనుభవించటం ధర్మం.

గేట్లో నుంచుని ఇటువంటి ఆలోచనలకు లోనై వున్న నారాయణరావుకి, తనకు దగ్గర్లో వాక చల్వరాతి తిన్నె మీద కూర్చొని వున్న స్త్రీ పురుషులిద్దరు కనుపించారు. వారి ముందు ఒక 'బుడి' వుంది. దానిని ఆలోకంలో

'బాటిల్' అంటారు. అందులో విస్కీ వుందని గ్రహించా డతను. ఆ స్త్రీ పురుషు లిద్దరూ విస్కీ గ్లాసుల్లో పోసుకుని తాగుతున్నారు. తన లోకంలో తాగటం అంటే మంచి నీళ్ళు తాగటం. ఈ లోకంలో తాగటం అంటే మద్యం సేవించటం. లోకాల వ్యత్యాసం మాటల అర్థాలలో కూడా కనపడటం అతినికి ఆశ్చర్యం కలిగించింది.

ఆ పురుషుడు గ్లాసు ఖాళీచేసి సిగరెట్ వెలిగిం చాడు. అంతకు ముందే ఆమెకు వొక సిగరెట్ ఇచ్చాడు. ఆమె సిగరెట్ వొయ్యారంగా తీసుకొని సుతారంగా పెద వుల మధ్య పెట్టుకుంది. ఆమె సిగరెట్ వెలిగించి తన సిగ రెట్ వెలిగించుకున్నా డా పురుషుడు. ముందుగా స్త్రీ సిగ రెట్ వెలిగించటం ఆ లోకంలో 'షివల్రీ' అంటారు. అటు వంటి వ్యక్తిని తన లోకంలో 'ఆడంగి వెధవ' అంటారు. తన లోకంలో పురుషుడు సిగరెట్ తాగటమే తప్పు. ఇక సిగరెట్ తాగే స్త్రీ సంగతే చెప్పాలా? తన లోకంలో స్త్రీలు చుట్టలు తాగితే తాగుతా రేమోగాని, సిగరెట్లు తాగరు. కొంతమంది స్త్రీలు చుట్టలను కాలేవైపు నోట్లో పెట్టుకొని పొగ వదులుతుంటారు. అయితే వాళ్ళు ఆడం గులు-స్త్రీలు కాదు. తన లోకంలో స్త్రీలు పదులకంట పడేటట్టు ధూమపానం చెయ్యరు. చాటుగా కాల్చే వాళ్ళుంటే వాళ్ళను సంఘం ఏం చెయ్యగలుగుతుంది? అటువంటి వాళ్ళకెప్పుడూ సంఘం లోకువే. సంఘమే వాళ్ళకు దాసోహం అంటుంది.

అయితే స్త్రీ సిగరెట్ త్రాగుతుంటే గమ్మత్తుగా వుండి చూడబుద్ది అవుతుం దతనికి. తనకు వివాహం అయిన క్రొత్తలో ఒకనాడు తాను సిగరెట్ త్రాగుతూ, భార్యను కూడా త్రాగమని బ్రతిమాలాడు. ఆమె పొగ పీల్చి విడు స్తుంటే చూడాలనిపించింది.

"ఛీ. పొడు," అన్నదామె.

"ఒక్క గుక్క పీల్చి విడువవూ?"

"ఆడవాళ్లు సిగరెట్ త్రాగటం ఏమిటండీ ?"

"ఏం త్రాగకూడదని వాళ్ళ మొహాన రాసి ఉందా"

"చాల్లెండీ."

"యిందులో తప్పేమి వుందీ ?"

"తప్పో వొప్పో నేను త్రాగను బాబూ."

అమె అలా అంటున్నా ఎందుకనో ఆమెకూ త్రాగి చూడాలనీ ఇంకొంచం బ్రతిమాలితే త్రాగుతుందనీ అని పించిం దతనికి.

"నా కోసం. ఒక్కసారి" అని బ్రతిమలాడాడు. బలవంతంగా త్రాగించటానికి ప్రయత్నించాడు. ఆమె నవ్వుతూనే విడిపించుకోటానికి ప్రయత్నించింది. అతను పట్టు విడువకుండా వెలిగించిన సిగరెట్ ఆమె పెదవులకు ఆనించాడు. ఆమె ఒక గుక్క పీల్చిందనే అనిపించింది. వెంటనే గుక్క తిరగనంత దగ్గు వచ్చింది. దగ్గుతూనే నవ్వు కుంటూనే లోపలకు పరుగెత్తింది.

తన కేనా పురుషు లందరికీ యిటువంటి ఆలోచనలు వస్తాయా? మొత్తానికి తమ కేదో తెలుసు అనుకుంటారు గాని, నిజానికి ఈ మానవులకు తెలిసింది ఎంత? కాని తెలిసినంతలోనే మానవుడు బ్రతకగలుగుతున్నాడు. ఇది చాలా విచిత్రమైన విషయం అనుకుంటూ బాహ్య లోకాన్ని మరచి ఆ గేటు మధ్య నిలబడి పోయాడు నారాయణరావు.

అదే సమయంలో బయటనుంచి వొక కారు రావటం వల్ల గేట్లో వున్న ప్యూను నారాయణరావుని రెక్క పట్టుకొని తన దగ్గరకు గుంజుకున్నాడు. కారు లోపలకు వెళ్ళింది.

"ఏమయ్యా, ప్రాణంమీద తీపి లేదూ నీకు?" అని అడిగాడు ప్యూన్.

"వుంది," అన్నాడు నారాయణరావు ఆ తబ్బిబ్బులో ఏం మాట్లాడుతున్నదీ తెలియకుండానే.

"వుంటే వొచ్చే పొయ్యే కార్లమధ్య నిలబడతావు ఎందుకయ్యా?"

"మరచి పోయాను."

"ఏమిటయ్యా నువ్వు మర్చిపోయింది?"

ఏమీ మరచిపోలేదని అప్పుడు జ్ఞాపకం ఒచ్చింది. అప్పుడు ప్యూన్ని తేరిపార జూశాడు. అతను యూనిఫారంలో వున్నాడు. యూనిఫారం అంటే సామాన్యమైనదా? ఇస్త్రీ చేసిన పొడుగాటి లాంకోటు వేశాడు. మడతలు చెడని పాంటు వేశాడు. కుచ్చావిడిచిన పెద్ద తెల

పాగా ధరించాడు. నడుముకి చారెడు వెడల్పువున్న ఎర్రటి గుడ్డబెల్టు పెట్టాడు. అక్షరాలా అతని దృష్టికి ఆ ప్యూన్ ఇటీవల కాంగ్రెస్ హయాంలో రాజ్యం పోగొట్టుకున్న ఒక పిల్ల మహారాజులాగు కనుపించాడు.

"గుడ్ మోర్నింగ్," అందామని చెయ్యి ఎత్తబోయి అంతలో అతను ఏ దుస్తులు ధరించినా, ఎంత ఠీవిగావున్నా ప్యూనే అనే సంగతి జ్ఞాపకం వొచ్చి తమాయించి వూరుకున్నాడు.

అప్పుడతనికి అకస్మాత్తుగా గోపీకృష్ణ ఏ గదిలో వుంటున్నదీ ఈ ప్యూన్‌కి తెలిసి వుండవచ్చనిపించింది. వెంటనే అడిగితే ఏమనుకుంటాడో అని భయం వేసింది. బయటకు నడవమంటాడేమో!

'టాక్సీ చేసుకుని వస్తే బాగుండిపోయేదేమో?' అనుకున్నాడు నారాయణరావు. కారులో వొచ్చిన వారిని తప్ప ఈ ప్యూనులు గౌరవించరు. ఆయా వ్యక్తులు సంఘంలో అనుభవించే గౌరవానికి కారు వుండటం లేకపోవటం వొక కొండ గుర్తు ప్యూన్లకు. తన ఆఫీసు గేట్లో వున్న ప్యూను కారులేని ఏ పెద్ద మనిషినీ ఆఫీసులో అడుగు పెట్టనివ్వడు. కారున్న ఏ పోకిరీ వెధవనూ ఆటంకపరచడు.

వొక్క ప్యూన్లేమిటి? ఆఫీసర్లు కూడా అంతే. అందుకే కారు సరాసరి పోర్టికోలోకి తీసుకువచ్చి ఆపుతారు తమ కారుని ఆఫీసర్లు చూడగలందులకు, కనీసం వాటి

మోతనైనా గుర్తు పట్ట గలందులకు. అప్పటికీ తృప్తిలేక 'గుడ్‌మార్నింగ్ సర్' అంటూ ఆఫీసరు గది ప్రవేశించి, "కారు పోర్టికోలో పెట్టాను. మీకేమీ ఇబ్బందిలేదు అనుకుంటాను," అంటారు. కారు పోర్టికోలో పెట్టిన సంగతి మాత్రం ఆయన దృష్టికి తేవటం ఎందుకు అనుకున్నవారు, "వొచ్చేటప్పుడు ఎందుకనో నా కారు ట్రబుల్ ఇచ్చిందండీ. ఎన్నడూ యివ్వలేదు. కారు మెకానిజం అంతా తెలిసిన వాణ్ణి గనక క్షణంలో బాగుచేసి తీసుకువచ్చాను" అంటారు. వీళ్ళకంటే గజకోతగాళ్లు కొందరు వున్నారు. వారు పెదవి కదల్చకుండానే పనులు చేయించుకునే నేర్పు గలవారు. వారు ఆఫీసరుకు ఎదురుగా కూర్చొని ఆయనకు కనపడేటట్లు కారు తాళంచెవి చేత్తో ఎగరవేస్తూ వుంటారు.

లోకం ఇలా నడుస్తుంటే తాను టాక్సీ అయినా చేసుకురాకపోవటంలో అర్థం లేదు అనిపించింది నారాయణరావుకి. కాలినడకను వచ్చినట్లు తెలిస్తే గోపీకృష్ణ కూడా చిన్నచూపు చూస్తాడేమోనని కంగారు పుట్టింది. వెంటనే అతను అటువంటివాడు కాదని తన్ను తాను సమాధాయించుకున్నాడు.

అంతలో అతనికి సమస్యను ఆ ప్యూనే తీర్చాడు. "అటో యిటో వెళ్ళక ఎందుకు ఇంకా యిక్కడ నుంచున్నావు" అని అడిగాడు. సందు దొరకనే దొరకిందని హోటల్లోకి నడిచాడు నారాయణరావు.

ఆ హోటల్లో వొక ఎంక్వాయిరీ ఆఫీసు వుంది. గోపీ కృష్ణ ఎక్కడ ఏ గదిలో వుంటున్నదీ అతనికి తెలియదు గనుక, ఆ ఎంక్వాయిరీ ఆఫీసులోకి వెళ్ళి అడగటం అతని ధర్మం. కాని అందుకు అతనికి మనస్కరించలేదు. క్రొత్త ప్రదేశాలకు వెళ్ళటం, క్రొత్త వాళ్ళతో మాట్లాడటం అతనికి సిగ్గు. కాని సిగ్గు అని వొప్పుకోడు. దానికి ఏదో ఒక కారణం చెప్పి తప్పుకుంటాడు. ఇప్పుడు కూడా అంతే చేశాడు. ఒకరిని అడగవలసిన పనేముంది? ఎవ్వరు ఏ గదిలో వుంటున్నారో తెలియజేసే బోర్డు వొకటి వుంటుంది గదా. అందులో చూస్తే సరిపోయె అనుకొని ఆ బోర్డు దగ్గరకు నడిచాడు. ఒక పది నిముషాలు తంటాలుపడి గోపీ కృష్ణ వుండే గది మూడో అంతస్థులో వుందనీ, దాని నెంబరు 237 అనీ తెలుసుకున్నాడు.

నిజానికి మూడో అంతస్థుకి ఎక్కటం అతనికి కష్టమే అనిపించింది. అతను వెళ్ళేటప్పటికి గోపీకృష్ణ గది ముందున్న బల్లమీద ముగ్గురు నలుగురు కూర్చుని వున్నారు. వాళ్ళు అతనితో పని వుండి వొచ్చిన వాళ్ళు. లోపల గదిలో ఎవ్వరో మాట్లాడుతున్నారు. స్త్రీ గొంతు వినవొస్తూవుంది. రెండవ గొంతు గోపీకృష్ణదే నని గుర్తు పట్టాడు.

ఇప్పుడేం చెయ్యాలి? మొదలకుండా లోపలికి వెళ్ళటమా? ఆ స్త్రీ బయటకు వొచ్చేవరకూ ఇతరులతో పాటు తానూ ఆ బెంచీమీద కూర్చోవటమా? ఇదొక పెద్ద సమస్య అయిపోయింది అతనికి.

అతని మనస్సును కలవరపెట్టిన విషయం మరొకటి వుంది. ఆ బెంచీమీద కూర్చున్నవారు కూడా తన కన్నా బాగా డ్రెస్ చేసుకొని వున్నారు. మామూలుగా వాళ్లు సంఘంలో పెద్ద మనుష్యులు క్రింద పరిగణింప బడేవారుగా కనుపిస్తున్నారు. వాళ్ళమధ్య వొకమనిషి సర్దుకొని యిరుకుగా కూర్చోవటానికి మాత్రమే స్థలం వుంది. ఆ స్థలంలో కూర్చోవటానికి బెరుకు అనిపించింది. వాళ్ళని సర్దుకో మనాలి? ఎలా సర్దుకోమనేటట్టు? వాళ్ళ మధ్య సాదా దుస్తుల్లో కూర్చున్న తనను 'వీ డెవడు?' అని మనస్సుల్లో నైనా చీదరించుకోకుండా వుంటారా? అప్పటికే వాళ్లు తనని విచిత్రంగా చూస్తున్నారు. 'ఇటువంటి మనిషి ఇక్కడికి ఎందుకు వచ్చినట్లు? ఇటువంటి మనిషికి గోపీకృష్ణతో ఏం పని?' అన్నట్లు కనిపిస్తున్నయి వాళ్ళ చూపులు.

అంతలో గోపీకృష్ణ తనతో మాట్లాడుతున్న స్త్రీని వెంటపెట్టుకొని బయటకు వచ్చాడు. ఆమె వెళ్ళబోతుంటే సాగనంపటానికని ఆమెతోబాటు వచ్చాడు. ఆ బయటకు వచ్చిన ఆమెను నారాయణరావు ఎరుగును. 'ఎరుగును' అంటే ఆమె వొక మీటింగులో వుపన్యసిస్తూ వున్నప్పుడు అతను ప్రేక్షకులలో వున్నాడు. ఆమె ఆ సిటీలో వున్న పెద్ద ధనవంతులలో వొకతె. ఆమె బొంబాయిలో వున్న మరొక శ్రీమంతుణ్ణి వివాహమాడింది. ఏ కారణం వల్లో అతనితో పడక వొంటరిగా కన్నవారి ఇంట్లోనే ఉండి పోయింది. ఆమె పేరు సంధ్యారాణి. ఆమె

కాలక్షేపానికి సాంఘిక సేవ మొదలు పెట్టింది. సిటీలో అనాథలకు రెండు విద్యాలయాలు నడుపుతూ వుంది.

అయితే ఆమె నడిచే వీధుల అంచుల నిలబడి చూసే వాళ్లలో ఆమెకు మంచి పేరులేదు. ఆమె లీలలను నారు రకరకాలుగా వర్ణించి చెప్పుకుంటూ వుంటారు. ఆ వర్ణనలను మాత్రమే నారాయణరావు వినివున్నా వాటిని యథాతథంగా నమ్మాడు.

"మీరు అడగటం నేను చేసిపెట్టకుండా వుండటమూనా?" అంటున్నాడు గోపీకృష్ణ సెలవు తీసుకొని వెళ్లిపోతున్న ఆమెతో.

గోపీకృష్ణ ఆమెతో స్నేహంగా ఉండటం నారాయణరావుకి కష్టం కలిగించింది. అది అకారణమే.

ఆమె వెళ్ళిపోయింది. గోపీకృష్ణ తన కోసం వేచి వున్నవారి వైపుకు దృష్టులను బరిపాడు. వారు నవ్వుతూ లేచి నిలబడ్డారు

గోపీకృష్ణ నారాయణరావుని గుర్తు పట్టాడు. "ఓ, నీవా, రా రా," అని లోపలకు తీసుకు వెళ్లాడు. అంత మందిలో తనను అంత ఆప్యాయతగా పలకరించి, ప్రత్యేకంగా లోపలకు తీసుకు వెళ్ళినందుకు గర్వపడ్డాడాక్షణం నారాయణరావు.

"వొచ్చే ముందు వొక్క ఉత్తరం ముక్క వ్రాస్తే బాగుండేదోయ్," అన్నాడు గోపీకృష్ణతో.

"అకస్మాత్తుగా బయలుదేరాను. అప్పటికి ఇంకా ప్లేన్‌కి అరగంటే టైముంది. మిమ్మల్ని ఇబ్బంది పెట్టటం

ఎందుకని ఈ హోటల్లో దిగాను. వెళ్ళేలోగా వొకసారి చూడ వచ్చు గదా అనుకున్నాను—అక్కా పిల్లలూ అంతా బాగు న్నారా ?" అని అడిగాడు గోపీకృష్ణ.

"ఆc! ఇప్పుడేం పనిమీద వొచ్చావు!"

గోపీకృష్ణ చెప్పాడు. తమ కంపెనీ తరఫున హైదరా బాద్‌లో వొక బ్రాంచీ పెట్టాలనుకున్నారట. అందుకు టెండర్లు కాల్ ఫర్ చేశారట. ఆ టెండర్లు పెట్టినవారిలో ఇంటర్వ్యూలు చేసి ఎవ్వరికి ఇవ్వవలసిందీ నిర్ణయించగలందు లకు తను వచ్చాడట.

అతని మాటలు వినగానే ఆ టెండరు తనకు ఇస్తే బాగుండును అనిపించింది నారాయణరావుకి. ఎక్కువలాభం వచ్చేదయితే తను ఉద్యోగం మానుకుంటే మాత్రం ఏం?

"బ్రాంచి ఆఫీసు నడిపేవారికి ఎంతలాభం వస్తుం దేమిటి?" అని అడిగాడు.

"అది నడిపేవారి చాకచక్యంమీద ఆధారపడి వుంటుంది. వెయ్యి మొదలు పదిహేను వందలవరకూ రావచ్చు."

"నువ్వు ఎవ్వరికి ఇవ్వాలనుకుంటే వాళ్ళకు ఇవ్వొచ్చా?"

"ఇవ్వవచ్చు. కాని అందుకు కొన్ని షరతులు వున్నాయి. వాళ్ళు ఎవ్వరైనా ముందు పదివేల రూపా యీలు డిపాజిట్ కట్టాలి. వ్యవహారదక్షత కలిగినవారూ, సంఘంలోనూ ప్రభుత్వంలోనూ మంచి పలుకుబడి కలిగిన

వారూ అయి వుండాలి. ప్రభుత్వంలో ఎందుకు అంటా వేమో! మేము అమ్మే సామగ్రి ఇటీవల ప్రభుత్వం నడు తున్న ప్రాజెక్టులూ, పారిశ్రామిక కేంద్రాలూ మొదలైన వాటికి అవసరం. ప్రభుత్వందగ్గర ఏ కంట్రాక్టయినా సంపాదించగలిగితే మా ఫరమ్‌కి చాలా లాభం"

ఇక ఆ బ్రాంచి ఆధిపత్యం తనకు వచ్చే అవకాశం లేదు అనుకున్నాడు. నారాయణరావు గోపీకృష్ణను అడిగి ప్రయోజనం లేదని తేల్చుకున్నాడు. వెంటనే తన మన స్సులో వున్న భావం కనిపెట్టి గోపీకృష్ణ అలాఅన్నాడేమో ననే అనుమానం అతనికి కలిగింది. మనస్సు చీకాకు పడింది.

"ఇంతకుముందు వెళ్ళిందే ఆమెను నువ్వు ఎరుగు దువా?" అని అడిగాడు గోపీకృష్ణ.

"ఏదో కొద్దిగా ఎరుగుదును, ఇంతకీ ఆమె ఎందుకు వచ్చినట్టు నీ దగ్గరకు".

"ఈ పనిమీదే" వచ్చింది.

"అంటే మీ బ్రాంచి ఇక్కడ తాను నడుపుతానని అంటూ వుందా?

"అవును."

"నీ వుద్దేశం ఏమిటి?"

"ఒప్పుకుందామనే అనుకుంటున్నాను. ఆమెకుగా ఆమె ధనవంతురాలు. సంఘసేవలో మంచి పేరున్న వ్యక్తి. పైగా ప్రభుత్వంలో చాలా మందిని ఎరిగివుంది. కొంత మంది మంత్రులతో కూడా ఆమెకు మంచి పరిచయంవుంది."

"వుండి వుంటుంది" అన్నాడు నారాయణరావు. నిజానికి ఆమెపట్ల అయిష్టత ప్రకటించాలని అతనికి లేదు. గోపీకృష్ణ వ్యవహారాల్లో వేలు పెట్టాలనే వుద్దేశం కూడా అతనికి లేదు. కాని జీవితంపట్ల అతనిలో తిష్ట వేసుకు కూర్చున్న అసంతృప్తి అకస్మాత్తుగా ఈ రూపంలో పైకి వుబికింది. "ఒలుకుబడీ పరిచయాలే కాక మరికొన్ని విషయాలు కూడా నీవు ఆలోచించాలిగదా!" అన్నాడు.

నారాయణరావువంక ఆశ్చర్యంగా చూస్తూ "ఏమిటవి?" అని అడిగాడు గోపీకృష్ణ.

ఆమెను గురించి తాను విన్న కథలన్నీ చెప్పాడు నారాయణరావు. చెపుతున్నంత సేపూ, ఇవన్నీ ఎందుకు చెపుతున్నానా అని లోలోపల ఆశ్చర్యపడుతూనే వున్నాడు. కాని చెపుతూనే వున్నాడు. చెప్పడంలో తాను విన్నవాటికి చిలవలు పలవలు కల్పించి చెప్పాడు.

అతను చెపుతున్నంత సేపూ గోపీకృష్ణ చిరునవ్వు నవ్వుతూ కూర్చున్నాడు. మధ్య మధ్య నారాయణరావుని అతను జాలిగా చూసేవాడు. చివరికి "పరిస్థితులు మారిపోతున్నాయి. విలువలు మారిపోతున్నాయి. జీవితం మహా వేగంగా ప్రవహిస్తూ ముందుకు ఉరకలెత్తుతూ వుంది. ఆ వేగం వొరిపిడికి వినూతనమైన అందచందాలు అనేకం బహిర్గతం అయి కనులకు మిరిమిట్లు గొల్పుతున్నాయి. అవి క్రొత్తవి గనుక, బహుశా మనకు అంతు బోధపడటం లేదు గనుక వాటిని నిరసించటం జరుగుతూ వుంది. కాని దానివల్ల ప్రయోజనం ఏముంది?" అన్నాడు గోపీకృష్ణ.

గోపీకృష్ణ మాటలు నారాయణరావుకి అమితాశ్చర్యాన్ని కలిగించాయి. 'తనకు తెలిసిన మనిషి కాదు ఈ గోపీకృష్ణ. ఎవ్వరో సరికొత్త మనిషి' అనుకున్నాడు. "అయితే జీవితంలో నైతికవిలువలకు స్థానం లేదంటావా?"

"ఎందుకు లేదు? వున్నది. అయితే మనం ఇప్పుడు అనుకుంటున్నవి నైతికవిలువలు కావని నావుద్దేశం. వొక వేళ వీటివల్ల ఒకప్పుడు సంఘం పురోగమించినా, ఒకప్పుడు ఇవి సాంఘికగమనానికి అవసరం అయినా, మారిన నేటి పరిస్థితుల్లో ఇవి బంధనాలే అవుతున్నాయి. తమను ఆశ్రయించిన మానవుణ్ణి వికసించనీయకుండా తమకౌగిలిలో బిగించి, ముడుచుకొని, కుంచుకొని పోయేటట్లు చేస్తున్నాయి. నేటి మన నైతికవిలువలు వొట్టి నిషేధాజ్ఞలే. అది చెయ్యొద్దు, ఇది చెయ్యొద్దు అనేగదా వాటి పురమాయింపులు. నిషేధబుద్ధితో జీవితాన్ని చూచిన ఏవ్యక్తి వికసించడు. వికసించని ఏవ్యక్తికీ విముక్తి లేదు. జీవితాన్ని బహు భంగుల అనుభవించిన వ్యక్తే, సంపూర్ణతను పొందగలుగుతాడు."

"అందుకని ..." అంటూ తన ఆశ్చర్యాన్ని వెలిబుచ్చబోయాడు నారాయణరావు.

"నారాయణరావు వుద్దేశాన్ని గ్రహించాడు గోపీకృష్ణ. జీవితాన్ని అనుభవించటానికి వెనుదీసిన మనిషి పురోగాముడు కాడని నా అభిప్రాయం. ఈనాడు మనం నైతిక విలువలుగా పరిగణిస్తున్న వ్యక్తులను సంఘంలో చూస్తు

న్నాం గదా! వారేవిధంగా వున్నారు? ముడుచుకుని ఒడిలి పోయిన ఆకులవలె కన్పిస్తున్నారు. భౌతికంగా జీవితాన్ని బహుభంగుల దర్శిస్తున్న వారి ముఖాలలో కనుపించే వర్చస్సూ, తేజస్సూ వారిలో కనుపించటంలేదు. వారిని విడిచి జీవితం తన దారి పోతుంటే, ఈర్ష్యాలోలురై, దానిని కప్పిపుచ్చుకోటానికి అనేక సిద్ధాంతాలను తొడుగులుగా ఉపయోగించుకుంటున్నారు. జీవితానికి పెడగా నిలుచున్న వానికంటే అన్నివిధాలా జీవితాన్ని అనుభవించేవారంటేనే నాకు ఇష్టం. వట్టి ఇష్టమే కాదు. నమ్మకం కూడాను" అన్నాడు.

అతడు అలా అంటుంటే, తనను గురించే అంటున్నాడేమో అనే అనుమానం కలిగింది నారాయణరావుకి. తన జీవితం పిశాచాకృతిలో కనుపించి వికటాట్టహాసం చేసింది.

నారాయణరావు బాధ గమనించాడు గోపీకృష్ణ. "మాటలకేం గాని ఇంటిదగ్గర పిల్లలందరూ బాగున్నారా?" అని అడిగాడు.

"బాగానే వున్నారు?"

"అమ్మాయి ఎలావుంది?" ఈ ప్రశ్న వేసేటప్పుడు గోపీకృష్ణ కంఠం అప్రయత్నంగా గాద్గదికమైంది. చిన్నతనంలో ముఖ్యంగా నారాయణరావుతో వివాహం అయ్యే సందర్భంలో ఆమె భవిష్యత్తు తాను ఊహించుకున్న దానికి నేటి ఆమె జీవితానికి వున్న తారతమ్యం ఆతని స్మృహలోకి వచ్చి వుంటుంది.

"ఆమెకేం? బాగానేవుంది" అన్నాడు నారాయణ రావు అవసరానికి మించిన దృఢస్వరంతో. ఎందుకనో గోపీకృష్ణ వైఖరి అతనికి కలవరం కలిగించింది. ఒకప్పుడు జీవితాన్ని గురించి తాను సిద్ధాంతీకరిస్తూంటే గోపీకృష్ణ తన్మయత్వంతో వింటూ వుండేవాడు. ఇపుడు అతను చెపుతున్నాడు. తాను వింటున్నాడు. అతని కలవరానికి ఇది కారణం కావచ్చు. తన జీవితం పెడదారి పట్టిందని గోపీకృష్ణ మాటలవల్ల జ్ఞాపకం రావటం కారణం కావచ్చు.

"నీ ఆరోగ్యం బాగా వుందా?" అని అడిగాడు. ఆ వొక్క విషయంలోనే తాను సలహా చెప్పే అవకాశం వుందని తనకు తెలియకుండానే అనుకోవటం నారాయణ రావు యొక్క ఈ ప్రశ్నకు కారణం.

"బాగానే వుంది"

"నాకలా అనిపించటం లేదు. చాలా అలసిపోయినట్లు కనుపిస్తున్నావు. శరీరం కాస్త దొందుబారినట్లుగా కూడా వుంది. ఇవేమంత మంచిలక్షణాలు కావు సంపాదన అవసర రమే. కాదని నేను అనను. కాని అన్నిటికంటే ముఖ్యం కదా ఆరోగ్యం?" అన్నాడు నారాయణరావు.

గోపీకృష్ణ మాట్లాడలేదు. నారాయణరావు కండ్లు గదిలో ఒకమూల టేబిల్ మీద వున్న విస్కీ బుడ్డి ఖాళీ గ్లాసులమీద పడ్డాయి. అంతకుముందు అంటే తాను గదిలో ప్రవేశించకముందు సంధ్యారాణి, గోపీకృష్ణ కలిసి

త్రాగి వుంటాడని నారాయణరావు నిశ్చయించుకున్నాడు. అతనిని ఆశ్చర్యంగా చూశాడు.

గోపీకృష్ణ చిరునవ్వు నవ్వుతూ, "నీకు ఇదంతా విచిత్రంగా కనుపిస్తూ వుందా బావా?" అని అడిగాడు.

"అవును"

"కాని మాలోకంలో ఇది మామూలే. అంటే ఇంచుమించు మీ లోకంలో కాఫీ త్రాగినట్లు. ఇక తప్పు కాదా అంటావా? నీవు అధిగమించిన లోకానికి కాఫీ త్రాగటం తప్పు. నీకు మద్యపానం తప్పు, అంతకంటే తప్పేమి వుంది." అన్నాడు గోపీకృష్ణ.

"నువ్వు చాలా మారిపోయావు," అన్నాడు నారాయణరావు.

పరిస్థితులకు అనుగుణంగా మారబట్టే సుఖంగా వున్నాను. ముదుచుకుపోయినవారికి వున్న దురావేశాలు నాకు లేవు. నాలో వున్న ఈర్ష్యాద్వేషాలను అణుచుకోటానికి నాకు ఏ వేదాంతంయొక్క సహాయమూ అవుసరం లేదు. ఎందుకంటే నాకు ఈర్ష్యాద్వేషాలు వుండే అవకాశమే లేదు గనుక. నేను శుభ్రంగా భోజనం చేస్తాను. శుభ్రంగా తిరుగుతాను. శుభ్రంగా నిద్ర పోతాను. ఇంకేం కావాలి. ఇందాక నీవు ఆరోగ్యం సంగతి మాట్లాడావే? నాబోటివాడు ఆరోగ్యంగా వుండకపోతే ఇంకెవ్వరుంటారు? ఈ పట్న వున్నవాణ్ణి వున్నట్టుగా మరణించవలసి వచ్చినా నేను పశ్చా

త్తాప పడను. మరణం అంటే భయపడేవారికి ఆరోగ్యం ప్రధానం. నాకెందుకు ఆ గొడవ? నాకు బ్రతికినన్నాళ్లు జీవించటం ప్రధానం. జీవించటం ద్వారా వికసించటం నా లక్ష్యం" అన్నాడు.

అని తనలో తాను నవ్వుకుంటూ, "చూడు బావా, చిన్నప్పుడు సిద్ధాంతాలు అల్లటం నీకు చాలా ఇష్టంగా వుండేది. సిద్ధాంతాలు జీవితాన్ని విరిచి పెడకు త్రిప్పుతా యని నా ఉద్దేశం. అందువల్ల సిద్ధాంతాన్ని నమ్మినవాడు జీవించ లేడు జీవించకుండా ఏమానవుడూ వికసించలేడుగదా! అయినా నిన్ను చూచినప్పటినుంచీ అప్రయత్నంగా సిద్ధాంతాలు అల్లటం ప్రారంభించాను. ఈ గొడవకేం గాని రేపు ఉదయం మీ ఇంటికి భోజనానికి వస్తానని అమ్మాయితో చెప్పు. ఆమెను చూచి చాలా రోజులైంది. మళ్ళీ రేపు సాయంకాలం ప్లేనుకి ఢిల్లీ వెళ్ళిపోవాలి," అన్నాడు.

అతను అన్న మాటప్రకారం తన ఇంటికి మరునాడు భోజనానికి వొచ్చాడు. తోడబుట్టినవాడు రాక రాక వొస్తు న్నాడని తన భార్య కూరలూ, పిండివంటలూ ఎక్కువగా చేసింది. కాని కాసేపు హోటల్లో గ్లాపీకృష్ణతో గడిపివచ్చిన నారాయణరావుకి ఆ వంటకాలన్నీ మోటుగా కనిపించినై. ఆమె బంగాళాదుంప ఇగురూ, బెండకాయల వేపుడూ, పప్పుచారూ, వంకాయ ధప్పళం ముద్దపప్పు, గారెలూ, మిరపకాయ బజ్జీలూ, పాయసం మొదలైనవి చేసింది. ఆమె చేసే కూరలు మామూలుగా నారాయణరావుకి రుచి గానే వుంటై. అందులో ఆమె పప్పుచారు చెయ్యటంలో

అందెవేసిన చెయ్యి అని ప్రతీతి. వాము పెట్టిన మిరపకాయలతో ఆమె బజ్జీలు చేస్తే నోరు కారంతో వొక ప్రక్క సుంయి మంటున్నా అతను ఏ అరడజనుకో తక్కువతినే వాడు కాదు. గారెలకు వొక్క మినపప్పయితే బాగుండదని అన్నిరకాల పప్పులూ కలిపి నానబోసి రుబ్బి వండింది. ఆరకం గారెలుఅన్నా తనకు ఇష్టమే. వీటికితోడు మజ్జిగలో నానవేసిన మిరపకాయలూ, అప్పడాలూ, వడియాలూ కూడా వేయించింది. ఇవన్నీకూడా తనకు ఇష్టమైన పదార్థాలే. కాని ఇవన్నీ ఆనాడు అతని కండ్లకు అమిత మోటుగా కనిపించినై. ఏ ఆఫ్రికావాసులో తినవలసిన పదార్థాలుగా గోచరించినై.

"ఎందుకు ఇన్ని చేశావ్?" అన్నాడతను భార్యతో.

"ఇవన్నీ వాడికి ఇష్టమే" అన్నది తన భార్య.

"వొకప్పుడు అయి వుండవచ్చు," అన్నాడతను.

"ఇప్పుడు మాత్రం ఏమొచ్చింది?"

"ఇప్పుడతను పెద్దవాడైనాడు. పెద్ద పెద్ద రుచులకు అలవాటు పడ్డాడు."

"ఎన్ని రుచులకు అలవాటుపడితే మాత్రం, చిన్నప్పటి రుచులు పోతయ్యాటండీ!"

తోడ బుట్టినవాడు వొస్తున్నాడనే వుద్దేశంతో ఆమె ఎవ్వరిమాటా వొరనిచ్చేస్థితిలో లేదు.

గోపీకృష్ణ అన్నదానికంటే వొక అరగంట ఆలస్యంగా వొచ్చాడు. ఇక ఆ అరగంట రాజమ్మపడిన ఆరా

టం వర్ణించలేం. "వండినవన్నీ ఆరిపోతున్నాయి. వాడు చల్లారితే తినడు," అన్నది. "మరచిపోయాడేమో, వొక్క-సారి అటు వెళ్ళి రాగూడదూ?" అన్నది. ఆ అరగంటా నోటికి మూతలేకుండా మాట్లాడింది మాట్లాడినట్లే వుంది. పిల్లలు అవీ ఇవీ పెట్టమని అడిగితే వాళ్ళని రెండుచరుపులు చరిచింది. వాళ్లు బిగ్గరగా ఏడ్వ నారంభించారు. ఆ ఏడుపుల్లోనే వస్తాడేమో గోపీకృష్ణ అనే భయం వేసింది నారాయణరావుకి. భగవంతుడిదయవల్ల అతను ఏడుపులు తగ్గింతరువాత వొచ్చాడు. టాక్సీలోవొచ్చిదిగాడు. వొస్తూ వొస్తూపిల్లలకు ఇన్నిబిస్కట్లూ,ఇన్ని చాకలెట్లూ తెచ్చాడు. పెద్దవాళ్ళకు చీరెలూ, జాకెట్లూ తెచ్చాడు. వొక్క-సారిగా యిల్లు పెండ్లి పందిరిగ మారింది. చిరుతిండికి ముఖంవాచిన వారికిమల్లే చిన్నపిల్లలంతా అతనిచుట్టూ మూగారు.

వాళ్ళ ఆరాటంచూసి గోపీకృష్ణ ఏమనుకుంటాడో అని నారాయణరావు తహ తహ లాడాడు. కాని అతను సంతోషంగానే వున్నాడు. అందరినీ పలకరించి, తాను తెచ్చిన బిస్కట్లూ మొదలైనవి అందరికీ పంచిపెట్టాడు.

"ఈ చీరెలూ జాకెట్లూ ఎందుకురా ఇప్పుడు?" అన్నది రాజమ్మ. పైకి అయితే ఆమె అలా అన్నదే గాని లో లోపల చాలా సంతోషించింది. ఆ గుడ్డలను చూడటంవల్ల ఆమెకు కలిగిన మురిపెం ఆమె కండ్లలో పూర్తిగా ద్యోతకం అవుతూనేవుంది. పిల్లలసంగతి సరే. పెద్దదైన తన భార్యకూడా వీటికోసం వాచిపోయినట్లు కనబడటం నారాయణరావు మనస్సును చాలా బాధ పెట్టింది.

"సరే, ఇప్పటికే ఆలస్యం అయింది, అన్నాలు వడ్డించు," అన్నాడు.

మామూలుగా ఎవ్వరైన యితరులు భోజనాలకు వచ్చినప్పుడు, అరుంధతి అన్నాలు వడ్డించటం రివాజు. కాని సోదరుడు వచ్చాడనే సంతోషంకొద్దీ ఆనాడు వడ్డనకు రాజమ్మ పూనుకుంది. ముందు గారెలు వడ్డించింది. అన్నంతోపాటు వడ్డిస్తే ఏ వొకటో రెండోతిని గోపీకృష్ణ వూరుకుంటాడేమోనని ఆమెభయం. అందుకని గారెలూ, వాటిలోకి పప్పూ వడ్డించింది. విస్తట్లో వొకొక్కరికీ కనీసం అరడజను గారెలైనా వున్నాయి.

వాటినిచూచి చిరునవ్వు నవ్వుతూ, "ఇవన్నీ తిన మనేనా చెల్లీ?" అని అడిగాడు గోపీకృష్ణ.

"ఆ నాలుగు ముక్కలూ తింటానికేంరా!" అన్నది రాజమ్మ.

అవన్నీ తినకపోతే ఆమెకు తీరని ఆశాభంగం కలుగు తుందని గ్రహించాడు గోపీకృష్ణ. నవుంకువున్న బెట్టు సడ లించి అందుకు పూనుకున్నాడు.

అతను గారె వొక్కొక్కముక్కా విరుచుకొని తింటూ వుంటే "అలాగేనట్రా గారెలుతినేది? అలాఅయితే ఎన్నని తింటావు? ఈ విషయం నువ్వు మా బావగారిదగ్గర నేర్చు కోవలసిందే," అనిచెప్పి, గారెలన్నీ చిదిమించి, అందులో చారెడు నెయ్యివేసి తినమన్నది

గోపీకృష్ణ గోప్యంగా ఆమె చెప్పినట్లుచేసి, ఆమె వొడ్డించినవన్నీ తిని భోజనం ముగించాడు. అతనికి ఇష్టమై తిన్నాడో, చెల్లి మనస్సుకి కష్టం కలిగించటం ఇష్టంలేక తిన్నాడో నారాయణరావుకి అర్థం కాలేదు.

చేతులుకడుక్కొని తమలపాకులు వేసుకుంటూ. "పెరిగినతరువాత ఎన్నిరుచులు అలవాటుపడినా, చిన్నప్పటి రుచులే స్థిరంగా వుంటాయనుకుంటాను. చెల్లి చేసిన వంటతింటూవుంటే చిన్నప్పుడు, అంటే ఆకలి చెప్పుకోక ముందు వున్నంత రుచిగానూవుంది," అన్నాడు గోపీకృష్ణ.

రాజమ్మ చిరునవ్వునవ్వుతూ 'నామాటే నిజమైంది చూశారా?' అన్నట్లు భర్తవంకకు చూసింది.

"వొదినెనుకూడా తీసుకువస్తే ఎంతో బాగుండేది!" అన్నది రాజమ్మ.

గోపీకృష్ణ వొక్కక్షణం ఆగి, "నీకు తెలుసుగా, వివాహం అయినప్పుడు ఆమె బి. ఏ. చదువుతూ వుండేది. వివాహం అయింతరువాత మానివేసింది. ఇప్పుడు బి. ఏ. పూర్తిచేయాలని మళ్ళీ చదువు మొదలుపెట్టింది," అన్నాడు.

ఇద్దరు పిల్లలు కలిగి యింతవయస్సు వొచ్చినపిదప ఆమె చదువు తిరిగి మొదలుపెట్టటం రాజమ్మకు తగని ఆశ్చర్యం కలిగించింది. 'విన్నారా ఈ వింత!' అన్నట్లు భర్తను చూచింది. అతనుకూడా ఈ విషయాన్ని విచిత్రం గానే భావించాడు.

"ఇప్పుడెందుకు కావలసి వొచ్చిందట ఆమెకు చదువు? ఉద్యోగంచేసి డబ్బుసంపాదించవలసి వొచ్చిందా తనకు?" అని అడిగింది రాజమ్మ.

"ఏమో ఎందుకో! నేను నాపనిమీదవుంటే ఆమె ఢిల్లీలోవున్న ఆంధ్రా మహిళా సంఘంలో పనిచేస్తూ వుండేది. ఆ సంఘానికి సెక్రెటరీకూడా అయింది. కష్టపడి పని చేసి ఆ సంఘాన్ని మంచి అభివృద్ధిలోకి తీసుకువచ్చింది. దానిక్రింద ఒక స్కూలు నడుపుతూ అనాథలకు చదువు చెప్పిస్తూవుంది. మంచి పేరు సంపాదించింది. వున్నట్టు వుండి 'నేను బి.ఏ కు డబ్బు కట్టాలనివుంది' అన్నది. నేను 'సరే, నీ ఇష్టం' అన్నాను. నేను ఆమెతో వాదించదలచలేదు. కారణంకూడా అడుగలేదు. ఆమె గట్టిగా చదువుకోదలచి నప్పుడు కారణం అడిగీ వాగ్వాదంలోకి దింపీ ప్రయోజనం ఏముంది? అప్పటినుంచీ అన్నిపనులూ మానివేసి రాత్రిం బగళ్ళు చదువుతూ కూర్చుంటున్నది."

"బి. ఏ. పూర్తిచేసి ఏంచేస్తుందట?" అని అడిగింది రాజమ్మ.

"ప్లీడరు చదివి ప్రాక్టీసు చేస్తుందట!" అన్నాడు గోపీకృష్ణ.

"ఆమె తెలియక ఈ వయస్సులో చదువు మొదలు పెడితే నీవుచూస్తూ వూరుకోవలసింది కాదురా. నాలుగు

బి నాట్లు పెట్టి మానిపించవలసింది. ఆమెకు నీ సంపాదన చాలక ఇప్పుడు చదువుకావలసి వొచ్చిందా? తనకు ఎంత మంది పిల్లలువున్నారు గనుక? ఇద్దరుగాను ఇద్దరు. ఇంత వయస్సులో చదువు మొదలు పెట్టటం నగుబాటు కూడానూ" అన్నది.

దీనికి గోపీకృష్ణ ఏ సమాధానమూ చెప్పలేదు. ఇక ఆ ప్రస్తావన సంభాషణలోకి రానివ్వలేదు. కాసేపు పిల్లలతో ఆడుకొని బావదగ్గరా, చెల్లిదగ్గరా సెలవుతీసుకొని వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళినపిదప వారంరోజులు అతనిని గురించే మాట్లాడింది రాజమ్మ. అతనిభార్య అప్పుడు చదువు మొదలు పెట్టటంలో వున్న వైపరీత్యాన్నిగురించి చెపుతూనే వుంది.

"దానికేం పోయ్యేకాలమో! వాడు అంతడబ్బ గడిస్తూవుంటే తిని కూర్చోక, దానికిప్పుడు చదువు ఎందుకు కావలసి వొచ్చిందో!" అన్నది నారాయణరావుతో.

"పోనీలెద్దూ. వాళ్లగొడవ మనకెందుకు?" అన్నాడు నారాయణరావు.

ఈ మాటకు ఆమెకు ఎక్కడలేనికోపమూ వచ్చింది. "అదేమిటండీ అట్లా అంటారూ? వాళ్ళ గొడవ అంటారేమిటి! వాళ్ళెవరు' వాళ్ళు పరాయివాళ్ళా? మీకు పరాయివాళ్ళయితే అయ్యారేమోనాని నాకు మాత్రం

కాదు. వాడు నాకు సయాన అన్న ఏకోదరులం. వాడి సంగతి నాకు కాకపోతే ఇంకెవ్వరికి? నేను ఏట్లావున్నా వాడు సుఖంగా వుండాలని వుంటుందినాకు,” అని కన్నీరు పెట్టుకుంది.

ఇంకా ఏదన్నాఅంటే ఆమె నోటివెంట ఏమేమి వినవలసివస్తుందోనని మెదలకుండా వూరుకున్నాడు నారాయణరావు.

తరువాత మళ్ళీ గోపీకృష్ణ హైదరాబాద్ రానూ లేదు. నారాయణరావుకి కనుపించనూలేదు. కాని అతనిని గురించి అప్పుడప్పుడూ కొన్నిసంగతులు మాత్రం తెలుస్తూ వుండేవి. అతను ఉద్యోగంలో చాలా అభివృద్ధికి వచ్చాడు. అతని ఆధ్వర్యంలో నడుస్తున్న పరిశ్రమ మూడు పువ్వులూ ఆరుకాయలుగా విలసిల్లుతూవుంది. అతని యజమాని అతని కృషికిమెచ్చి, వ్యాపారంలో అతనిని భాగస్వామిగా తీసుకున్నాడు. వీటికితోడు అతను మరికొన్ని వార్తలుకూడా విన్నాడు. గోపీకృష్ణ భార్య బి. ఎల్. ప్యాసయి ప్రాక్టీసు పెట్టింది. ఆమెకూడా బాగానే సంపాదిస్తూ వుంది. అయితే ఆమెకూ గోపీకృష్ణకూ పడటంలేదట. పడకపోబట్టే ఆమె మళ్ళీ చదువు ప్రారంభించి, పరీక్షలు ప్యాసయి ప్రాక్టీసు పెట్టిందట! ఇప్పటికీ వారు ఒకే ఇంట్లో వుంటూన్నా ఎవరి దారి వారిదేనట! వారు లోకంకోసం కలిసివున్నట్లు కనపడటమేతప్ప, ఒకరితో ఒకరు మాట్లాడుకోవటమే లేదట.

ఈ వార్త విని దిగ్భ్రమచెందాడు నారాయణరావు.

గోపీకృష్ణ తనకు తెలిసినంతవరకు చాలా విశాల భావాలు కలవాడు. ఏ విషయంలోనైనా తనదే రైటని మొండి పట్టు పట్టుకు కూర్చునే స్వభావం కలవాడు కాదు. ఇతరుల దృష్టిని సానుభూతితో అర్థంచేసుకునే గుణంకూడా అతనికి వుంది. పైగా ప్రపంచజ్ఞానం కలిగినవాడు. ఇటువంటి వ్యక్తితో అతని భార్యకు కాపురం చెయ్యటానికి ఎందుకు కుదరటంలేదో అతనికి ఎంత ఆలోచించినా అర్థంకాలేదు. చివరికి ఈ లోపం అతని భార్యలోనే వుండివుండాలని నిర్ధారించుకున్నాడు.

అటువంటి సమయంలో అతనికి గోపీకృష్ణ మధ్యపానాభిలాషుడేకాక, స్త్రీలోలుడనికూడా తెలిసింది. ఆ స్త్రీలోలత్వంలోకూడా ఒకహద్దూ పద్దూ, ఒక మంచీ చెడూ లేదట. స్త్రీ చీరెచెరగు తాకినా, చీరెచెరగు తాకటమే కాదు గాలిసోకినా, తన్నుతాను మరచిపోతాడట. అటు పిమ్మట ఏం చేస్తున్నదీ అతనికి తెలియదట.

ఈ మాటలను మొదట్లో నమ్మలేక పోయాడు నారాయణరావు. చివరికి అతనిభార్య విడిగావుంటానికి అతని ఈ గుణమే కారణం అయివుండాలని నిర్ణయించుకున్నాడు.

కాని అతనిభార్య రాజమ్మ ఉద్దేశం వేరుగావుంది. ఆమెకోపం గోపీకృష్ణ భార్యమీదే. తన అన్న మీద ఈ అభాండాలన్నీ ఆమె ప్రచారం చేస్తూవుందని ఆమె

దృఢవిశ్వాసం. వీడు మంచితనానికి పోతున్నాడు గాని లేకపోతే దాన్ని వొదిలివేసి మరొకపిల్లను పెళ్ళి చేసుకుంటే సరిపోకపోయిందా? వాడికి పిల్ల నిచ్చేవాళ్లే కరువయ్యారా? ఎవ్వరైనా నెత్తిన పెట్టుకొని మరీఇస్తారు,'' అని అనేది. ఈ సారి వాడిని కనపడనివ్వండి. నేను అన్నంతపనీ వాడితో చేయించకపోతే నాపేరు రాజమ్మకాదు,'' అనేది. ఇంకా చాలా చాలా అనేది.

నారాయణరావు భార్య మాటలకు అట్టే విలువ ఇచ్చేవాడు కాదు. ఆలోచించినకొద్దీ, గోపీకృష్ణను గురించి వొక చిత్రమైన అభిప్రాయం అతనికి కలిగింది. దానిని బట్టి 'ఇంత విశాలమైన బుద్ధిగలవాడే గోపీకృష్ణ ఇటువంటి పని చేస్తాడా?' అని అనుకోవటం తప్పని తేల్చుకున్నాడు. ఎందుకంటే ఇటువంటి పనులు చెయ్యబట్టే అతని బుద్ధి విశాలపడి వుంటుంది అని అనిపించిందతనికి.

అతనుజీవితంలో చూస్తున్నాడు. ఏవో నీతీ, నియమం అనే కట్టుబాట్లు పెట్టుకు కూర్చున్నవాళ్ళు చాదస్తులుగా తయారవుతున్నారు. అలా కాకుండా జీవితాన్ని ఎడా పెడా కొట్టేవాళ్ళే విశాల దృక్పథం గడించుకోగలుగుతున్నారు. వాళ్ళు జీవితాన్ని బహుముఖాలు అనుభవిస్తున్నారు. అందువల్ల బహుముఖాలగా పరిశీలించవలసిన అవుసరం కలిగి వారి దృక్పథం విశాలపడుతూ వుంది. ఏవో కొన్ని నియమాలు పెట్టుకొని కూర్చున్నవారికిమల్లే వాళ్ళు జీవిత వాహినికి గట్లు వేసుకొని కూర్చోవటంలేదు. అలా గట్లు వేసుకొని కూర్చున్నవాళ్ళు, జీవితానికి తమకు అను

కూలంగా అర్థం చెప్పుకొని సంకుచిత పడిపోతున్నారు. తమకు అనుకూలంగా లేని జీవితాన్ని నిరసిస్తున్నారు. అందువల్ల పిడచకట్టుకుపోయి, పురోగమనశక్తిని కోల్పోతున్నారు.

మానవులు మహర్షులుకాదు. అందువల్ల ప్రతి మానవుడూ జీవితానికి తన పరిస్థితికి అనుకూలమైన అర్థం చెప్పుకొని తృప్తిపడుతున్నాడు. అందువల్లే విభిన్నమైన ఇన్ని సిద్ధాంతాలూ, ఇన్ని అభిప్రాయాలూ ప్రపంచంలో మనుతున్నాయి. ప్రపంచం వొక కలగూరగంపగానూ, జీవితం వొక పంచకోళ్ళ కషాయంగానూ, మనస్సు నాలుగుకోళ్ళ నులకమంచంగానూ తయారైంది.

జీవితాన్ని కృత్రిమంగా విభజించి, ఏదో ఒక ముక్కను పట్టుకొని అదే సర్వస్వం అనుకోవటంవల్ల మానవుడు ఒక ఘనీభవించిన పదార్థం అయ్యాడు. అటువంటి పదార్థంగానే పరిగణింప బడుతున్నాడు.

ఇలా తయారయిన మానవుల్లో తాను ఒకడు. తన కంటే ఘనపదార్థంగా ముడుచుకు పోయింది తన భార్య. తామిద్దరూ జీవితం అనే గోడకు కొట్టబడి ఎండిపోయిన రెండు పిడకలు.

అప్పుడు గోపీకృష్ణ ఒకప్పుడు తనతో మాట్లాడిన మాటల్లో అర్థం లేకపోలేదు అనిపించింది అతనికి.

భార్య రగడవల్ల విశాలమైన మనస్సుతో కూర్చున్న నారాయణరావుకి ఈ ఆలోచనలన్నీ ఒకదాని

వెనుక ఒకటి తోసుకువచ్చినై. అతని ఆలోచనలు కాగితం మీద పెట్టటానికి ఇంతసేపు పట్టింది గాని, నిజానికి అవి అతనిని ముసురుకోటానికి ఏ నాలుగైదు నిమిషాలో పట్టింది.

అతని ఆలోచనల ఉధృతం కొంత తగ్గేటప్పటికి, వంట ఇంట్లోనుంచి పళ్లాలమోతా, భార్య కేకలూ వినిపించినై. భార్య పిల్లలమీద కేకలువేస్తూ వుంది. నిజానికి అన్నాల దగ్గర చాలా విసిగిస్తారు. ఎవ్వరికి ఏ పళ్లెం కావాలో ఏరు కోవటందగరనుంచి వాళ్లకు తగాదే. పిల్లలకు ఎవ్వరిపళ్లాలు వాళ్లకు వున్నయి. అయినా ఎవ్వరి పళ్లెంలో వాళ్లు తినరు. ప్రతి వొక్కరూ ఇతరుల పళ్లెంకోసం కీచులాడుతారు. ఇక ఎన్నికూరలు వండినా, వండని కూరలకోసం పోట్లా డటం వాళ్లకు మామూలు. పైగా అందరూ వొక్కకూర అడగరు. వొక్కొక్కరూ వొక్కొక్క కూర అడుగు తారు. అది ఏదోవొక విధంగా సర్దితే నెయ్యిదగ్గర తగాదా. పెరుగుదగ్గర తగాదా. ఆతగాదా వొట్టిమాటలతో అంతంకాదు. తల్లితో పోట్లాడుతారు. వాళ్ళల్లో వాళ్ళు కొట్టుకుంటారు. చివ్వరికి బావురున ఏడుస్తారు. అక్కడితో ఆమెకు శిగం ఎక్కి నాలుగు అంటిస్తుంది. దాన్తో ఇల్లు ఎగిరిపోయేటట్లు శోకాలు ప్రారంభం అవుతై. అన్నాల దగ్గర ఈ సీను ఇంచుమించు నిత్యకృత్యం అయింది.

వంటఇంట్లో "మెదలకుండా పెట్టింది తిన్నారా తినండి. లేకపోతే కాళ్ళు విరగగొట్టి అవతల పారవేస్తాను," అంటూవుంది రాజమ్మ.

ఆ మాటలమీదనుంచి దృష్టిని మరల్చాలనే ఉద్దేశంతో నారాయణరావు ఆఫీసునుంచి తీసుకువచ్చిన ఫైలు ముందువేసుకు కూర్చున్నాడు. ఎన్నో కుటుంబాల భవిష్యత్తు ఆ ఫైల్లో ఉన్న కాగితాలమీద ఆధారపడి వుండటం అతనికి విచిత్రంగా తోచింది. ఆ కాగితాల్లో అక్షరాలు వుంటై సిద్ధాంతాలు వుంటై. రూల్స్‌వుంటై. అంతేగాని మనిషికి వుండే ఫీలింగ్స్ వుండవు. కనీసం మనిషికి వుండే మాంసం నెత్తురూ అయినా వుండవు. అవి లేకుండా న్యాయం ఎలా జరుగుతుంది? వాట్టి అక్షరాలూ, రూలూ్స న్యాయాన్ని ఎలా సూచించగలుగుతై. ఆ ఫైలు తనకంటే, తన భార్యకంటే ఘనీభవించిన పిడకగా గోచరించిందతనికి. దానిని తాకితే శవాన్ని తాకినట్లయి అతని శరీరం జలదరించింది. కంపరం పుట్టింది. అదొక శవంగానూ, ఆ గది నొక శ్మశానంగానూ, తాను కాటికాపలా వానిగానూ అనిపించింది. ఫైలు ప్రక్కకు పెట్టి ఆలోచిస్తూ కూర్చున్నాడు.

నారాయణరావు భోజనంచేసి పడుకున్నాడు. అతనికి ఆనాడు అన్నం రాజమ్మ వడ్డించలేదు. పిల్లల భోజనాలైన పిదప ఆమె వెళ్ళి పడుకుంది. నారాయణరావుకి ఆకలి అవుతూ వుంది. అన్నం వడ్డించమని భార్యను అడుగుదాం అనుకున్నాడు. కాని ఆమె మళ్ళీపోట్లాట ప్రారంభిస్తుందేమో నని భయపడి వూరుకున్నాడు. నారాయణరావుకి తనభార్య సంగతి తెలుసు. కోపం వస్తే తనకు అన్నం వడ్డించదు. ఎంతకోపం వచ్చినా తనకు ఆకలి అవుతూ వుంటుందని

తెలిసి కూడా ఆమె అన్నం వడ్డించకుండా ఎలా వూరుకుంటుందో తలుచుకున్నప్పుడల్లా అతనికి ఆశ్చర్యం, అసహ్యం కలుగుతూ వుంటాయి. ఎంతకోపం వచ్చినా ఆమె అంత కఠినంగా ఎలా ప్రవర్తించగలుగుతుందో! ఇంతకీ తననని ప్రయోజనం ఏముంది? తన తప్పేమి వుంది. తనమీద వుంటే ఆమెకు జాలి వుండాలి గాని పగ ఎందుకు?

కాసేపు గడిచిన పిదప అతని పెద్దకూూర్తె అరుంధతి వచ్చి తండ్రిని పిలిచి అన్నం వడ్డించింది. అతను అన్నం ముందు కూర్చున్నాడు. గాని తిన బుద్ధి పుట్టలేదు. రెండు మెతుకులు కొరికి లేచాడు. తండ్రి అవస్థకు చాలా జాలి పడింది. కాని ఆమె ఏమి చెయ్యగలదు?

నారాయణరావు భోజనం ముగించుకొని తన గది లోకి వెళ్ళి పడుకున్నాడు. అతనికి నిద్ర పట్టలేదు. మనస్సు ఆలోచనలతో చదలుపుట్ట అయింది. పిల్లలందరూ నిద్ర పోతున్నారు. ఇల్లు నిశ్శబ్దంగా వుంది. సముద్రపుహోరు తగ్గినట్లు వుంది. కాని ఆ నిశ్శబ్దం నారాయణరావు మనస్సుకి అతిభయంకరంగా కనుపించింది. మనస్సుని మరొక వైపుకి మరలిస్తే తప్ప ఆ నిశ్శబ్దాన్ని భరించటం కష్టం అనిపించింది. తలదగ్గర వున్న భగవద్గీత తీశాడు. మనస్సు బాగా లేనప్పుడు భగవద్గీత చదవటం ఇటీవల అతనికి అలవాటైంది. భగవద్గీతలోని శ్లోకాలు పఠిస్తూ పడుకున్నాడు.

వంటఇంట్లో అలికిడైంది. తన భార్య అన్నం తిని పళ్లాలు సర్దుతూ వుందనుకున్నాడు నారాయణరావు ఇక ఆమెకూడా పడుకుంటుంది. జీవితంలో వొక రోజు ముగిసిందనుకొని వొక నిట్టూర్పు విడిచాడు. నారాయణరావు భగవద్గీతమీద దృష్టిని కేంద్రీకరించాడు.

తన గదిలో ఏదో శబ్దమైంది. చూస్తే తన భార్య. గదిలో అడుగు పెట్టి మెదలకుండా నుంచుంది. ఆమె ముఖం చూచి కలవర పడ్డాడు నారాయణరావు. ఆ ముఖంలోని వైఖరి అతనికి సుపరిచితమైంది. ఏదైనా పెద్ద విషాదగాథ చెప్పవలసి వచ్చినప్పుడు ఆమె వైఖరి అలా ఉంటుంది. ఆ వైఖరిలో కోపం ఉండదు. చూచేవాళ్ళ మనస్సును కలగుండు పరిచే భయం, బాధా ద్యోతకం అవుతూ వుంటాయి.

ఆమె కన్నీరు పెట్టుకుంటూ నిలబడింది. కన్నీరు తుడుచుకోవాలనే ప్రమేయంలో ఆమె వున్నట్లు లేదు. ఆమెకు ఆవోపిక కూడా లేదు.

ఆమెను చూస్తే అమితమైన జాలి కలిగింది. కాని కదిలిస్తే ఏవిషాదపూరితకథను ఏకరువు పెడుతుందో అనే భీతి కలిగి చూచీచూడనట్టు వూరుకున్నాడు. నిజానికి తాను ఆఫీసునుంచి ఇంటికి తిరిగి వచ్చినప్పటినుంచీ పైకి ఆమె ఎంత కోపంగా కనుపించినా, కోపంతో అందరినీ ఎంత చీదరించుకుంటూ వున్నా, మనోవ్యథ ఏదో ఆమెను పీడుస్తూ వుందనీ, ఆ పీడ అనుభవించలేక ఆమె అవిధంగా

ప్రవరిస్తూ వుందనీ అతనికి అనుమానంగానే వుంది. అది నిజమేనని ఇప్పటికి ఆమె వైఖరి దృఢపరిచింది.

ఆమె వుండి వుండి, "ఇంకా భగవద్గీత చదువుతూ వున్నారా? మీకు చీమ కుట్టినట్లన్నా లేదు," అన్నది.

"ఏం జరిగింది?" అని అడిగాడు నారాయణరావు అప్రయత్నంగా. నిజానికి అతనికి ఆమెను ప్రశ్నించాలని లేదు. అప్పుడు ఆమె వున్న మానసిక పరిస్థితిలో ఆమెను ప్రశ్నించటం 'కొరివితో తల గోకుకోవటమే' అని అతనికి తెలుసు. అయినా అడిగాడు. అడిగాడంటే ప్రశ్న అతని నోటినుంచి జారింది.

ఆమె సమాధానం చెప్పలేదు. నిశ్శబ్ద శోకదేవత వలె నిలబడి వుంది.

నారాయణరావు తార్కికబుద్ధి గలవాడు. మొదటి ప్రశ్న వెయ్యటంవరకే అతని ఇష్టం. మిగిలిన ప్రశ్నలు ఒకదానినుంచి ఒకటి పుట్టుకొస్తాయి. వాటిమీద అతనికి పెత్తనం వుండదు.

"ఏమి జరిగిందో చెప్పకుండా అలా బాధ పడితే నాకేం తెలుస్తుంది?" అన్నాడు.

"అటు చావటానికి ఇటు బ్రతకటానికి వీల్లేకుండా అయింది నా బ్రతుకు," అన్నది రాజమ్మ కన్నీరు వొత్తుకుంటూ. అకస్మాత్తుగా పరిస్థితి అతనికి అర్థమైంది. ఇటువంటి మాట ఆమె ఒక సందర్భాన్ని సూచించటానికి ఇంతకు

ముందు నాలుగైదుసార్లు వాడి వుంది. ఆసందర్భం జ్ఞాపకం వచ్చి అతని గుండె దడ దడ కొట్టుకుంది.

భార్యను తేరిపార చూశాడు, అతని చూపులనుంచి ముఖం త్రిప్పుకుంది రాజమ్మ. అతని గుండె దడ హెచ్చయింది. "నిజమా?" అని అడిగాడు. అది ప్రశ్న కాదు. ఒక దీనుని ఆక్రందనం.

ఆమె 'అవును' అన్నట్లు తల వూపింది. ఆనిజమైన దానిని నోటితో అనటానికే అతనికి భయం వేసింది. ఆ మాట 'నెలతప్పటం'. 'అవును' అన్నట్లు అతని భార్య తల వూపడంతో అతని గుండె బ్రద్దలయింది. తన ఏడు గురు సంతూ జ్ఞాపకం వచ్చింది అతనికి. పైగా ఎనిమిదవ సంతు ఆవిర్భవించబోతూ వుంది. దీనికి అంతూ పొంతూ లేదా?

విషయం భర్తకు తెలియజెప్పటానికి ఆమె సంకట పడ్డది. విషయం భర్తకు తెలిసిం తరువాత ఆమె మనస్సు తేడపడ్డది.

"ఆపరేషన్ చేయించుకోమని నెత్తిన నోరు పెట్టుకొని చెపితే మీరు నామాట విన్నారా? మీకు నా ఆరోగ్యం కావలసి వచ్చిందా? నేను చస్తే మరొకదాన్ని కట్టుకోవచ్చని చూస్తున్నట్టున్నారు. ఈ రోజుల్లో చదువూ, సంధ్యా లేని పల్లెటూరివాళ్ళు కూడా ఆపరేషన్ చేయించుకుంటున్నారు. మీకు మాత్రం పడలేదు. ఆ మాటకి వస్తే కనేది మీరు కాదుగదా! మీకు కావలసిన సపర్యలు మీకు జరిగితే చాలు" అన్నది.

నారాయణరావు కుంచుకు కుంచుకు పోయాడు. అకస్మాత్తుగా పాతాళలోకంలోకి దొర్లినట్లనిపించింది అతనికి. అతనిమనస్సులో తేళ్ళూ జెర్రులూ కదిలినై. తన భార్య అతనికి ఆపరేషన్ చేయించుకోవలసిందిగా సలహా చెప్పిన మాటలు నిజమే. ఆపరేషన్ చేయించుకోవటం తన కుటుంబంవున్న పరిస్థితుల్లో న్యాయం అనికూడా అతనికి తెలుసు. అయినా మనస్సు వెనక్కు తీసింది. బుద్ధి వొక ప్రక్కకూ మనస్సు వొకప్రక్కకూ లాగాయి. మనస్సే జయించింది.

అతను వ్యవసాయిక కుటుంబానికి చెందినవాడు. వ్యవసాయకులు మామూలుదారిన పోవటానికి ఉత్సహించే స్వభావంగలవారై వుంటారు. దారిలో పూటిగోతులున్నా ఏ పుట్టలో ఏ పామున్నదో అనే భయంతో వాటిని పూడ్చుకొని ప్రయాణం చెయ్యటానికి కూడా జంకుతారు. ఆ స్వభావమే అతనిని అంటిపెట్టుకొని వున్నట్లువున్నది. వెనుకటిలాగే ఆ స్వభావం వల్లే అతను భార్యచెప్పినా వినకుండా ఆపరేషన్ చేయించుకోలేదు. అందుకు అనుకూలంగా అనేక కారణాలను పోగుజేసి, వాటిని పోటీగాపెట్టుకొని జీవయాత్ర గడిపాడు.

ఆపరేషన్ చేయించుకోవటం ప్రకృతికి విరుద్ధం. అందువల్ల కాలం గడిచినకొద్దీ అనేకరోగాలు రావచ్చు. మానవునికి కాస్త దూరదృష్టి వుండాలి. అదీకాక ఆపరేషన్ చేయించుకోటానికీ, భ్రూణహత్యకూ భేదం ఏ

ముంది? పుట్టబోయేవారిని ఆపటం, పుట్టినవారిని హత్య చెయ్యటం వంటిదే! అందుకు పాల్పడటం కిరాతకచర్య. పిల్లల్లో ఏ తొమ్మిదోవాడో, పదోవాడో అత్యంత ప్రతిభావంతుడు కావచ్చు. ఆమాటకివస్తే శ్రీకృష్ణుడు అష్టమగర్భుడు. జిడ్డుకృష్ణమూర్తికూడా అంతే. వారి తల్లి దండ్రులు గర్భనిరోధసూత్రం పాటిస్తే వారు వుండేవారు కాదు. అప్పుడు లోకం ఎంతనష్టపడేది! లోకానికి ఎంతచేటు చేకూరేది! ఈ విధంగా లోకానికి చెరుపు కలిగించిందానికంటే వ్యక్తి దారిద్ర్యం అనుభవిస్తూ బాధపడవలసివస్తే, అనుభవించటం, బాధపడటమే మెరుగు.

అలాంటి కారణాలను ఎన్నిటినో పోగుజేసుకొని వాటి సహాయంతో బుద్ధిని వోదార్చి, వూరడించి, తాను వూరుకున్నాడు.

ఎప్పుడయినా బుద్ధి ఆరాటపెడితే గాంధీగారిని తలుచుకునేవాడు. ఆయన గర్భనిరోధానికి వ్యతిరేకుడు. పిల్లలు ఎక్కువ అవడంవల్ల ఆరోగ్యం చెడినా, కుటుంబ హీన పరిస్థితిని ఎదుర్కోవలసివచ్చినా బ్రహ్మచర్య అవలంబించాలిగాని గర్భనిరోధకానికి పూనుకోగూడదు అని సిద్ధాంతీకరించాడాయన. ఆందోళన తీవ్రం అయినప్పుడు ఈ సిద్ధాంతాన్ని జ్ఞాపకంతెచ్చుకొని బ్రహ్మచర్యం అవలంబించాలని నిశ్చయించుకునేవాడు. ఆపని తేలికే అనుకునేవాడు. కాని ఎప్పుడో కాలుజారేది. ఫలితం వికటాట్టహాసం చేసేది.

"మిమ్మల్ని అని ఏం ప్రయోజనం? నా కర్మ," అని కంటతడి పెట్టుకుంది రాజమ్మ.

ఈ పరిస్థితి చాలా విచిత్రమైంది, వికృతమైంది కూడా. అవసరమైనవారికీ, ధనవంతులకూ పిల్లలు కలగటం బ్రహ్మప్రళయం అవుతుంది. అక్కరలేనివారికీ, భరించలేని వారికీ పిలువకుండానే పలుకుతారు.

'జీవితంమీద అసంతృప్తి ప్రబలినవారికి పిల్లలు ఎక్కువపుడతార'ని ఆమధ్య ఎవరో అన్నారు. 'మానవునిలో సృజనశక్తి వుంది. ఆ సృజనశక్తి మానసికరూపం ధరించనప్పుడు, అలా ధరించటానికి అడ్డంకులు ఎక్కువై అసంతృప్తిగా మారినప్పుడు, భౌతికరూపం ధరిస్తుందట. ఆ భౌతికరూపాలే పిల్లలు,' అన్నాడాయన. ఏది ఏమైనా తను తనమనస్సును శాంతిపరచి, తప్పించుకోటానికి అనేక సిద్ధాంతాలను సృష్టించుకోకుండా, తన భార్యమాటవిని సమస్యను ధైర్యంగా ఎదుర్కొనివుంటే ఈ దుర్భరపరిస్థితి వొచ్చేదికాదు. తను వినలేదు. తను వినకపోవటంవల్ల వచ్చినబాధను అనుభవించేది తన భార్య.

ఆక్షణం ఆమెనుచూస్తే అతని కడుపు తరుక్కుపోయింది.

"ఇప్పటికైనా ఏదైనా మార్గం వుండేమో?" అన్నాడు భార్య ముఖంచూడలేక తలవొంచుకొని.

"ఇకవున్నది వొకటేమార్గం" అన్నది రాజమ్మ.

"అలా అనుకుంటే ఎలా!"

"ఏం చెయ్యమంటారు? ఇంతకుముందు వొకటి రెండుసార్లు ఇంగువ వేసుకున్నాను. ఫలితం కనుపించింది. ఇప్పుడు రెండు మూడుసార్లు వేసుకున్నా శరీరానికి వేడి ఎక్కి తపన పుట్టటంతప్ప, జరిగిందేమీ లేదు," అని దీనాలాపంవంటి వొక పెద్ద నిట్టూర్పు విడిచింది.

"నన్ను క్షమించు. పొరపాటు నాదే?"

ఆమె కన్నీరు తుడుచుకుంది. "మిమ్మల్ని మాత్రం నేను ఎట్లా అనగలను? నాకుమాత్రం బుద్ధి ఎక్కడిది? నేను ఆపరేషన్ చేయించుకున్నా పోయేదిగదా! స్త్రీ చేయించుకోవలసిన ఏదో పెద్ద ఆపరేషన్ అన్నారు. నేను భయపడ్డాను. ఆపరేషన్ అనేమాట అప్పుడు నామనస్సుకేదో వికృతంగా కనబడ్డది. అలా ఎందుకు కనిపించాలి? స్త్రీలు మాత్రం ఎంతమంది చేయించుకోవటంలేదు? ఆమాత్రం ధైర్యం నాకు ఎందుకు వుండకపోవాలి? ఇక ఇప్పుడు నేను ఏంచెయ్యాలి? ఈ కాన్పు తప్పనిసరైతే నేను బ్రతుకుతాననే ఆశలేదు," అని ఎక్కెక్కి ఏడ్చింది.

నారాయణరావు నీరైపోయాడు. అతనికి, తమకు మొదటి కుమారుడు పుట్టినరోజులు జ్ఞాపకం వచ్చినై. మొదటి రెండు మూడు కాన్పులకూ ఆమె ఎనలేని ఆనందం అనుభవించింది. ప్రక్కలో పసిగుడ్డును పడుకోబెట్టుకొని పాలిస్తూ అతినిర్మలంగావున్న ఆమె ముఖంమీది

చిరునవ్వునుచూచి తానూ అనిర్వచనీయమైన ఆనందం అనుభవించాడు.

ఇద్దరూ పైకి వొకరికొకరు చెప్పుకోలేక పోయినా, 'ఈ ఆనందం పిల్లలులేనివారికి లేదుకదా?' అని లోలోన జాలిపడ్డారు.

మొదటి కుమార్తెకు పెద్దపెట్టున బారసాల చేయించింది రాజమ్మ. ఆనాడు ఉయ్యాల వేయించింది. ఇంటి చుట్టుప్రక్కలవున్న అమ్మలక్కలనందరినీ పిలిచింది పేరంటానికి. ఎందుకైనా మంచిదని నారాయణరావుతో అతని స్పెషల్ సూపరింటెండెంట్ భార్యనీ, అసిస్టెంట్ సెక్రటరీ భార్యనీ ఆహ్వానింపించింది. పై ఉద్యోగుల భార్యలనుకూడా పిలవాలని ఆమె సంకల్పించిందిగాని, పిలిచినా యు.డి. క్లర్కు కూతురు బారసాలకు వారు రారనీ, తాను ఆహ్వానిస్తే వారు అదొక అవమానంగా, తాను ప్రదర్శించిన వొక సాహస కృత్యంగా తీసుకోవచ్చునీ ఆమెకుచెప్పి, ఆ ప్రయత్నాన్నుంచి ఆమెను విరమింపజేశాడు నారాయణరావు.

ఆరోజు పిల్లకు ఉయ్యాలకొనడం బ్రహ్మ ప్రళయం అయింది. తన పరిస్థితినిబట్టి పేము ఉయ్యాలకొంటే సరిపోతుంది అనుకున్నాడు నారాయణరావు. 'పిల్లకు పాకే వయస్సు వచ్చేదాకానేగద అది వుపకరించేది. తరువాత ఏ ఎలిసెమీదకో ఎక్కేదేనాయే!' అనుకున్నాడు. కాని అందుకు ఆమె అంగీకరించలేదు. 'ఈ పిల్లతో అయిందా?. పుట్టేవాళ్ళకు అక్కరలేదా? వొక్కొక్కళ్ళకి వొక్కొక్క

ఉయ్యాల కొంటామా? ఇప్పుడు నాలుగు రూపాయిలు ఎక్కువఅయినా, మంచిది నాలుగు కాలాలు మన్నేది కొంటే, పెద్దమ్మాయి పురుళ్ళకుకూడా పనికివస్తుంది' అని చెప్పి ఇనపఉయ్యాల కొనిపించింది. ఆ ఇనప ఉయ్యాలల్లో కూడా తాను. ఎప్పుడో హాస్పిటల్లో చూసిందట, అటు వంటిది.

ఆరోజు ఆహ్వానింపబడిన అమ్మలక్కలందరూ వొచ్చారు. సూపరింటెండెంట్ భార్యా, అసిస్టెంట్ సెక్ర టరీ భార్యాకూడా వచ్చారు. పెద్ద ఉత్సవం జరిగినట్టు జరిగి పోయింది. వొచ్చిన వారంతా పిల్లకు తలకొక అర్థగజం గుడ్డా పట్టుకువచ్చారు. పిల్ల 'చక్కనిచుక్క' అని పొగిడి వెళ్ళారు. బారసాల వైభవంగా జరిగినమాట నిజమే. కాని లెక్కలు చూచుకునేటప్పటికి నారాయణరావుకి రెండు వందల రూంపాయిలు ఖర్చయినవి.

ఈఖర్చు ఇలావుండగా, పిల్లకు పండ్లు రావటం తత్సంబంధమైన జబ్బులకు మరికొంతడబ్బు ఖర్చయింది. తరు వాత పిల్లకు అన్నప్రాశనోత్సవం తలపెట్టింది రాజమ్మ. ఆ వుత్సవము కూడా వైభవోపేతంగానే జరిగింది. ఆ వుత్స వానికి మరికొంత అప్పుఅయింది. అప్పు అయినందుకు ఒక మూలదిగులుగా వున్నా, పిల్లకు అన్ని ముచ్చట్లూ వనగూ డినట్లు నెరవేరినందుకు దంపతులు ఇద్దరూ సంతోషించారు.

ఆ పిల్ల తప్పటడుగులు వేసే దినాలు, నంగి మాటలు చెప్పే దినాలు వాళ్లకు పర్వదినాలు. ప్రపంచంలో ఘట్టే

పిల్లలందరూ, ఎప్పుడో ఒకప్పుడు తప్పటడుగులు వేస్తారు. ఎప్పుడో ఒకప్పుడు సంగి మాటలు చెపుతారు. అందులో ప్రత్యేకత అనేది ఏమీలేదు. ఆ సంగతి వాళ్ళకూ తెలుసు. అయినప్పటికీ వాళ్ళకు ఆ సంఘటనలు పరవశతను కలిగించాయి.

ఒకరోజు నారాయణరావు ఆఫీసు నుంచి వచ్చేటప్పటికి రాజమ్మ అతనికోసం ఎదురు చూస్తూ కూర్చుంది. అతను ఇంట్లో అడుగు పెట్టీ పెట్టగానే, "చూశారా, ఇవాళ అమ్మాయి ఎంతపని చేసిందో", అన్నది.

"ఏం చేసిందేమిటి ?" అని ఆశ్చర్యంగా అడిగాడు నారాయణరావు.

"ఏం చెయ్యడమేమిటండీ ! దాని దుంప తెగా, దాని వయస్సుకి అది అప్పుడేనడవడం ప్రారంభించిందండీ"అన్నది.

ఆ మాటకు నారాయణరావుకి పట్టలేనంత సంతోషం కలిగింది.

"నిజమా ?" అని అడిగాడు తన చెవులను తానే నమ్మలేని పరిస్థితిలో.

"నిజమండీ !"

"నిజమే ?"

"ఇంకా నిజమని అడుగుతున్నారా ? నేను కళ్ళారా చూస్తే. దానికి ఎవ్వరూ నేర్పిందికూడా లేదు. తానే నిలబడి నడవటం మొదలు పెట్టింది. నా కళ్ళను నేనే నమ్మలేక పోయాను. పక్క ఇంటి పిల్ల ఎవరన్నా నేమో అనుకున్నాను. చివరికి ఏ గాలన్నా సోకి అట్లా గాలిలో తేలిపోతున్న దేమో

అనిపించి గుండె దడ దడ కొట్టుకుందండీ. తీరా చూస్తును గదా, అది నడిచివొచ్చినా కాళ్ళు వాలేసుకొని ఏదో ఘనకార్యం చేసిందానికిమల్లే నవ్వటం మొదలుపెట్టిం దండీ."

ఈమాటలని, "నువ్వునడవటం నాన్నగారు చూస్తారుట. నడిచి చూపించు," అని పిల్లను చంకనుంచి దింపి నడిపించటానికి ప్రయత్నించింది. మొదట్లో ఆపిల్ల నడవలేదు.

ఆ చర్యను, "దానికెంత అభిమానం అనుకున్నారు. దానికి ఇష్టంవొచ్చినప్పుడు నడుస్తుందిగాని, ఎవ్వరన్నా నడవమన్నప్పుడు నడవదు," అని వ్యాఖ్యానించింది రాజమ్మ.

రెండవసారి ప్రయత్నిస్తే నిలబడి నడవకుండా, నవ్వుతూ తల్లి వొళ్ళో తలనూర్చిందాపిల్ల.

ఆ చర్యను, "దానికి ఎంతసిగ్గు అనుకున్నారూ. తగనిసిగ్గు, ఈ వయస్సుకి దీనికింత పోకిళ్ళేమిటో!" అని వ్యాఖానించింది రాజమ్మ.

మూడవసారి ప్రయత్నిస్తే ఆపిల్ల ఏడవ నారంభించింది.

ఆ చర్యను, "దానికెంతపట్టుదల అనుకున్నారూ? తాను అనుకున్నది జరిగితీరవలసిందే, లేకపోతే ఎక్కడలేని కోపమూ వస్తుంది. పీకిపెడుతుంది" అని వ్యాఖ్యానించింది రాజమ్మ.

నాలుగవసారి ఆ పిల్ల నడిచింది, నిజానికి ఆ పిల్ల వేసింది నాలుగు అడుగులే. అయితే ఏం? ఆనాలుగడు

గులూ వామనుని అడుగులంత బ్రహ్మాండమైన విశాలంగా కనుపించినవి ఆ దంపతులకు.

నారాయణరావు ఆనందం పట్టలేక పిల్లను ఎత్తుకొని ముద్దులాడాడు. "ఈ వయస్సులో నడిచినవాళ్ళు మా ఇండ్లల్లో ఎవ్వరూ లేరండీ. మా నాయనమ్మ అమ్మ ఈ వయస్సుకి నడిచిందని చెప్పుకోవటం విన్నాను. ఆమె చాలా తెలివిగలదట. ఆమె తెలివి మాయింట్లో ఇప్పటికీ కట్టు కథలుగా చెప్పుకుంటారు. ఆమె పోలికే వొచ్చినట్లున్నది దీనికి." అని మురుసుకుంది రాజమ్మ.

తరువాత పోలికలు రావటాన్ని గురించి వాళ్ళు కొంచం సేపు ముచ్చటించుకున్నారు. ఏ అమ్మమ్మ, నాయనమ్మ పోలికలో, ఏ తాత పోలికలో అకస్మాత్తుగా మనుమల మీాదికీ, మనుమరాళ్ళమీాదికీ వొచ్చి కూర్చుంటై. ఎక్కడనుంచి వొస్తాయో! ఇన్నాళ్ళూ శరీరాల్లోని ఏ భాగాల్లో దాగి వుంటాయో! అది అంతా వొక విచిత్రమైన కథ. ఆ కథ ముచ్చటించుకొని ఇద్దరూ ఆశ్చర్యాంబుధిలో కూర్చునేవారు.

వాళ్ల ఇంటి ప్రక్క ఆ రోజుల్లో ఒక కంట్రాక్టు షావుకారు వుండేవాడు. అతను తనపిల్లవాడికి ఖరీదైన ఒకతోపుడు బండి కొన్నాడు. రోజూ సాయంత్రం వాళ్ల మనిషివల్ల వాడిని ఆబండిలో కూర్చోబెట్టి షికారుగా తోసుకు వెళ్తుండేవాడు. వొకరోజు అటువంటి బండి లక్ష్మికి కూడా కొనవలసిందని పట్టు పట్టుకు కూర్చుంది రాజమ్మ. నారాయణ

రావు ఎన్ని చెప్పినా వినలేదు. డబ్బులేక ఏడుపుగాని నారాయణరావుకి కూడా తన కూతురికి అటువంటి బండీ వొకటి కొనాలని వుంది. ఇతరుల పిల్లలు అనుభవించే సౌఖ్యాలు తన కూతురు మాత్రం ఎందుకు అనుభవించ కూడదు. మరునెల జీతం రాగానే ప్రక్క ఇంటివాళ్ళ తోపుడుబండివంటిది కొనటానికి బజారు వెళ్ళాడు. దాని ఖరీదు వంద రూపాయీలు చెప్పారు. నారాయణరావు గుండె గతుక్కు మన్నది. తన జీతంలో సగానికి సగం ఈ బండికే సరిపోయేటట్టు ఉంది. ఆ రకం బండే కొనాలని మనస్సులో ఎంత వున్నా విధిలేక మరొకరకం బండి నలభై రూపాయీ లకు కొని ఇంటికి పట్టించుకు వచ్చాడు.

ప్రక్క ఇంటివాళ్ళ బండివంటిది కొనలేదని మన స్సులో కొంచం కష్టపడినా, ఏదో వొకబండి వొచ్చి నందుకు సంతోషించింది రాజమ్మ. గుడ్డిలో మెల్ల అని తృప్తిపడ్డది.

ఆరోజు సాయంకాలం అయిదు గంటలయ్యేటప్పటికి స్నానం చేసి సింగారించుకొని, పిల్లదానికి పౌడరూ, క్రొత్త బట్టలూ వేసి బండిలో కూచోబెట్టి తానే తిప్పుకువచ్చింది. ఆరు ఆరున్నరకు ఇంటికి వచ్చి అప్పుడు వంట మొదలు పెట్టింది. వంట అయ్యేటప్పటికి తొమ్మిది అయింది. భోజ నాలు అయ్యేటప్పటికి పదీ పదకొండు గంటలయింది.

సాయంకాలం పిల్లని రోడ్లమీద తిప్పే ఉత్సా హంలో మొదట్లో ఆ పద్ధతిని తట్టుకుంది రాజమ్మ. కాని

నాలుగు రోజులు గడిచేటప్పటికి బండిమీద మోజు తగ్గింది, విసుగూ హెచ్చింది. పైగా నడిచి రావటంవల్ల కాళ్లు నొప్పులు పట్టి వంట చెయ్యటం కష్టం అయింది. అయిదోరోజు "సాయంకాలం ఆఫీసునుంచి వేళకు తిరిగి వచ్చి, పిల్లని కొంచం బండిలో తిప్పరాదూ" అని అడిగింది భర్తని.

తాను బండిని తోసుకుంటూ వెళ్ళటం నారాయణ రావుకి ఇష్టం లేదు. కాని ఏంచెయ్యటం? తాను అలా తోసుకు వెళ్ళకపోతే కొన్న బండి వృధా అవుతుంది. అది వూరికినే వుండి క్షణక్షణం తన్ను వెక్కిరిస్తుంది.

సాయంకాలం ఆఫీసునుంచి త్వరగా వచ్చివేసి, పిల్లని బండిలో కూర్చోబెట్టి రోడ్లవెంట తోసుకువెళ్ళాడు. అకస్మాత్తుగా ఈ పద్ధతి అసహ్యం అనిపించిం దతనికి. పిల్ల బండిలో సరిగా కూర్చోదు. అటూ ఇటూ కదులుతుంది. లేచి నుంచోబోతుంది. పిల్ల పడకుండా ముందు అడ్డంగా బెల్టు వొకటి వుంది గాని, కాలం మంచిది గానప్పుడు ఆ బెల్టులోనుంచి జారి పడవచ్చని గ్రహించాడు. నారాయణరావు. పిల్లని కదలకుండా కూర్చోమని అదిలిస్తే పెద్దపెట్టున ఏడుపుకి లంకించుకుంది.

అతను బండి తోసుకువెళ్తుంటే, బజార్న నడుస్తున్న జనమంతా అతనివంకే చూశారు. అదికూడా ఆశ్చర్యంగానూ, విడ్డూరంగానూ అప్పు డతనికి స్ఫురణకు వచ్చింది. సాధారణంగా ఇటువంటి తోపుడుబండ్లను ఇండ్లలో పని

చేసేవాళ్ళు స్త్రీలే తోసుకువెళ్తూ వుంటారని. ఈ ఆచారం జ్ఞాపకం రాగానే అతనికి తగని సిగ్గు వేసింది. పెద్దబజారు తప్పించి సందు గొందుల వెంట నడిపాడు బండిని. మధ్య ఎందుకో పెద్దపెట్టుగ ఏడువ నారంభించింది బండిలో వున్న కూతురు. ఎన్ని చెప్పినా వినలేదు. ఎంత సముదాయించినా ఆగలేదు. అతనికి కోపం వచ్చి ఆపిల్ల ఏడుస్తున్నా పట్టించు కోకుండా బండి తోశాడు. దారే పోయే వొక ముసలమ్మ "అదేమిటయ్యా, పిల్ల ఏడుస్తుంటే పట్టించుకోవూ? బండి ఆపి కాస్త ఎత్తుకొని సముదాయించకూడదూ?" అన్నది నిష్ఠూరంగా. ఆ పరిస్థితుల్లో అంతే చెయ్యాలి కాబోలు అనుకొని పిల్లను ఎత్తుకొని సముదాయించాడు.

ఇంటికి తిరిగి వచ్చి జరిగిన సంగతంతా భార్యకు చెప్పాడు. ఆమె తన కష్టం గమనించకుండా, "అది వొట్టి రాగది," అని మురుసుకుంది. ఆమె పిల్లని తలుచుకొని మురుసుకుంటూ వుంటే అతనికి సంతోషమే వేసింది.

ఈ విధంగా గడిచిపోయినై ఆరోజులు. పిల్లలు ఎక్కువ అయినకొద్దీ ఆసంతోషాలూ, మురిపాలూ ఏమయ్యాయో, వొక్కొక్క కాన్పుకి వాళ్ళ మనస్సులు భీతావహంతో గిజ గిజ లాడిపోయేవి. వాళ్ళ భీతావ హంతోపాటు పిల్లలు ఎక్కువ అవుతూ వచ్చారు. క్రమ క్రమేణా ఈ దీనావస్థకు వచ్చారు.

భార్య మాటలకు గతించిన ఈ చరిత్ర అంతా జ్ఞాపకం వచ్చింది నారాయణ రావుకి. భార్య ఈ స్థితికి రావ

టానికి తన చపలత్వమే కారణం అనుకున్నాడు. ఆమె వంకకు చూడలేకపోయాడు తల వంచుకునే "విచారించకు. ఏదో వొకటి చేద్దాం" అన్నాడు.

"ఇంకా చేసేదేముందండీ?" అని రోదించింది రాజమ్మ. "ధైర్యమే ఉండాలి గాని, ఉపాయమే దొరకకపోతుందా?" అన్నాడు నారాయణరావు.

అతని మనస్సులో గర్భిణీ పోగొట్టవచ్చనే భావం కదులాడింది. పోషించలేని పిల్లలను కని వాళ్ళను రోడ్లకు అప్పగించిందానికంటే ఇది తప్పుకాదనిపించింది. ఇతర దేశాల్లో ఈపని నిత్యకృత్యంగా జరుగుతూ వుంటుందట! ఎవ్వరూ దీనిని వొకతప్పుగా పరిగణించరట. మన దేశానికి ఏమొచ్చిందో రోగం! ఈ దేశంలో క్రొత్తపనులన్నీ విడ్డూరంగానే పరిగణింపబడతై. అవన్నీ పాపపులక్రిందే లెక్క. ఏమిదేశం ఇది? ఇదొక ఘూబికికూపం. బయటకు రావటాని ప్రయత్నించినకొద్దీ లోపలకు దిగబడతారు. మానవులు ఈ దేశంలో. నూతిలో కూరుకొని వుండటం ఈ దేశంలో గొప్ప. ఎంతలోతుగా దిగబడితే అంత గొప్పనాయకుడు ఈ దేశంలో.

రాజమ్మ వెళ్ళి పడుకుంది. ఆమె కన్నీరు పెట్టుకుంటూ ఉంటుందనీ, ఇక ఆరాత్రి ఆమెకు నిద్దర వుండదనీ నారాయణరావుకి తెలుసు. కాని ఆమె మనస్సుకి ప్రశాంతతను చేకూర్చటానికి తాను చేయగలిగిందేమిటి? ఆలోచిస్తూ పడుకున్నాడు. పిల్లలు ఎక్కడివాళ్ళు అక్కడ నిద్ర పోతున్నారు. తూటా ప్రేలుడికి వొకకొండ పగిలి

ముక్కలు ముక్కలై గాలిలోకి ఎగిరి క్రిందపడి మరుక్షణం నిశ్శబ్దపూరితమైనట్లనిపించింది అతనికి. ఆ నిశ్శబ్దం అతి భయంకరంగా ఉంటుంది. రాబోయే మరొక గొప్ప ప్రమాదానికి సూచనప్రాయంగా ఉంటుంది. వుండి వుండి కొండలను కరగించేఆర్తనాదంవొకటి ఆనిశ్శబ్దంలోనుంచి వెలువడవచ్చు. రాబోయే ఆర్తనాదానికి బలం ఇవ్వటానికే ముందు ఈ నిశ్శబ్దం ఏర్పడింది. వొక్క క్షణం ప్రాణాలను బిగబట్టుకొని కూర్చున్నాడు నారాయణరావు. అకస్మాత్తుగా తన భార్య పెద్దపెట్టున శోకించటం తను వినవలసి వస్తుందని నిర్ణయించుకున్నాడు. కాని అటువంటిదేమీ జరగలేదు. పంపునుంచి నీటిచుక్కలు వొక్కొక్కటిగ టప్ టప్ మంటూ బొక్కెనలో పడుతున్నాయి. వినపడుతున్నది ఆ వొక్క ధ్వనే అవటంవల్ల దానికొక వింత ప్రాధాన్యత వొచ్చింది నారాయణరావు మనస్సులో. ఆధ్వని సైతం భయోత్పాతాన్నే కలిగించింది అతనికి

టప్, టప్, టప్, టప్.

మానవుని అంతిమఘడియలు లెక్క పెడుతున్నట్లున్నారు ఎవ్వరో! అక్కడనుంచి బ్రతుకుమీదకు నడిచింది అతని బుద్ధి. ఈ బ్రతుకుకి అర్థం లేదు. ఈ సంగతి బహుశా అందరికీ తెలుసు. అయినా ప్రతివాళ్ళూ ఏదో పెద్ద అర్థం వున్నట్లే ప్రవర్తిస్తారు. లేకపోతే ఇన్నికలహాలూ, ఇన్ని యుద్ధాలూ దేనికి? ప్రతి చిన్నవిషయానికీ ఈ ఆరాటం దేనికి? ఈ హైరాన దేనికి?

టప్, టప్, టప్, టప్. అని నీటిబిందువులు బొక్కెనలోకి పడుతూనే వున్నయి. ఈ సారితనగుండె కొట్టుకుంటున్నట్లు అనిపించింది అతనికి. తనగుండె కొట్టుకునే తీరు ఎవ్వరో బయటనుంచి వినిపిస్తున్నారు. ఈ వాతావరణం తనకే ఇట్లావుంటే తన భార్య గుండెను ఎంతగా చెదర గొడుతూ వుందో అని ఆలోచించబుద్ధి అయింది అతనికి. అక్కడితో భార్యమీద వర్ణించటానికి వీల్లేనంత సాను భూతి ఏర్పడింది. ఆమెను దగ్గరకు తీసుకొని వోదార్చవల సిన బాధ్యత తనమీద ఎంతగానో వున్నదనిపించింది. ఆమెతో కలిసి తనూ కన్నీరు పెట్టుకుంటే గాని ఆమెకు న్యాయం చేసినట్లు అవదు.

నెమ్మదిగాలేచి భార్య పడుకున్న గదిలోకివెళ్ళాడు. అతను పని చేసుకునే గదీ, వంటగదీ, భోజనాల గదీ కాక ఆ ఇంట్లో వున్నది ఆవొక్కగదే. పిల్లాజెల్లా అంతా ఆ గది లోనే పడుకుంటారు. అతను పెండ్లినాడు కొన్న ఒక పెద్ద జంపఖానా వుంది. అది ఇప్పుడు అరచేతిమందాన మట్టికొట్టు కొని అంచులు చిరిగివుంది. గతించిన దీపావళినాడు పిల్లలు కాల్చిన మతాబులకు అది మధ్యన కాలితే అతని భార్య మాసికవేసి సరిపెట్టింది. అది పరుచుకొని అందరూ వరు సగా పడుకొని వున్నారు. వాళ్ళని ఒక్కచోట చూస్తే భవి ష్యత్తు సంగతి అటుంచి ఇన్నాళ్లు వాళ్ళందరినీ ఎట్లా పెంచానా అని ఆశ్చర్యం కలిగింది. తనకు గానీ, తన భార్యకు గానీ ఏదన్నా జరిగితే వీళ్ళంతా ఏమవ్వాలా, అనే ఆలో చన మనస్సులో పడేటప్పటికి అతని గుండె గుభేలు

మన్నది. ఈ పరిస్థితి ఇలా వుండగా ఈ క్రొత్త ఆపద ఒకటి వచ్చి పడింది. నిజంగా తనకు బుద్ధిలేదు అని తేల్చుకున్నాడు నారాయణరావు. తనకు ఇంతబుద్ధి ఎందుకు లేక పోయిందో అతనికి అర్థం కాలేదు. తనంత బుద్ధిలేనివాడీ ప్రపంచంలో మరొకడు వుండడనుకున్నాడు ఆక్షణం.

వరుసలో చివర పడుకొని వున్నది అతని భార్య. ఏడ్చి ఏడ్చి అప్పుడే నిద్రపోయినట్లు వుంది. అతని చిన్నతనంలో అతని వూరి పక్కన చిన్న చిన్న గుడిసెలు వేసుకొని ఎవరికి వాళ్లు వుండేవాళ్ళు. ఒక్కొక్క గుడిసెకి పదిమంది సభ్యులకు తక్కువ లేకుండా వుండేవాళ్ళు. వాళ్ళయిళ్ళు అచ్చగా గుడిసి బండ్లకుమల్లే వుండేవి. అంటే గడబర్దలు వంచి కట్టినదాని పైన చాపో, ఆకులో వెయ్యటం. అటువంటి గుడిసెలో ఇంతమంది ఎట్లా కాపురం చేస్తారా అని ఆరోజుల్లో అతనికి ఆశ్చర్యం కలిగింది. అన్నింటికంటే ముఖ్యమైంది వాళ్ళంతా రాత్రిళ్లు ఎట్లా పడుకుంటారా అనే ప్రశ్న. ఆ ప్రశ్నకు ఇప్పటికి సమాధానం దొరికింది నారాయణరావుకి.

"ఇట్లాగే," అనుకున్నాడు. తనది ఎంత దీనావస్థ! అతని కండ్లలో నీళ్ళు తిరిగినై. తనకష్టం ఎవ్వరితో చెప్పుకో గలడు? ఎచ్చిదో పచ్చిదో తనకు మిగిలింది ఈ భార్య.

"రాజీ?" అని పిలిచాడు.

ఆమె పలకలేదు. పని చేసి చేసి అలసివుంటుందేమో నిద్రనుంచి లేవటం ఆమెకు గగనం అవుతుంది. నిద్రలో ఏమేమి భావాలను ఊహిస్తూ వుంటుందో, బల

వంతంగా లేపితే లేచి కేకలు పెడుతుంది. ఒక్కొక్కప్పుడు అలా ప్రారంభించిన కేకలు ఇక ఆపదేమో అని భయం కలుగుతూ వుంటుంది నారాయణరావుకి. అటువంటి పరిస్థితుల్లో ఆమె నారాయణరావుని గుర్తు పట్టనే పట్టదు. వణికిపోతూ, కండ్లతో చింతనిప్పులను చెరుగుతూ నిద్రావస్థలో కనుపించిన ఏ రాక్షస సమూహంతోనో పోరాడుతున్నట్లు కనుపిస్తుంది.

పెండ్లిఅయిన మొదటిరోజుల్లో ఆమెకు ఈ అంశ వుండేదికాదు. నిద్రించినప్పుడూ, మేల్కొన్నప్పుడూ కూడా ఆ మెముఖం నవ్వుతూవుండేది. నిద్రపోతున్నప్పుడు ఆమె కనురెప్పలు ఏతియ్యని కలలనో దాస్తున్న వెన్నెలతరగలకు మల్లే కనుపించేవి. ఒక సుందరాంగి యౌవనారంభాన్ని తమలో పొదుగుకొని మురుసుకుంటున్న ఉల్లిపొరవమిటె పొరలకుమల్లే కనుపించేవి. ఆ రెప్పలను నారాయణరావు ఎన్నిసార్లు ముద్దుపెట్టుకున్నా తనివితీరేదికాదు. అతనికి అది ఒక మహాద్భాగ్యంగా రుచించేది.

ఇప్పుడా? ఇప్పుడు ఎండుటాకులవలె, ఖాళీ అయిన తోలుతిత్తులకువలె, డిప్పలకువలె కనుపించి మనస్సును కలవర పరుస్తున్నయి. మనస్సులో రవరవలు రేపుతున్నయి. పుట్టి, వికసించి, పండి, ఎండి రాలిపోవటంలో అర్థంఏముంది? ఈ విధానమే తప్పనిసరైనదైతే పుట్టటందేనికి? పుట్టటం దేనికి? చావటం దేనికి? 'అడుసు త్రొక్కనేల కాలు

కడుగనేల'. ఇది నారాయణరావు వీధిబడిలో చదువు కున్న ముక్క. ఈముక్క ఆరోజుల్లో పరమసత్యంగా కనుపించేది నారాయణరావుకి. కాని ఇప్పుడు అడుసు త్రొక్కటం కాలుకడగటమే జీవితసత్యంగా కనుపిస్తూ వుంది. పుట్టటం చావటం. ఎలాగూ చస్తాంగదా అని పుట్ట టం మానుకోము. పొట్టనింపుకోవటం, ఆకలికి మాడటం. ఎలాగూ ఆకలికి మాడటం తప్పదుగదాఅని తినటం మాను కోము. రోగానపడటం, నయం చేసుకోవటం. ఎలాగైనా రోగానపడటం తప్పదుగదా అని నయం చేసుకోవటం మానుకోము. అడుసు త్రొక్కుతూవుంటాం. ఎందుకయ్యా అంటే కాళ్ళు కడుక్కోవటానికి. కాళ్ళు కడుక్కోవటం ఎందుకంటే అడుసు త్రొక్కాంగనుక. అయితే ఈ విచిత్ర విధానంలో ఆనందం అనుభవిస్తున్నవారు లేకపోలేదు. వాళ్ళకు అడుసుత్రొక్కటంలో ఆనందంవుంది. తరువాత కాళ్ళు కడుక్కోవటంలో ఆనందంవుంది. బహుశా వాళ్ళు ధన్యజీవులు.

కాని నారాయణరావుకి ఈ స్థాయిలేదు. అందుకని అడుసుత్రొక్కవలసి వచ్చినప్పుడు ఏడుస్తూ త్రొక్కు తాడు. కాళ్లు కడగవలసివచ్చినప్పుడు అంతకంటే ఏడుస్తూ కడుక్కుంటాడు. ఈ త్రొక్కటం కడగటం లేకపోతే జీవి తమే లేదనే విషయం అప్పటికి ఇంకా అతనికి తట్టలేదు.

అందుకని పొరలివస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ భార్యమీద చెయ్యివేసి, "రాజీ?" అని మళ్ళీ పిలిచాడు.

అతని చేతిస్పర్శకు ఆమె ఉలికిపడి లేచింది. "ఎవరు? ఎవరు? ఆ! ఇక్కడ నీకేంపని?" అని ఆమె బిగ్గరగా అరిచింది. ఆమెకు ఎదురుగావున్న అతను కనుపించటంలేదు. ఆమెకు కలలోని రాక్షసులే కనపడుతున్నారని అతను గ్రహించాడు. "పిల్లలు లేస్తారు. అరవకు రాజీ. నేనే. ఎవ్వరినీ కాదు. నేనే," అన్నాడు.

"నేను వూరుకోను. చంపేస్తాను," అని మళ్ళీ అరిచింది రాజమ్మ.

నారాయణరావుకి ఏమీ తోచలేదు. రాజమ్మ ఇక తిరిగి ఈ లోకానికి రాక, అలాగే వుండిపోతుందేమోనని భయంవేసింది.

"చూడు. ఇటుచూడు. నావంకకుచూడు. నేను నారాయణరావుని," అని ఆమె రెండుచేతులూ పట్టుకొని బ్రతిమలాడాడు. ఆమె వున్నట్టువుండి వధ్యవేదికకు కొనిపోబడుతున్న యజ్ఞపశువుకి మల్లే 'బే'అని అడలింది. అక్కడే కూలబడింది.

ఆమె స్పృహలోకి వస్తూవుందని గ్రహించి, "ఊరుకో రాజీ. నేను నారాయణరావుని," అని అతను పలువిధాల బ్రతిమాలుతూ కూర్చున్నాడు. ఆమె స్పృహలోకి వస్తూవుంది. బ్రతిమాలే సైనంలో ఆమె నడుంచుట్టూవున్న అతనిచేతికి ఆమె శరీరం వెచ్చగా తగిలింది. ఆమె తన ప్రక్కన కూర్చున్న నారాయణరావుని నిశితంగా చూచింది.

"ఏదైనా పీడకలవచ్చిందా రాజీ," అని అనునయంగా అడిగాడు. నడుంచుట్టుకొనివున్న అతని చేతి స్పృహ ఆమెకు కలిగినట్లువుంది.

"ఎందుకు ఇక్కడికి వచ్చారూ? మీకు సిగ్గులేదూ? వెళ్ళండి. పిల్లల కళ్ళల్లో సైతం నా బ్రతుకు నగుబాటయ్యే రోజు వచ్చింది. కదల్రేం?" అని గద్దించింది.

"కాదురాజీ," అని తన కష్టసుఖాలు చెప్పబోయాడు నారాయణరావు. ఎందుకో ఆమెను విడిచిపెట్టి వెళ్ళటం అతనికి ఇష్టంగాలేదు.

"కాదూలేదు, గీదూలేదు. వెళ్లండి ఇక్కడినుంచి," అని నడుంమీదవున్న అతనిచేతిని విసిరివేసింది రాజమ్మ. ఆమె కోపానికీ, తనకు వెళ్ళబుద్ధి కాకపోవటానికీ కారణం అప్పుడర్థమయింది నారాయణరావుకి.

"రాజీ?" అంటూ మళ్ళీ ఆమె నడుంమీద చెయ్యి వెయ్యబోయాడు.

"చాలు నడవండి," అంటూ దిగ్గున లేచింది రాజమ్మ. "ఇంతవయస్సు వచ్చినా బుద్ధిరాకపోయె. ఇతరులు నవ్వుతారనైనా సిగ్గులేకపోయె. మిమ్మల్ని ఏదో దెయ్యం పట్టుకొన్నట్టువుంది," అన్నది.

నారాయణరావు తలవంచుకొని పడుకొనివున్న పిల్లలను దాటుకుంటూ తనగదిలోకి వెళ్ళి పడుకున్నాడు. బొక్కబోర్లా పడుకొని దిండులోకి తలదూర్చాడు. తన భార్యమాటలు అక్షరాలా నిజం. నిజంగానే తనకుసిగ్గులేదు. నిజంగానే తనను దెయ్యం పట్టుకుంది

భార్య విచారంగా వున్నప్పుడు తాను సముదాయించినఘట్టాలు ఎప్పుడూ వొకవిధంగానే ముగిసినై. తాను దగ్గరకుచేరి శరీరాన్ని నిమురుతూ సముదాయించడం, ఆమె శరీరం తాకగానే అనుకోకుండానే తనకు ఉద్రేకం పెరగటం, చివరకు తన ఉద్రేకానికి ఆమెలోనవటం ఎప్పుడూ అలాగే జరుగుతుంది. అందరికీ అలాగే జరుగుతుందా? తనకేనా? ఈ విషయాలలో తనకూ ఇతరులకూ భేదం ఏమన్నావుందా? 'ఓవర్ సెక్స్‌డ్' వ్యక్తులు కొందరు వుంటారని అతను వొకప్పుడు చదువుకున్నాడు. వాళ్ళకు ప్రపంచం అంతా సెక్సుమీద ఆధారపడివున్నట్టు కనుపిస్తుందట. ఉద్రేకంకలిగితే వాళ్ళకు మంచీ చెడూ కనపడదట! ప్రపంచమే కనపడదట! తాను ఆ జాతిలోనివాడు కాడు గదా?

నలుగురు పిల్లలు కలిగినప్పటినుంచీ అతను సంతానాన్ని ఆపటానికే ప్రయత్నించాడు. కాని అతనివల్ల కాలేదు. రెండు మూడు నెలలు అతను భార్యకు దూరంగా వుండేవాడు. తరువాత ఏదో జరిగేది. నెమ్మదిగా భార్య దగ్గరకు జేరేవాడు. అదేమి ఖర్మమో తనగాలి భార్యకు తగలగానే పిల్లవాడు పడికేవాడు? అందరికీ ఇలా జరగదు. తనకే ఎందుకు జరుగుతుందో! ఈ విషయాన్ని గురించి పెరల్‌బక్ తన నవలలో వొకమంచిమాట అన్నది. 'కొంత మంది వ్యక్తులు భార్య మంచందగ్గరకు వెళ్ళి చెప్పులు విడిస్తే చాలట, భార్య గర్భిణి ధరిస్తుందట!' అలాగేవుంది తన సంగతి కూడా.

ఈ జీవితంలో అతనికి మరొక విచిత్రమైన అనుభవం కూడావుంది. భార్యకు గర్భిణి అని తెలిసింతరువాత మనస్సుమీాదనుంచి పెద్దబరువు తీసివేసినట్టువుండేది. జరగవలసింది జరిగింది, ఇక విచారపడవలసిన అగత్యం ఏముంది? ఆనాటినుంచీ విశృంఖలంగా ప్రవర్తించేవాడు. ఇంకా జరిగేది ఏముంటుంది? ఇక తను భయపడటానికి కారణం ఏముంది? ఇదీ వొకరకంగా బాగానేవుంది అనుకునేవాడు.

దిండులో తలదూర్చి పడుకున్న నారాయణరావుకి ఇవన్నీ జ్ఞాపకం వొచ్చినై. తన జీవితం వొక చదలపుట్టగా కనుపించింది. గులగుల మనటంకంటే దీనికొక ఆదర్శం లేదు అనుకున్నాడు.

తన ఉద్యోగం, తాను డీల్ చేసే ఫైళ్ళు చెవులు గింగురు మనేటట్లు వికటాట్టహాసం చేసినై. పక్కనవున్న ఫైలు తీసుకొని రపీమని నేలకువేసి కొట్టాడు. కాసేపు గదిలో అటూ ఇటూ నడిచాడు. ఏమి నడిచి చేసేది ఏముంది? మళ్ళీ పడుకున్నాడు. ఏమైనాసరే పరిస్థితి ఈ సారి కాన్పుదాకా రాకుండా చూడాలని నిశ్చయించుకున్నాడు. ఇందుకు గర్భస్రావం చేయించటం వొకటే మందు అని నిశ్చయించుకున్నాడు.

ఏవిధంగా చేయించాలి?

ఇందుకు అనేకమార్గాలు అతని మనోవీధిలో మెరిసినై. అందులో ముఖ్యమైంది ధర్మాసుపత్రిలో జేర్చటం. ఇటువంటి పనులను వారు పూనుకోరని అతనికి వెంటనే

జ్ఞాపకం వొచ్చింది. అదీకాక అక్కడ రోగుల విషయం శ్రద్ధతీసుకోరనే పుకారు అతను వినివున్నాడు. ఇవి ధర్మానికి రోజులు కావు! డబ్బుకి రోజులు. ధర్మాసుపత్రిలో వుండే డాక్టర్లకు శ్రద్ధచూపినా చూపకపోయినా ముట్టే జీతం వొకటే. అందువల్ల రోగులపట్ల శ్రద్ధ చూపవలసిన అగత్యం వారికి ఏమాత్రం కనబడలేదు.

. ఆమధ్య కాన్పుకి కష్టమైన వొక స్త్రీని ధర్మాసుపత్రిలో జేర్చారట. ఆమెకు ఆ రాత్రి కాన్పు అయిందట. కాని అక్కడ ఆమెను చూసే వారెవ్వరూ లేకపోవటం వల్ల, చివరికి మంచినీటిచుక్కకూడా ఇచ్చేవారులేక, అరచి అరచి మరణించిందట. ఈ విషయం మరునాడు పత్రికలు ప్రచురించి నానా గొడవ చేసినై.

ఇక రెండవమార్గం తన భార్యను ప్రభుత్వం స్థాపించిన కుటుంబ నియంత్రణ కేంద్రంలో జేర్పించటం. ఇక్కడకూడా ఇటువంటి కేసులను జేర్చుకోరనే అనుమానం అతనికివుంది. ఈ కేంద్రాలలో పిల్లలు కలగకుండా వుంటానికి సూత్రాలు చెపుతారు. ఆపరేషన్లుకూడా చేస్తారు. కాని గర్భస్రావాలకు వారూ పూనుకోరని అతని అనుమానం.

పిల్లలు కలగకుండా చెయ్యటానికీ, గర్భస్రావానికీ తేడా ఏమిటో ఆ పరమాత్ముడికే తెలియాలి. ప్రభుత్వం సైతం ఇటువంటి తేడాలను కల్పించటం సిగ్గుచేటు అనుకున్నాడు నారాయణరావు.

ఇక అతనికి మిగిలిన మార్గం వొకటే. మంచి ప్రయివేటు డాక్టరుకి చూపటం. ఆ డాక్టరు మగవాడైతే తన భార్య అంగీకరించదు. అందులో సందేహంలేదు. అందుకని ఆడ డాక్టర్ని చూడాలి. తను ఆఫీసుకు వెళ్ళేటప్పుడు ఆడ డాక్టర్లు పెట్టిన నర్సింగ్ హోములు అనేకం చూశాడు. అందులో ఏదో వొకదాంట్లో తన భార్యను జేర్పించాలని తేల్చుకున్నాడు నారాయణరావు.

మరి డబ్బు ఎంత అవుతుందో అనే ఆలోచన అతనికి వెంటనే తట్టింది. ఇంటిదగ్గర అంతమంది పిల్లల్తో, తన భార్యకు చికిత్స చేయించటం అర్థంలేనిపనేకాక కుదరనిపని కూడానూ. ఏదన్నా అవుసరం కలిగితే చూసే పెద్దదిక్కు కూడా తనకులేదు. పైగా పిల్లలకు ఈ విషయాలన్నీ తెలియనివ్వటం ఏమంత సక్రమమైన పనికాదు. అందువల్ల ఆమెను నర్సింగ్‌హోమ్‌లో జేర్పించవలసిందే. అందుకు కనీసం వంద రూపాయీలైనా కావలసి రావచ్చు అంత డబ్బు ఎక్కడనుంచి తెచ్చేటట్టు? వొకటవ తారీఖున వొచ్చే జీతంలోని ఎక్కువభాగం ఇందుకే సరిపోతుంది. ఇక నెలంతా తనేం చేసేటట్లు? ఎట్లాగడుస్తుంది? అప్పుతేవటం వొకటే దారి. అనుకోవటమేగాని అది మాత్రం అంత తేలికపనా? తనకు ఎవరిస్తారు. ఏంచూచి ఇస్తారు? తాను ఎట్లా తీర్చగలడు అనే ప్రశ్న వాళ్లకు మాత్రం ఉదయించదా?

ఇంటికి రాద్దామంటే 'పెట్టినఖర్చు పెట్టావు. ఇక వొక చిల్లిగవ్వ పంపను' అని తన తండ్రి ఎప్పుడో తెలియజేశాడు. అది సహజమే. అందుకు ఆయన్ని అనవలసిన పనీ

లేదు. పుట్టించిన నేరానికి చదువు సంధ్యలు చెప్పించి ఉద్యోగంలో జేర్పించాడు. అంతకంటే ఆయనమాత్రం ఏంచేస్తాడు? ఆ ఇంట్లో ఇంకా ఈడేరవలసిన పిల్లలు వున్నారు.

ఆలోచించగా ఆలోచించగా, ఇచ్చినా ఇవ్వక పోయినా ఆవూళ్ళో తను అప్పు అడగగలిగినవాళ్ళు ముగ్గురు తేలారు. అందులో మొదటి ఆయన ఆవూళ్ళోనే ప్రాక్టీసు చేస్తున్న వొక ప్లీడరు. ఆయనపేరు భాస్కరరావు. అతను కాలేజీలో తన క్లాస్‌మేట్. అతను చదువుకునే రోజుల్లో జలసాగా తిరుగుతుండేవాడు. అలా తిరగటంవల్ల అతనికి కలుపుగోలుతనం వొకటి అలవడ్డది. ఎటువంటి వ్యక్తితో నైనా ఇట్టే స్నేహం చెయ్యగలిగివుండేవాడు. కలుపు గోలుతనం వుండటంవల్లా. వస్తుతః ధనవంతుడవటంవల్లా అతనికి మంచి మంచి పరిచయాలు వుండేవి. ఆ పరిచయా లన్నీ అతని ప్రాక్టీసుకి ఉపకరించినై. బాగా సంపా దిస్తున్నాడు.

ఇక రెండవ అతను తన గ్రామస్థుడే. ఇటీవలే వచ్చి ఆవూళ్ళో వ్యాపారం పెట్టాడు. మొట్టమొదట్లో బ్రెస్ పెడదామనుకొని, తరువాత హైదరాబాదులో తెలుగువాళ్ళ హోటళ్ళకు బాగా రాబడి వున్నదని తెలుసుకొని, హైదరాబాద్‌కి కూడలిస్థలమైన ఎబిడ్స్ రోడ్‌లో వొక పెద్ద మేడ అద్దెకు తీసుకొని అందులో ఒక పెద్ద హోటలు పెట్టాడు. భోజనానికీ, విశ్రాంతికీ కూడా

అక్కడ వసతులు ఏర్పరచటంవల్లా, వంటకాల్లో మిరప కాయలూ, కారం ఎక్కువ వెయ్యటంవల్లా, పెద్ద పెద్ద కేకలు వేసుకుంటూ మాట్లాడుకునే పోట్లాడుకునే అవకాశం వుండటంవల్లా. ఉత్తర సర్కారులనుంచి పనిమీద హైదరాబాద్ వొచ్చేవారిలో చాలామంది అక్కడ బస చేస్తూ వుంటారు. అది మిలిటరీహోటలు అవటం ఒక ప్రత్యేక ఆకర్షణ. మాంసం తింటే అక్కడే తినాలని పలువురు చెప్పుకోవటం నారాయణరావు ఆనోటా ఆనోటా అనేకసార్లు విని వున్నాడు. ఈ హోటల్ వల్ల చాలామంది రాజకీయ నాయకులతో అంటే ఎం. ఎల్. ఏ. లతో అతనికి పరిచయాలు కల్గినాయి. ఆపరిచయాలను పురస్కరించుకొని అతను ఇటీవల కొన్ని కంట్రాక్టులు సంపాదించి వాటివల్ల కూడా డబ్బు గడిస్తున్నాడు. అతని పేరు షణ్ముగం.

మూడవ అతని పేరు లక్ష్మణ కోటిశాస్త్రి. ఆయన ప్రభుత్వ పౌర సంబంధ ప్రచారకశాఖలో పని చేస్తున్నాడు. పౌర సంబంధప్రచారక శాఖ అనే పేరు వినటానికి కటువుగా వుండవచ్చు. మామూలు మనుష్యులకు తెలిసిన తెలుగు కాదు అని కూడా అనిపించవచ్చు. దానికి ప్రభుత్వం చెయ్యగలిగింది ఏమీ లేదు. ఎందుకంటే 'ఇన్ఫర్మేషన్ అండ్ పబ్లిక్ రిలేషన్స్' అనే ఇంగ్లీషుపదాలకు అది తర్జుమా. తర్జుమా మక్కికి మక్కీగా వున్నట్టు ఎవ్వరికన్నా అనిపిస్తే దానికి ప్రభుత్వం చెయ్యగలిగింది ఏమీ లేదు. ఇంగ్లీషుపదాలకు మక్కికి మక్కీ తెలుగుతర్జుమా చెయ్య

టానికే గదా ప్రభుత్వం పుట్టింది. హైదరాబాద్‌లోని ప్రభుత్వాలయాలకు ముందు తగిలించబడి వుండే బోర్డులే దీనికి తిరుగు లేని సాక్ష్యం. నడుస్తుంటే ప్రతి వీధిలోనూ ఇటువంటి బోర్డు ఏదో వొకటి తగులుతుంది. ఛీఫ్ సెక్రటేరియట్‌నుంచి, టాంక్‌బండ్ వైపున నడుస్తుంటే 'మత్స్యసంవర్ధకశాఖ' అని వొక బోర్డు తగులుతుంది. అదే విధంగా సరోజినీదేవి హాస్పటల్ వైపు వెళ్తుంటే 'పశుసంవర్ధక శాఖ' వొకటి తగులుతుంది. బషీర్‌బాగ్‌లో 'పురావస్తు సంవర్ధకశాఖ' వొకటి వుంటుంది. ఈ బోర్డులను బట్టి ఆఫీసుల్లో ఏం జరుగుతుందో మనం కనిపెట్టలేం. ప్రభుత్వం 'పశుపోషకశాఖ' అనిగానీ, 'మత్స్యపోషకశాఖ' అనిగానీ అనదు. 'పురాతనవస్తు సంరక్షకశాఖ' అని గానీ 'ప్రాచీన వస్తు సంరక్షకశాఖ' అని గానీ అనదు. వొకచోట 'శ్రీ కృత్రిమ శుక్ల ప్రసారక కేంద్రం' అనే బోర్డు కూడా వుంది.

ఈ మతలబుకి కారణం తాము వ్రాయించింది ప్రజలకు అర్థమయితే తాము చేసే పనులమీద వారికి గౌరవం వుండదనే అభిప్రాయం ప్రభుత్వాధికారులకు వుండటం కావచ్చు. 'చేపల పెంపకం' అంటే అందులో ఘనత ఏముంది? చేపలను వీళ్ళు పెంచేది ఏమిటి? అని ప్రజలు ఈసడించవచ్చు. చేపల పెంపకానికి ఇంత పెద్ద బిల్డింగూ, ఇంతమంది ఆఫీసర్లూ ఎందుకు? వీళ్ళకు ఇంతింత జీతాలూ, వీళ్ళకింద ఇంతమంది నౌకర్లూ ఎందుకు? చేపల పెంపకానికి ఇంత ఖర్చా? అని అనిపించవచ్చు. 'మత్స్య

సంవర్ధక శాఖ' అంటే ప్రభుత్వం అక్కడ ఏదో ఘనకార్యం సాధిస్తూ వుందని ప్రజలు భ్రమపడి ఆశ్చర్య నిమగ్నులై, నిర్విణ్ణులై జోహారులు అర్పించవచ్చు.

నేనిలా అంటున్నానని ఈ బోర్డుల విషయంలో ప్రభుత్వం శ్రద్ధ వహించదని ఎవ్వరూ అనుకోవలసిన అగత్యం లేదు. అది ప్రభుత్వం. అందుకని అన్నిటిపట్లా దానికి శ్రద్ధే! దేన్నయినా అది స్థనశల్య పరీక్ష చేసిగాని గాని విడువదు. అదే విధంగా ప్రభుత్వం అఫీసుల ఎదుట స్థాపితం చెయ్యబడే ఈ బోర్డుల స్థనశల్యాలను కూడా అది పరీక్షించింది. అలా పరిశీలించే ఆయా పేర్లను నిర్ణయించింది.

ఈ పేర్లను నిర్ణయించటానికి కూడా అనేక ఫైలు నడుపుతుంది. దీనికి నేక ఫైలూ, దానిని పరమపద సోపాన పటంమీద నడపటం, పాముల కాట్లకు లోను చెయ్యటం ఎందుకు అంటారేమో? చిన్న పామునైనా పెద్దకర్రతో కొట్టాలనే నీతిని అనుసరించి అలా చేస్తుంది ప్రభుత్వం.

నేక సుముహూర్తాన తనక్రింద పనిచేసే శాఖకు తెలుగులో ఏ పేరు పెడితే బాగుంటుందో సజెషన్స్ పంప వలసిందని నేక నోట్ పెట్టి ఆశాఖ డైరెక్టరుగానీ, సెక్ర టరీగానీ నేక ఫైలు సృష్టించి క్రిందకు పంపుతాడు. అది ఎ కాఎకిని ఎల్.డి.క్లార్కు టేబిల్ మీదకు.వచ్చి వాలుతుంది. ఆ ఎల్.డి. క్లార్కు ఆలోచించవలసింది ఏ పేరు పెడదామా అని కాదు. పేరు అంకరును దే ఇంగ్లీషులో వుంటుంటె మన

ఖర్మాన ఆ పేరు బ్రిటిష్ ప్రభుత్వమే మన నొసట వ్రాసి వెళ్ళింది. నొసటవ్రాతకు తిరుగులేదననేది మన నరనరాలకూ ఎక్కివున్న చిరసత్యం అవడంవల్ల ఆపేరును మార్చ వచ్చనే బుద్ధి ఎవ్వరికీ తట్టదు. ఇక చెయ్యగలిగింది. దానికి తెలుగు తర్జుమా. ఆతర్జుమా విషయంలోనే ఈ తర్జన భర్జన.

తనకు ఎదురుగా వచ్చి వాలిన ఫైలుమీద ఎల్. డి. క్లార్కు తన దృష్టిని కేంద్రీకరిస్తాడు. తన శాఖ సెక్రటరీ తన్నే తర్జుమా చెయ్యమని అడిగినట్లు భావించి గర్వపడతాడు. 'నేను చస్తున్నాను. ఇప్పుడు మాసెక్రటరీగారు మాశాఖకు పేరు పెట్టవలసిందని నన్ను అడిగారు' అని తనకు కనుపించినవారికల్లా చెప్తాతాడు. 'పెద్ద పెద్ద ఉద్యోగులు ఎంత మంది వున్నా ఆయనకు నేనంటే నే నమ్మకం. అందుకని ఫైలు నాకే పంపాడు' అంటాడు. ఆమాట నమ్మినవారు నమ్ముతారు, లేనివారు లేదు. ఎదటివారు తమమాటలను నమ్ముతున్నారా లేదా అనే గమనం ప్రభుత్వంలో పని చేసేవారు ఉంచుకోరు. చెప్పుకుపోవడమే వారి పని. వినగా వినగా ఎంత చేదు విషమైనా పరమసత్యమై కూర్చుంటుందని వారి నమ్మిక.

ఆ యల్. డి. క్లర్కు తనదగ్గరకువచ్చిఆఫైలును నాలుగు రోజులు వుంచుకున్నాడు. ఆనాలుగురోజులూ ఆతర్జుమాను గురించే ఆలోచించాడు. అతను తర్జుమా చెయ్యవలసిన పేరు 'ఆర్టిఫిషల్ ఇన్సెమినేషన్ సెంటర్. ఆమధ్య ప్రభు

త్వానికి పశుసంపదను వృద్ధి చెయ్యాలనే సంకల్పం కలిగింది. అందుకు మేలురకం ఆబోతులనూ, దున్నలనూ రైతులకు సప్లయి చెయ్య నారంభించింది. కాని ఎన్ని ఆబోతులునూ దున్నలను సప్లయి చెయ్యగలదు. పైగా అందుకు గాను ఇచ్చిన డబ్బు దుర్వ్యయం అవుతూవుందనే అపవాదు వొకటి ప్రభుత్వం చెవులకు సోకింది.

స్వరాజ్యం వచ్చిం తరువాత ప్రభుత్వం ప్రణాళికలను తయారు చేసి, వాటి ఆచరణకు అభివృద్ధిశాఖను వొకదానిని నెలకొల్పింది. ఈ శాఖ సమాజ వికాస కేంద్రాలలో జరిగే అభివృద్ధి కార్యక్రమాలను అజమాయిషీ చేస్తూ వుంటుంది. ఒకప్పుడు ఈ శాఖ వొక్కొక్క సమాజ వికాస కేంద్రానికి వొక్కొక్క ఆబోతు వుండటం మంచిదని నిర్ణయించింది. ఆనిర్ణయాప్రకారం ఆబోతును అచ్చు పోయించటానికి గాను వొక్కొక్క కేంద్రానికి వెయ్యి రూపాయిల చొప్పున నాలుగు కేంద్రాలకు మంజూరు చేసింది. ఆ నాలుగు కేంద్రాలూ మంచి కోడెలను కొని అచ్చు వేయించినట్లు వెంటనే తెలియ పరిచాయి. పని చురుకుగా జరుగుతున్నందుకు డెవలప్ మెంట్ కమీషనర్ చాలా సంతోషించారు.

తరువాత కొన్నాళ్ళకు టూర్ ప్రోగాం వేసుకొని ఆయన ఆయా కేంద్రాలు దర్శించారు. మొదటి కేంద్రంలో అడుగు పెట్టగానే ఆగ్రామ పెద్దలూ, ఆ కేంద్రం అధికారీ ప్రభుత్వం ఇచ్చిన డబ్బుతో అచ్చు

పోయించిన ఆబోతును తీసుకువచ్చి చూపారు. ఆ ఆబోతునుచూసి డెవలప్‌మెంట్ కమీషనర్ చాలా సంతోషించాడు. ఆ ఆబోతుకు నెలకు వందరూపాయీలు ఖర్చు పెడుతున్నామని చెప్పాడు. ఆ కేంద్రఅధికారి మిగిలిన మూడు కేంద్రాలలో కూడా డెవలెప్‌మెంట్ కమీషనరు గారికి అక్కడక్కడ పెంచబడుతున్న ఆబోతులను తెచ్చి చూపారు ఆయా అధికారులూ, గ్రామపెద్దలున్నూ.

ఆ ఆబోతులను చూచి డెవలప్‌మెంట్ కమీషనరు గారు పరమానందభరితులయ్యారు. ఆ ఆబోతులు బాగా బలిసి, మంచి మూపురాలు కలిగివుండటం కూడా ఆయన గమనించాడు. కండ్లకు కాటుక పెట్టినట్లు వున్నాయి. మూపురాలు నలుపుకు తిరిగి వొక ప్రక్కకు వాలి వొరిగిన రుబ్బుడు పొత్రాలకు మల్లే వుండటం ఆయన మనస్సుకి ఆహ్లాదం కలిగింది.

కానీ తీరా ఇంటికి వొచ్చేటప్పటికి అకస్మాత్తుగా ఆయనకు వొక అనుమానం కలిగింది. ఆ కేంద్రాలవారు చూపిన నాలుగు ఆ బోతులూ వొకే రకంగా వున్నట్లు అనిపించింది. వెంటనే ఆ నాలుగు కేంద్రాలలో తాను వొకే ఆబోతును చూశానని అనిపించింది. అధికారులు ఒకే ఆబోతును తనతోపాటు తిప్పి తనకు తెలియకుండా కేంద్రానికి ఒక రంగుదుస్తులను తొడిగి తనను మాయ చేశారని గ్రహించటానికి ఆయనకు ఎక్కువసేపు పట్టలేదు. అక్కడితో ఆయన హతాశుడైనాడు.

ఆనాటినుంచీ అధికారులద్వారా గ్రామస్థులకు ఆబోతులను ఇప్పించే కార్యక్రమం ఆపివేసి, కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాలను స్థాపించటంలో నిమగ్న మయ్యారు డెవలెప్‌మెంట్ కమీషనరుగారు. ఇప్పుడు బోర్డు వ్రాయించేది హైదరాబాద్‌లో స్థాపించబడే ఆ కేంద్రాల హెడ్ ఆఫీసే. ఆపనే ఇప్పుడు ఆశాఖలో పని చేసే ఎల్. డి. క్లార్కు పాల బడింది.

ఆ క్లార్కు నాలుగు రోజులు ఆలోచించి, 'ఆర్టి ఫిషల్ ఇనసెమినేషన్' అనే ఇంగ్లీషుపేరుకి, 'కృత్రిమ గర్భోత్పత్తి' అని తర్జుమాచేసి, ఆఫైలు పై అధికారులకు మార్కు చేశాడు. అది సెక్రటరీ దగ్గరకు వెళ్ళడానికి ప్రయాణం మొదలు పెట్టింది.

ముందు సూపరింటెండెంట్ ఆ ఫైలు చూశాడు. అదే తర్జుమా తనలో తాను నాలుగైదు సార్లు చదువు కున్నాడు. అప్పటికీ తృప్తిచెందక పైకి రెండుసార్లు చది వాడు. వెంటనే తర్జుమా చేసిన ఎల్. డి. క్లార్కుని పిలిచాడు.

అతను చాలా సంతోషంగా వచ్చాడు. తాను చేసిన తర్జుమా మెచ్చుకోటానికి పిలిచి వుంటాడని అతను అనుకున్నాడు. నిజానికి అతను బాగా తర్జుమా చేశాడు. పూర్తి అర్థం వచ్చేటట్టు చేశాడు. మళ్ళీ చదివేవాళ్ళకు జుగుప్స కలగకుండా వుండేటట్టు చూశాడు. 'గర్భోత్పత్తి' అనేమాట దొరకటం అతని అదృష్టం అతను కనబడగానే

"ఏదైనా పని ఇస్తే శ్రద్ధగా చెయ్యాలి. ఏదో ఒక విధంగా వదిలించుకోటానికి చెయ్యకూడదు. ఈ సంగతి నీకు ఎన్ని సార్లు చెప్పాలి?" అన్నాడు.

"చిత్తం. బాగానే చేశానండీ," అన్నాడు ఎల్. డి. క్లార్కు కంగారుపడుతూ.

"ఏం బాగు! నాముఖం బాగు. మీరు చెయ్యవలసిన పనులు నేను చెయ్యలేక చస్తున్నాను. వున్న మూడు మాటల్లో వొకమాట విడిచిపెట్టావేం?" అని అడిగాడు సూపరింటెండెంట్.

"ఏ మాటండీ?"

"సెంటర్ అనేమాట. 'ఆర్టిఫిషల్ ఇన్ సెమినేషన్ సెంటర్' అనే మాటలుగదా నువ్వు తర్జుమా చెయ్యవలసింది. దానికి 'కృత్రిమ గర్భోత్పత్తి' అన్నావు. మరి 'సెంటర్' అనే మాటకు అందులో నీవు చేసిన తర్జుమా ఎక్కడ?"

"పొరపాటేనండీ," అన్నాడా ఎల్. డి. క్లార్కు.

"పొరపాటు అంటే సరిపోయిందీ? మొదటే వుండాలి. నేను ప్రతి కాగితం, ప్రతి అక్షరం చూసుకునేవాడిని గనక సరిపోయింది. మామూలు సూపరింటెండెంట్ అయితే బాగానే రాసివుంటావనే నమ్మకంతో ఫైలు పైకి పంపే వాడు. అప్పుడు అతని గతి ఏమయ్యేదో? పైనుంచి వచ్చే చీవాట్లకు లోనయ్యేవాడంటావా, కాదా?"

"చిత్తం. పొరపాటే."

"సరే, ఇంతకీ 'సెంటర్' అంటే తెలుగు ఏమిటంటావ్?"

ఎల్.డి. క్లార్కు ఒక క్షణం ఆలోచించాడు. 'సెంటర్' అనే మాటకి తెలుగు అతనికి తెలుసు. కాని చెపితే తన క్రింద ఉద్యోగి తప్పుచేసినట్లూ, తాను సరిదిద్దినట్లూ ఫైలు మీద వ్రాసి పైకిపంపుతాడు సూపరింటెండెంట్. అందుకని "ఆ ఫైలు ఇలాఇవ్వండి. ఆలోచించి వ్రాసి సబ్‌మిట్ చేస్తాను" అన్నాడు.

"ఇందులో ఆలోచించేది ఏముందోయ్. తెలిస్తేచెప్పు. లేకపోతే నేనే చూసుకుంటాను," అన్నాడు సూపరింటెండెంట్.

ఇక చెప్పక తప్పదు అనుకున్నాడు ఎల్. డి. క్లార్కు "కేంద్రం," అన్నాడు.

"సెంటర్ అంటే కేంద్రం ఏమిటోయ్? తెలిస్తే చెప్పాలి. లేకపోతే వూరుకోవాలి. సరే సరే, నాతిప్పలునేను పడతాను. ఇక నువ్వువెళ్ళు," అని విదిలించుకున్నాడు.

ఎల్. డి. క్లార్కు వెళ్ళిపోయాడు. కాని అతనికి తెలుసు తను చెప్పినమాటే సూపరింటెండెంట్ ఫైలు మీద వ్రాసి పంపుతాడని. ప్రభుత్వోద్యోగులకు ఇది పరిపాటే. అన్నీ క్రింది ఉద్యోగుల్తో చెప్పించుకుంటారు. వారు చెప్పింది తప్పనేభావం కలిగిస్తారు. కాని వారు అటువెళ్ళగానే వారు చెప్పింది తమ సొంత అభిప్రాయాలుగా ఫైలుమీద రాసి పరమపద సోపానాలు ఎక్కిస్తారు. ఇప్పుడూ ఆ సూపరింటెండెంట్ అంతే చేశాడు. ఫైలుమీద 'కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రం' అని రాసి అసిస్టెంట్ సెక్రటరీ దగ్గరకు దానిని తీసుకువెళ్లాడు.

"ఇటువంటివాటికిక్రిందవాళ్ళమీద ఆధారపడిలాభం లేదండీ. వాళ్ళకి శ్రద్ధలేదు. అన్నీ నేనే చూసుకోవలసి వస్తూవుంది చస్తున్నాను," అని ఫైలు ఆయనకు అందించాడు.

"సరే చూస్తాను. అక్కడ పెట్టి వెళ్ళు," అన్నాడు అసిస్టెంట్ సెక్రటరీ. అతను అటు వెళ్ళగానే తాను చెయ్యి చేసుకోకపోతే బాగుండదని 'శ్రీ కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రం' అని వ్రాసి డిప్యూటీ సెక్రటరీకి పంపాడు. అది అక్కడనుంచి సెక్రటరీ దగ్గరకు వెళ్ళింది.

ఆ ఫైలు చదివితే సెక్రటరీకి వొక బ్రహ్మాండమైన అనుమానం కలిగింది.

'ఇన్సెమినేషన్' అనే మాటకు గర్భోత్పత్తి అనే అర్థం ఎక్కడనుంచి వొచ్చింది? సెక్రటరీకి ఇన్సెమినేషన్ అనే మాటలో ఎంత వెతికినా గర్భం కనపడలేదు. పైగా ఇంగ్లీషులో లేని శ్రీ అనేపదం తెలుగులో ఎట్లా వచ్చిందో అతనికి అర్థంకాలేదు. 'మిస్టర్' అనే పదానికి తెలుగులో 'శ్రీ' అని వాడటం అతనికి తెలుసు. ఇక్కడ 'మిస్టర్ ఆర్టిఫిషల్ ఇన్సెమినేషన్ సెంటర్' అనిలేదుగదా! మరి ఈ శ్రీ ఎక్కడనుంచి వొచ్చింది. అంతేకాదు. ఇంగ్లీషులో వున్నవి మూడు మాటలు. తెలుగులో శ్రీ తీసివేసినా నాలుగు మాటలు వున్నట్లు అతనికి అనుమానం వేసింది. (గర్భోత్పత్తి రెండుమాటలు అని అతను పసికట్టాడు) ఈనాలుగో మాట ఎందుకు రావలసింది.

ఇవన్నీ ఫైలుమీద రాసి, క్లారిఫికేషన్‌కోసం ఫైలు

క్రిందకు పంపాడు. అది చెయ్యవలసిన మజిలీలన్నీ చేసి, ఆగవలసినచోట్లల్లా ఆగి చివరికి సూపరింటెండెంట్ దగ్గరకు వచ్చింది. ఆ ఫైలూ, దానిమీద సెక్రటరీ వేసిన ప్రశ్నలూ చూసేటప్పటికి సూపరింటెండెంట్‌కి గుండె ఆగినంతపని అయింది. నాలుగైదుసార్లు చదివిందే చదివాడు. సెక్రటరీ రాసిన అక్షరాలు పెద్ద పెద్ద దయ్యాలకుమల్లే అతనిముందు తాండవించ సాగినై. పది నిముషాలు ఏమి చెయ్యటానికీ తోచక అలాగే కూర్చుండిపోయాడు. అతనికి ఈ మధ్యే సూపరింటెండెంట్‌గా ప్రమోషన్ వొచ్చింది. ఇక యు.డి. క్లార్కుగా తనకు రివర్షన్ తప్పదు అనుకున్నాడు. అందుకు తన క్రింద పనిచేసే ఎల్. డి. క్లార్కు బాధ్యుడనుకున్నాడు. అతనిని పిలిచి తన అక్కసు వెళ్ళబోసుకున్నాడు. అతనిని అనరాని మాటలన్నీ అని, "ఇక నీజన్మకు ప్రమోషన్ రాకుండా చేస్తాను," అని బెదిరించి పంపించి, ఈసారి ఫైలుమీద నోటు తనే తయారుచేశాడు. సెక్రటరీ అడిగిన ప్రశ్నలన్నిటికీ సమాధానం రాశాడు. శ్రీ అనే అక్షరానికి శుభం అనే అర్థం గనుక ప్రభుత్వం స్థాపించే 'కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రా'నికి ముందు శ్రీ ఉంచానన్నాడు. ఇన్‌సెమినేషన్ అనే ఇంగ్లీషు మాటలో గర్భం లేనిమాట నిజమేననీ, తన తప్పు క్షమించవలసిందనీ గర్భోత్పత్తికి బదులు శుక్లప్రసారం అని ఉంచితే బాగుంటుందని శుక్లప్రసారం పైకి రెండుమాటలుగా కనుపిస్తున్నా, అసలు వొకే మాటనీ, అందువల్ల ఇంగ్లీషులో వున్నట్టు తెలుగులోనూ మూడు మాటలే వున్నాయనీ, ఈ కారణాలను పురస్కరించుకొని

'శ్రీ కృత్రిమ శుక్ల ప్రసార కేంద్రం' అనే పేరు అంగీకరించ వలసిందని రాసి ఫైలు పైకి పంపాము. ఫైలు దివ్యంగా పైకి వెళ్ళి సెక్రటరీ అనుమతితో దిగివచ్చింది. అప్పటినుంచీ ఆ కేంద్రం పేరు 'శ్రీ కృత్రిమ శుక్ల ప్రసార కేంద్రం'గా స్థిర పడిపోయి ఆ ఆఫీసుముఖాన వ్రేళ్ళాడుతూవుంది.

ఇటువంటి మాటలను విరివిగా ఉత్పత్తి చేసే ఫ్యాక్టరీ నారాయణరావు స్నేహితుడు లక్ష్మణకోటిశాస్త్రి పని చేస్తున్న ప్రభుత్వపౌర సంబంధ ప్రచారకశాఖ. ముందు మొదటి ఇద్దరినీచూచి వారితో పనికాకపోతే లక్ష్మణకోటి శాస్త్రిని అతని ఆఫీసులోనే చూద్దాం అనుకున్నాడు నారాయణరావు.

ఈ ఆలోచనలతో అతని మనస్సు కొంత కుదట పడింది. అతనికి నిద్రపట్టింది.

* * *

నారాయణరావుకి మామూలుగా తెల్లవారి అయిదు గంటలకల్లా మెలకువ వస్తుంది. అతనిభార్య అంతకు పాక అరగంటకు ముందే లేచి కాఫీ పెడుతుంది. అతను కాల కృత్యాలు తీర్చుకునేటప్పటికి కాఫీ తయారుగా ఉంటుంది. అతనికి మొత్తం జీవితంలోకల్లా మధురంగా వుండేది ఆ

కప్పు కాఫీయే. ఏ కారణంవల్లనయినా ఆ కాఫీ అందటం ఆలస్యం అయితే అతనిప్రాణం కొట్టుకులాడేది.

ఆరోజుకూడా అలవాటు ప్రకారం అతను అయిదు గంటలకు లేచాడు. లేచిం దగ్గరనుంచీ మనస్సు విచారం గానూ, బరువుగానూ వుంది. కండ్లు తెరిచిన కాసేపటికిగాని అతనికి గతరాత్రి జరిగిన సంఘటన జ్ఞాపకం రాలేదు. అది జ్ఞాపకం వచ్చేటప్పటికి కంగారు ఎత్తింది. మళ్లా భార్య ఏమంటుందో అని భయం వేసింది. ఏమన్నాతప్పేది ఏముందని లేచి కాలకృత్యాలు తీర్చుకొని మంచం మీద కూర్చున్నాడు.

రాజమ్మ కాఫీ తీసుకువచ్చింది. ఆమె ముఖం ప్రశాంతంగావుంది. కోపచిహ్నాలు ఏమీ లేవు. అతనికి ఆశ్చర్యంవేసింది. ఆమెకు కోపంవస్తే రెండు మూడు రోజు లైనా వుండటం పరిపాటి. ఈ సందర్భంలో తెల్లవారే టప్పటికి కోపం తగ్గిపోవటం నారాయణరావుకి విచిత్రం అనిపించింది.

తల పైకెత్తకుండా కాఫీతాగుతూ, "రాత్రి బాగా నిద్రపట్టిందా?" అని అడిగాడు.

"ఆఁ" అన్నది రాజమ్మ. ఆమె గొంతులో కోప లక్షణం ఏమీ కనపడలేదు. "మీరులేచేముందే లేచాను" అన్నది.

"కాఫీ బాగుంది."

"వొట్టి భారత్ పొడి అయితే బాగుండదని పోల్సన్స్ పొడీ, భారత్ పొడీ కలిపి చేశాను."

"నాకు ఫ్రూళ్ళో కొంచం పనివుంది. పొయ్యిమీద నీళ్ళు పెడితే స్నానంచేసి వెళ్తాను.

"అలాగే"

"పనికొంచం టైం తీసుకోవచ్చు. అందుకని పని చూచుకొని ఆఫీసుకు వెళ్ళి వొంటిగంటకు భోజనానికి వొస్తాను."

"అలాగే రండి. అన్నం కూరలూ ఆరిపోకుండా చిన్న టిఫిన్ కారియర్‌లో పెట్టి వుంచుతాను."

ఆమె మళ్ళీ వంటగదిలోకి వెళ్ళింది. తన భార్య ప్రవర్తనకు విస్తుబోయి కూర్చున్నాడు నారాయణరావు. అతని ఆలోచనకు అంతు దొరకలేదు. ప్రక్కనవున్న ఫైలు తీసి తిరగవేస్తూ కూర్చున్నాడు. కొంతసేపు అయింతరు వాత అతనికి వొక సందేహం వచ్చింది.

ధైర్యంచేసి వంటగది దగ్గరకువెళ్ళి, "ఏం చేస్తు న్నావ్?" అని అడిగాడు.

"నీళ్ళు పెట్టమన్నారు గదా?" అన్నది రాజమ్మ.

"కాగినయ్యా?"

"కాగుతున్నయి."

"రాత్రి నువ్వు చెప్పినమాట నిజమేనా?"

"నిజమే, మీతో అబద్ధం ఎందుకు చెపుతాను?" అన్నది రాజమ్మ భర్తముఖం పరిశీలనగా చూస్తూ.

"నిర్విచారంగా వుంటేనూ...." అని ఏమో అన బోయాడు నారాయణరావు.

"వుండక చేసేది ఏముంది?"

"అలా అంటే ఎలా! వున్న పిల్లలతోనే బ్రతకటం కష్టంగా వుంటే ఇంకా పిల్లలా?"

"ఇప్పటికైనా మీకు తెలిసివచ్చినందుకు చాలా సంతోషంగా వుంది."

"నాకు ఎప్పుడూ తెలిసేవుంది! కాని కర్మ అనేది మెడపట్టుకొని నడుపుతూవుంటే ఏం చెయ్యను?"

భార్యను తొందర పెట్టి, త్వరగా స్నానంచేసి అప్పు తేవటానికి స్నేహితుల దగ్గరకు బయలుదేరాడు నారాయణ రావు. పిల్లలు లేచి ఎవ్వరిపనుల్లో వాళ్లువున్నారు. అరుంధతి చదువుకుంటూవుంది. చివరిది తీరిగ్గా కూర్చుని ఏడుస్తూవుంది. రాజమ్మ అంట్లు తోముతూవుంది. "పొయ్యి ఘూరికినే మండుతూవున్నట్లు వుంది. ఏదన్నా పెట్టమ్మా," అని పెద్ద కూతురుతో కేకవేసి చెప్పింది. అరుంధతి వెళ్ళి పొయ్యి దగ్గర కూర్చుంది.

"ఎందుకే ఏడుస్తావు?" అని చిన్నకూతురుని అదిలించింది రాజమ్మ.

"ఆకలే అమ్మా."

"అక్క కాఫీ ఇస్తుంది. వెళ్ళి తాగమ్మా," అని సమాధానం చెప్పింది రాజమ్మ.

ఆమె సాత్వికంగా మాట్లాడి ఎన్నిరోజులయిందో! రాత్రివొచ్చిన ఉప్పెనగాలి ఇంతత్వరగా ఎలా చల్లారిందా అని ఆలోచిస్తూ పరధ్యానంగా వాకిట్లో నిలబడి వున్నాడు నారాయణరావు.

"వెళ్లారా?" అని కేకవేసింది లోపలనుంచి రాజమ్మ.

"వెళ్తున్నాను."

"వొక్క మాట"

"ఏమిటి?"

"పంపు చెడిపోయింది. వెళుతూ వెళుతూ నాగయ్యను వొకసారి రమ్మనమని చెప్పండి"

"చెపుతాను"

అతని ఇంటిముందు వీధి మలుపు తిరగ్గానే నాగయ్య వుంటాడు. అతను కరీంనగర్ నుంచి వొచ్చి హైదరాబాదులో సెటిల్ అయ్యాడు. రెండు ఎకరాలు వుంటే అమ్ముకొనివచ్చి రిక్షాలు పెట్టాడు రాబడి బాగావుండేది. ఏ ఏడాదికి వొక్కసారో పొట్ట జరగటానికి సరిపోయే ధాన్యం పండించే కుటుంబంలోనుంచి వచ్చిన నాగయ్యకు, రోజూ చీకటి పడేటప్పటికి దోసెడు చిల్లర వచ్చి పడేటప్పటికి, అతని కండ్లు బయర్లు కమ్మినై. ఆ డబ్బు సక్రమంగా హరాయించుకోలేక దుర్వ్యసనాలకు లోనైనాడు. తాగుడూ, వ్యభిచారం అలవాటైంది. ఒక ఆడమనిషిని అట్టిపెట్టుకోవటం కూడ జరిగింది. దానితో వ్యాపారం మూలబడింది. అజ కనుక్కునే వాళ్ళు లేక ఎవ్వరిచేతుల్లో డబ్బు వాళ్ళచేతుల్లోనే హరించుకుపోయింది. అందినవాళ్ళు అందినట్లు తినివేశారు. అప్పులు ఎక్కువై అతను రిక్షాలు అమ్మివేశాడు. అతనికి తిండి గడవటమే కష్టమయినది.

రిక్షాలు పెట్టిన మొదటి రోజులలో అతను వాటిని రిపేర్ చెయ్యటం నేర్చుకున్నాడు. ఇప్పుడా విద్య అతనికి అక్కరకు వచ్చింది.

నారాయణరావు వుంటున్న వీధి మూల ఎప్పుడూ పది పన్నెండు రిక్షాలు వుంటూ వుంటై. నాగయ్య ఆ మూల కూర్చుని రిక్షాలు రిపేర్ చేస్తూ జీవయాత్ర సాగిస్తున్నాడు. తిండికి గడవటం కష్టంగా వున్నా అతను తాగుడు మాన లేదు. అతనిని అంటిపెట్టుకొనివున్న ఆడమనిషి ఇంకా అత నితో వుంటూనేవుంది. అతనికి భార్యా పిల్లలు వున్నారు. వాళ్లంటే అతనికి ప్రేమే. వాళ్ళని వొక్క దురుసు మాట కూడా అనడు. కాని చేతికి డబ్బు చిక్కితే మాత్రం తాగి, తనను అంటిపెట్టుకొనివున్న మనిషి ఇంటికి వెళ్ళి పడుకుం టాడు. డబ్బు వుంటే అతను ఎప్పుడూ తాగే వుంటాడు.

అతని భార్యకు కూడా అతనంటే ఇష్టమే. ఆమే అతనిని ఏమీ అనేదికాదు. ఇంటిలో డబ్బు లేకపోతే వొచ్చి అతని సరసన కూర్చొని, అతనికి వొచ్చిన డబ్బు వొచ్చినట్లు చేతులో వేసుకొని వెళ్ళిపోయేది. ఆ డబ్బుకోసం ఆమె బలవంతం చెయ్యవలసిన అవుసరం వుండేది కాదు. అతనే ఇచ్చి పంపేవాడు. ఆ డబ్బు ఖర్చయ్యేదాకా మళ్ళీ వచ్చేదికాదు. ఈలోగా సంపాదించిన డబ్బు ఏమయిందని అడిగేదికాదు.

ఆమె అప్పుడప్పుడూ రాజమ్మకు కనుపిస్తూ వుండేది. "వెనక ఎర్రగా దుక్క ముక్కల్లే వుండేవాడు. ఆ అగ్గిలో కూర్చొని ఎట్లా మసిబొగ్గయ్యాడో చూడండి అమ్మగారూ? ఉన్ననాళ్లూ కన్నూ మిన్నూ తెలవకుండా ఖర్చు పెట్టాడు. ఇప్పుడు నానా బాధలూ పడుతున్నాడు" అని విచారపడేది.

"ఇంకా దాని ఇంటికి వెళుతున్నాడటే ?" అని అడిగేది రాజమ్మ.

"వొట్టప్పుడు వెళ్లడమ్మా. తాగినప్పుడు వెళ్తుంటాడు. తాగి నాలుగైదు రోజులు ఇంటికిరాడు. అక్కడే వుంటాడు" అని ఏమాత్రం విచారం లేకుండా చెప్పేది.

ఇటువంటి కబుర్లు వినటం ఇష్టం రాజమ్మకి. "తాగినప్పుడే వెళ్లటం దేనికి ?"

"అదీ తాగుతుంది. యిద్దరూ కలిసి తాగుతారు, అదేమి సరదో ఏమో !"

"తాగి నీ దగ్గరకు రాడూ ?"

"రాడు"

"ఎందుకని ?"

ఆమె నవ్వుతూ, "నేను పూసుకోనని భయం" అనేది.

ఈ దాంపత్యం విచిత్రంగా కనుపించేది నారాయణరావుకి. నాగయ్యకు భార్యఅంటే ఇష్టమే. అందుకని అతను చేసే పనులేమీ మానుకోడు. ఆమెనూ అతనంటే ఇష్టమే. అందుకని తన ఇష్టం వొచ్చినట్లు నడుచుకోమని కోరదు. అలా వెళ్ళిపోతున్నయి వాళ్ళ జీవితాలు. ఎక్కడికంటారా ? అందరి జీవితాలూ ఎక్కడికో అవీ అక్కడికే. వల్లోకి.

"రిక్షా కావాలా బాబూ" అంటూ ఆ మూలవున్న రిక్షావాలాలంతా అతని చుట్టూ గుమిగూడారు.

"అక్కర్లేదు," అని డబ్బులేక తాను నడిచి వెళ్ళటానికి సంకల్పించినట్లు వాళ్లకు అనుమానం కలగకుండా

వుండగలందులకు, "నేను ఎక్కడికీ వెళ్లటంలేదు" అన్నాడు నారాయణరావు.

రిక్షావాలాలు హతాశులయ్యారు. వాళ్ళ చూపులు ఎగతాళికి తిరిగినై. ఒకరి నొకరు చూచుకొని పెదవులు విరుచుకున్నారు. 'వాళ్లతో రిక్షా ఎక్కితే ఒక చిక్కు, ఎక్కకపోతే ఒకచిక్కు' అనుకున్నాడు నారాయణరావు.

నాగయ్య అక్కడే తలవంచుకు పనిచేస్తున్నాడు.

"నాగయ్యా, పంపు బాగుచేయాలట, ఒకసారి ఇంటికి వెళ్ళు," అన్నాడు నారాయణరావు.

"నాలుగు రోజుల క్రిందట చూశానండీ. పంపులో మిస్టిక్ ఏమీ లేదు. వాషర్ చెడిపోయింది. అది వేస్తే సరిపోతుంది."

"వెయ్యక పోయావా ?"

"అప్పుడే అమ్మగారికి చెప్పానండీ. అమ్మగారు ఇనిపించుకోలేదు."

"ఇప్పుడు వెళ్ళు. అమ్మ దబ్బిస్తుంది. కొని వాషర్ వెయ్యి. నువ్వు త్వరగా వెళ్ళాలి. ఇంట్లో ఇబ్బందిగా వుంది" అని ప్లీడరు భాస్కరరావు యింటికి బయలుదేరాడు.

భాస్కరరావు యింటికి వెళ్లాలంటే కింగ్‌కోటీ దాటి వెళ్లాలి. కింగ్‌కోటీ ఇప్పటి హైదరాబాదు నవాబువుంటున్న ప్రాసాదం. లోపల ఎవ్వరు వున్నదీ కనుపించకుండా ఆవరణచుట్టూ పెద్ద గోడ వుంటుంది. గేట్లో ఇద్దరు నిజాం పోలీసులు కూర్చుని వున్నారు. ఒకప్పుడు ఈ ప్రాసాదం కళకళ లాడుతూ, జనంతో కిలకిల లాడుతూ వుండివుండాలి.

ఇప్పుడో ! స్మశానంలో వుండే నిశ్శబ్దంతో వొక పెద్ద భూతగృహం లాగు వుండి, భయం కొల్పుతూవుంది.

నిజాంరాష్ట్రం భారతభూభాగంలో కలిసిన తరువాత కూడా ఆ ప్రాసాదం ముందున్న రోడ్డుమీద ఇతరులు నడవటానికి వీలుండేదికాదు. అది ప్రత్యేకం నవాబువాడుక లోనే వుండేది. ఇప్పుడో ! అది మామూలు రహదారి అయింది. వచ్చేపోయే జనంతో, కార్లతో హడావిడిగా వుంది. రోడ్డు ప్రక్కన వున్న ఆ ప్రాసాదం సంగతి పట్టించుకునేవారే లేరు. అది అక్కడ పడివుంది. హైదరాబాదులో పెద్ద పెద్ద ఇండ్లు ఎన్ని లేవు. అందులో యిదొకటి. కాల మహాత్మ్యం !

నిజాం నవాబు ప్రపంచంలోవున్న ధనికుల్లో ఒకడని ప్రతీతి. అతని దగ్గర కొన్ని కోట్ల మణుగుల బంగారం వుందని ప్రజలు చెప్పుకుంటూ వుంటారు. ఆ బంగారం భూగర్భంలో వొక కొట్టు కట్టించి, అందులో వుంచాడట. వారానికి వొకసారి ఆ కొట్టు తలుపులు తెరిచి, బంగారం చూచుకొని ఆనందంతో తన్మయుడౌతూ వుంటాడట..డబ్బు విలువ అతనికి అంతవరకే !

అతను పరమ లోభి అని ప్రతీతి. పుట్టకనుంచీ అతనికి ఆ గుణం వుందట. వొక రోజు జేబులో నుంచి డబ్బు క్రిందపడితే ఏరుకోవటం అతని తండ్రి చూశాడట. ఆ పని ఆయనకు నీచంగా కనుపించిందట. అదెవ్వరో నౌఖర్లూ, కూలీ నాలీ వాళ్లూ చెయ్యవలసిన పని. కాబోయే నవాబు చెయ్యటం పెద్ద నవాబు సహించలేకపోయాడు. పిల్ల

వాడికి గుణపాఠం నేర్పాలనే వుద్దేశంతో తన జన్మదినం నాడు పెద్ద వూరేగింపు ఏర్పాటుచేసి, ఏనుగు అంబారీలో తాను కూర్చొని, పిల్లవాణ్ణి తన ప్రక్కన కూర్చోబెట్టుకొని, వూరేగింపు పూర్తయ్యేవరకూ బంగారపు నవరసులు ఎగుర వేస్తూ కూర్చున్నాడుట. అవి వానజల్లుగా క్రింద పడగా ప్రజలు గుంపులు గుంపులు పడి దేవుకున్నారట. తమకు డబ్బు ఎంత విలువలేనిదో, డబ్బుకు విలువ వున్నవాళ్లెవరో ప్రత్యక్షంగా చిన్న నవాబుకు ఆకళింపు చెయ్యటానికని పెద్ద నవాబు ఈ పని చేశాడు. అలా నవరసులు ఎగురవేస్తూ మధ్య మధ్య చిన్ననవాబు వంక తన దృష్టులు సారించేవాడట-ఈ ప్రక్రియ అతనిమీద ఎలాపారిందో తెలుసుకోగలందుకు. అప్పుడు చిన్ననవాబు ముఖంలో ఆయన ఏం చూశాడో చరిత్రకారులు చెప్పలేదు. కాని మనం ఊహించగలం ఏనుగు అంబారీలో కూర్చునే జాతిలో పుట్టినందుకు తన ఖర్మను నిందించుకొని వుంటాడు చిన్ననవాబు. అలా పుట్టి బట్టేగదా విరజిమ్మబడిన నవరసులను తను ఏరుకునే ప్రాప్తి లేకుండా పోయింది. ఇతరులకు వొదిలి చూసుకోవల వచ్చింది. అతనికి ఏనుగుమీద నుంచి దూకాలని అనిపిం కూడా వుంటుంది. కాకపోతే కాళ్లు విరుగుతవేమోన భయపడి వూరుకొనివుంటాడు. అంతేకాదు. డబ్బు చిల్లగవ లను విరజిమ్మినట్లు విరజిమ్ముతున్న తన తండ్రి వెర్రిబాగ వాడనికూడా అనుకొని వుంటాడు చిన్ననవాబు. డబ్బుకో కాకపోతే ఈ సామ్రాజ్యాలు ఎందుకట! ఎవ్వ ఉద్ధరించటానికట !

చిన్నన వాబు ఆలోచనలను కనిపెట్టి వుంటాడు పెద్దనవాబు. అందుకనే ఆయన ఇటువంటి పనికి మళ్లీ పూనుకోలేదు. అతని ఖర్మకు అతనిని వదలి తన ఖర్మన తాను నడిచి మరణించాడు.

చిన్ననవాబు రాజ్యానికి వచ్చి పెద్దనవాబయ్యాడు. అప్పటినుంచీ డబ్బు పోగుజెయ్యటమే అతని పని. ఈ వ్యసనానికి చాలామంది అతనిని అసహ్యించుకుంటూరు. కాని అతని ఈ స్వభావానికి మెచ్చుకునేవారుకూడ లేకపోలేదు. ప్రపంచంయొక్క గమ్మత్తే అది. ఏది చూడదలచిన వాళ్ళకి అదే కనిపిస్తుంది. అంత ధనవంతుడయ్యా, ఎంతో నిరాడంబరంగా వుంటాడనీ, బజారులోకెల్లా చౌకగా వుండే గుడ్డలనే అతను తన అంగీలకు సెలకు చేసుకుంటాడనీ, అంగీలు చినిగితే తనే వాటికి మాసికలువేసి తొడుక్కుంటాడనీ, ఇవన్నీ అతని నిరాడంబర స్వభావానికి నిదర్శనాలనీ పొగిడేవారు లేకపోలేదు. ఎక్కువమందే వున్నారు అంత డబ్బి వుండీ సామాన్యులలోకెల్ల సామాన్యుడుగా వుండటం సామాన్యమైన పనా? అది అతనికే చెల్లు. ఈ విషయంలో అతను అతనికే సాటి అంటారు వారు. అందుకు అనేక నిదర్శనాలు చూపుతారు.

అతనికి భార్యలందరిలోకీ చిన్న బేగం అంటే ఇష్టమట. ఆమె అతిలోక సుందరి అట. మెత్తని మనస్సు కలదట. దాస దాసీ జనాన్ని ఎంతో ఆదరంగా చూస్తుందట. నవాబువలె కాక కష్టాలలో వున్నవారిని సాకటానికి ఎంత డబ్బయినా ఇచ్చి పెడుతుందట. ఆమె 'మూర్తీభవించిన

ధర్మదేవత, అని చాలామంది చెప్పుకుంటూ వుంటారు. అందులో నవాబు అంటే పడనివారే ఎక్కువమంది.

వొకనాడు ఆమెకు ఇష్టురాలైన వొక దాసీ, "బేగం సాహెబ్ మిమ్ములను చాలా రోజులనుంచీ వొక మాట అడుగుదాం అనుకుంటున్నాను," అన్నది.

"ఏమిటది ?" అన్నది బేగం సాహెబ్.

"నవాబుగారు ఇంత ధనవంతులు గదా, వారికి కొండమీద కోతి దిగి రమ్మన్నా వస్తుంది గదా, చిరిగిన బట్టలు కుట్టి వేసుకుంటారేమిటమ్మా ?" అని అడిగింది.

మామూలుగా దాస దాసీ జనం వేయనలసిన ప్రశ్న కాదది. నవాబు ఏది చేస్తే అదే మంచిదని పొగడాలి వారు. 'నవాబుగారు వేసుకున్న దుస్తులు ఆకాశంలోని నీలిమగా ప్రకాశిస్తుంటే, ఆ దుస్తులమీది మాసికలు నక్షత్రాలు లాగు మెరుస్తున్నవి' అని అనవలసింది. అయితే ఆ దాసీది చిన్న బేగంగారి ఆంతరంగిక చెలికత్తె. ఆమెకు బేగం సాహేబాగారి దగ్గర చాలా చనువు వుంది. ఆ చనువును పురస్కరించుకొని అడిగింది.

ఆ ప్రశ్నకు నవ్వి వూరుకుంది బేగం సాహేబా. కాసేపువుండి, ఆమెను వెంట రమ్మని అదే ఆవరణలో వున్న వొక పురాతన భవనంలోకి తీసుకు వెళ్ళింది. ఆ భవనం దాస దాసీ జనం రోజూ చూస్తున్న భవనమే. కాని ఆ భవనం ఎప్పుడూ తాళం వేసి వుంటుంది. ముందు సైనికుడొకడు నిరంతరం కాపలా కాస్తుంటాడు. అది ఎప్పుడూ తాళం వేసివుండటంవల్ల, దానిసంగతి ఎవ్వరూ పట్టించు

కోరు. ఆ భవనంలో ఏముందో తెలుసుకోవాలనే ఉత్సాహం కూడా అక్కడ పనిచేసేవాళ్ళకు ఎప్పుడో నశించింది.

చిన్న బేగంసాహేబా రావటంచూచి కాపలా కాస్తున్న సైనికుడు తొలిగి నిలబడ్డాడు. బేగంసాహేబా వొక పెద్ద తాళంచెవి తన చేతులోవున్న బంగారపు పెట్టెలో నుంచి తెరచి తలుపుతీసింది. వెనుకపాటున నుంచున్న దాసీని తనతోరమ్మని లోపలకు అడుగుపెట్టింది. ఆభవంతిలోవున్న వస్తువులను చూసేటప్పటికి ఆ దాసీదాని కండ్లు జిగేల్ మన్నాయి. అక్కడ బంగారం పూతతో ధగధగాయమానంగా మెరిసిపోతున్న రకరకాల దుస్తులున్నాయి. ఆ గదిలో ఎటుచూచినా దుస్తులే. ఆగది దుస్తులమయం అని చెప్పటంలో అతిశయోక్తి ఏమాత్రం లేదు. వాటిని చూడటంతో తన కండ్లను తానే నమ్మలేకుండా నుంచుని వున్న దాసీని చిన్న బేగంసాహేబా మరొకగదిలోకి తీసుకువెళ్లింది. ఆగదిలో ఎటుచూచినా నవరత్న ఖచితమైన కిరీటాలే వున్నాయి. ఆగది వెయ్యిమంది సూర్యులకాంతితో ప్రజ్వరిల్లుతున్నట్లు వున్నది. అక్కడనుంచీ దాసీని మరొకగదిలోకి తీసుకొని వెళ్ళింది. ఆగదిలో రత్నాలహారాలు అనేకం గోడలకు తగిలించిన బంగారు కొంకెలకు వేళ్ళాడుతున్నాయి. మధ్యన కెంపులతో చెక్కబడిన వొక వేదికా, దానిమీద మేలిమితో నిర్మించబడిన వొక గోడుగూ వుంది. ఆగోడకు అంచులనుండి పగడాలహారాలు వేళ్ళాడుతున్నాయి. ఇవన్నీ చూస్తున్న దాసీకి ఏ స్వర్గలోకంలోనో అడుగు పెట్టినట్లు

వుంది. ఆగదిలో ఇవికాక వరుసగా నాలుగు పెట్టెలు వున్నాయి. ఆ పెట్టెలను ఏ లోహంతో నిర్మించారోగాని, అవి పచ్చని కాంతి కిరణాలను విరజిమ్ముతున్నాయి. ఆ పెట్టెలను తెరిచి చూపించింది బేగంసాహేబా. వాటిలో వున్న వన్నీ ఆభరణాలే. వెలలేని రాళ్ళతో పొదగబడిన ఆభరణాలు. వీటన్నిటినీచూచి దాసీ అక్కడే మూర్ఛపోయిందనీ బయటకు తీసుకువచ్చి వొక గంటసేపు శైత్యోపచారాలు చేస్తేగాని కోలుకోలేదనీ ప్రజలు చెప్పుకుంటూ వుంటారు.

దాసీది కోలుకోగానే, "ఇప్పుడు నువ్వు చూసినవన్నీ నవాబుగారు సొంతంగా వాడుకోటానికి నిర్దేశించబడినవే," అన్నదట బేగంసాహేబా.

"మరి ఇందులో ఏవొక్కటీ వాడరేమమ్మా?" అని అడిగిందట దాసీది.

"వారికెందుకే ఇవన్నీ! వారు మామూలు మనిషిగా ఉండటానికే ఇచ్ఛగిస్తారు," అని సమాధానం చెప్పిందట బేగంసాహేబా.

నవాబుగారి నిరాడంబరతను గూర్చి చెప్పదలచిన వారు ఇటువంటి కథలు ఎన్నో చెపుతారు. 'వారు ఔరంగజేబు వలె మహాపురుషులు,' అంటారు.

"అయితే డబ్బు అంటే ఇంత వ్యసనం ఎందుకు? అధికారం అంటే ఈ వ్యామోహం ఎందుకు?" అని ఎవ్వరయినా అడిగితే దానికికూడా వారు సమాధానం చెప్పగలరు.

ఆయనకు అధికారం అంటే వ్యామోహం లేదనే వారి వాదం. "ఆయన నవాబుగా జన్మించాడు గనుక నవాబుగా వుంటున్నాడు. అంతేగాని అధికారం ఆయన కోరుకుంటే వొచ్చిందిగాదు. అందుకనే అధికారం చెలాయించాలని ఆయనకు వుండదు. రోజూ ఉదయం ఏడు గంటలనుంచి వొంటిగంట వరకూ వారు స్వయంగా సంస్థానం ఎకౌంట్లూ సొంత ఎకౌంట్లూ చూసుకుంటూ వుంటారు. అప్పుడుగాని భోజనానికి లేవరు. అంటే ఆవిధంగా పనిచేసి తన భోజనానికి అర్హతను సంపాదించుకుంటారన్న మాట. సరే, ఇక ఆయనకు వ్యక్తిగతంగా గానీ, సంస్థానాధిపతిగా గానీ రావలసిన డబ్బును నిక్కచ్చిగా వసూలు చేసుకుంటారంటే తప్పేది ఏముంది? అలా చెయ్యక, భగవంతుడు తనకు నిర్దేశించిన పనిని సక్రమంగా నిర్వర్తించక, అపచారం చెయ్యటం ఆయనకు ఇష్టంలేక చేస్తారు. ఈ ప్రపంచంలో ఎవ్వరి విధ్యుక్తధర్మం వారు నెరవేర్చవలసిందే గదా! అలా నెరవేర్చాలనే పట్టుదలకొద్దీ వారలా చేస్తారేగాని తనకేదో వొరగాలనికాదు, తన అధికారాన్ని ఆచరణలో పెట్టాలనీ కాదు. ఇక డబ్బు పట్ల ఆయనకు వ్యసనం వున్నదంటారా? అదీ వొట్టిమాటే. స్థూలదృష్టులకు అలా కనుపించవచ్చు. అసలు ఆయనకు డబ్బే అవుసరం లేదు. అందుకనే ఆయన డబ్బు ముట్టుకోరు కూడాను. వొచ్చింది వొచ్చినట్లుగా ఎక్కడో పడవేస్తారు. అది ఎక్కడవుందో, ఎంతవుందో కూడా ఆయనకు తెలియదు.

అది అలా పోగులుపడుతూ వుంటుంది. దానికి వారేం చేస్తారు? అలాపోగులు పడటానికికూడా తప్పక నిర్వర్తించవలసిన కొన్ని బాధ్యతలు లేకపోతే వారు వొప్పుకొని వుండే వారు కాదు. వారి మీద కొన్నివేల కుటుంబాలు ఆధారపడివున్నయి. ఎలాగూ సంస్థానాలు నిలువవు. పోతయి. అప్పుడు తనమీద ఆధారపడిన ఈ కుటుంబాలన్నీ ఏమయిపోవాలి? ఆ కుటుంబాలను దృష్టిలో పెట్టుకొని వారు డబ్బు పోగుపడటాన్ని చూచీ చూడనట్లు సహిస్తున్నారు. వారు అంత దూరదృష్టితో మెలగబట్టే ఇప్పుడు తనమీద ఆధారపడినవారికి వివాహాలుచేసి, వొక్కొక్కరికీ వొక్కొక్కయిల్లూ, ఇరవైవేల రూపాయీల ఆస్తీఇచ్చి, అందరికీ ఆధారం కలిగించగలిగారు. లేకపోతే వాళ్ళంతా ఈపాటికి నడివీధుల్లో తిరుగుతూ వుండేవారు," అంటారు.

"వారీపని టాక్సు తప్పించుకోటానికి చేశారు." అని ఎవ్వరన్నా అంటే, "వారికి టాక్సు అనేది వొకటి వుంటుందనే తెలియదు," అంటారు.

ఈ నవాబునిగురించి ఆమధ్య జవహర్‌లాల్ నెహ్రూ "ఈయన ప్రపంచంలోని ధనాఢ్యులలో వొకరని ప్రతీతి. కాని ఆయన చూడటానికి వొక ఫ్యాక్టరీమల్లే వుంటాడు," అని వ్రాశాడు.

ఈ విషయం నవాబుగారి అభిమానులకు తెలిసి ఏమన్నారనుకున్నారు? "నెహ్రూగారు అన్నమాటలు నవాబుగారు చదివారు. చదివి 'సరే, నేను నవాబునై వుండి

ఫకీరల్లే వుంటాను. వారు ఫకీరైవుండి నవాబుకుమల్లే వుం టారు. మా ఇద్దరిలో ఎవ్వరుగొప్ప?'' అని అడిగారు. ఎవ్వరుగొప్పో స్పష్టంగా కనుపిస్తూనేవుంటే ఇక మేం చెప్ప టం ఎందుకు అని నవ్వి వూరుకున్నాం,'' అన్నారు.

కింగ్ కోటీ రోడ ప్రక్కగా నడుస్తున్న నారాయణ రావు మస్తిష్కంలో ఇటువంటి విషయాలెన్నో పొరలి నయి. ప్రపంచంలో డబ్బు వొకమూల కుప్పలు పడుతూ వుంది. మరొకమూల ఆకలి అగడ్తలు పెరుగుతున్నయి. కొంతమందికి డబ్బు ఏం చేసుకోవాలో తెలియటం లేదు. కొంతమందికి ఆకలి ఎలా తీర్చుకోవాలో తెలియటం లేదు. ధనం కండ్లకు కనపడుతూనే వుంటుంది. కాని ఆకలితో చచ్చేవాళ్ళు దానిని తాకటానికి కూడా వీల్లేదు. కళ్లార్చ కుండా, నోరూర్చుకుంటూ అలా చావవలసిందే. అటు డబ్బుకి విలువూ, ఇటు మానవ శరీరానికి చీమలూ పడు తున్నయి. ఈ పరిస్థితి ఎప్పటికి చక్కబడుతుందో తెలియక పోగా, ఈ సమస్య ఎట్లా పరిష్కరించ బడుతుందో కూడా అర్థంకాలేదు నారాయణరావుకి. నిజానికి ఇది పెద్ద సమస్య కాదు. కాని స్వార్థపరులు పరిష్కరింపబడటానికి వీల్లేనంత బ్రహ్మాండమైన సమస్యగా దానిని తీర్చిదిద్ది కూర్చోబెట్టారు. ప్రతివాని మనస్సులోనూ అటువంటి భ్రమను కల్పించి అడ్డ పాపలను సృష్టించారు.

నారాయణరావు పరిస్థితుల ప్రభావంతో, భావాల బరువుతో క్రుంగిపోయి తల వంచుకొని నడుస్తున్నాడు.

రోడ్డుకి అవతలపక్క ఫుట్ పాత్ మీద నడుస్తున్న వ్యక్తి "ఏమండీ?" అని బిగ్గరగా పిలిచాడు.

నారాయణరావు తనని అనుకోకుండానే తల పైకెత్తి చూశాడు.

"ఏకమాట," అంటూ ఆవ్యక్తి రోడ్డుకి అడ్డంపడి పరుగెత్తుకు వస్తున్నాడు. అతను ఏ కృష్ణా గుంటూరు జిల్లాలనుంచో వచ్చిన ఆంధ్రుడని గ్రహించాడు నారాయణరావు. ఆంధ్రుడికి రోడ్డు ప్రక్కగా నడవటం ఇరకాటంలో పడినట్లు వుంటుంది. రోడ్డుకి అడ్డంగా నడవటం ఉల్లాసంగా వుంటుంది. అతనికి నెమ్మదిగా మాట్లాడితే పక్కలు బిగబడతై. పొలికేకవేస్తే ప్రాణానికి హాయిగా ఉంటుంది. అతనికి ఇంట్లోకూర్చొని ఏ సమస్యనయినా చర్చించటం ప్రాణాంతకం. నాలుగు బజార్లమధ్య నిలబడి ఆవేశంతో మాషించటం అమితోత్సాహం. అందుకని అతనికి తిన్నది అరుగుతుంది.

"మీది ఈవూరేనా?" అన్నాడావ్యక్తి నారాయణరావు దగ్గరకు వచ్చి.

"అవును," అన్నాడు నారాయణరావు.

"ఇది నైజాం ఇల్లే గదండీ?"

"అవును,"

"అతగాడికి వందలకు వందల పెళ్ళాలు వున్నారట, నిజమేనా?"

"అనే అనుకుంటారు."

"ఇంతమందిని ఏం చేసుకుంటాడండీ?"

ఈ ప్రశ్నకు నారాయణరావుకి సమాధానం దొరకలేదు.

"అడుగుతుంటే మాట్లాడరేం?" అన్నాడు ఆంధ్రుడు. ఏదో వొకటి చెప్పకపోతే ప్రశుతి మించుతుందేమోనని, "అది వాళ్ళ ఆచారం," అన్నాడు నారాయణరావు.

"ఆచారానికి మాత్రం అర్థం వుండక్కర్లేదా?"

"వుండాలి."

"మరిక్కడ లేదేం?"

"లేదు."

"ఆ పెళ్ళాల్లో చాలామంది ముఖాలే అతను చూచి వుండడనుకుంటాను."

"వుండకపోవచ్చు"

"వుండనప్పుడు అంతమంది పెళ్ళాలు దేనికి?" అని ఆవేశంతో అడిగాడు ఆంధ్రుడు.

"తప్పే."

"....అక్కడ వ్యభిచారం ఎక్కువగా వుంటుందనుకుంటాను?" అని, వొక్కక్షణం ఆలోచించి అడిగాడు.

"వుండవచ్చు"

"వుండవచ్చు అని నెమ్మదిగా అంటారేమిటండీ. వుండితీరుతుంది."

"నిజమే."

"చూట్టానికి లోపలకు వెళ్ళనిస్తారా?"

"ముందుగా పర్మిషన్ తెచ్చుకోవాలి."

"పర్మిషన్ తెచ్చుకొని లోపలకువెళ్తే వాళ్ళందరినీ చూడనిస్తారా?"

"ఎవరందర్నీ?"

"ఆ పెళ్ళాలను."

"వాళ్ళు జనానాల్లో వుంటారు. అక్కడకు పోతు టీగను కూడా చేరనివ్వరు?"

"ఇక అక్కడకు ఏం చూడటానికి వెళ్ళాలి? నిజాం నా? ఆ మొహాన్ని చూస్తూనే వున్నాంగా. ఆమధ్య నెహ్రూ హైదరాబాద్ వచ్చినప్పుడు ఆయన్ని ఆహ్వానించటానికి పెద్దలు చాలామంది విమానందగ్గరకు వెళ్ళారు. అందులో నైజామూ వున్నాడు. ఎట్లావున్నాడు. కోతికి మనిషి టోపీ తొడిగినట్లు వున్నాడు. ఛత్-ఆతనికి ఇంతమంది పెళ్ళాలు ఎందుకో!... వస్తానండీ," అని వెళ్ళిపోయాడు ఆంధ్రుడు.

అతను వెళ్ళినందుకు వొకవిధంగా సంతోషించాడు నారాయణరావు. ఇటీవల అతను ఏ రకమైన ఉత్సాహాన్ని తట్టుకోలేక పోతున్నాడు. ఉత్సాహవంతులను చూస్తే దిగులుగానే కాక, చీకాకుగా కూడా వుంటూవుంది.

అప్పటికే ఆలస్యం అయిందని జ్ఞాపకం వచ్చి చక చకా ముందుకు నడిచాడు.

అతను వెళ్ళేటప్పటికి భాస్కర్రావు ఆఫీసుగదిలో కూర్చొని వొక క్లయింటుతో మాట్లాడుతున్నాడు. ఆ క్లయింటు తెల్లటి పైజమా తొడుక్కొని సిల్కులాల్చి వేసుకొని వున్నాడు. రూపవంతుడు. ధనవంతుడుగా కూడా కనబడ్డాడు. గది ప్రవేశించగానే తాను విన్నమాటలను

బట్టి, వారు డైవోర్సును గురించి మాట్లాడు కుంటున్నారని గ్రహించాడు నారాయణరావు.

"రావోయ్ రా, కూర్చో," అన్నాడు భాస్కరరావు తన మాటలను మధ్యలోనే ఆపి.

"ఏదో పనిలో వున్నట్లున్నారు," అని నసిగాడు నారాయణరావు తాను అటువంటి సమయంలో వచ్చినందుకు క్షమాపణ చెప్పుకుంటున్నట్లు.

"పరవాలేదు," అన్నాడు భాస్కరరావు, అతను ఎందుకు వచ్చాడో ఊహించటానికి ప్రయత్నిస్తూ. ముళ్ళ మీద కూర్చున్నట్లు కూర్చున్నాడు నారాయణరావు. అక్కడ కూర్చోటానికి అతనికి బెరుకు అనిపించింది. 'ఛీ! ఎందుకు వచ్చినట్లు?'.

"ఇతని పేరు నారాయణరావండీ. గవర్నమెంటులో ఉద్యోగం చేస్తున్నాడు," అని ఆక్రొత్తమనిషికి పరిచయం చేశాడు భాస్కరరావు.

'గవర్నమెంట్‌లో ఉద్యోగం ఏమిటి నాముఖం? యు. డి. క్లార్క్' అనుకున్నాడు నారాయణరావు.

"ఈయనన్ని నువ్వు ఎరిగే వుంటావు" అని ఆ కొత్త మనిషిని పరిచయం చెయ్యటానికి మొదలు పెట్టాడు భాస్కర్రావు.

ఏమనాలో తోచక తేలముఖం వేసి ఆ కొత్త మనిషి వంకకు చూశాడు నారాయణరావు. "నా పేరు

భగవంతరావు. ఇక్కడ సినిమాలో పనిచేస్తున్నాను," అని తనను తాను పరిచయం చేసుకున్నాడు ఆ కొత్తమనిషి.

"పనిచెయ్యటం ఏమిటి? వొక సినిమాకంపెనీకి మేనేజింగ్ డైరెక్టరుగా ఉంటున్నారు. వొక చిత్రం తీస్తున్నారు" అన్నాడు భాస్కరరావు.

ఇద్దరూ వొకరి కొకరు నమస్కరించుకున్నారు.

నమస్కరిస్తూనే, 'ఇంకేం తన భార్యను డైవోర్సు చేసే నిమిత్తం సలహాకై ఒచ్చి వుంటాడు' అనుకున్నాడు నారాయణరావు.

భగవంతరావు చేతిలో వున్న 555 సిగరెట్ టిన్ను నారాయణరావుకి అందిస్తూ, "ఒక సిగిరెట్ తీసుకోండి," అన్నాడు.

"నేను తాగను. క్షమించాలి."

"అసలు ఎప్పుడూ తాగలేదా?" అని అడిగాడు భాస్కరరావు.

మాట్లాడటానికి ఇంకొక విషయం దొరక్క ఈ విషయం సాగదీస్తున్నాడని అర్థం చేసుకున్నాడు నారాయణరావు.

"ఒకప్పుడు తాగేవాణ్ణి, ఇప్పుడు మానివేశాను."

"అందుకే అడిగాను. నువ్వు సిగిరెట్ త్రాగుతుండగా చూసినట్లు గుర్తు. మానివేశా వన్న మాట."

"అవును".

"మంచిపని చేశావు," అని భగవంతరావు ఎక్కడ ఏమనుకొనిపోతాడోనని, "రాత్రింబగళ్లు పనిచేసే మీలాంటివాళ్ళకు తప్పదు" అన్నాడు.

భగవంతరావు నవ్వి వూరుకున్నాడు.

ఇక సంభాషణ సాగలేదు. అంతా ఇబ్బందిగానే కూర్చున్నారు. తాము ముఖ్యమైన సంగతులు మాట్లాడుకోవలసి వుండటంవల్ల నారాయణరావు వెళ్తే బాగుండుననివుంది మిగిలిన ఇద్దరికీ. కాని ఎలా చెప్పటం. వచ్చిం దగ్గర నుంచీ వెళ్ళాలనే వుంది నారాయణరావుకి. కాని ఎలా వెళ్ళటం?

ఏమీ మాట్లాడుకోకుండా అట్లా కూర్చోవటం వికృతంగా కనుపించింది అందరికీ. దీపపుసిమ్మెలు సభ చేసినట్లు వుంది.

"ఇవ్వాళ ఆఫీసు లేదా?" అని అడిగాడు భాస్కరరావు.

"వుంది.".

నారాయణరావుకి తప్పించుకోటానికి సందు దొరికింది. "ఇటుపక్క పని వుండి వొచ్చాను. పని చూచుకొని వెళ్తూ వెళ్తూ చూచి పోదామని వచ్చాను, మరి నేను వెళ్తాను," అని లేచాడు.

"కాసేపు కూర్చోగూడదా?"

"కాఫీ తాగి ఇటు బయలుదేరాను. ఇంటిదగ్గర పనులన్నీ అట్లాగే వున్నాయి. మళ్ళీ పదిగంటలకల్లా ఆఫీసుకు వెళ్లాలి. తీరికగా వున్నప్పుడు మళ్ళీ ఇంకొకసారి

వస్తాను” అని భగవంతరావుకి నమస్కారం పెట్టి బయట పడ్డాడు నారాయణరావు.

అతనికి అతనిమీాదే అసహ్యం వేసింది. తను అకారణంగా ఎన్ని అబద్ధాలాడాడు! ఇన్ని అబద్ధా లాడవలసిన ఖర్మ ఏమొచ్చింది? తను సహజంగా అబద్ధాలాడని స్వభావం కలవాడని ప్రతీతి. తన ఉద్దేశం కూడా అదే. ఉద్దేశమే కాదు, తనకు అబద్ధాలు చేతకాకపోబట్టీ, ముఖప్రీతి మాటలు చేత గాకపోబట్టి తను పైకి రాలేక పోయానని అతనికి అతను ఎన్నోసార్లు అనుకున్నాడు. పైకి వచ్చేవారందరూ ఆవిద్యల్లో నేర్పు వున్నవాళ్ళే నని కూడా అతను అనేకసార్లు అనుకున్నాడు. రోజుకి కనీసం నలుగురైదుగురు దగ్గరయినా అతను నైతికవిలువల ప్రాశస్త్యాన్ని వెలువరిస్తూ వుంటాడు. ఇతరులు కూడా అతను కొన్ని నియమాలకు లోనై జీవయాత్ర గడుపుతున్న మనిషనే అనుకుంటారు. తీరా చూస్తే ఇది. కొంతమంది ఏదో లాభాన్ని ఆశించి అబద్ధాలాడతారు. తాను అది కూడా కాదే. “కొంచం పనివుండి వచ్చాను. నీవేదో తొందర్లో వున్నట్లు వున్నావు. మళ్ళీ వస్తాను.” అంటే సరిపోక పోయిందా? కాని తను అలా అనలేదు. ఒకదానినుంచి ఒకటి అనేక అబద్ధాలు ఆడాడు. తనతో అట్లా అబద్ధాలు ఆడించిన శక్తి ఏది? ‘అహం’ అనుకున్నాడు నారాయణరావు.

ఇతరులు ఎవ్వరో వున్నారని తను డబ్బు ఎందు కడగ లేకపోయాడు?

'అహం'

పని వుండి వచ్చి వూరికినే చూచిపోవటానికి వచ్చానని ఎందుకు చెప్పాడు?

'అహం'.

డబ్బు వేటకు వెళ్తూ ఇంటికి వెళ్తున్నానని ఎందుకు చెప్పాడు?

'అహం'

అన్ని అరిష్టాలకూ ఈ 'అహమే' మూలకందమని పెద్దలు చెపుతారు. ఈ 'అహాన్ని' చంపుకున్నవాడు మహర్షి అవుతాడు. అతనికి భగవద్దర్శనం అవుతుంది. అతనికి కావలసిందేమీ ఉండదు.?

వున్నదంతా ఆ పరబ్రహ్మమే అయినప్పుడు ఈ 'అహం' ఎక్కడనుంచి వచ్చింది? అది కూడా పరబ్రహ్మ తత్వంలోనే వుండి వుండాలి. అటువంటప్పుడు దానిని నిరసించటం ఎందుకు? అలా నిరసించటం పరబ్రహ్మ తత్వంలోని వొక ముఖ్యాంశాన్ని నిరసించటమే అవుతుంది.

ఇక 'అహం' పరబ్రహ్మంలోనే వున్నప్పుడు, ది చేయించే పనులన్నీ పరబ్రహ్మ యొక్క చైదాలే అయి వుండాలి. అంటే సత్యం అసత్యం రెండూ ఆ పరబ్రహ్మంలోవే అయి వుండాలి. మరి అసత్యాన్ని ఏవగించుకొని సత్యాన్ని హర్షించటం ఎందుకు?

ఈ ప్రశ్న నారాయణరావుని చాలా రోజులనుంచీ వేధిస్తూ వుంది. అతను పైకి అబద్ధాలాడేవారిని విమ

ర్శిస్తూ వుంటాడు గాని, లోలోపల అసత్యంమీద అతనికి ఏమాత్రం ఏవగింపూ లేదు. అతను మాట్లాడే మాటలను అది మనస్సులో కూర్చొని వెక్కిరిస్తూనే వుంటుంది. అప్పు డప్పుడూ ఆ వెక్కిరింపు అతనికి ఇష్టంగా వుంటుంది కూడాను. "సత్యం ఎంత నిజమో నేనూ అంతే నిజం. నేను తప్ప ఇంకొకటి లేదు అనే అహం నాకు లేదు. అది సత్యానికి వుంది. అహంకారజనితమైన దానిని నమ్ముకుంటే ఎవ్వరూ బాగుపడరు. అది చాదస్తులను సృష్టిస్తుంది. మనస్సుని సంకుచిత పరుస్తుంది. మనిషిని గడ్డకట్టిసుంది. మేమిద్దరమూ వున్నాం. అందుకని మానవుడు తెలివి తేటలతో మా ఇద్దరినీ వాడుకోగలిగినప్పుడే పురోగమనాన్ని సాధించగలుగుతాడు. నువ్వు వ్యాపారస్తులను చూడ లేదా? రాజకీయ నాయకులను చూడలేదా! సంఘంలో పెద్దమనుష్యులుగా పూజింపబడేవారిని చూడలేదా? వారంతా హాయిగా కాలం గడుపుతున్నారు. ఎందు వల్ల? ఈ రహస్యం తెలుసుకోవటం వల్లే. అవసరం వొచ్చినప్పుడల్లా నన్ను వాడుకోగలగటం వల్లే. ఈచారి త్రక సత్యాన్ని గమనించలేనివాడు జీవించీ మృతుడే అవుతున్నాడు." అనేది.

నారాయణరావుది విని వూరుకునే స్వభావం కాదు. "నేను ఒప్పుకోను." అనేవాడు.

"ఎందుకని?"

"మహర్షుల మాటేమిటి?"

అసత్యం బిగ్గరగా నవ్వేది. "నీలాంటి అసంతృప్తులూ, నిరాశావాదులూ అనుకోవటం తప్ప వారు బావుకున్నదేముంది? వారి మాధ్యాన్ని జీవితం నిరసించింది. జీవితం వారిని రోసింది. వారు ఎందుకూ పనికిరాక మహర్షులయ్యారు. వారేదో బావుకు తింటున్నారని నీవు అనుకుంటున్నావు. అది వొట్టిమాట. తను పనికిరానితనాన్ని కప్పి పుచ్చుకోటానికి వారొక సిద్ధాంతం అల్లారు. ఆసిద్ధాంతంఎవ్వరికి నచ్చుతుంది? జీవించటం చేతగాని వారికి నచ్చుతుంది. బహు భంగుల జీవితం అనుభవించటం చేతనైనవారికి ఆ గొడవ ఎందుకు? అసమర్థులను మాత్రమే ఆ సిద్ధాంతం ఆకర్షిస్తుంది. మానవులు అసమర్థులు కావాలని కోరుకోవటం మంచిపని అని ఎవ్వరు అనగలుగుతారు?" అనేది.

"అయితే అబద్ధాలూ సబద్ధాలూ ఆడుకుంటూ పోవటమేనా జీవితలక్ష్యం?"

"ఆ మాట నేను అనను. మా ఇద్దరినీ మించిన స్థాయి వొకటివుంది. కాని ఆస్థాయికి మానవుడు జేరటానికి మా ఇద్దరినీ సవ్యంగా వినియోగించుకోవటమే మార్గం. అప్పటివరకూ మేమిద్దరం ఉంటాము. నేను లేకుండా సత్యం వుండదు. సత్యం లేకుండా నేను వుండద్దు" అనేది.

అది చెపుతుంటే దాని మాటల్లోనూ వొక పద్ధతి వుందనిపించేది నారాయణరావుకి. జీవితంలోని ఏదో ఒక అంశాన్ని తోసిపుచ్చినవాడికంటే, అన్ని అంశలనూ అనుభవంలోకి తెచ్చుకున్నవాడే సుఖపడుతున్నాడు. అతని ముఖం ఎప్పుడూ ఆనందంతో తొణికిసలాడుతూ

వుంటుంది. ఆ ఆనందాన్ని చేరలేనివాళ్లు అనేకం
మాట్లాడుతారు. కాని ఏం మాట్లాడి ఏం ప్రయోజనం,
వాళ్ళ మనోవేదనకు వాళ్ళ ముఖాలే నిదర్శనంగా పీకు
పోయి వుంటై.

నిజానికి ఈ ప్రపంచంలో ఎవ్వరి స్వభావానికి
అనుకూలంగా వారు సిద్ధాంతాలను సృష్టించుకొని తదను
గుణంగా మాట్లాడుతున్నారే తప్ప వేరొక నిజం లేదు.

ఈ అభిప్రాయం కలిగినప్పుడు తన సంగతి పరి
లించుకున్నాడు నారాయణరావు. ఇప్పు డెవ్వరయినా
వచ్చి లక్షరూపాయీలు ఇస్తానంటే తాను కాదంటాడా
తనూ మొదటినుంచీ ఏ వ్యాపారమో చేసి డబ్బు పుష్క
లంగా గడిస్తే ఈ విధంగా వుండేవాడా? అం
దూరం కూడా పోనక్కరలేదు. తన ఉద్యోగంలో గబగ
ప్రమోషన్లు వచ్చినా తన స్వభావం ఈ విధం
వుండేదికాదు. అందుకు సరిపోయేటట్టు మారి కూర్చునే
దానికి అనుకూలంగా తాను మాట్లాడుతూ వుండేవా
ఒకసిద్ధాంతాన్ని అల్లి తన తాహతునిబట్టి ప్రచారం చేస్తూ
డేవాడు.

అలా జరగలేదు. జరగనప్పుడు బ్రతుకుకు ఏ
ఒక ఆధారం వుండాలిగదా! తనకు అనుకూలమైన ఆధా
తాను ఏర్పరచుకున్నాడు. ప్రపంచం చెడిపోయింది.
నియమాలు నశించినై. అందువల్ల మంచివాళ్ళు వెనక
తున్నారు. తాను వెనుకపడ్డాడు. గనుక మంచివా

వుండాలి. ఇది వెనుక పడటం అని మాత్రం ఎందుకు అనుకోవాలి? ముందుకు జరగటమే అయి ఉండాలి. డబ్బు దేముంది? అదొక వ్యసనం. అదొక శృంఖలం అందుకనే. ఏసుక్రీస్తు, 'ధనవంతుడు స్వర్గాన్ని చేరటం లొట్టిపిట్ట సూది బెజ్జంలో దూరగలగటం అంత అసంభవం' అన్నాడు. డబ్బు వ్యసనమయితే, భోగాలు ములుకులైతే, ఇంద్రియాలు గుర్రాలైతే, మనస్సొక ముళ్ళ కిరీటమైతే ఇక జీవితానికి ఆదర్శం ఏమిటి ? విముక్తి. వీటన్నిటినుంచీ విముక్తి. అలా నడచినై అతని ఆలోచనలు. 'సత్యం' మీంద మోజు అట్లా పెరిగింది అతనికి.

అనుకుంటాం గాని నిజానికి సత్యం మాట్లాడుతూ కూర్చుంటే జీవితం నడుస్తుందా ? వొక్క క్షణం నడవదు. మనిషికి మనిషికి పొత్తే కుదరదు. అబద్ధం అనేది వొకటి ఆసరాగా దొరకబట్టి ప్రపంచం ఇంకా నడుస్తూ వుంది. ఆ ఆసరా పోయినప్పుడు వొక్కసారి భగ్గుమంటుంది.

ఇటువంటి ఆలోచనలకు లోనై, షణ్ముగం హోటలు వైపు నడుస్తున్న నారాయణరావు అబద్ధం చెప్పిందాంట్లో సత్యం లేకపోలేదు అనుకున్నాడు. వెంటనే అబద్ధం మాటలను కూడ తన కొలబద్దతోనే కొలుస్తున్నానని జ్ఞాపకం వచ్చి విసుక్కున్నాడు. తనకు వుండే విలువ తనకు వుందని అబద్ధం చెపుతూవుంటే 'ఆ సంగతీ నిజమే' అని తను అనుకోవడంలో అర్థం ఏముంది ? అది అబద్ధానికి అన్యాయం చెయ్యటమేగా !

"ఏమిటో గొడవ!" అనుకున్నాడు నారాయణరావు. ఇటువంటి ఆలోచనలన్నీ ఎవ్వరికీ రావ్. తనకే ఎందుకు వస్తాయో! అందరికీ వస్తవేమో? ఎవ్వరి ఆలోచనలను వారు మూసిపెట్టుకుంటూ వుంటే ఎలా తెలుస్తుంది. తన సంగతి ఎంతమందికి తెలుసు?

"సరే, ప్రస్తుతం ఈ అప్పు సంగతి తేల్చుకుంటాను," అని వొక నిశ్చయానికి వొచ్చాడు నారాయణరావు.

అతను హోటలుకి వెళ్లేటప్పటికి షణ్ముగం లేడు. మంత్రిగారితో పనివుండి ఉదయమే వెళ్లాడనీ, త్వరలోనే రావచ్చనీ కౌంటర్ దగ్గర కూర్చున్న అతని బావమరిది చెప్పాడు. వ్యాపారం చేసే ప్రతివాడికీ వొక బావమరిది వుంటాడు. డబ్బు పెత్తనం చేస్తూ బావగారు ఎక్కడికి వెళ్ళిందీ చెపుతుంటాడు. బావమరుదుల మీద సద్భావం లేని నారాయణరావుకి, షణ్ముగం బావమరిది చెప్పిన మాటకు కోపం వచ్చింది.

"నీ చెల్లెలు పరంగానే గదా నీకీ అధికారం వచ్చింది. నీ సొంత తెలివితేటలవల్ల కాదుగదా?" అందా మనుకున్నాడు. ఏమని ఏం ప్రయోజనం? ఎంతమంది నని అనగలడు.? మెదలకుండా వూరుకొని వొచ్చినదారిని ఇంటికి వెళ్లటమేనా ఇక తాను చెయ్యదగ్గపని? అనే మీమాంసలో పడ్డాడు.

ఎవరో పిలిచారు?

ఎవరు?

ఆ వ్యక్తి అప్పుడే భోజనం చేసి త్రేనుస్తూ పై అంత

స్థులో వున్న తన గదిలోకి వెళ్తున్నాడు. మెట్లదగ్గర ఆగి పిలిచాడు.

"బాగా వున్నావటోయ్ నారాయణరావు ?"

ఎవరా వ్యక్తి ? ఎక్కడో చూచినట్లువుంది.

"అట్లా చూస్తావేమిటోయ్ ? గుర్తు పట్టలేదా ఏమిటి ? నేను చలమయ్యానోయ్" అంటూ దగ్గరకు వచ్చాడు.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది నారాయణరావుకి. చలమయ్య తన ప్రక్క గ్రామవాసుడు. వీధి బళ్లో ఇద్దరూ కలిసి చదివారు. ఇద్దరూ కలిసి బడి ఎగ్గొట్టాకు జీవితంలో పెద్దవాళ్లయిన పిదప వొకటి రెండు సార్లు తారసిల్లారు ?"

"ఎప్పుడొచ్చావు చలమయ్యా ?"

"నేను వచ్చి దగ్గర దగ్గర నెలరోజులైంది"

"అంతా బాగున్నారా ?"

"ఆహా !"

"ఏమిటి పనిమీద వచ్చావు"

"ఎసెంబ్లీ మీటింగు జరగబోతూవుందిగదా, ఆ పని మీద వొచ్చాను," అని నారాయణరావు ముఖం పరిశీలనగా చూచి, "నీకు తెలియదా ?" అని అడిగాడు.

"ఏమిటి ?"

"నేను ఇప్పుడు యం. యల్. ఏ ను. పోయిన ఎలెక్షన్లలో నేనే గెలిచాను. గెలవటం అంటే గెలవటమా ? నా ప్రత్యర్థి కంటేపదివేల వోట్లు ఎక్కువ వచ్చాయి. రిజల్ట్సు

చూచి గొప్ప గొప్ప వాళ్ళే మూర్ఛపోయారు," అన్నాడు.

నారాయణరావుకి ఆశ్చర్యమే వేసింది. చిన్నప్పుడు చలమయ్యా దగ్గర ప్రజా నాయకుడయ్యే లక్షణాలు ఏమీ వుండేవికాదు. కొన్ని సంవత్సరాల క్రిందట ఏదో పనిమీద తనను బ్రతిమాలి ఆ పని చేయించుకుకు వెళ్ళినప్పుడు కూడా అతను ప్రజా నాయకుడవుతాడని అతను ఊహించలేదు కూడా. 'ప్రజాస్వామికం వచ్చింతరువాత అనేక విచిత్రాలు జరుగుతున్నాయి. అందులో ఇది వొకటై వుండనోపు.'

"నిన్ను చూచి చాలా రోజులైంది. అప్పుడప్పుడూ నిన్ను కలుద్దామని అనుకునేవాణ్ణి. అది జరగనేలేదు. నా గదిలోకి వెళ్దాం రా, కాసేపు కూర్చొని వెల్దువుగాని' అని నారాయణరావుని పైకి తీసుకువెళ్లాడు చలమయ్యా.

అది గది, పెద్ద హాలులాగుంది. నాలుగు మంచాలు న్నాయి. అప్పటికప్పుడే భోజనాలు చేసి ఇద్దరు రెండు మంచాల మీద గుర్రుపెడుతూ పడుకొని వున్నారు. ఒకతను తెలుగు పత్రిక చేత్తో పట్టుకొని బిగ్గరగా చదువుతున్నాడు. వొక ముసలి రైతూ, అతని పద్దెనిమిది సంవత్సరాల కుమారుడూ కాస్త దూరంగా కూర్చొని వున్నారు.

చలమయ్యా గదిలోకి రావటం చూచి ఆ ముసలి రైతు మర్యాదగా లేచి నిలబడ్డాడు.

"ఇప్పుడే విద్యాశాఖ డైరెక్టరుతో మాట్లాడి వస్తున్నా శోభనాద్రీ. ఈ సారి ఖాళీ రాగానే నీ కుర్రవాడికి తప్పకుండా అవకాశం ఇస్తానన్నాడు,"అన్నాడు చలమయ్యా.

"పోయినసారి మనం వొచ్చినప్పుడు కూడా అట్లాగే

అన్నారు చలమయ్యగారూ. ఈ లోగా మా కుర్రవాడితో ప్యాసయినవారికి ముగ్గురికి ఉద్యోగాలు వేశారట. వాళ్లందరికీ మా వాడి కంటే తక్కువ మార్కులే వచ్చినయ్యట."

"ఆ సంగతి నేను గట్టిగానే అడిగాను శోభనాద్రీ. ఊరుకోలేదు. ఎవ్వరో పెద్ద పెద్దవాళ్ళు ఆ కుర్రవాళ్ళను రికమెండ్ చెయ్యటంవల్ల వాళ్ళకు ఇవ్వక తప్పలేదు అన్నాడు. ఈ సారి తప్పకుండా ఇస్తానన్నాడు."

"ఈ సారి మాత్రం ఎవరో వొక పెద్దమనిషి మరొకళ్లని సిఫారసు చెయ్యరని ఎక్కడుంది చలమయ్యగారూ? ఈ దేశంలో పెద్ద మనుష్యులు తక్కువ ఉన్నారు గనకనా. ఇటీవల ఎక్కడ చూస్తే అక్కడే వుంటూ వుండిరి. ఏ పెద్ద మనిషి సిఫారసుచేస్తే మాత్రం మార్కులు ఎక్కువ వచ్చిన వాణ్ణి వొదిలి, తక్కువ వచ్చిన వాళ్ళకి ఎట్లా ఉద్యోగం ఇచ్చారో! ఇంతకంటే అన్యాయం ఏమన్నా ఉంటుందా? న్యాయం జరపటానికి పుట్టిన ప్రభుత్వమే ఇట్లా చేస్తుంటే, మా బోటి వాళ్ళు ఇక ఎవ్వరితో మొరపెట్టుకోవాలి చలమయ్యగారూ? మీకు చేతనయింది చెయ్యండి. ఇక నేను మాత్రం ఈ హైదరాబాద్ రాను." అన్నాడు శోభనాద్రి.

"అంత విసుగు పడితే ఎట్లా శోభనాద్రీ? దేనికైనా కొంత వోర్పు వుండాలి. ప్రభుత్వం పని కావాలంటే మనం కోరినప్పుడు అవుతుందా? దానికి వుండే ఇబ్బందులు దానికి వుంటై."

"దానికి వుండే ఇబ్బందులు చదువు రాని నాబోటి వాడికి ఏం తెలుస్తయి చలమయ్యగారూ? మా వాడు

మూడేళ్ల క్రిందట యం. ఏ. ప్యాసయ్యాడు. అప్పటి నుంచీ ఏదో వొక ఉద్యోగంకోసం తిరుగుతూనే వున్నా. ఎక్కడికి వెళ్ళినా ఏదో వొక వంక చెప్పటం తప్ప ఉద్యోగం ఇచ్చిన వాడే లేకపోయె. ఉద్యోగాలు లేవా అంటే కోకొల్లలుగా కనపడుతూనే వుండె. వస్తున్నాయి. నిండుతున్నాయి. ఎక్కడికి వెళ్ళినా ఈ సిఫారసు అనేది వొకటి ఎదురు పడతా వుంది. ఇది ప్రభుత్వం కన్నా గొప్ప పలుకుబడి కలదల్లే వుంది."

"దానికి వారినేం చెయ్యమంటావ్ శోభనాద్రీ. వారి శాయ శక్తులా వారు ప్రయత్నిస్తూనే వున్నారు గదా!" అన్నాడు పత్రిక చదువుకుంటున్నాయన.

"నేను ఎవర్నీ ఏమీ అనటం లేదు బాబూ. నా ఖర్మను నిందించు కుంటున్నాను. అంతే."

"నా ప్రయత్నంలో నేనేమీ లోటు చెయ్యటం లేదు శోభనాద్రీ. ఇంతకు ముందే వీరితో కూడా చెపుతున్నా. వీరిని ఎరుగుదువో లేదో, ఛీఫ్ సెక్రటేరియెట్‌లో పని చేస్తున్నారు."

శోభనాద్రి నారాయణరావును నఖ శిఖ పర్యంతం పరీక్షగా చూచి, "తమరి పేరేమిటి బాబూ?" అని అడిగాడు.

ఇటువంటి సంభాషణలు ఇటీవల చాలా వింటున్న నారాయణరావు యాదాలాపంగా తన పేరు చెప్పాడు.

"తమరి ఉద్యోగం"

"యు. డి. క్లార్కుగా వుంటున్నాను."

"ఉద్యోగం ఏదయితే ఏం? మంచి పలుకుబడి గలిగిన ఆయన. ఆయన ఫైలు మీద నోటు పెడితే దానికి

తిరుగు వుండదు. ఎంత పెద్ద సెక్రటరీ అయినా సరే నాలిక కొరుక్కొని నోట్లో వేలు వేసుకోవలసిందే," అన్నాడు చలమయ్య.

చలమయ్య ఎందుకు అలా అంటున్నదీ తెలుసుకోవటం నారాయణరావుకి కష్టమైన విషయం కాదు.

"తమరు ఎక్కడ వుంటున్నారు ?" అని అడిగాడు శోభనాద్రి నారాయణరావుని ఉద్దేశించి.

-అతను తన ఎడ్రెస్ చెప్పాడు.

"సరే వొస్తా బాబూ. వెళ్ళేలోగా మళ్ళీ కనుపిస్తాను," అని కొడుకుని తీసుకొని వెళ్ళిపోయాడు శోభనాద్రి.

"చూశావా నారాయణరావు, ఇట్లా వున్నాయి మా బ్రతుకులు ! ఏదో ఎం. ఎల్. ఏ లమని పేరే తప్ప, ప్రతివాడూ మమ్మల్ని బెదిరించేవాడే ! ఆ పని చేసిపెట్టమనీ, ఈ పని చేసిపెట్టమనీ రోజుకి పది మంది అన్నా ఇంటికి వస్తారు. వారి పనులన్నీ హైదరాబాద్‌లోనే. అలాగే చేసి పెడతానంటే నమ్మరు. వెంట వస్తారు. వాళ్ళందరికీ రైలు ఛార్జీలు నేనే పెట్టుకోవాలి. లేకపోతే వాళ్ళకు కోపం వచ్చి ఏదో వొక అభాండం నెత్తిన వేస్తారు. ఎలెక్షన్‌కి అయిన ఏభై వేలు కాక ఇదొక నిత్య వైద్యంగా వెంటపడుతూవుంది. ఎం. ఎల్. ఏ బ్రతుకు చేతి చమురు భాగోతంగా తయారైంది అనుకో," అన్నాడు.

అతని మాటలన్నీ వింటూ కూర్చున్నాడు నారాయణరావు.

శోభనాద్రి మాట్లాడిన తీరులో కొడుక్కి ఉద్యో

గం రాలేదనేదే కాక, ఇంకేదో బాధ అతనికి విసిపించింది. తన కొడుక్కి ఉద్యోగం యిప్పించవలసిన నైతిక బాధ్యత చలమయ్యగారి మీద వున్నంత నిష్ఠురంగా అతను మాట్లా డాడు. కనుక దీని వెనుక ఏదో వుండి వుంటుందనుకున్నాడు. నారాయణరావు ఈ అనుమానంలో పడ్డ అతనికి చలమయ్య గారి మాటలు చెవికి ఎక్కలేదు.

పైగా అతని మనస్సు షణ్ముగం రాకమీద వుంది. షణ్ముగంతో మాట్లాడి ఆఫీసుకు వెళ్లవలసివుంది. అప్పటికే ఆలస్యం అయింది. లేటుగా వస్తానని కూడా అతను అప్లి కేషన్ పెట్టుకోలేదు. చెడు మాట అనటానికి కాటి కాడి నక్కల్లే కాచుకు కూచుంటాడు సూపరింటెండెంట్.

"ఏమిటి సంగతులు ?" అని అడిగాడు చలమయ్య.

"ఏమున్నయ్,"

"కాఫీ తెప్పించమంటావా ?"

"వొద్దు. యింటికి వెళ్లి భోజనం చేసి ఆఫీసుకు వెళ్లాలి."

"అలా వీల్లేదు, కాఫీ తాగవలసిందే!" అని మూడు కప్పుల కాఫీకి ఆర్డర్ చేశాడు. కాఫీ తేవటానికి వచ్చిన కుర్రవాడితో, "వొచ్చేటప్పుడు మీ ప్రొప్రయిటరుగారు వొచ్చారేమో కనుక్కొని రా" అని చెప్పాడు నారాయణ రావు.

ఆ కుర్రవాడు వెళ్ళగానే పత్రిక చదువుకుంటున్న ఆయన,"నా పని ఏం చేశారు!"అని అడిగాడు చలమయ్యని.

"ప్రొద్దున్న లేచిందగ్గరనుంచి నీ పనిమీదే

వున్నాను. మంత్రిగారి ఇంటికి వెళ్ళి మాట్లాడి వచ్చాను కూడా. పాపం ఆయన 'చలమయ్యా, ఈ పనికినువ్వు ఇంత దూరం రావాలా, కాకితో కబురు పంపితే చెయ్యక పోయానా' అన్నారు. ఆ టెండరు తప్పకుండా నీకు వస్తుంది"

"వూళ్లో చాలా పుకార్లుగా ఉన్నాయండీ ?"

"ఏమిటవి ?"

"కొంతమంది మినిస్టర్లు ఆ టెండరు మనతో పాటు పెట్టిన ఆ రెండో అతనికి ఇప్పిద్దామని ప్రబల ప్రయత్నం చేస్తున్నారట."

"పోర్టు ఫోలియో మన మినిస్టరుదైతే వాళ్ళేం చేస్తారోయ్? చదవేస్తే వున్నమతి కూడా పోయిందని అట్లా మాట్లాడుతావేం ?"

"అంత తేలిగ్గా లేదండీ? ఆ మినిస్టరు ఈ టెండరు విషయం ఛీఫ్ మినిస్టరు దగ్గరకు డెప్యుటేషన్ వెళ్ళారట! ఆయనేమో ఫైలు తన దగ్గరకు తెప్పించుకొని ఫైనల్ ఆర్డర్సు తనే వేస్తానన్నాడుట"

"నువ్వేమీ ఇటువంటి మాటలు నమ్మకు. ఆ సంగతులన్నీ నేను చూసుకుంటాలే" అన్నాడు చలమయ్య. అని నారాయణరావు వైపు చూపులుత్రిప్పి, "ఈ వూళ్ళో సంధ్యారాణి అని వొకామె వుందట. ఆమెకు ప్రభుత్వంలో ఏపని కావాలన్నా చేసిపెట్టే సమర్థత వుందట. ఆమెను నీవు ఎరుగుదువా?" అని అడిగాడు.

వెంటనే వొకప్పుడు గోపీకృష్ణ ఇక్కడకు వచ్చి

నప్పుడు సంధ్యారాణి అతనితో మాట్లాడుతూ వుండగా తాను చూసిన సంగతి జ్ఞాపకం వచ్చింది! 'నేను ఎరుగను గాని నా బావమరది గోపీకృష్ణ ఆమెను బాగా ఎరుగును' అని చెపుదాం అనుకున్నాడు. కాని ఆమాత్రం సందిస్తే చలమయ్య తనను వొదలడనీ,కనీసం గోపీకృష్ణకు ఒకవుత్తరం ముక్కయినా రాయిస్తాడనీ భయపడి, "నేను ఎరగను" అన్నాడు. (అంటున్నప్పుడే తాను అబద్ధం ఆడుతున్నాననే గమనం అతనికి వుంది. అలా అబద్ధం ఆడటం అనవసరం అనే విషయంకూడా అతనికి తెలుస్తూనేవుంది. అయినా నోటివెంట అవ్వాయి చువ్వాకు మల్లే వెలువడుతున్న ఆ అబద్ధాన్ని ఆపలేకపోయాడు. ఆపాలనే సంకల్పం కూడా అతనికి కలగలేదని చెప్పవచ్చు.)

ఒకవేళ తెలిసివుంటే మాత్రం "ప్రభుత్వం రహస్యాలు మాకు చెపుతావటలే," అన్నాడు చలమయ్య నిష్ఠురంగా.

అంతలో కుర్రవాడు కాఫీలు తెచ్చాడు. ప్రొప్రయిటరు కౌంటర్ దగ్గర వున్నారని నారాయణరావుకి చెప్పాడు. కాఫీ తాగి చలమయ్యదగ్గర సెలవు తీసుకొని, షణ్ముగంతో మాట్లాడటానికి బయలుదేరాడు నారాయణరావు.

"ఎప్పుడైనావచ్చి నిన్ను ఆఫీసులో చూస్తానోయ్," అన్నాడు చలమయ్య.

"అలాగే."

నారాయణరావు క్రిందకుదిగి సరాసరి కౌంటర్ దగ్గరకు వెళ్ళాడు. అతను ఇటూ అటూ చూడలేదు. తెలిసిన

వాళ్ళుంచే బెడుస్తుందేమోనని అతని భయం. ఎవ్వరునాా కళ్ళుమూసుకొని వచ్చినపని షణ్ముగానికి చెపుదామనే సంక ల్పంలో వున్నాడు. ఏదో మాటల్లోపడితే డబ్బు సంగతి అడగటం కష్టం అవుతుందని అతను అనుభవం మీద తెలుసుకున్నాడు. అందుకని అడగటం అడగటమే అసలు సంగతి అడిగివేద్దా మనుకున్నాడు

"నీతో పనివుండి వచ్చానోయ్."

వొక కస్టమర్ కి వంద రూపాయిాల చిల్లర ఇచ్చి పంపుతున్న షణ్ముగం ఉలిక్కిపడి అతన్ని చూశాడు. "నువ్వా? ఎవ్వరో అనుకున్నా, ఆపని ఏమిటో చెప్పు. తప్ప కుండా చేసిపెడతాను" అన్నాడు, బహుశా ఏ రికమెండే షనో అయి వుంటుందనే వుద్దేశంతో. వెంటనే ఎందుకైనా మంచిదని "నేను చెయ్యగలిగిందయితే" అని కలిపాడు.

వ్యాపారంలో వేలుపెట్టిన ప్రతివానికీ వుండే జాగ్రత్త అది.

నారాయణరావు అవకాశం దొరకనే దొరికిందని, "నాకు వొక వంద రూపాయిాలు బదులు కావాలి. వొక వారం రోజుల్లో సర్దుతాను." (వారం రోజుల్లో సర్దటం సంభవం కాదని అతనికి తెలుసు. అయినా అనేశాడు.)

"అయ్యయ్యో! ఇవాళే అడిగావు? నిన్న అడిగితే వొక వందేమిటి? ఎన్ని వందలైనా ఇచ్చేవాణ్ణి. ఇంతకు ముందే భాగస్వాములం అందరం కలిసి వొక నిర్ణయానికి వొచ్చాం. నేను అడిగిన వాళ్ళకల్లా అప్పులు పెడుతున్నా నని మిగిలిన భాగస్వాములందరూ కలిసి, ఈ సంస్థ డబ్బు

ఎవ్వరూ వొక్క చిల్లిగవ్వ ముట్టుకోగూడదని కట్టడి చేశారు. నేను అంటూనేవున్నా. దీనివల్ల చాలా ఇబ్బంది పడవలసి వస్తుందని. 'ఎవ్వరో ప్రాణంమీదకు వచ్చి అడుగుతారు. లేదనటం ధర్మమా?' అని ఎన్నో మాటలు చెప్పాను. కాని వాళ్ళు నామాటలు వింటేనా? మొండి పట్టు పట్టుకు కూచున్నారు. ఆ 'కట్టడికి లోబడకపోతే అసలు సంస్థనే మూసివేద్దాం' అన్నారు. నా కోసం బంగారపు గ్రుడ్లు పెడుతున్న ఈ బాతును నాశనం చెయ్యటం ఎందుకని నేను వొప్పుకున్నా. నా డబ్బంతా ఇందులోనే వుంది. సొంతానికి వొక దమ్మిడీకూడా లేదు?" అని దూరంగా కూర్చున్న వొక పార్ట్నర్ని పిలిచి, "చూశారా, ఎంతపని జరిగిందో! ఇతను నా ప్రాణస్నేహితుడు. ప్రాణాల మీదకు వచ్చింది. వారం రోజుల్లో తెచ్చి ఇస్తాను వొక వంద రూపాయిలువుంటే ఇమ్మంటున్నాడు. ఎంత ఇబ్బందో వుంటేగాని అడిగేమనిషి కాదు. పొద్దున్న ఇటువంటి చిక్కులువస్తాయి అని చెపితే విన్నారా? కౌంటర్లోది వొక్కదమ్మిడీ బయటకు తియ్యటానికి వీల్లేదంటిరి. ఇప్పుడు ఏం చెయ్యమంటావు నన్ను?"

"ఏమన్నా చేసుకో. మనం చేసుకున్న నిర్ణయాన్ని ధిక్కరించటానికి వీల్లేదు," అన్నాడు పార్ట్నర్.

"మొత్తానికి నా పరువు తీసివేస్తున్నారు మీరు." అని పార్ట్నర్ మీద కేకలు పెట్టాడు షణ్ముగం.

"నువ్వు ఎన్ని కేకలన్నా పెట్టు, కౌంటర్లో డబ్బు ముట్టుకోటానికి వీల్లేదు." అన్నాడు పార్ట్నర్.

"ఏమన్నావ్?" అంటూ కోపంగా లేచాడు షణ్ముగం.

"నే నింకెక్కడయినా తీసుకుంటాను. నాకోసం మీరు పోట్లాడుకోకండి," అని చెప్పి ఇకఅక్కడ రెప్పపాటు కూడా వుండకుండా బయటకు నడిచాడు నారాయణరావు.

ఆ పోట్లాట స్వభావం అతనికి తెలుసు. వాళ్లు అనుకొని పోట్లాడుకునే పోట్లాటే అది. అది ఆంధ్ర దేశంలో ఒకే వ్యాపారంలో వున్న పార్ట్‌నర్స్ మామూలుగా అనుసరించే టెక్నిక్కే. తెలిసి మాత్రం చేసేది ఏముంది ?

లక్ష్మణకోటిశాస్త్రి ఆఫీసులో తన గదిలో కూర్చుని పని చూసుకుంటున్నాడు. పని అంటే ఫైళ్లు తిరగ వెయ్యటం. అతని బల్లమీద ఫైళ్ళ దొంతరలు వున్నాయి. అందులో వొక ఫైలు తీసి విప్పి చదువుతున్నాడు.

ఆయన పని చేసే ఆఫీసు పేరు 'ప్రభుత్వ పౌర సంబంధాల ప్రచారక శాఖ' అని ఇదివరకే చెప్పాను. ఆ శాఖలో 'ప్రణాళికా ప్రచారక శాఖ' ఒకటి వుంది. ప్రణాళిక క్రింద జరుగుతున్న అభ్యుదయ కార్యక్రమాలను పదిమందికీ తెలిసేటట్టు చెయ్యటం ఈ శాఖ యొక్క ఆదర్శం. ప్రస్తుతం ఆ శాఖలో పనిచేస్తున్నాడు లక్ష్మణకోటిశాస్త్రి.

గది గుమ్మం దగ్గర కాపలా కాస్తున్న ప్యూన్ వచ్చి అతనికి వొక చీటీ అందించాడు. అది నారాయణరావు పంపిన చీటీ. ఆ చీటీ చూచి లోపలకు పంపించమన్నాడు లక్ష్మణకోటిశాస్త్రి.

నారాయణరావు ప్రవేశించాడు. ఉద్యోగ రీత్యా

లక్షణ కోటిశాస్త్రి అతనితో నమస్కారం పెట్టించుకొనే హోదాలో వున్నప్పటికీ, స్నేహాన్ని పురస్కరించుకొని అతను పెట్టలేదు.

"రా కూర్చో," అని లక్షణ కోటిశాస్త్రి ఫైలు చదువుకుంటూ కూర్చున్నాడు.

అలా చెయ్యటం ప్రభుత్వోద్యోగులకు ఆచారం. ఏ మనిషి నైనా సరే, అతనితో వ్యక్తిగతంగా పని వుంటే తప్ప వారు ప్రవేశించగానే పలకరించరు. యీ పలకరించటం గౌరవహాని అని వారి ఉద్దేశం. వొచ్చిన మనిషిని చూడనట్టు కాసేపు తమ పనిలో నిమగ్నులై వుంటారు. కూర్చో బెట్టి ఫైలు తిరగవేస్తూ కూర్చోవటం కూడ కద్దు. ఈ లోగా అతడు ఎందుకు వచ్చాడో, అతనికి ఏమి చెప్పి పంపాలో ఊహించుకుంటారు. ఆ పనే చేశాడు లక్ష్మణ కోటిశాస్త్రి. మొదలకుండా కూర్చోటానికి నారాయణరావు ఇబ్బంది పడుతున్నాడని తెలుసుకొని, "ఈ ఫైలు అర్జంటుగా వెళ్లాలి. డైరెక్టరుగారు ఇప్పటికే రెండు రిమైండర్లు పంపించారు. వొక్క క్షణం. ఏమీ అనుకోవద్దు" అని ఫైలు చదువుతూ కూర్చున్నాడు. చదివి తను నోటు పెట్టటం పూర్తి చేశాడు.

"జీతం తీసుకుంటున్నప్పుడు కనీసం దానికి తగినంత పనన్నా ప్రతి వ్యక్తి చెయ్యాలని నా అభిప్రాయం. ఏమంటావ్ ?" అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

"అవును," అన్నాడు నారాయణరావు. చెపుతూ చెపుతూ ప్రతి వాక్యం చివరా ఆపి, 'ఏమంటావ్' అని అడగటం ఆయన మేనరిజం అని అతనికి తెలుసు.

"నోటు పడితే ప్రశ్నకు తావు వుండగూడదు. ఏమంటావ్ ?" అన్నాడు లక్ష్మణకోటిశాస్త్రి.

"అవును," అన్నాడు నారాయణరావు.

"మొదట డ్యూటీ, పిదప ప్లజర్. అది నా పోలసీ. ఏమంటావ్ ?" అన్నాడు లక్ష్మణకోటిశాస్త్రి.

"అవును"అన్నాడు నారాయణరావు.

లక్ష్మణకోటిశాస్త్రి టేబుల్ మీాద వున్న కాలింగ్ బెల్ నొక్కాడు. ప్రభుత్వంలో ప్రతి ఆఫీసరు టేబుల్ మీాద వొక కాలింగ్ బెల్ వుంటుంది. ప్యూన్‌ని వారు నోటితో పిలవరు. కాలింగ్ బెల్ కొడతారు. నూటికి తొంభై పాళ్లు ఆ బెల్ ఆర్డరులో వుండదు. అందువల్ల తరచు చెయ్యి నొప్పిపెట్టే దాకా కొట్టవలసి వస్తుంది. వారు అందుకైనా సిద్ధపడతారు గాని నోటితో మాత్రం పిలవరు.

అదృష్టవశాత్తూ ఆ నాడు లక్ష్మణకోటిశాస్త్రి టేబిల్ మీాద వున్న బెల్ ముట్టుకోగానే మ్రోగింది. దడ దడ ప్యూన్ లోపలికి వచ్చాడు. ఫైలు అతనికి అప్పగించి, చేతులు దులుపుకొని, కుర్చీలో వెనక్కు ఆనుకొని కూర్చొని, "ఇప్పుడు చెప్పు ఏం పనిమీాద వొచ్చావో. ఏమంటావ్ ?" అన్నాడు.

పనిమీాద వొచ్చి వుండకపోతే, 'నీ తలకాయ అంటాను' అని అనివుండేవాడే నారాయణరావు. అందులో అతను వచ్చిన పని సామాన్యమైన పని కాదు. తన భవిష్యత్తూ, తన కుటుంబ భవిష్యత్తూ ఆ పని నెరవేరటం, నెర

నేరక పోవటం మీాద ఆధారపడి వుంది. అందుకని తమా యించుకొని తాను వచ్చిన పని చెప్పాడు.

లక్ష్మణకోటిశాస్త్రి ప్రభుత్వోద్యోగంలో జేరినాక కొన్ని దురలవాట్లు పట్టు పడినా, స్వభావసిద్ధంగా మంచి వాడు. వితరణ బుద్ధి కలిగిన కుటుంబంలో పుట్టి పెరిగినవాడు. అందువల్ల నారాయణరావు అభ్యర్థనను కాదనలేకపోయాడు. ప్రభుత్వం దగ్గర నేర్చుకున్న గుణపాఠాన్ని బట్టి వెంటనే అవునూ అనలేక పోయాడు.

"అలాగా ? ఇప్పుడు నా దగ్గర లేదే," అన్నాడు.

నారాయణరావు అతని నిర్ణయం కోసం ఎదురు చూస్తూ పెదవి కదల్చకుండా కూర్చున్నాడు. అతనిని చూస్తే జాలి కలిగినట్లు వుంది లక్ష్మణకోటిశాస్త్రికి.

"ఎప్పటి లోగా కావాలి ?" అని అడిగాడు.

"సాయంకాలం లోగా ఇస్తే పని సానుకూలపడుతుంది"

"అయితే సాయంకాలం వొకసారి మా ఇంటివైపు రా ! ఏమంటావ్ ?"

"వస్తాను."

"నేనుఇక్కడనుంచి నేనుబయలుదేరేటప్పటికిఅయిదూ అయిదున్నర అవుతుంది. ఇంటికి వచ్చేటప్పటికి ఆరు అవు తుంది. అందుకే ఆరూ ఆరున్నర ప్రాంతాల వొస్తే బాగుం టుంది. ఏమంటావ్ ?"

"అలాగే," అన్నాడు నారాయణరావు.

అక్కడనుంచి ఆఫీసుకు వెళ్లేటప్పటికి పన్నెండు గంటలయింది.

జరిగిన సంఘటనల వల్ల అతని మనస్సు వికలం అయివుంది. అందులో వొక పక్క డొక్క మాడుతూ వుంది. అప్పుడు అతనికి సంఘం అంతా చెప్పటానికి వీల్లేని వొక పెద్ద అంటువ్యాధితో బాధపడుతున్నట్లు వుంది. అంటువ్యాధి అన్నదానికంటే సుఖరోగం అంటే సబబుగా వుంటుంది. 'సుఖరోగం' అనే మాట ఎంత చక్కని మాట! 'సుఖాల వల్ల వచ్చే రోగం' అనుకున్నాడు తనలో తాను.

అతను ఆకలిని తట్టుకోగలిగిన మనిషి కాదు. వేళకు అంతో ఇంతో కడుపులో పడకపోతే నరాలు జివ్వున లాగుతై. కొంతమంది ఆకలైతే కాఫీ తాగుతారు. అంతటితో వూరుకుంటారు. కాని అతనికి కాఫీ ఆకలి తీర్చే పదార్థంగా కనపడదు. మంచినీళ్ళు తాగితే ఎంతో కాఫీ తాగినా అంతే. అతనికి ఆకలి తీరటానికి అన్నమే పడాలి. ఇది కూడా తాను పుట్టి పెరిగిన పల్లెటూరికి సంబంధించిన గుణమేనేమో? అక్కడి మనుష్యులు కాఫీ తాగినా చిరుతిళ్ళు తిన్నా వేళకు ఇంత అన్నం తినవలసిందే. అన్నం లోపలకు వెళ్ళేవరకూ పొట్ట ఏడుస్తూనే వుంటుంది.

చిన్నప్పటి గుణాలు ఇలా వెంటపడి పీడించటం అతనికి ఏమీ బాగాలేదు. లక్ష్మణకోటిశాస్త్రి దగ్గరనుంచి ఇంటికి వెళ్ళి భోజనం చేసి వస్తే బాగుండేది అనుకున్నాడు. అప్పుడు ఆఫీసుకు వొక పూట సెలవు పెట్టవలసి వచ్చేది. పూరికే వొకపూట పోనివ్వటం ఎందుకు అనుకున్నాడప్పుడు. వెళ్ళి అటెండెన్సు వేసి లంచ్ టైములో ఇంటికి వెళ్ళి

రావచ్చనుకున్నాడు. ఇప్పుడు అలా చెయ్యటం తప్పయి పోయింది అనుకున్నాడు.

అప్పుడతని ఆకారం ఎట్లావుందో ఏమో, సెక్షన్లో అడుగు పెట్టేటప్పటికి అంతా అతనిని విచిత్రంగా చూశారు. అతను ఏనాడూ ఆఫీసుకి ఆలస్యంగా వెళ్ళిన వాడుకాదు. అందువల్ల ఆఫీసులో అంత ఆలస్యంగా అడుగు పెట్టటం అతనికీ ఎబ్బెట్టుగానే వుంది. ఇతరుల చూపులను తప్పించు కొని, త్వరగా సహజత్వాన్ని పొందటానికని గబగబా వెళ్లి తనసీట్లో కూర్చున్నాడు. కోటు నెమ్మదిమీద విప్పి కుర్చీకి తగిలించవచ్చనుకున్నాడు. ప్రస్తుతానికి అతనికి తగిలింప బడే వుంది కోటు.

బల్లమీద ఫైళ్ళు పేరుకొని వున్నాయి. వొక ఫైలు తీశాడు. అది గతం రోజు తను నోట్ పెట్టి పైకి పంపించిన ఫైలు. అప్పుడే తిరిగి రావటం అతనికి ఆశ్చర్యం వేసింది. వొక్కొక్క ఫైలు ఏ ఆఫీసరు టేబులుకో అతుక్కొని అలా నెలా రెండు నెలలు వేళ్ళాడుతూ వుండటం అతను ఎన్నో సార్లు చూశాడు. స్త్రీకి ముక్కుకు వేళ్లాడే బులాకీ ఎంత అందమో, ఆ ఆఫీసరుకి ఆ ఫైలు అంత అందం. అందాకవి వీలైనంత వరకు దానిని వొదలించుకోటానికి ఆ ఆఫీసరు ఇష్టపడేవాడు కాదు. అది వేళ్ళాడుతూ వుండగా పదిమంది కళ్లల్లో పడటానికి ఉత్సాహించేవాడు.

అది మానవ జీవితం కాదు. ఫైళ్ల జీవితం అక్కడ ఫైళ్ళు అధికారులూ మానవులు నౌకర్లూ. అక్కడ పని చేసే వాళ్లందరూ పెండ్లి కూతుళ్ళని, పెండ్లి పీటల మీగకు

మోసుకు వెళ్ళే మేనమామలు. పెండ్లికూతుళ్ళు ఎవ్వరంటారా ? ఫైళ్ళు. పెండ్లికూతుళ్ళను అస్తారబతంగా మోసుకు వెళ్ళి ఇతరులకు అప్పగించి చేతులు దులుపుకొని తిరిగి రావటమే ఈ మేనమామలు చేసేపని.

తన ఆలోచనలకు తానే నవ్వుకున్నాడు నారాయణరావు. తనూ ఆలోచించగలడు. ఎంత గొప్ప విషయం. చిత్రంగా ఆలోచించగలడు. ఎంత ప్రమాదకరమైన విషయం! 'యు. డి. క్లార్క్‌కి ఈ గొడవలన్నీ ఎందుకో!' అనుకున్నాడు తననుగురించి తానే.

వుఖ్లో వుండి తాను పంపిన ఫైలు మధ్యలో ఎక్కడున్నా పాము కాటు తిని తిరిగి వచ్చిందేమో అనే అనుమానం కలిగింది అతనికి.

గబగబా ఎర్రపీలిక విప్పి కాగితాలు తిరగేసి చూశాడు. అలా జరగలేదు. వొకరి దానిక్రింద వొకటి వొప్పిన ఆఫీసర్ల దస్కత్తులన్నీ వున్నాయి. చివరన సెక్రటరీ దస్కత్తు వుంది. 'ఎగ్రీడ్' (వొప్పుకున్నాను) అని వ్రాసి దస్కత్తు పెట్టాడు.

వొప్పుకున్నాడట! తాను వ్రాసిందేగా వొప్పుకుంది! తాను వ్రాసింది ఆయన వొప్పుకోవటం ఎంత ఘనంగా వుంది. అంటే ఆయన ఆలోచించినట్లు తనూ ఆలోచించగలడనేగా దాని అర్థం. తాను వ్రాసింది ఆయన వొప్పుకోవటం. ఎన్నో దేశాలు తిరిగి, ఎన్నో డిగ్రీలు సంపాదించి పెద్దపెద్ద నాయకులతో సమానస్కంధాలో తిరిగిన మనిషి తాను వ్రాసింది వొప్పుకున్నాడట! అంటే ఆయనకు వున్న తెలివి తనకీ వున్నట్టేగా! ఇంకా ఈ ఆఫీసు కుర్చీలు గిరగిరా

తొంగక మామూలుగావుండే వెధవ మొహాలతోనే కూర్చున్న య్యేం? గోడలకు తగిలించివున్న దేశ నాయకుల పటాలు ఎగిరి గెంతవేం? మిగిలిన ఫైళ్ళు జేజేలు కొట్టక అట్లా రెక్కలు ఆర్చుకొని పడుకున్నయ్యేం?

ఫైల్లోకి చూస్తూ కూర్చున్న అతనిని ఈ భావాలన్నీ వొక్కుమ్మడిగా ముసురుకున్నాయి.

సెక్రటరీ దస్కత్తు, అతనికి ముత్యాలహారంగానూ వొక అతిలోక సుందరి పలువరసగానూ, అనబ్ షాహీ ద్రాక్ష గుత్తిగానూ కనుపించింది.

తను పెట్టిన నోట్ చదివి 'ఎగ్రీడ్' అని వ్రాసినప్పుడు తనను గురించి సెక్రటరీ ఏమనుకున్నాడో! ఇంత తెలివిగల వాడు యు.డి. క్లార్కుగా వుండటం అన్యాయమని తప్పకుండ అనుకొని వుంటాడు. ఆ అన్యాయాన్ని సెట్ రైట్ చెయ్యా లనే సంకల్పం కూడా ఆయనకు కలిగి వుండవచ్చు. తనను చూడాలనే అభిలాషకూడా ఆయనకు కలిగి వుండ వచ్చు. తనకోసం సొంత ప్యూన్‌ని ఎప్పుడు పంపినా పంప వచ్చు. ఛీఫ్ సెక్రటరీ సొంత ప్యూన్ చాలా హుందాగా వుంటాడు. ఆఫీసర్లు వేసుకునే దుస్తులకంటే తెల్లని దుస్తులు వేసుకొని, వొక ఎర్రని తలగుడ్డ, బెల్టు చుట్టుకొని వుంటాడు. ఆతనిని చూచినప్పుడల్లా ఆ తలగుడ్డ ఎవరెస్టు శిఖరంగానూ, ఆ బెల్టు భూదేవి ధరించిన వొడ్డాణంగానూ తనకు కనిపించి నిర్విణ్ణుని చేసేవి. అతను వస్తాడు తనకోసం. అతను రావటం సామాన్యమైన విషయమా? అతను ఎవ్వరి దగ్గరకు వొస్తే వాళ్ళ పంట పండినట్లు. అతను మామూలుగా సెక్రటరీల

దగ్గరకుగాని వెళ్లడు. అస్తమానం ఛీఫ్ సెక్రటరీ దగ్గరవుండే మనిషని సెక్రటరీలు సైతం అతనిని మర్యాదగా, గౌరవంగా చూస్తారు. అతనిలో ఛీఫ్ సెక్రటరీ అంశ కనుపిస్తుంది వారికి.

"అయ్య ఏం చేస్తున్నాడు?" అని అడుగుతారు.

"ఎందుకు రమ్మన్నారు?"

"కోపంగా వున్నారా? సంతోషంగా వున్నారా?"

"ఇంతకుముందు ఎవ్వరు వొచ్చి వెళ్ళారు?

"ఎప్పుడైనా నా సంగతి మాట్లాడుతూ వుంటారా?"

"వీలైనప్పుడు నన్నుగురించి వొకమంచి మాట అను"

ఈ ప్రశ్న లన్నిటికే పెద్దయ్యగారి ఫ్యూన్ సమాధానం చెపితే చెపుతాడు, లేకపోతే వొక చిరునవ్వు పారవేసి వూరుకుంటాడు. ఎన్ని ప్రశ్నలకు సమాధానం చెపుతాడు, ఏ విధంగా చెపుతాడు అనేవి పండుగ మామూళ్ళు దగ్గరకు రావటాన్నిబట్టీ రాకపోవటాన్నిబట్టీ వుంటుంది.

పరిస్థితిని బట్టి, "మీరు అప్పుడప్పుడు అయ్యగారిని చూస్తూవుండటం మంచిది," అంటాడు.

ఆ మాటకు అవతలివాడు ఎంత మొనగాడైనా భీతావహానికి లోను కావలసిందే!

"నేను రాలేదు అనుకుంటున్నారా?" అని బిత్తర పోయి అడుగుతాడు.

"నన్ను గురించి ఎవ్వరూ అయ్యగారి చెవి కొరకటం లేదుగద!"

"నా మీద కోపంగా వున్నారా?"

"నిజం చెప్పవ్?"

ఆయన గాభరా పడుతున్న కొద్దీ ఫ్యూన్ బిగుస్తాడు. "అయ్యన్నీ నన్ను అడక్కండి. అప్పుడప్పుడూ అయ్యాని చూస్తూ వుండటం మంచిది అన్నాను. తరువాత మీ ఇష్టం," అంటాడు.

ఆ మాటతో అవతలి ఆఫీసరు జీవనాడులు క్రుంగుతై. ఆ ఫ్యూను ఉదహరించి వూరుకోవటంవల్ల ఎన్నో ఆలోచనలు చెలరేగుతై. ఎవ్వరో తనమీద కక్షకట్టి ఛీఫ్ సెక్రటరీ గారితో కొండాలు చూరిపోస్తూ వుండి వుంటారని ఊహిస్తాడు. మరుక్షణం అతను ఎవ్వరో తెలుసుకోవాలనే అన్వేషణ ప్రారంభిస్తాడు. తనపట్ల విరోధం వహించటానికి ఎవ్వరెవ్వరికి ఏయే కారణం వుందో జ్ఞాపకం తెచ్చుకుంటాడు. వాళ్ళమీద పగ బూనతాడు.

మరునాడు ఏదో వొక నెపంతో ఛీఫ్ సెక్రటరీని చూస్తాడు. తనకు అనుకూలం వున్న ఆఫీసర్ల మీద అంది అందకుండా ఏవో కొన్ని నేరాలు పులమటానికి ప్రయత్నిస్తాడు. ఛీఫ్ సెక్రటరీ వింటాడు. వినీ విననట్లు నటిస్తూ శ్రద్ధగా వింటాడు. లీడింగ్ ప్రశ్నలు వేసి చాలా సమాచారం రాబడతాడు. ఇది ఆయనకు తప్పనిసరైన పని. ఎందుకంటే తన క్రింద పనిచేసేవారి సంగతి సందర్భాలు తెలుసుకోవటానికి ఆయనకు ఇదొక మంచి దారి. వొంగ దారా? అని మీరు అడగనూ కూడదు, నేను చెప్పనూ కూడదు.

ఈ సమాచారాన్ని ప్రతి సెక్షన్లోనూ ప్రత్యర్థులను సృష్టించటానికి ఆయన అతి నేర్పుగా వినియోగిస్తాడు.

ఇదొక ధోరణి. మరొక ధోరణి కూడా వుంది. దానిని మాత్రం వొదిలిపెట్టటం ఎందుకు? ఆ సంగతి కూడా చెపుతాను.

చీఫ్ సెక్రటరీగారి పెద్దప్యూను వొక్కొక్కసారి, పరిస్థితినిబట్టి, అవతలి ఆఫీసరు వేసిన ప్రశ్నకు, "మీరంటే పెద్దయ్యగారికి చాలా ఇష్టమండీ. ప్రతిదానికీ మీ పేరు చెపుతుంటారు," అంటాడు.

ఆ ప్రశస్తికి తన్మయుడవుతాడు అవతలి ఆఫీసరు.

"నీ దగ్గర ఎప్పుడైనా అన్నారా?" అని అడుగుతాడు. ఆ వొక్క ప్రశ్న వేసి వూరుకోడు. ప్రశ్నల వర్షం కురిపిస్తాడు,

"నా వర్క్ సంగతి ఎప్పుడైనా ఎత్తారా?"

"ఫైళ్ళమీద నేను పెట్టే నోట్లు ఎట్లా వుంటాయి అంటారు?"

"నేను రాత్రి ఏడు గంటలవరకూ ఆఫీసులోనే వుండి పనిచేస్తూ వుంటానని నువ్వు ఎప్పుడైనా చెప్పావా?"

"ఆయనకు తెలియకపోవచ్చు. కాని నాకు ఆయన దైవంతో సమానం."

ఈ ప్రశ్నలన్నిటికీ ఆ ప్యూన్ సమాధానం చెప్పడు. ఏ వొకటికో రెంటికో సమాధానం చెప్పి, మిగిలిన వాటికి ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ నిలబడతాడు.

ఎటువంటి ఆఫీసరుతోనైనా ఆ ప్యూను చాలా రిజర్వ్‌డుగా వుంటాడు అనేను. మామూలుగా సెక్షన్లలోకి రాడు. వొస్తే వేళాకోళం క్రిందే లెక్క.

అటువంటి ప్యూను ఆ వేళ తనకోసం ఎప్పుడు వచ్చినా రావచ్చు అనుకున్నాడు నారాయణరావు.

"సారయ్యా ?"

ఎవ్వరో పిలిచారు.

ఆ ప్యూనే అనుకొని హఠాత్తుగా తల పైకెత్తి చూశాడు నారాయణరావు. ప్యూనే, కాని ఆ తల గుడ్డ గానీ ఆ బెల్టు గానీ లేదు. మామూలు ప్యూన్లు పెట్టుకునే చిన్న తల గుడ్డ, బెల్టు వుంది. అవికూడా మామూలు ప్యూన్లు ధరించే ఆకుపచ్చ రంగులో వున్నాయి.

అప్పుడతను గుర్తు పట్టాడు. ఆ ప్యూన్ తన సెక్షన్ ప్యూన్. అతను 'సార్' 'అయ్యా' అనే రెండు పదాలు కలిపి ప్రతివారినీ 'సారయ్యా' ? అని పలకరిస్తాడు.

"ఏమిటి ?" అని అడిగాడు నారాయణరావు కను రెప్పలను తాటిస్తూ.

"సూపరింటెండ్ గారు తమను తక్షణంరమ్మన్నారు"

"ఎవ్వరు ?" సూపరింటెండెంటా, ఛీఫ్ సెక్రటరీయా అనే అనుమానం వొచ్చిందతనికి. వొక మాట బదులు వొక మాట అంటున్నాడేమో అనే భ్రమ కూడా కలిగింది.

"ఎవరేంటి సారయ్యా? మన సెక్షన్ సూపరింటెం డెంట్ గారు," అన్నాడు ప్యూన్.

"నన్ను రమ్మన్నారా?"

"అవును సారయ్యా తచ్ఛనం రమ్మన్నారు."

అప్పుడతనికి జ్ఞాపకం వొచ్చింది—తాడు ఆలస్యంగా వచ్చినందుకు ఎక్స్ప్లనేషన్ చెప్పుకోవలసి వున్న

దని. అటువంటి సందర్భాల్లో చెప్పవలసిందేదో ముందుగానే వొక మతలబు ఏర్పాటు చేసుకొని వెళ్ళటం అతని స్వభావం. ఇప్పుడు ఈ గొడవల్లో పడి ఆ సంగతే ఆలోచించలేదు. పైగా కడుపు కాలుతూ వుంది. ఏమి అడిగితే ఏమంటామోఅనే భయం వొకటి పీకులాడింది. ఎందుకైనా మంచిదని కాస్త కాలయాపన చేద్దామనుకున్నాడు.

"పని మధ్యలో వున్నానే, అందులో అర్జంటుపని," అన్నాడు.

"ఎంత అర్జంటుపనైనా రమ్మన్నారు సారయ్యా. కనపడివచ్చి మళ్ళీ పనిచూసుకోవచ్చు. పని ఎక్కడికి పారిపోతుంది సారయ్యా?"

నారాయణరావు చేతులోవున్న ఫైలు కట్టిపెట్టి లేచాడు. తను ఫైలుమీద నిన్నపెట్టిన నోటు బాగుందని చెప్పటానికి పిలిచాడనే ఆశ అతనికి ఏ మూలనో లేకపోలేదు. ఆ ఫైలు ఏ పాము వాతా పడకుండా పరమ పద సోపానపటం ఎక్కి దిగివచ్చినందుకు ఆయన తనను అభినందించవచ్చు అనే భావంకూడ అతనికి కలిగింది. 'ఎంత స్పెషల్ సూపరింటెండెంట్ అయినా ఆయనా మనిషేగదా! మనిషి అన్నతరువాత వొకప్పుడు కాకపోయినా వొకప్పుడయినా మంచిమాట అనకుండా వుండలేడు.

కాని సూపరింటెండెంట్ గదిలో అడుగుపెట్టీ పెట్టగానే తన అభిప్రాయంతప్పని తెలుసుకున్నాడు నారాయణరావు.

"ఇంత ఆలస్యంగా ఎందుకవచ్చావ్?" అని గద్దించాడు సూపరింటెండెంట్.

నారాయణరావుకి ఆకలివేస్తూవుంది. అంతేకాదు. ఆకలివేస్తూవుందనే గమనంకూడా వుంది.

"పని తగిలింది," అన్నాడు.

"అటువంటప్పుడు ముందే సెలవు పెట్టవలసింది."

"ముందుగా తెలిస్తేగదా." అన్నాడు నారాయణరావు. వెంటనే 'అదుగో ఆకలి మహిమ. తగుజాగ్రత్తలో వుండాలి' అనుకున్నాడు. అనుకొని "పదిగంటలకల్లా పనైపోతుందనీ, టైముకి ఆఫీసుకు రావొచ్చనీ అనుకున్నాను. వెళ్ళినపని అనుకున్నంత తొందరగా కాలేదు," అన్నాడు.

"నీకు తెలుసుగా నా స్వభావం? ఇటువంటి పనులు నేను సహించను. నేను క్రమశిక్షణాపరుణ్ని. స్నేహం వుంటే బయట బయట మనం ఎట్లా క్రిందా మీదా పడినా పంవాలేదు. ఆఫీసులో వున్నంతవరకూ నేను సూపరింటెండెంట్‌ని, నీవు యు. డి. క్లార్క్‌వీనీ"

'తమరి ధర్మాన బయట కూడా అంతే' అన్నది నారాయణరావులోవున్న ఆకలి. 'నువ్వు కాసేపు వూరుకుందువ్,' అని మందలించాడు నారాయణరావు.

"మాట్లాడవేం?" అన్నాడు సూపరింటెండెంట్.

"మీరు అక్షరాలా నిజం. పరమసత్యం" అన్నాడు నారాయణరావు. మూతి బిగబట్టి పట్టు తప్పించుకొని, 'నిజంకాదు. వాడిమొహం,' అన్నది ఆకలి.

"ఇప్పటికే రెండుసార్లు ఫోను చేశారు డిప్యూటీ సెక్రటరీగారు. నువ్వువచ్చావా అని అడిగారు."

'కొంయ్!' అన్నది నారాయణరావు ఆకలి. 'నీ ముఖానికితోడు డిప్యూటీ సెక్రటరీ ఫోను చెయ్యటం కూడానా, మీ ఇద్దరిమధ్యా అసిస్టెంట్ సెక్రటరీ అనే ఆయన వొకరువున్నారనే సంగతి నాకు తెలుసు లేవోయ్. ఆయన్ని అమాంతంగా దాటి నీకు ఫోను చెయ్యకేం?' అన్నది ఆకలి.

"ఏం చెప్పారు?" అని అడిగాడు నారాయణరావు.

"ఏదో చెప్పాను. కాని ప్రభుత్వంలో ఉద్యోగం చేస్తున్నాననీ, చేస్తున్నపనికి జీతం పుచ్చుకుంటున్నాననే గమనం నీకు వుండాలి. మనిషి అన్నతరువాత విశ్వాసం అనేది వొకటి వుండాలోయ్."

'నోరుమూస్తావా, పళ్ళు విరిగేటట్టు తన్నమంటావా?' అని అడిగింది నారాయణరావు ఆకలి.

"ఇక్కడ పనిచేసేవాళ్ళకు ఎవ్వరికన్నా విశ్వాసం అనేది వుంటే అది నాకే" అన్నాడు నారాయణరావు. "కాకపోతే ఇవ్వాళ అనుకోకుండా ఆలస్యంగా వచ్చాను."

"అనుకోకుండా ఆలస్యంగా రావటమేమిటయ్యా"

'నీ భార్యకూడా ఎనిమిదో గర్భిణి అయితే తెలిసేది,' అన్నది నారాయణరావు ఆకలి.

'నువ్వు ఊరుకుంటావా లేదా?' అని గద్దించాడు నారాయణరావు.

"నువ్వు అనుకోకుండా ఆలస్యంగా వొచ్చావో, అనుకునే ఆలస్యంగా వొచ్చావో నాకెట్లా తెలుస్తుంది" అన్నాడు సూపరింటెండెంట్.

'తొలి గర్భిణే ఎరగని నీ వెర్రి మొహానికి ఎట్లా తెలుస్తుందిలే,' అన్నది నారాయణరావు ఆకలి.

"ఏదైనా ఈ వ్యవహారం డిప్యూటీ సెక్రటరీ గారికి రిపోర్టు చెయ్యక తప్పదు. దొంగలను కాపాడటానికి కాదు నేను ఇక్కడవుంది. దండించటానికి," అన్నాడు సూపరింటెండెంట్.

'ఎవ్వడ్రా దొంగ? నీకంటే దొంగ ఎవ్వడున్నాడ్రా ఇక్కడ? ఇంకొక్క సారి మాట జారావంటే డొక్క చీల్చి డోలు కట్టిస్తాను. బద్మాష్,' అన్నది నారాయణరావు ఆకలి.

ఆకలిని అదుపులో పెట్టటం కష్టమే అయింది నారాయణరావుకి. "కావాలంటే ఈ పూట సెలవు పెడతాను. డిప్యూటీ సెక్రటరీగారికి రిపోర్టు చెయ్యదలిస్తే చేసుకోండి. మీ ఇష్టంవచ్చినట్లు వ్రాసి పంపండి. అంతేగాని అనవసరంగా మాటలంటే పడేదిలేదు. పనిచెయ్యక, ఇతరులు చేస్తున్నపని తాను చేస్తున్నట్లు నటించి పేరు తెచ్చుకునే వాళ్ళంటే నాకేం భయంలేదు. నా మీద రిపోర్టు చేస్తే నేను చెప్పవలసినవి కొన్ని వున్నాయి. అవి బయట పెడతాను. ఎవ్వరిది న్యాయమో డిప్యూటీ సెక్రటరీగారే నిర్ణయిస్తారు" అని కోపంగా బయటకువచ్చి తన కుర్చీలో కూర్చున్నాడు నారాయణరావు.

'సెబాస్, బలేపని చేశావు,' అని అభినందించింది ఆకలి.

'ఆ గౌరవం నీదే,' అన్నాడు నారాయణరావు.

ఆకలీ నారాయణరావూ వొకరినొకరు అభినందించుకున్నారు.

'అంటాడుగాని నీ మీద వ్రాయటానికి వాడికి ఎక్కడగుండెలు వున్నయ్?' అన్నది ఆకలి.

'నేను కష్టపడి పనిచేసేవాణ్ణి. ఈ ఉద్యోగంపోతే మాత్రం బ్రతకలేనా;' అన్నాడు నారాయణరావు.

'అది వేరే సంగతి' అన్నది ఆకలి కాస్త జంకుతూ

'ఏది వేరే సంగతి నీ మొహం?'

ఏదో జరిగిపోతున్నదానిని పెదదారి పట్టించడం ఎందుకు? జరిగిపోయేదాన్ని జరిగిపోనివ్వటం మంచిది" అన్నది ఆకలి.

'ఏడిసినట్లువుంది. నీమూలానే నేను పనికిరాని వెధవనయ్యాను' అని ఈసడించుకున్నాడు నారాయణరావు.

'సరేలే, పరిస్థితులు అవే చక్కబడతై. నువ్వు మొదలకుండా వూరుకో," అన్నది ఆకలి.

అంతలో సూపరింటెండెంట్ వచ్చాడు. చిరునవ్వు నవ్వుతూ నారాయణరావు కుర్చీదగ్గరకువచ్చి, "కోపంవచ్చినట్లు వుందే" అన్నాడు.

నారాయణరావు మాట్లాడలేదు.

'అదే చక్కబడుతుందని నేను చెప్పలా?' అని కులికింది ఆకలి.

"ఏమీ అనకుండావుంటే నీపట్ల పక్షపాతం వహించానని ఇతరులు గునుస్తారు. అందుకని అన్నాను. అంతకంటే ఏంలేదు. నీ సంగతి నాకు తెలియదా. ఏమీ అనుకోకు. డిప్యూటీ సెక్రటరీగారు ఫోనుచేసి అడిగినప్పుడే, "నువ్వు ఆఫీసుకి టైముకేవచ్చావనీ, వొక ఫైలు కోసం జి. డి. ఎ. కి వెళ్ళావనీ చెప్పాను. వారేదో ఫైలు అడిగితే నేనే ఇచ్చి వచ్చాను. నీకు వచ్చిన ఇబ్బంది ఏమీ లేదు. ఇవిగో, ఈ నాలుగు ఫైళ్ళు అర్జంటుఫైళ్ళు చదివి నోటుపెట్టి త్వరగా పంపించు. ఇవ్వాళ వెళ్ళిపోవాలి," అని చెప్పి వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళినవైపే చూస్తూ కూర్చున్నాడు నారాయణరావు. అతని పెదవి వికటంగా మెలితిరిగింది. పులీ పిల్లీ రెండు కలిసి వుంటై ఎక్కువమంది ప్రభుత్వోద్యోగుల మనస్తత్వంలో. అవతలివాడు లొచ్చయితే హుంకరిస్తారు. ఎదురు తిరిగితే బుస్సునతగ్గ కాళ్ళ బేరానికి వస్తారు. మళ్ళీ అవకాశం కోసం ఎదురుచూస్తూ కూర్చుంటారు. అవకాశం దొరికితే మాత్రం నొక్కి విడవకుండా వూరుకోరు. వారికేదాకా అవతలివాణ్ణి ప్రమత్తుణ్ణి చెయ్యటానికి అత్యద్భుతమైన జోలపాటలు పాడగలరు. ప్రస్తుతం తన సెక్షన్ సూపరింటెండెంట్ అదే ధోరణి అవలంబిస్తున్నాడని గోచరించకపోలేదు నారాయణరావుకి.

ఇవన్నీ మనస్సులో పెట్టుకొని ఎప్పుడో కక్ష తీర్చుకుంటాడు.

కోపంగానూ, విసుగ్గానూ వున్న నారాయణరావు 'తీసుకోనియ్,' అనుకున్నాడు. అంతకంటే ఎక్కువదూరం ఆలోచించే ఓపిక అప్పుడతనికి లేదు.

ఎదురుగుండా బల్లమీద నాలుగు ఫైళ్ళున్నాయి. వాటికి ప్రయాణం కట్టాలి. ఇక అవ్వాల్టికి భోజనంలేదని ఒక్కనిట్టూర్పు విడిచాడు. తప్పేది ఏముంది. చచ్చేదాకా ఈ ఫైళ్ళు నడిపేభారం తన భుజాలమీంద మోస్తాడు భగవంతుడు. ఆదిశేషుడు భూమిని మోస్తున్నట్లు తన భారం మొయ్యవలసిందే. గుమాస్తాలు ఈ భారాన్నుంచి తొలిగితే భూమి జలదరిస్తుంది. అంటే భూకంపం వొస్తుంది.

తన వర్గాన్ని ఆదిశేషుడితో పోల్చుకోవటం అతని మనస్సుకి నచ్చింది. శక్తినిచ్చింది. లేచి టిఫిన్‌తిని కాఫీ తాగి వొచ్చి కూర్చున్నాడు. కాఫీ టిఫిన్, భోజనంతో సమానం కానిమాట నిజమే. కాని చేసేది ఏముంది?

ఆనాడు హడావుడిలోవుండి ఇంకా కోటు విప్పలేదు అనే సంగతి అప్పుడతనికి జ్ఞాపకం వొచ్చింది. కోటు విప్పి కుర్చీకి తగిలించాడు. చొక్కా విప్పి గోదాలోకిదిగిన పహిల్వాన్‌లా ఫీలయ్యాడు. ఫైళ్ళతో చేతులు కలిపాడు.

ఆ ఫైళ్ళన్నీకూడా వివాదాస్పదమైనవే. ఒక్కొక్క ఫైలు మీద నోటుపెట్టటానికి అంతపూర్వం డీల్ చేసిన ఏ అరడజను ఫైళ్ళో చదవవలసి వచ్చింది నారాయణరావుకి. నారాయణరావుకి టాలాటోలీగా నోట్ పెట్టే అలవాటు లేదు. ఏ సమస్యనైనా బహుముఖాల పరిశీలించి చదవవలసినవన్నీ చదివిగాని నోట్ పెట్టడు. అది అతనికి ఒక వ్యస

నంగా తయారైంది. తన తెలివిని బయటపెట్టేదారి ఇది వొక్కటే మిగిలి వుండటంవల్ల, అవసరానికి మించి కష్ట పడుతున్నాడని అనిపిస్తుంది అతను పనిచేసే ధోరణిచూస్తే.

ఈ స్వభావం కలవాడు అవటంవల్ల ఆ నాలుగు ఫైళ్ళనూ అత్తవారింటికి ప్రయాణం కట్టించేటప్పటికి దగ్గర దగ్గర ఆరు గంటలైంది. అప్పుడతనికి లక్ష్మణకోటిశాస్త్రిని చూడవలసినకాలం దగ్గరపడిందని జ్ఞాపకం వచ్చింది. ప్యూన్‌కి ఫైళ్ళు అప్పగించి బయలుదేరాడు.

అప్పటికే ఉద్యోగస్థులందరూ తమ తమ ఇండ్లకు వెళ్ళి పోయారు. అంతకుముందువరకూ సందడి సందడిగా వున్న సెక్రెటేరియట్ ఆఫీసు బావురుమంటూ వుంది. ప్యూన్లు వారివారి సెక్షన్స్‌కి తాళాలు వేస్తున్నారు. అక్కడక్కడా గదుల్లో లైట్లు వెలుగుతున్నాయి. ఆ గదుల్లో వొకరిద్దరు గుమాస్తాలు ఇంకా పనిచేసుకుంటున్నారు. పని చేసుకోటానికి వున్నారో, ఇంటిదగ్గర సమస్యలను ఎదుర్కో లేక కాస్త కాలం గడిచినా గడిచినట్టేనని వున్నారో ఆ పరమాత్ముడికే తెలియాలి.

ఉదయంనుంచీ భోజనం చెయ్యకపోవటంవల్లా, ఏక బిగువున వొంటిగంటనుంచీ అప్పటిదాకా పని చెయ్యటం వల్లా, నారాయణరావుకి తల దిమ్మెక్కినట్లు వుంది. నాదుగావుంది. పక్కగా ప్రవహిస్తున్న నది మీాదనుంచి చల్లని గాలి వీచింది. నారాయణరావు మనస్సు చల్లబడింది.

"ఇంటికి వెళ్తున్నావా?" అని అడిగాడు శ్రీరాములు. శ్రీరాములు మరొకసెక్షన్‌లో గుమాస్తా.

"అవునోయ్," అన్నాడు నారాయణరావు నీరసంగా.

"నువ్వు అదృష్టవంతుడివిలే" అన్నాడు శ్రీరాములు.

"ఎందుకట?"

"చీకటి పడీపడగానే ఇంటికి వెళ్తున్నావు"

"నువ్వు రావటం లేదా?"

"నాకెక్కడ కుదురుతుందయ్యా. రావణాసురుడికి మల్లే ఇరవైచేతుల్తో పనిచేసినా, ఇంకా మిగులుతూనే వుంది. ఇంకా పది ఫైళ్ళు బల్లమీదపడి ఏడుస్తున్నాయి. అవి పూర్తిచేసిగాని బయటకు అడుగుపెట్టటానికి వీల్లేదు. అంటే రాత్రి పదిగంటలన్నా అవుతుంది. అందుకని ఎందుకైనా మంచిది అని బయటకు వెళ్ళి కాఫీ తాగి వస్తున్నా. ఎవ్వరున్నా లేకపోయినా తలుపులు వేసుకోటానికన్నా ప్యూన్ ఉండాలిగదా! వాడికి కాఫీ పోయించి తీసుకు వస్తున్నా," అన్నాడు.

అతనిమాటలకు నవ్వు వొచ్చింది నారాయణరావుకి. ప్రభుత్వోద్యోగుల్లో వొకరకం మనుష్యులున్నారు. వారు పని చెయ్యరు. పని చెయ్యలేక చస్తున్నాం అని నాలుగు సెకన్లకి తిరిగిచెప్పివచ్చి నిజమే అనే భావం కలిగించటమే వారు చేసేపని.

అటువంటివారిలో ముఖ్యుడు ఈ శ్రీరాములు.

అయితే ఇటువంటివారు ఎలా గెట్ ఆన్ అవుతారంటూరా? దానికి వారి కొక టెక్నిక్ వుంది. వారు రోజూ

ఉదయం, వారి వారి హోదానుబట్టి, తమ సెక్షన్ సెక్రటరీ ఇంటికో డిప్యూటీ సెక్రటరీ ఇంటికో వెళ్ళి దర్శనం చేసుకు వస్తుంటారు.

'దర్శనం' అనేమాట ఎవ్వరు సృష్టించారోగాని, చాలా గొప్పమాట. ఆ సృష్టించినవారికి జోహారులర్పించవచ్చు. ఆ మాటలో అనేకం ఇమిడి వుంటాయి. ఎన్ని ఇమిడివుంటాయో చెప్పటం కష్టం. ఆఫీసరు పిల్లలను ఎత్తుకోవటం దగ్గరనుంచి, తన వాళ్ళకి ఉద్యోగాలిప్పించుకోవటంవరకూ అందులో వుంటయి. ఆఫీసులో జరిగే పనులు రోజువారీగా ఆఫీసరుకు చెప్పటం మొదలుకొని, ఆఫీసరు భార్యకు కూరగాయలు మార్కెట్ నుంచి తెచ్చి పెట్టటం వరకూ ఉంటయి.

ఈ టెక్నిక్ వారానికి వొకసారి ఆఫీసరుకు వొక నమస్కారం పారవెయ్యటంతో ప్రారంభం అయి, ఆఫీసరు పిల్లలకు బిస్కట్లు తీసుకువెళ్లటంతో సాగి ఆఫీసరు ప్రతి పనికీ అతనిమీద ఆధారపడటంతో పరాకాష్ట నందుకుంటుంది.

ఇక అప్పుడు ఆఫీసరు అతను అడిగిన పనల్లా చేసి పెట్టక తప్పదు. వొకవేళ అతను నసిగినా అతని భార్య వూరుకోదు.

'మనలను నమ్ముకొని వున్నాడు, ఈ మాత్రం పనైనా చేసిపెట్టకపోతే ఎట్లాగూ?' అంటుంది.

'అదీ నిజమే,' అనిపిస్తుంది ఆఫీసరుకి.

'నమ్మినవాళ్ళకి ఈ మాత్రమన్నా చేసిపెట్టకపోతే, ఈ ఉద్యోగం ఎవ్వరిని ఉద్ధరించటానికి?' అంటుంది భార్య.

'అవునవును,' అంటుంది ఆఫీసరు మనస్సు.

'మాట్లాడకుండా అట్లా మొద్దల్లే కూర్చున్నారే. అతను అడిగింది చేసిపెట్టి పంపక?' అంటుంది భార్య.

ఇక తప్పేది ఏముంది? గప్‌చిప్‌గా ఆపనికాస్తా చేసి పెట్టి, కన్నంలో తేలుకుట్టిన దొంగకుమల్లే కూర్చుంటాడు ఆఫీసరు.

అయితే ఆఫీసరు భార్య ఇంతపట్టుదల పట్టటానికి కారణం అతను కూరగాయలు తెచ్చి పెట్టటం, పిల్లలను ఎత్తుకోవటమే అంటారా? కాదు. ఇంట్లో ఏదికావాలన్నా అతను తెచ్చిపెడతాడు. కొండమీద కోతిని దింపుతాడు. అతను డబ్బు తీసుకోకుండా ఈ పనులు చేసి పెట్టడు. ఆ మాట నిజమే. కాని ఏవస్తువయినా అందరికంటే తక్కువ ఖరీదుకి తెస్తాడు. ఎంతగొప్ప ఖరీదైన వస్తువయినా ఎంతో కొంత చౌకగా తెస్తాడు. మొదట్లో అతని పలుకుబడికి ఆఫీసరుభార్య ఆశ్చర్యపోతుంది. తరువాత ఎలా తక్కువ ఖరీదుకి తెస్తాడా అని ఆలోచిస్తుంది. అప్పుడామెకు అనుమానం కలుగుతుంది. క్రమక్రమేణా నిశ్చయం అవుతుంది.

ఎక్కడ ఖరీదు ఎక్కువైందని అనుకుంటారోనని కొద్దో గొప్పో తన సొంతచేతిది వొదిలించుకోటానికి సిద్ధపడి అతను తక్కువ వెలచెప్పి అంతే తీసుకుంటాడు. ఈవిషయం తెలియగానే, 'పాపం వెర్రివాడు. ఎంత అమాయకుడు!' అని జాలిపడుతుంది ఆఫీసరు భార్య.

ఆఫీసరు భార్యకు ధర్మవరం చీరెలంటే మోజు. వొకరోజు అతను వినేటట్టు అంటుంది. మరుక్షణం పది రకాల చీరెలువచ్చి ఇంట్లో వాలతై.

'మీ ఇష్టం వొచ్చింది తీసుకోండి' అంటాడు అతను.

ఆమె వొక చీరె నాణ్యంచేసి ధర అడుగుతుంది.

'ధరదేముంది లెండి,' అంటాడు అతను.

'అలాకాదు. ధరచెప్పవలసిందే,' అంటుంది ఆమె.

"ఎంతండీ? డెబ్బై అయిదు రూపాయీలు" అంటాడు అతను.

పక్క ఇంటావిడ అదే చీరె వంద రూపాయీలకు రెండురోజుల క్రితమే కొనటం ఆమె ఎరుగును. అందులో ఆపక్క ఇంటావిడ నలుగుర్ని అడిగి, నాలుగు కొట్లలో వాకబుచేసిగాని ఏ వస్తువూ కొనదు. డెబ్బై అయిదు రూపాయిలూ ఇచ్చి వూరుకుంటుంది. మిగిలింది అతను ఇచ్చుకుంటాడనే ఆమె నమ్మకం. కాని పైకి ఆ విషయం ఆవంతకూడా తెలియనట్లు నటిస్తుంది.

కొన్నాళ్ళకు, తనభర్తతో పనులుచేయించి పెడతానని అతను ఇతరులదగ్గర డబ్బు తీసుకుంటున్నాడని తెలుస్తుంది. నిజమేనేమో అనిపిస్తుందామెకు దానివల్లే తమకు ఖర్చు పెడుతున్నాడనుకుంటుంది. కాని ఈ అనుమానం ఎవ్వరికి సుఖిం యిస్తుంది. అందరి మనస్సులనూ కలవరపెట్టే అనుమానం. అందుకని, 'వొట్టిదే. గిట్టనివాళ్ళు అతనిమీద

వేస్తున్న లేనిపోని పుకార్లు,' అని తనకు తాను నచ్చజెప్పుకుంటుంది; మనస్సును సమాధాయిస్తుంది.

ఈవిషయం ఆమెభర్తకు కూడ తెలిసివుండవచ్చు. కాని ఎవ్వరికివారు తెలియనట్లే నటిస్తారు. కాలం గడుస్తుంది. 'పోనీలే, తీసుకున్నా తను ఉంచుకోవటంలేదుగా. మనకే పెడుతున్నాడుగా' అనుకుంటుంది.

"ఇదీ వొకందుకు బాగానేవుంది," అనే నిశ్చయానికి వస్తుంది.

ఆమె ఈ నిశ్చయానికిరాగానే అతను వొక అడుగు ముందుకువేస్తాడు. అయ్యగారు పుట్టినరోజు పండక్కి, అమ్మగారు పుట్టినరోజు పండక్కి ఏ చీరే జాకెట్టో, ఏ వెండి పళ్ళెమో, గ్లాసో తీసుకువచ్చి ఇస్తాడు. వాట్టిచేతుల్తోరాడు.

పుట్టినరోజులు జ్ఞాపకం పెట్టుకొని అతను అలా చెయ్యటం ఆమెకు బ్రహ్మానందాన్ని కలిగిస్తుంది. ఈ పని తన కన్నవారుకూడా చెయ్యరు. అతను ఈ పని చెయ్యటంవల్ల తన పుటకకే వొక అద్భుతమైన విలువ ఏర్పడుతుంది. ఆ నాటినుంచీ ఆ ఇంట్లో అతను వొక సభ్యుడే అవుతాడు. ఆమె అతనిని, 'అన్నయ్యా?'అని పిలుస్తుంది. సోదర సోదరీ భావం పుటకవల్ల కాక ప్రవర్తనవల్ల, ఆదరంవల్ల, ఇచ్చి పుచ్చుకోవటంవల్ల కలుగుతుందని అప్పుడామెకు బోధపడుతుంది.

అయితే అతనినుంచి వస్తువులు పుచ్చుకొని అతనికి పనులు చేసిపెట్టటం లంచాలు తినటంకాదా అంటే, కానే కాదని ఆమె ఏనాడో తేల్చుకుంది. డబ్బురూపంగా తీసు

కుంటే లంచాలనీ, వస్తురూపంలో తీసుకున్నవన్నీ బహుమతులనీ ఆమె ఏనాడో తేల్చుకుంది.

ప్రభుత్వరంగంలో 'దర్శనం' అనేమాటకు వున్నంత విలువ, ఈ 'బహుమతి' అనే పదానికి కూడా వుంది. ఆఫీసర్లమీద రకరకాల బహుమతులు వొచ్చిపడతై. అవి లంచాలు మాత్రంకాదు. లంచాలు అని ఎవ్వరయినా అంటే వాళ్ళు గిట్టనివాళ్ళు – ఈర్ష్యాళులు. మానవుడైపుట్టి పొట్టకు తినేవాడు 'బహుమతి'కీ, 'లంచానికీ' వున్న తేడా తెలుసుకోవాలి. బహుమతి అనేది ఈనాటిదా? ఇక్ష్వాకుల కాలంనుంచీ వొస్తూవుంది. వెధవలకూ, పుట్టుకుంకలకూ ఈ తేడా తెలియకపోతే ఆఫీసర్లు ఏంచేస్తారు? 'రోజులు చెడిపోయినై,' అని విచారపడతారు.

బ్రతుకు నేర్పుగలిగిన తెలివిగలవాళ్ళు అనుసరించే టెక్నిక్ ఇది. ప్రభుత్వరంగంలో ఈ టెక్నిక్ యొక్క పరిణామం, మానవ పరిణామంకంటే అత్యద్భుతమైంది. పెన్సిలిన్ మందుకంటే అమోఘమైంది.

ఈ టెక్నిక్ కి రెండు వైపులా పదనువుంది. వొక వైపు ఆఫీసర్లను కట్టుకుంటుంది ఈ టెక్నిక్. రెండోవైపు క్రింది ఆఫీసర్లనూ ఉద్యోగులనూ ఆకడుతుంది. అది ఎలాగంటారా? చెపుతాను.

ఆ బ్రతుకు నేర్పుగలిగిన తెలివిగలవాడు అవకాశం దొరికినప్పుడల్లా డిప్యూటీ సెక్రటరీ ఇంటినుంచి వొస్తున్నాను అంటాడు. ఇంకా ఇలాంటి మాటలు అనేకం వొదులుతుంటాడు.

'ఆయన చాలా మంచివాడు.'

'ఆయన భార్యగారు అంతకంటే మంచిది.'

'నన్ను అడగకుండా ఏపనీ చెయ్యరు. నేనంటే అంత అభిమానం.'

"మొన్న మన అప్పారావుకి పనికావలసి వొస్తే నేనే చెప్పి చేయించి పెట్టాను."

'నీకేం కావాలో చెప్పు. చేసి పెడతాను' అంటూ వుంటారు.' మన వాళ్ళకు పదిమందికి సహాయం చెయ్యటం తప్ప నాకు కావలసిందేముంది?'

'మనం చెప్పినట్లు వింటారుగనుక నా స్వార్థానికి వాడుకోవటం నాకు ఇష్టంలేదు. ఆయన శ్రేయస్సుకూడా నేను ఆలోచించాలి గదా?'

'మన అసిస్టెంట్ సెక్రటరీగారి మీదకు ఏదో రిపోర్టువస్తే ఆయనగారికి చెప్పి నేనే సరిచేశాను. లేకపోతే ఆయన ఉద్యోగానికి ఈ పాటికి ఉద్వాసన జరిగేదే.'

'సింహపురం ప్రాజెక్టు నాలుగు లక్షల విలువగలది. కంఠాభరణంగారు నన్ను ఆశ్రయిస్తే, వారికి నేనే ఇప్పించాను. సెక్రటరీగారికి ఇష్టంలేదు. డిప్యూటీ సెక్రటరీ గారితో అనుకూలంగా నోటు పెట్టించి, మినిష్టరుగారితో సెక్రటరీగారికి చెప్పించాను. అంతపనీ ఇట్టే అయిపోయింది.'

ఈ విధంగా మాటలకు వివిధ రంగులు పులిమి విసురుతుంటాడు. అవి ఇంతింతై వ్యాపిస్తవి. అతనికి పై ఆఫీసరు దగ్గరనుంచి పలుకుబడి వుందని అందరికీ విశదపడుతుంది. మిగిలినవారిలో భయం ఏర్పడుతుంది. ఏమంటే

ఆయనకు ఏంచెప్పి అపకారం చేయిస్తాడో అని. అక్కడ నుంచి అంతా అతన్ని కాకా పట్టేదాకా రావటంలో విచిత్రం ఏముంటుంది? పెద్దపెద్దవాళ్ళే అతనిని గౌరవించటం మొదలు పెడతారు. వాళ్ళకింద పనిచేసేవాళ్ళందరూ జోహుకుం కొట్టక గత్యంతరం ఏముంది?

అట్లా అతని ప్రభావం చిలవలు పలవలుగా ఇతర శాఖలకుకూడా వ్యాపించి వృద్ధి చెందుతుంది. అతని పనులు తన డిప్యూటీ సెక్రటరీ పనిచేసే శాఖలోనే కాక, అన్ని శాఖలలోనూ ఇట్టే అవుతుంటవి. ఏదోవాక విధంగా పనులు చేసిపెట్టడమేగదా, ఈనాడు ప్రతిభకు నిదర్శనం. ఇక జనం అతనిచుట్టూ మూగుతారు.

ఇటువంటి టెక్నిక్ అనుసరించే వాళ్ళల్లో శ్రీరాములు అగ్రగణ్యుడు అవటంవల్ల అతని ప్రభావం దినదినాభివృద్ధి అయి వంచుతూవుంది. ఎప్పటికప్పుడు అతను కీలక స్థానం పట్టుకుకూర్చుంటాడు. మిగిలిన వ్యవహారాలు సునాయాసంగా వాటికవే జరిగిపోతుంటై.

శ్రీరాములు వెళ్ళిపోయాడు. నారాయణరావు ఆఫీసు దాటాడు. 'రోజులు అటువంటివాళ్ళకే బాగున్నాయి. అతను తన కొడుకును యం. బి. బి. యస్. చదివిస్తున్నాడు. సీటుకూడా సునాయాసంగా సంపాదించాడు. ఆ కుర్రవాడికి ఎవ్వరైనా పిల్లనిచ్చి లక్ష రూపాయీలు కట్నం ఇస్తారు. గత సంవత్సరం పాతికవేల రూపాయీలు కట్నం యిచ్చి తన కుమార్తెకు వివాహం చేశాడు. ఆ కుర్రవాడికి ఇంకా మంచి కట్నం వొచ్చేదే. శ్రీరాములు

ప్రభుత్వంలో మంచి పలుకుబడి గలవాడనీ, మంచి ఉద్యోగం ఇప్పించగలడనీ, అండగా వుంటాడనీ భావించి, పెండ్లి కొడుకు తండ్రి ఇచ్చినంత డబ్బు తీసుకొని వివాహానికి అంగీకరించాడు.

అగతా అనుకున్నట్టే శ్రీరాములు అల్లుడికి చక్కని ఉద్యోగం ఇప్పించాడు. భార్యాభర్తలు సుఖంగా ఉండటానికి వీలైన ఊళ్లో ఉద్యోగం వేయించాడు. కుటుంబాల అంతస్థులు ఈ విధంగా పెరిగిపోతుంటే, ఎవరెన్ని గొణుగుకుని ఏం లాభం ?

జీవితం తన్ను మోసం చేసింది అనుకున్నాడు నారాయణరావు. మోసం చేస్తుంటే తాను గ్రహించలేక అది ఆడమన్నట్లల్లా ఆడాడు. పర్యవసానం నిత్యావసరాల అన్వేషణలో రోడ్లు పట్టుకు తిరగటం.

సెక్రటేరియట్‌కి ఎదురుగా వొక మైదానం వుంది. ఆ మైదానంలో వున్నది వొక పాడుపడిన ఇల్లూ, నాలుగు చెట్లూ. ఆ మైదానం వైపున నడుస్తున్నారు ఇద్దరు వ్యక్తులు. వారెవరో గుర్తుపట్టాడు నారాయణరావు. మగవాడు తన ప్రక్క సెక్షన్లో పనిచేస్తున్న యు. డి. క్లార్క్. అతని పేరు సింహాచలం. స్త్రీ సెక్షన్లోనే పనిచేస్తున్న రిసెప్షనిస్టు.

సింహాచలానికి వివాహం అయింది. ఆమెకు కాలేదు. వారిద్దరూ ప్రేమించుకుంటున్న సంగతి అందరికీ తెలిసిందే.

చదువుకున్న ఆడపిల్లలు ఇంత తెలివితక్కువగా ఎందుకు ప్రవర్తిస్తారో అతనికి అర్థంకాలేదు.

అవతల మస్లిషికి వివాహమయింది. అందువల్ల తనను వివాహమాడటానికి వలనుపడదు. వొకవేళ తెగించి అలా జరిగినప్పటికీ, అందరి జీవితాలను భీభత్సం చేసే పరిణామాలు ఎదుర్కొంటై. వీటన్నిటినీ పరిగణింపనీయని ఆ ఆకర్షణ, ఉద్రేకం ఏమిటో !

'ఉద్రేకమూ కాదు. ఆకర్షణా కాదు, మౌఢ్యం' అనుకున్నాడు నారాయణరావు. 'మదం' అనే మాట మనస్సు నుంచి పైకి ఉబికింది గాని, ఆ మాటను పైకి తేవటానికి తనకే అసహ్యం వేసి, దాని స్థానంలో మౌఢ్యాన్ని నిలిపి తనలో తాను ఉచ్చరించుకున్నాడు. 'పోనీ వాళ్లు చేసేది తప్పే అయినా తానింత బలంగా ఎందుకు ఆవేశపడాలో' అతను ఆలోచించలేదు. ఆ ఆవేశం వెనక ఈర్ష్య ఏదైనా గూడు కట్టుకు వుందా? తన ఆవేశం అందులోనుంచి పొంగిందా?' అని తరచి చూచుకునే నిగ్రహం అప్పుడు అతనికి లేదు.

'సంఘం పాడై పోయింది.' 'బాడఖో సంఘం' అనే మాట నోటి దాకా వచ్చి ఆగింది. అవసరానికి మించిన ఇంతంత బూతు మాటలు తన మనస్సులో ఎందుకు రేగుతవో అతను తెలుసుకునే స్థితిలో లేడు.

బస్సుస్టాపు దగ్గరకు వచ్చి లక్ష్మణకోటిశాస్త్రి ఇంటికి వెళ్లటానికిగాను ఆగాడు నారాయణరావు.

బస్సుస్టాప్ నిలబడటం ఎప్పుడూ అతనికి కంపరంగానే ఉంటుంది. రకరకాల మనుష్యుల మధ్య నిలబడటం, అందులో ప్రతి వ్యక్తి మిగిలిన వాళ్ళ సంగతి గమనించకుండా, ఎవ్వరికి వారే ముందుగా బస్సు ఎక్కగలందులకు

సర్వ సన్నాహాలు చేసుకుంటూ వుండటం, బస్సు ఎక్కడో ఆగుతుందని ముందుగానే ఇతరులను నెట్టుకుంటూ అక్కడకు పరుగెత్తటం, అవి అక్కడ ఆగకపోతే చువ్వలు పట్టుకుని వేళ్లాడటం, వొకరిమీద వొకరు పడి తమ నిరాశను తగాదారూపంలో తీర్చుకోవటం. ఇవన్నీ అతనికి ట్రక్కుల్లో వెళ్తున్న మిలిటరీ వాళ్లనూ, బోనుల్లో వున్న జంతువులనూ, శ్రాద్ధంనాడు చెరువు అంచున గుమిగూడిన కాకులనూ, జ్ఞాపకానికి తెస్తూ వుండేవి.

అతని చీకాకుకు వీటన్నిటికన్నా ముఖ్యమైన కారణం వొకటి వుంది. అది బస్సుకోసం నిలబడిన స్త్రీలకు దగ్గరగా వున్న కుర్రవాళ్లు చూసే చూపులు. స్త్రీలను వాళ్లు అప్పుడే చూస్తున్నట్లు, ఆకొన్న భోజనప్రియుడు నిండిన విస్తరిని చూచినట్లు, పిశాచాలు మానవ రక్తంకోసం ఆరాటపడినట్లు, వాళ్ళు ప్రవర్తిస్తారు. ఇతరులు తమను గమనిస్తున్నారేమోననే భయంగాని, తమ చూపులు ఆ స్త్రీలను బాధపెడుతున్నాయేమోననే విచారంగాని, ఇది మానవ స్వభావానికి విరుద్ధం అనే విచక్షణగాని వాళ్లకు వుండదు. వాళ్ళు క్షణానికి వొకసారి నాలుకలతో పెదవులను తడుపుకుంటూ వుండటం దయ్యాలు తిలకించవలసిన దృశ్యం!

'ఇది మన దేశం ప్రత్యేకతేనా? ఇతర దేశస్థులుకూడ ఇదే విధంగా ప్రవర్తిస్తారా? అనే శంక అతనిని నిరంతరం వెన్నాడుతూనే వుండేది. 'స్త్రీలు తంతారు, పోలీసులు జైల్లో వేస్తారు' అనుకొని తనకోరికను తానే నివారణ చేసుకునేవాడు.

ఆ నాడు ఓక ఆంగ్లో ఇండియన్ -యువతి స్టాప్ దగ్గర వుంది బస్సుకోసం ఎదురుచూస్తూ. ఆమె అందానికి నారాయణరావు కండ్లు జిగేల్ మన్నాయి. ఆంగ్లో ఇండియన్ యువతుల అందం అతనికి ఎప్పుడూ ఆకర్షవంతంగానే ఉంటుంది. కత్తిరించిన జుట్టు గాలికి ఎగురుతూ వుండగా, వాళ్ళు చకచక నడిచి వెళ్తుంటే అతనికి చూడ ముచ్చటగా వుండేవి. వాళ్ళల్లో ఎవ్వరైనా చిన్న బేగ్ భుజానికి తగిలించుకొని వెల్తుంటే ఆమె కనుమరుగు అయ్యేదాకా అతనికి చూడబుద్ధి అయ్యేది.

కాని ఆ అందానికీ, మెరిసిపోతున్న ఈ అందానికీ సాపత్యం లేదు. చూడటానికి ఈమె చాకల్లే వుంది. ఆమె ధరించిన దుస్తులు ఆ జాతి వాళ్ళు సహజంగా వాడే దుస్తుల్లాగే శరీరాన్ని అంటిపెట్టుకొని వున్నాయి. మోకాళ్ళనుంచి క్రింది భాగంనగ్నంగా వుంది.

ఆమె మంచి అంగ సౌష్టవం గల యువతి. ఆమె ముంజేతులు ముత్యపు దొంతలవలె ముద్దులొలుకుతూ వున్నాయి. వేళ్ళు సన్నగా మొనలు తేలి వుండి పసిడిమూసలను మరిపిస్తున్నాయి. ఆమె నేత్రాలు యవ్వనపు కాంతులను కురుస్తున్నాయి. వంపులు తిరిగిన ఆమె నల్లని జుట్టు మిలమిల మెరుస్తూవుంది. చెక్కిళ్ళు గులాబీ రంగుతో మెరిసిపోతున్నాయి. తేమ గలిగిన ఆమె ఎర్రని పెదిమలు, ఎటువంటి పురుషుని మనస్సునైనా గిలిగింతలు పెట్టక వూరుకోవు. నవ్వినప్పుడు, మాట్లాడినప్పుడు కూడా ఆమె తెల్లని పలువరస ధవళ కాంతులను విరజిమ్ముతూ వుంది.

ఇక పురుషుల ములుకు చూపులనునుంచి ఆమె ఏ విధంగా తప్పించుకోగలదు ? పాపం వారు మాత్రం తమ చూపుల తూపులను ఏ విధంగా త్రిప్పుకోగలరు ?

బస్సు స్టాప్ దగ్గరి మనుష్యులే కాక, దారేపోయే జనం అంతా ఆమెను వింతగా చూస్తున్నారు. బస్సుల్లో, కారుల్లో, రిక్షాల్లో ప్రయాణం చేసే ప్రజల చూపులన్నీ ఆమెమీదే వున్నాయి. ఆ చూపుల్లో వున్న కాంక్షను నిర్లిప్తంగా వర్ణించటం కష్టం. వాళ్ళు ఆమెవైపు చూచిచూచి తమలో తాము ఏవో గుసగుసలు పోతున్నారు. హేళన చేస్తున్నారు. క్రౌర్యం వెలిబుచ్చుతున్నారు.

ఒకసారి మానవలోకం అంతా ఎందుకు తల్లడిల్లి పోతూ వుందో నారాయణరావుకి అర్థం కాలేదు. ఆ దృశ్యం చాలా ఘోరంగా కనుపించింది. ఎవ్వరయినా పురికొల్పే వారుంటే ఆ జనం యావత్తూ వడ్డించిన విస్తరిమీద కుక్కలు పడినట్లు పడి ముక్కలు ముక్కలుగా చీల్చి వేయగలరని అనిపించింది.

తన ప్రాణం ఎంత ప్రమాదంలో వుందో ఆమెకు తెలియదు. ఒక సన్నని పోటి దారం మీద ఆధారపడి వుందని ఆమెకు లీలగా కూడా అనుమానం రాలేదు. ఆతురతగా బస్సు కోసం నిరీక్షిస్తూ నుంచొని వుంది.

కాస్త దూరంలో వున్న యువకులు ఆమెను చూచి చూచి బూతులు తిట్టుకుంటున్నారు.

ఈ క్రౌర్యానికీ, ఈ బూతులకూ కారణం అతనికి తెలుసు. అంటిపెట్టుకున్న దుస్తులు ధరించటం వల్ల ఆమె

శరీరంవంపులు చూసే వారికి స్పష్టంగా కనిపిస్తున్నాయి. స్త్రీశరీరంవంపులు చూసే అవకాశం వాళ్ళకు లేదు. అందువల్ల వాళ్ల మనస్సులు ఆకర్షించబడినై. ఒక రకం మనుష్యులు అందాన్నీ, ఆకర్షణనీ తట్టుకోలేరు. అంతేకాదు, తమ ఆవేశాన్ని బూతుల రూపంలో వెలిబుచ్చుతారు.

సినిమా చూచి బయటకు వచ్చే ప్రేక్షకులు తమ ఆనందాన్ని వెలిబుచ్చే రీతి నారాయణరావుకి అనుభవంలో వున్న విషయమే.

"ముండ ఏం చేసిందిరా ?" అంటారు కథానాయికను ద్దేశించి.

"తొత్తుకొడుకు ఎంత బాగా నటించాడురా!" అంటారు కథానాయకుణ్ణి ఉద్దేశించి.

కొందరిలో అందం, ఆనందం భావోద్రేకాలనూ, ఆవేశాలనూ ప్రేరేపిస్తాయి. వాటిని ఈ రూపంలో వాళ్ళు గాలికి వొదులుతారు. ఆ క్షణం వాళ్ళకే ఏలు చిక్కితే రాక్షసులకు మల్లేనే ప్రవర్తిస్తారు.

ప్రక్కన వున్న మానవుల వైఖరిని చూస్తే నారాయణ రావుకి భయం వేసింది. ఆగ్రహం కలిగింది. దూరంగావున్న కుర్రవాళ్ళు గమనించేటట్లు తుపుక్కున ఊశాడు. ఆకలి మీద వున్నాడేమో దాని ధ్వని అతను ఆశించిందానికంటే పెద్దగా వినిపించింది. అంతా అతని వంకకు తిరిగారు. ఆమె మీద అయిష్టం ప్రకటించటానికని అతను ఆ పని చేశాడనే దురభిప్రాయంతో బిగ్గరగా, ఏక గ్రీవంగా నవ్వారు.

అతనికి కోపం హెచ్చింది. వొక్క క్షణం వుంటే

ఏమయ్యేదో, భగవంతుని దయవల్ల జంయిమని బస్సు రానే వచ్చింది. ఆగనే ఆగింది.

జనం త్రోసుకుంటూ బస్సు ఎక్కటానికి తోసుకు వెళ్లారు. ఆమె కదల్లేదు. ఆమెను ఎక్కనివ్వకుండా చెయ్యాలనే అపేక్ష కూడా వాళ్లకు లేకపోలేదు. లేకపోతే ఆమెను అంత అందంగా ఎవ్వరు వుండమన్నారు? అటువంటి దుస్తులు వేసుకోమని ఎవరన్నారు? ఆ లిప్స్టిక్ ఏమిటి దాని మొహం.

అటువంటి సమయాల్లో లోపలి ప్రయాణీకులు బస్సు దిగేదాకా ఆగదు జనం. వాళ్ళు దిగకముందు బస్సు ఎక్కరని వాళ్ళకి తెలుసు. అయినా ఎవ్వరు ముందు ఎక్కిపోతారో అనే తహతహలో నెట్టుకుపోవటమే వాళ్ళకు పరమావధి.

"ప్రయాణీకులను దిగనివ్వండి," అని కేకవేశాడు కండక్టరు. అప్పటికీ ఆగకపోతే ఎక్కే జనాన్ని వెనక్కు నెట్టాడు. జనం కొంచం సర్దుకుంది. దిగవలసిన ప్రయాణీకులు ఇంకా ఇద్దరు ముగ్గురు వుండగానే జనం మళ్ళీ తోపుడు మొదలుపెట్టింది.

ఆ ఆంగ్లో ఇండియన్ యువతి అప్పుడు కదిలింది.

జనం వెనక నిలబడి, "దారి ఇవ్వండి దయచేసి" అన్నది.

ఆ మాటల్లో ఏమి మహత్యం వుందో ఏమో? జనం హఠాత్తుగా ఆగిపోయింది. మరుక్షణం రెండుగా చీలిపోయినది. శ్రీరాములవారు నారి సారించేటప్పటికి దారి ఇచ్చిన సముద్రంలాగు చీలిపోయింది. ఆ ఆంగ్లో ఇండియన్

యువతి టకటక బస్సు ఎక్కి కూర్చుంది. ఆమె నడకలో వున్న ఫూపుకి నారాయణరావు ముగ్ధుడయ్యాడు.

ఆమె ఎక్కి కూర్చోగానే ఎక్కనిచ్చినందుకు ఆ జనంలోని ప్రతివ్యక్తికీ పక్కనున్న వ్యక్తిమీద కోపం వొచ్చింది. ఆ కోపం పట్టలేక నెట్టుకోవటం ద్వారా వొకరి మీద వొకరు ప్రదర్శించుకుంటూ అంతా బస్సు ఎక్కారు.

బస్సు కదిలింది. నారాయణరావు ఎక్కబోతే, "ఖాళీ లేదు" అన్నాడు కండక్టరు.

అతను అంతమాట ఎలా అనగలిగాడో అతనికి అర్థం కాలేదు. పెద్దమనిషితరహాగా ప్రవర్తించినందుకు ప్రతిఫలమా ఇది !

ఈ బస్సులకు బుద్ధిలేదు. బుద్ధివుంటే రూల్సు ప్రకారం నిలబడివున్న వాళ్ళకే అగ్ర తాంబూలం ఇచ్చేవి. అవి అసలు రూల్సును వర్తింపచెయ్యటం లేదా అంటే చేస్తున్నవి. కాని తనను ఎక్కించుకోకుండా వుండే అంతవరకే వర్తింపజేస్తున్నవి

అందని బస్సు అందకపోగా, అంతమంది ఎక్కగా, తాను ఎక్కలేకపోయినందుకు, ఎవ్వరయినా చూచి నవ్వుతారేమో అని భయం వేసింది నారాయణరావుకి.

తాను బస్సు ఎక్కటానికి కాక ఏదో వెతుక్కోవటానికి నాలుగు అడుగులు ముందుకు వేసినట్టు నటించి, ఈల వేసుకుంటూ వెనుతిరిగి మళ్ళీ యథాస్థానంలో నిలబడ్డాడు. యథాస్థానంలో నిలబడితే జనం గ్రహిస్తారనే శంకతో, ఈల వేసుకుంటూ అటూ ఇటూ తిరగ నారంభించాడు.

అతను ఇన్ని చేసినా ఇంకొక మార్గాన వెళ్లే బస్సు కోసం వేచివున్న ప్రయాణీకులు గ్రహించనే గ్రహించారు, నవ్వనే నవ్వారు.

'వస్తానన్న స్నేహితుడు రాలేదే,' అనుకున్నాడు కాస్త బిగ్గరగా, తాను బస్సు దగ్గరకు వెళ్ళింది దిగవలసిన స్నేహితుడికోసం అనే భ్రమను వాళ్ళకు కలిగిద్దామనే ఉద్దేశంతో.

వాళ్ళు నమ్మినట్లు లేరు. ఏదో గుసగుసలాడుకొని నవ్వుకున్నారు.

ఇక అక్కడ ఎలా వుండేటట్లు? వాళ్ళ కండ్లముందే బస్సు ఎట్లా ఎక్కేటట్లు? అలా బస్సు ఎక్కితే ఇందాక ప్రయత్నించీ బస్సును అందుకోలేని నిర్భాగ్యుడు తానని తేల్చుకుంటారు. ఇంకా నవ్వుకుంటారు. ఇళ్ళకు వెళ్ళి తాను చేసిన తతంగం అంతా భార్యలకు చెప్పుకుంటారు.

వాళ్ళు 'వాడికి అదేం రోగం,' అని బుగ్గన వేలు వేసుకుంటారు.

తనను చూడటానికని ఇరుగుపొరుగు అమ్మలక్కలను కలుపుకొని తన ఆఫీసుకి వచ్చినా రావొచ్చు.

'ఎందుకువచ్చిన గొడవ ఇది?' అనుకున్నాడు నారాయణరావు. మరొక స్టాప్‌దగ్గర బస్సు ఎక్కటం మంచిదని నిర్ధారించుకున్నాడు. స్నేహితుడు రాకపోవటంవల్ల హతాశుడై ఇంటికి తిరిగి వెళ్తున్నట్టు నటించి దగ్గరవున్న మరొక బస్సుస్టాప్ దగ్గరకు నడిచాడు.

అతను లక్ష్మణకోటిశాస్త్రి ఇంటికి వెళ్ళేటప్పటికి ఎనిమిదిన్నర అయింది.

లక్ష్మణకోటిశాస్త్రిది అసలు కృష్ణాజిల్లా, దివి తాలూకాలోని ఒక గ్రామం. వారిద్దరు అన్నదమ్ములు. అతను చిన్నవాడు. మొదట్లో ఆ కుటుంబం భూవసతిగల కుటుంబమే. పైగా అతని అన్న జమీందారు తరఫున ఆ పరిసర గ్రామాలమీద మేనేజరుగా వుండేవాడు. అయితే ఆయన జీవితం వేదాంతపరం చేసి, ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాడు. జమీందారు ఆయనచేసిన సేవకు మెచ్చి నాలుగు ఎకరాల మాగాణి భూమి ఉచితంగా ఇస్తానన్నా తీసుకోలేదు. అజమాయిషీ లేకపోవటంవల్లా, ఖర్చు పెరిగిపోవటంవల్లా క్రమ క్రమేణా వాళ్ళ ఆస్తి హరించుకుపోయింది.

లక్ష్మణకోటిశాస్త్రి బి. ఏ. ప్యాసయ్యే నాటికి నాలుగు ఎకరాలు మాత్రమే మిగిలితే, ఎటుపోయి ఎటు వచ్చినా మంచిదని వృద్ధురాలయిన తల్లికి ఒక ఎకరం రాసిఇచ్చి ఇద్దరూ చెరొక ఎకరంన్నరా పంచుకున్నారు. తరువాత లక్ష్మణకోటిశాస్త్రి వూరువిడిచి ఉద్యోగంలో జేరాడు. అన్న ఇంకా అదేగ్రామంలోనే వుంటున్నాడు. తల్లి అన్నతోనే వుంటూ వుంది.

అన్న ఆధ్యాత్మిక చింతలో మంచి పేరు ప్రఖ్యాతులైతే సంపాదించాడుగాని, ఆ సాధనలో అతని వాటాకు వచ్చిన ఒకటిన్నర ఎకరం భగవదార్పితం అయింది. ఇక ఆతని కుటుంబం మొత్తానికి మిగిలింది తల్లిపేర వున్న ఒక్క-

ఎకరమే. అయినా ఆయన గౌరవంగానే కాలక్షేపం చేస్తు న్నాడు. ఏనాడూ తమ్ముణ్ణి ఏ సహాయమూ అర్థించి ఎర గడు. గత సంవత్సరం వరకూ తమ్ముని పొలం అతనే కవు లికిఇచ్చి, రాబడి లెక్క ప్రకారం పంపుతూ వుండేవాడు.

గత సంవత్సరం హైదరాబాద్‌లో ఇల్లు కట్టించుకోవాలనే ఉద్దేశంతో లక్ష్మణకోటిశాస్త్రి ఆ పొలం అమ్మాడు. ఆ పనికూడా అన్న చేతులమీదుగానే జరిగింది. ఆ డబ్బుతో స్థలంకొని, ప్రభుత్వ సహాయంతో ఇల్లు కట్టించాడు లక్ష్మణకోటిశాస్త్రి.

అప్పటినుంచీతను ఆయింట్లోనే వుంటున్నాడు. చిన్న తనంలోనే ఒడుదుడుకులకు లోనయిన వాడవటంవల్ల అతను జీవితం చాలా క్లుప్తంగా జరపటం నేర్చుకున్నాడు. తన హుందాకు తగినట్లు ఖర్చుపెట్టే మనిషే అతను. అయితే లెక్క ప్రకారం ఖర్చుపెడతాడు.

అతనికి పిల్లలు లేరు. అది అదృష్టమని అతనూ, కొరత అని అతని భార్యా అనుకుంటూ వుంటారు.

అతను ఏపని చేసినా భార్యను సంప్రదించకుండా చెయ్యడు. అందుకని ఆనాడు ఆఫీసునుంచి రాగానే, "నారాయణరావు వంద రూపాయలు అప్పివ్వమని అడి గాడు," అని చెప్పాడు.

"వందరూపాయలా?"

"అతనికి ఏవో పెద్ద అవసరం వచ్చిపడిందట! నాలుగురోజుల్లో సర్దుతానన్నాడు."

"మనకెక్కడివి ఇవ్వటానికి" అని అడిగింది ఆమె అయిష్టంగా.

"నీ దగ్గర వుండాలనుకున్నానే."

"మీా రిచ్చిన డబ్బు ఇంకా నా దగ్గర కూర్చున్న దనుకున్నారా? ఎప్పుడో అయిపోయింది. వాసంతికమ్మ దగ్గర ఇవ్వాళ పది రూపాయిలు అప్పు తెప్పించాను కూడాను...."

అవన్నీ అబద్ధాలే అని లక్ష్మణకోటిశాస్త్రికి తెలుసు. ఆమెకు ఇతరులకు అప్పు ఇవ్వటం సుతారమూ ఇష్టం వుండదు. ఆమెకే కాదు, ఏ ఆఫీసరు భార్యకైనా అంతే.

ఆఫీసరుకు పదిమందితో తిరిగేవాడు గనుక ఎంత ఒద్దనుకున్నా కొన్ని మొహమాటాలు వస్తాయి. ఇంట్లో నాలుగు గోడలమధ్య కూర్చునే ఆయన భార్యకు అటువంటి ఇబ్బందులు వుండవలసిన అగత్యం ఏముంది? అందుకని ఇటువంటి విషయాల్లో ఆమె కచ్చితంగా వుండగలదు. అప్పుడు ఆమెకు చెప్పి ఒప్పించటం కూడా కష్టమే. అయి నప్పటికీ ఒకొక్కప్పుడు ఇటువంటి ప్రమాదాలకు లోను కావలసిన ప్రమాదం వొస్తూవుంటుంది.

"ఏమిటి ఆలోచిస్తున్నారు"

"అబ్బే ఏమీాలేదు."

"అప్పారావుకి ఇస్తానని మాట యిచ్చారా ఏమిటి?"

మాట యిచ్చానని గట్టిగా చెప్పటం భయంవేసి, "ఇచ్చానంటే... వొకరకంగా ఇచ్చాను" అన్నాడు.

"వెనకా ముందూ చూచుకోకుండా అడిగిన వాళ్ళ కల్లా ఎందుకండీ మాట ఇవ్వటం? ఇటువంటివి పెట్టుకో వద్దని ఎన్నిసార్లు చెప్పాను? అప్పిస్తే విరోధం కొనితెచ్చుకున్నట్టే అవుతుందని మనం ఎన్నిసార్లు చెప్పుకోలేదు?"

"నిజమే—పాపం, కష్టంలో వున్నానని ప్రాధేయ పడ్డాడు" అని ఆమెకు జాలి కలిగించాలనే ఉద్దేశంతో అన్నాడు లక్ష్మణకోటిశాస్త్రి.

"అప్పు అడిగేవాళ్ళు కష్టాల్లో వుండి అడక్క సుఖాల్లోవుండి అడుగుతారటండీ, మీ వెర్రిగాని? సరే మాట అంటేమాత్రం ఇప్పుడొచ్చిన ఉపద్రవం ఏముంది? ఇంట్లో వున్నదనుకున్నాను, లేదు అని చెప్పండి. ఏవో చీరెలు అమ్మకానికి వస్తే నా భార్య ఖర్చుపెట్టింది అని చెప్పండి. అతను తప్పితే తలకెత్తేది ఏమీ వారిగిపోవు."

"ఇస్తాను. ఇంటికి రమ్మన్నాను" అన్నాడు లక్ష్మణకోటిశాస్త్రి ఇంటి కప్పువైపు చూస్తూ. అటువంటి సందర్భాలలో భార్యముఖం చూడలేడు అతను.

"రమ్మంటే రమ్మన్నారు. అబద్ధాలు ఆడకుండా వుండటానికి మనమేం సత్యహరిశ్చంద్రులమా? అప్పు లిస్తానని వీపున అట్టలు కట్టుకు కూర్చున్నామా?"

"చీటికీ మాటికీ అప్పులడిగే మనిషి కాదు అతను. ఎంత ఇబ్బందిలో వుండి అడిగాడో!" అన్నాడు. వీలైనంత సౌమ్యంగానే అన్నాడు. ఆమెకు కోపం తెప్పిస్తే పని జరగదని అతనికి తెలుసు.

"ఇంకేం ? మీకంత జాలిగావుంటే ఇచ్చుకోండి. నా చేతిలో మాత్రం చిల్లిగవ్వకూడా లేదు. వుంళ్ళోళ్ళవన్నీ మనకే కావలసివస్తాయి. మనకు అక్కరలేంది లేదు" అని విసురుకుంటూ ఆమె ఇంట్లోకి వెళ్ళిపోయింది.

"నాలుగు రోజుల్లో తప్పకుండా ఇస్తాడు. మాట తప్పేరకం కాదు" అన్నాడు వెళ్ళిపోతున్న ఆమెకు వినబడే టట్లు.

"ఇస్తాడో, చస్తాడో. ఆ సంగతులు నాకు తెలి యవు" అన్నదామె రివ్వున వెనక్కు తిరిగి.

లక్ష్మణకోటిశాస్త్రి ఆలోచనలో పడ్డాడు. నారా యణరావుకి డబ్బు ఇవ్వాలనే వుంది అతనికి. కాని ఎలా ఇవ్వాలో అతనికి బోధపడలేదు. ఆఫీసర్లు అందరికిమల్లే అతనూ నెలజీతం తీసుకువచ్చి భార్య చేతుల్లో పోస్తాడు. అంతా ఆమే వాడుతుంది. ఆమెకు తెలియకుండా ఇవ్వటం అనేది కుదరదు. ఆమె వొప్పుకోదనేది తేలింది. గట్టిగా అడిగితే గగడ అవుతుంది. ఆ రగడ రేపిన దుమారం కనీ సం వొకనెల రోజులైనా అతనిని వెన్నాడుతుంది. అది భరించటం కష్టం.

లక్ష్మణకోటిశాస్త్రికి బ్యాంక్‌లో కొద్దిగా డబ్బు వుంది. దానిచెక్ పుస్తకం అతనిదగ్గరే వుంది. వంద రూపాయలకు ఒక చెక్ వ్రాసి నారాయణరావుకి ఇవ్వ వచ్చు. కాని దానికివుండే ఇబ్బందులు దానికి వున్నాయి. అతనిభార్యకు అప్పుడప్పుడూ చెక్ పుస్తకం తిరగవేసి, ఎవ్వరికి ఎంత ఇచ్చిందీ తెలుసుకునేందుకు కౌన్టర్

ఫాయిల్స్‌మీద పేర్లు చూసే అలవాటు వుంది. కౌన్సర్ ఫాయిల్ లేకుండా చేసినా, చెక్ నెంబర్లను ఏం చేసేట్టు?

అసలు మొదటే నా వల్లకాదని చెపితే బాగుండి పోయేది అనుకున్నాడు లక్ష్మణకోటిశాస్త్రి. తన భార్య మాటే నిజం. ముఖమాటపడటం ఎందుకు, ఈ కష్టం నెత్తికి తెచ్చిపెట్టుకోవటం ఎందుకు? అంత్య నిష్ఠూరంకంటే ఆదినిష్ఠూరం మంచిదని పెద్దలు అందుకే చెప్పారు.

అతను భోజనంచేసి కూర్చొని మనస్సులో యీ విషయమే చర్చించుకుంటున్నాడు. ఆలస్యం అయింది గనుక నారాయణరావు రాడు అనుకున్నాడు. బహుశా అతనికి ఎక్కడయినా దొరికి వుంటుంది.

అంతలోకి అతను రానేవచ్చాడు.

బయటనుంచి, "లక్ష్మణకోటిశాస్త్రిగారూ" అని పిలిచాడు.

ఆ పిలుపుకు లక్ష్మణకోటిశాస్త్రి ఒళ్ళు ఝల్లు మన్నది. రోటిలో తల దూర్చి, రోకటిపోటుకి జంకటం ఎందుకు? సమస్యను ముఖా ముఖి ఎదుర్కోవటం తన కర్తవ్యం అనుకున్నాడు.

"లోపలికి రావోయ్" అన్నాడు.

నారాయణరావు అతను కూర్చున్న గదిలోకిఅడుగు పెట్టాడు.

"కూర్చో."

అతను లక్ష్మణకోటిశాస్త్రికి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

ఒక్క క్షణం ఎవ్వరూ మాట్లాడలేదు. ఎలా అడగాలో నారాయణరావుకీ, ఏం చెప్పాలో లక్ష్మణకోటి శాస్త్రికీ తెలియలేదు.

కాని ఎంతసేపు అలా కూర్చోగలరు ?

"ఆలస్యంగా వొచ్చావేం?" అని అడిగాడు లక్ష్మణ కోటిశాస్త్రి.

"పని పూర్తి చేసుకొని బయలుదేరేప్పటికి ఆలస్యం అయింది. దానికి తగినట్లు మొదటిబస్సు అందలేదు" అన్నాడు నారాయణరావు.

మళ్ళీ కాసేపు నిశ్శబ్దం.

"డబ్బు కావాలన్నావు కదూ?"

"అవును."

"అంత అర్జంటా?"

"అర్జంటే"

"ఇవాళ ఎలాగూ చీకటి పడింది. రేపు తీసుకు వెళ్ళ గూడదూ?"

"శ్రమ అనుకోకపోతే, ఇప్పుడిస్తే సంతోషిస్తాను."

"ఇప్పుడే కావాలా?"

"ఎంత అర్జంటుగా ఇవ్వగలిగితే...."

"అంత అవసరం ఏమొచ్చింది నెల నెలా జీతం తీసుకునే నీకు?" లక్ష్మణకోటిశాస్త్రి ధోరణి నారాయణ రావుకి ఏమీ బాగాలేదు. అయినా కార్యార్థి గనుక

నోర్పు వహించటానికి ప్రయత్నించాడు. ఆకలితో వశం తప్పివున్న తన శరీరం ఎక్కడ ఎదురు తిరుగుతుందో అని వస్తాయించి, "ఒక స్నేహితుడికి కావలసివచ్చింది. అతని భార్యకు సుస్తీగా వుంటే హాస్పిటల్లో జేర్పించాడు. డాక్టరు మందులకు డబ్బు తెమ్మన్నాడు. ఇవ్వాళ ఇంజెక్షన్ ఇవ్వకపోతే ప్రమాదం అన్నాడు."

"ఏం సుస్తీ ఆమెకు?" అని అడిగాడు లక్ష్మణకోటి శాస్త్రి.

పెద్ద అబద్ధం ఆడేశక్తి లేక, "ఆమెకు గర్భిణి" అన్నాడు నారాయణరావు.

"ప్రసవానికి జేరిందా?"

"కాదు" అన్నాడు నారాయణరావు. ఈ ప్రశ్నలకు అతనిలోనుంచి కోపం పుట్టుకువస్తూంది. తాను అడిగింది అప్పు. దానం కాదు. దానిని తీర్చేమాట నిజం. అందుకు ఇంత ఆరా తియ్యటంలో అతనికి అర్థం కనుపించలేదు. ఉన్న సంగతి ఉన్నట్టు చెప్పివేద్దామన్నంత వేదన కలిగింది.

"మరేమిటి జబ్బు?" అని అడిగాడు లక్ష్మణకోటి శాస్త్రి.

ఈ ప్రశ్నకు నారాయణరావు వెంటనే సమాధానం చెప్పలేదు.

సమాధానం చెప్పటానికి జంకుతున్నాడని గ్రహించాడు లక్ష్మణకోటిశాస్త్రి. జబ్బేదో చెప్పటానికి జంకవల

సిన పనేమి వుంది ? గర్భిణీ స్త్రీ ప్రసవానికి కాకపోతే! ఆక స్మాత్తుగా అతనికి వొక అనుమానం కలిగింది. పూర్వం స్త్రీకి నెల తప్పితే ఇంటిల్లపాదీ మహదానందం అనుభవించే వారు. ఇప్పుడు నెల తప్పిందగ్గరనుంచీ దడదడే. పైగా పిల్లలు కలగకుండా వుండగలందులకు అనేక మార్గాలు అనుసరిస్తున్నారు. నెల తప్పకముందే కాదు, తప్పిన పిదప కూడా. ఇది అటువంటి కేసు కాదుగదా !

"చూడు నారాయణరావు,"

దిక్కులు చూస్తూ కూర్చున్న నారాయణరావు తన దృష్టిని అతనిపైకి ప్రసరించాడు.

"నీ స్నేహితుడు తన భార్యను హాస్పిటల్ లో జేర్పిం చింది అందుకా?"

నారాయణరావు అతని ఉద్దేశం గ్రహించాడు. "అందుకే !" అన్నాడు.

ఇంతవరకూ డబ్బు ఇవ్వలేనని చెప్పటానికి అవ కాశం కోసం వెతుకుతున్న లక్ష్మణకోటిశాస్త్రి 'అందుకే' అనే మాట విని పెద్ద నిట్టూర్పు విడిచాడు.

"ఎంత అన్యాయం ! ఇంకా చెప్పావు నయం. లేక పోతే ఈ పాపకృత్యంలో నేనుకూడా భాగస్వామిని అయ్యే వాణ్ణి. ఎంత దారుణం. వొక నిండు జీవితాన్ని పొట్టన పెట్టుకోడానికి సిద్ధపడుతున్న నీ స్నేహితుడు ఎంతటి కిరాత కుడయ్యా !" అని తన ఏవగింపునూ, ఆశ్చర్యాన్నీ కలిపి వెలిబుచ్చాడు. వాటితో అప్పు ఇవ్వకుండా తప్పించుకునే అవకాశం దొరికిందనే ఉత్సాహాన్ని మిళితం చేశాడు.

"నీకు తెలియదులే అతని బాధ," అన్నాడు నారాయణరావు పెళ్ళగిలి వస్తున్న కోపాన్ని ఆపుకుంటూ.

"నాకు తెలియకపోవటం ఏమిటి ?"

"నీకూ (ఏడుగురు అంటే తన సంగతేనని ఎక్కడ అనుకుంటాడోనని) ఆయి దారుగురు పిల్లలుంటే తెలిసేది"

"పిల్లలు బరువా ?"

"డబ్బు చాలని వాడికి బరువే."

"డబ్బులు చాలకపోతే ఇంకా కష్టపడి సంపాదించుకోవాలి గాని పుట్టబోయే పిల్లల పీకెలు నులిమి వేస్తారా ? భ్రూణ హత్యకు పూనుకుంటారా? ఇక రాక్షసులకూ, మనుష్యులకూ భేదం ఏముంది ? నా మాట విని ఇటువంటి పనులకు పూనుకోవద్దని నీ స్నేహితుడికి చెప్పు. పశువులాగు ప్రవర్తించవద్దను. దీనివల్ల అతని భార్య ఆరోగ్యంకూడా పూర్తిగా చెడిపోతుంది."

"ఆ ప్రమాదం లేదు" అన్నాడు నారాయణరావు తనకు తానే చెప్పుకుంటున్నట్లు.

"ఎందుకని ?"

"ఆమె ఆరోగ్యం నిరంతరం కాన్పులవల్ల చెడవలసినంతకు చెడే వుంది."

"అతనికి ఎంతమంది పిల్లలేమిటి ?

"ఏడుగురు" అన్నాడు నారాయణరావు అనాలోచితంగా. వెంటనే తన తప్పు గ్రహించాడు. భార్యను ఆసుపత్రికి పంపిన వ్యక్తికీ, తనకీ ఏడుగురు పిల్లలే. తన సంగతే

తన స్నేహితునిమీద పెట్టి చెప్తున్నాడని లక్ష్మణకోటి శాస్త్రి అనుమానించడు గదా!

అప్పు ఇవ్వకుండా ఉండటానికి అవకాశం కోసం వెతుకుతున్న శాస్త్రి ఈ గొడవలో లేడు. అతను తనకు ఆ అవకాశం దొరికిందనే ఉత్సాహంలో వున్నాడు.

"నీ స్నేహితునికి బుద్ధిలేదా నారాయణరావు? ఏడు గురు పిల్లలేమిటి? ఏడుగురు పిల్లలు పుట్టేదాకా ఏం చేస్తు న్నాడు? నిద్ర పోతున్నాడా? మనం చదువుకున్న వాళ్లం. జీవితాన్ని ప్లాన్ చేసుకోవాలి. ముందు ఆలోచన వుండాలి. అనాలోచితంగా జీవితాన్ని నడిపి, వాళ్ళనీ వీళ్లనీ డబ్బు ఇవ్వమంటే ఎవ్వరిస్తారు? అసలు ఇంతకీ కొంతమంది ఇత రులను డబ్బివ్వమని ఎలా అడుగుతారో నాకు బొత్తిగా అవగాహన కాకుండా వుంది. ఇంత అపస్యంగా ప్లానూ, పాడూ లేకుండా జీవితం నడిపేవాడు అప్పు మాత్రం ఎలా తీరుస్తాడు. దేనికైనా ప్లాను వుండాలి," అన్నాడు.

ఈ మాటలకు నారాయణరావు శరీరం వుడికింది. డబ్బు ఆశ వొదులుకో బుద్ధి అయింది. "కబుర్లు చెప్పటం తేలికే!" అన్నాడు.

"ఆచరణలో మాత్రం కష్టం ఏముంది?"

"తలి దండ్రుల కష్టార్జితాన్ని ఉట్టుడియంగా అనుభ వించే నీకు చెప్పినా తెలియదు."

వంట ఇంట్లోనుంచి బయటకువచ్చిన శాస్త్రి భార్య

ఈ మాటలను విన్నది. ఆ మాట్లాడేది నారాయణరావేనని, డబ్బు అడగటానికి వచ్చాడనీ గ్రహించటానికి ఎక్కువసేపు పట్టలేదు. తన భర్త స్వభావం ఆమెకు తెలుసు. ప్రతిదానికీ నీళ్ళు నములుతూ కూర్చుంటాడు గాని, ఏదీ తేల్చి చెప్ప లేడు. ఆపదలోవున్న అతనికి సహాయం చెయ్యటం తన సతీ ధర్మం అని భావించి వాళ్ళు మాట్లాడుకునే గదిలోకి వెళ్ళింది.

ఆమెనుచూచి, 'కొంప మునిగింది' అనుకున్నాడు శాస్త్రి.

తడబడ్డాడు నారాయణరావు. ఎంత ఆకలిగావున్నా అతను పురుషులను ఎదిరించి మాట్లాడగలడేగాని స్త్రీ ఎదుట పిల్లి. ఇది తన తండ్రినుంచి సంక్రమించిన గుణమని అతని అమ్మమ్మ ఎద్దేవ చేస్తూవుండేది.

ఎదురుగావచ్చి నిలుచున్న ఆమెను ఏమనాలో తోచక, "మన నారాయణరావు వచ్చాడు" అన్నాడు శాస్త్రి.

"ఆయన గొంతు గుర్తుపట్టాను" అన్నది అతని భార్య. ఆమెపేరు అనంతలక్ష్మి. ఆమె నారాయణరావుని ఇంతకుముందు ఒకటి రెండుసార్లు చూసింది.

"ఏమండీ, చీకటిపడి ఏమిటి పనిమీద వచ్చారు" అని అడిగింది.

లక్ష్మణకోటిశాస్త్రి వెంటనే సమాధానం చెప్పలేక

పోయాడు. ఏదో ఒక విధంగా సర్ది చెప్పుదామని, "ఇందాక నీకు చెప్పానుగదా. అతనికి కొద్దిగా డబ్బు అవుసరం వుండి అప్పు అడిగాడని. ఆపనిమీద వొచ్చాడు."

"మరి మీ ఉద్దేశం చెప్పకుండా ఎందుకింకా నానుస్తున్నారు. ఆయనకు ఇంటిదగ్గర అనేక పనులు వుంటాయి" అన్నది అనంతలక్ష్మి.

"అదే చెపుతున్నాను" అన్నాడు శాస్త్రి, ఆమె విసరబోయే ఉప్పెనకు భయపడి.

"ఇందులో ఎక్కువసేపు మాట్లాడవలసిందేముందండీ నారాయణరావుగారూ. మీకు డబ్బులు ఎందుకు కావలసి వచ్చిందీ ఇంతకుముందు మీరు మాట్లాడుకుంటూ వుంటే విన్నాను. అటువంటి పాపకృత్యానికి మేము ఏవిధంగానూ సహాయం చెయ్యమండీ. పూర్వజన్మలో ఏపాపం చేశామో ఈ జన్మలో మాకు పిల్లలులేక బాధపడుతున్నాం. ఈ జన్మలో ఈ పాపం మా నెత్తిమీద ఎందుకు రుద్దుతారు. వెళ్ళండి" అన్నది.

"ఇది పుణ్యకార్యమనే నేను అనుకుంటున్నాను," అన్నాడు నారాయణరావు తలవంచుకొని ఆమె ముఖం చూడకుండా.

"మీరు అనుకోవచ్చు. మీకు అలా అనిపించవచ్చు కూడా. కాని డబ్బిచ్చేది మేముగదా. మాకు ఎలా అనిపిస్తున్నది అనేది ముఖ్యం," అన్నది అనంతలక్ష్మి. అని

భర్తవైపుకి తిరిగి, "ఇంకెందుకండీ కూర్చున్నారు?" అని గద్దించింది.

శాస్త్రి లేచాడు.

"అయితే డబ్బు ఇవ్వటానికి వీలు పడదన్న మాటేగా?" అని అడిగాడు.

"నేను చెపుతున్నాగదండీ" అన్నది అనంతలక్ష్మి.

"అతను చెపితే వినాలని వుంది".

ఈ మాటకు శాస్త్రికి కోపం వచ్చింది. "పడదు" అన్నాడు.

"మొదటే ఇంటిదగ్గరవాళ్ళను సంప్రదించి చెపుతానంటే నేను ఇక్కడికి వొచ్చేవాణ్ణికాదు."

"ఈ పాపపు పనికని ముందే చెపితే, ఇవ్వనని అప్పుడే చెప్పేవాణ్ణి" అన్నాడు.

"అయినా ఇంటికివచ్చే చెప్పవలసి వచ్చేది మీకు" అన్నాడు నారాయణరావు ...

"ఏమిటండీ మీరు మాట్లాడేది? పుణ్యానికిపోతే పాపం ఎదురౌతుందని, ఏమిటి మీ మాటలు? డబ్బు ఇచ్చేవాళ్ళం మా ఇష్టమైతే యిస్తాం, లేకపోతే లేదు" అని భర్త మీదకు తిరిగి, "ఇటువంటివాళ్ళతో పెట్టుకోవద్దని మీకు ఎన్నిసార్లు చెప్పాను. మీ తాహతునెరిగి ప్రవర్తించటం మీకు చేతగాదు. అడ్డమైనవాళ్ళకీ అలుసు ఇవ్వటం, నెత్తిన ఎక్కించుకోవటం, తరువాత మొట్టి

కాయలు వేస్తున్నారని దిగులుపడటం, ఇదేగా మీరు చేసే పని. ఎక్కడవాళ్లని అక్కడ వుంచటం చేతనైతే ఇటువంటి వాళ్ళంతా మన గడపతొక్కేవాళ్ళా. గజెటెడ్ ఆఫీసరు అయ్యా మీకు గుమాస్తాబుద్ధి పోదాయె. ఉద్ధరించారు లెండి, ఉద్ధరింపు. పదండి లోపలకు" అని భర్తను లోపలకు తీసుకువెళ్ళింది అనంతలక్ష్మి.

నారాయణరావు ఒక్కక్షణం అక్కడే నిలబడ్డాడు. అతను వెళ్ళకపోవటం చూచి, "వెళ్లరేం, వెళ్ళండి" అని లోపలనుంచే కేక వేసింది.

"మీతో వొకమాట మాట్లాడి వెళ్ళాలని వుంది," అన్నాడు నారాయణరావు.

"నాతో మాట్లాడవలసిందేమీ లేదు. వెళ్లండి"

"మాట్లాడకుండా వెళ్లదలచ లేదు."

ఈ మాటకు ఇల్లంతా ఒక్కక్షణం నిశ్శబ్దం అయింది. అనంతలక్ష్మి వొణికిపోతూ భర్తతో ఆడుతున్న గుస గుసలు. పంపులోనుంచి వొస్తున్న గాలి కెరటాలకు మల్లే నారాయణరావు చెవులకు సోకినై. "నా మాట వినండి. అతన్ని చూస్తుంటే నాకేదో భయంగావుంది. ఏ అఘాయిత్యానికి పాల్పడతాడో .... పోలీసులకు ఫోను చెయ్యండి," అన్నది భర్తతో.

'నువ్వూరుకో' అన్నాడు లక్ష్మణకోటిశాస్త్రి. "అతను అటువంటివాడు కాదు."

"మొన్నటికి మొన్న మన పక్కయింట్లోనే గదండీ పెద్దమనిషిలాగావొచ్చి వొక ఆగంతకుడు వొంటరిగావున్న ఆ ఇల్లాలిని పొడిచి నగలన్నీ కాజేసుకు పోయింది. ఎందుకైనా మంచిది పోలీసులను పిలవండి" అంటున్నది అనంతలక్ష్మి.

"ఫోనుకూడా ఆగదిలోనేవుందే," అంటున్నాడు శాస్త్రి.

ఆమె, 'అయ్యో!' అని కేకవేసి, తలుపు దభాలున వేసి లోపల గడియ వేసుకుంది. వెంటనే గడియవెయ్యటం వల్ల అతనికి దొంగతనం చేసే అవకాశం ఎక్కువ అయిందని భయపడి, తలుపు వోరగాతీసి అతను ఏం చేస్తున్నాడో తెలుసుకోటానికని తొంగిచూసింది.

తొంగిచూస్తున్న ఆమె కండ్లలోకి నారాయణరావు వికటంగా నవ్వాడు. ఆమె అదిరిపడి తలుపు మూసుకుంది. తను నవ్విన నవ్వు తనకే వికృతంగా వినిపించింది నారాయణరావుకి. వికృతంగానేకాదు, వొక కరడుకట్టిన విలెన్ నవ్వుకుమల్లే వినిపించింది. దొంగతనాలు చెయ్యటానికీ చెయ్యకపోవటానికీ, హత్యలుచెయ్యటానికీ చెయ్యకపోవటానికీ తేడా ఎంత స్వల్పమైందో అప్పుడతని మీద పిడుగుపడినట్లు పడింది. ఇతరులను తన్నుచూచినట్లే ప్రవర్తించబద్ధి అవుతుంది మానవునికి. ఆపట్న పక్కగదిలోకి అడుగు పెట్టడమూ పెట్టకపోవటమేగదా, దొంగకీ దొరకీ భేదం. దొంగతనం చేసేటప్పుడు ఇంటి యజమాని అడ్డు

రావటం, రాకపోవటమే గదా హంతకుడికీ దొంగకీ భేదం. ఈ భేదం సూదిబెజ్జం అంతకూడా లేదు. ఆ బెజ్జంలో దూరే దారికంటే పలచగా కనుపించింది నారాయణ రావుకి. ఆక్షణం తన భవిష్యత్తును నిర్ణయించబోతూ వుం దనిపించిందతనికి. వెంటనే ఎక్కడనుంచి వొచ్చిందో భయం అతనిని ఆవహించింది. తొందరగా అతను బయ టకు వెళ్ళిపోయాడు. 'భయం వుండటంకూడా మంచిది,' అనుకున్నాడు. 'భయం ఈ విధంగా ఎంతమందిని అవినీతి పనులు కాకుండా రక్షిస్తూవుందో!' అనుకున్నాడు.

అతనికి ఇంటికి వెళ్ళబుద్ధి కాలేదు. ఆకలితో శరీరం కట్టెబారి, దానివల్ల వచ్చే బాధకూడా కనుపించకుండా పోయింది. అన్నం తిన్నావొకటే తినకపోయినా వొకటే అనిపించింది. ఆ మాటకువస్తే తినటమే కష్టం అనిపించింది.

అది కండెల ఋతువు. జీవకోటికి భూదేవి ఋతువుల ప్రకారం ఆహారాన్ని అందిస్తూవుంటుంది. అన్ని పంటలూ ఎల్లకాలంవుంటే నష్టంఏమిటో! వొకేవస్తువు ఎల్లకాలం అందుబాటులోవుంటే మొహం మొత్తుతుంది అంటారు. ఎందుకు మొత్తుతుంది? మొత్తిందే తింటూ వుండేది. మార్చుకుంటూ నములుతూవుండేది. వొకవేళ మొత్తిందే తినక తప్పదనుకోండి. అయితేమాత్రం నష్టం ఏముంది? ఏడుస్తూ తినవలసివస్తుంది. ఏడుస్తూ తింటేం, నవ్వుతూ తిం టేం? అందులో అతనికి ఏమంతభేదం కనబడలేదు.

పొలాల్లో పనిచేసే వొక పల్లెటూరిస్త్రీ, వొక బస్తా కండెలు రోడ్డుపక్కన పోసుకొని, కుంపటి పెట్టుకొని

కాలుస్తూవుంది. వాటిదుంపతెగ కండెలు వాటి మానాన అవి కాలుకుంటూ పోవు. అలో లక్ష్మణా అంటూ ఏడ వటమో, దారేపోయేవాళ్ళను ఆహ్వానించటమో టపటప శబ్దం చేసుకుంటూ కాలుతై.

ఆ నాః అప్పుడే కోసుకు వచ్చిందేమో, ఆ కండెలు చూడటానికిసైతం చక్కగా వున్నయి. లేతవిలాగుంది, ఆకు పచ్చగావున్నయి. అటువంటివాటిని 'పొత్తులు' అన టం ఎంతో సమంజసంగావుంది.

కాలుతున్న కండెలవాసన బజార్లోకి కొడుతూవుంది. రుచి చూడాలనే కోర్కెను రేపుతూవుంది. వొకప్పుడు ఇటువంటి పదార్థాలను బజారుల్లో పెట్టి అమ్మటం నారాయణరావుకి రోతగావుండేది. కాని ఇటీవల అలా పెట్టటంలో వొక పెద్ద వ్యాపార రహస్యం ఇమిడి వుందని అతను గ్రహించాడు. అలా పెట్టి ప్రజలకు వాటినిచూసే అవకాశం, వాటి సువాసనను ఆఘ్రాణించే అవకాశం కలి గించబట్టే దారేపోయే ప్రతివారికీ కొని తినాలనే బుద్ధి పుడుతుంది. అవి ఏ చాటునోవుంటే వాటిమొహం ఎవరు చూస్తారు? వాటిగిరాకీ తగ్గిపోయి మార్కెట్ ఆర్థికసంక్షో భానికి గురి అవుతుంది. ఈ సంగతి ఆరోగ్యవాదులకు తెలియదు. ఏదోవొక పాయింటు పట్టుకొని వారు ఉపన్యా సాలు దంచివేస్తారు. అందుకనే వారి ఉపన్యాసాలను ప్రజలు హరికథా కాలక్షేపాలనుగానో, ఉత్సవ ప్రదర్శనా లను గానో పరిగణించి ఆ కాసేపూ ఆనందించి ముద్దిదులు పుకు వెళ్ళి పోతున్నారు. వస్తువులు కొనకపోయినా నేలాం

పాడే చోటుకి చాలా మంది ప్రజలు గుమిగూడతారు. వారు వచ్చేది వస్తువులు కొనటానికి కాదు, వేలం పాడే ఆయన స్వరంలోని లయ వింటానికి. ఈ ఉపన్యాసాలకు కూడా అందుకే వస్తుంటారు ప్రజలు. ఇంకెందుకో వస్తున్నారని ఎవ్వరన్నా అనుకుంటే తప్పు వాళ్ళది కాదు.

నారాయణరావుకి చిన్నప్పటినుంచీ కండెలన్నా, రేగి కాయలన్నా, నూనె పకోడీలన్నా ఇష్టం. కండెలు వాళ్ళచేలోనే పండేవి. అతని చిన్నతనంలో పల్లెటూళ్ళల్లో ఎక్కువరకాల పిండివంటలు వుండేవికావు. గారెలు పండుగలకో, పబ్బాలకో చేసుకునేవారు. ఇక మిగిలినవి పకోడీలు. పకోడీలు గారెలు పీల్చినంత నూనె పీలవ్వు. అందుకని ఎక్కువగా పకోడీలే చేసుకునేవారు. అతని అమ్మమ్మ ఎప్పుడూ పకోడీలే చేసిపెట్టేది. అతని ఇంటి దొడ్లో వొక పెద్ద రేగిచెట్టు వుండేది. దానికాయలు తెల్లగా వుండేవి. అంత పెద్దకాయలు అంతకుముందు అతను ఎప్పుడూ చూడలేదు. అవి దోరముగ్గినప్పుడు ఘల్లగా తియ్యగావుండి మహారుచిగా వుండేవి.

చిన్నతనంలో ఎప్పుడూ ఆ చెట్టుక్రిందే వుండేవాడు నారాయణరావు. రాలినకాయలు ఏరుకుతినేవాడు. రాలక పోతే ఎవ్వరూలేకుండాచూచి రాళ్ళతో కొట్టుకుతినేవాడు.

ఎంత పెరిగినా, మధ్యలో ఎన్నిరకాలరుచులకు అల వాటుపడినా, చిన్నప్పటిరుచులే కీలకంగా వుంటాయి కాబోలు! అవి అంతకుముందు అన్నిటితోపాటు వున్నట్లు వుండి, శరీరం వయస్సువల్ల సడలేటప్పటికి విజృంభిస్తాయి.

మరణించేటప్పటికి మానవుడు ఎట్లా పుట్టాడో అట్లాగే మరణిస్తాడు. మధ్యలోవచ్చిన పొరలు వచ్చినట్లే తొలగిపోతై. ఇక ఈజీవితం ఎందుకు? అలా అనుకోటానికి వీల్లేదు. జీవితంయొక్క అనుభవంయొక్క ప్రభావం అనుభవించే ఆత్మమీద ఉంటుంది. అయితే లీలగామాత్రమే ఉండటం వల్ల కనపడదు. అది అంత లీలగావుండేది అవటంవల్లే 'విముక్తి' చెందటానికి వొక్కొక్క వ్యక్తి ఎన్నోజన్మలు ఎత్తవలసి ఉంటూవుంది.

నారాయణరావు ఇన్ని రకాలుగా ఆలోచిస్తున్నా రోడ్డు పక్కన కాలుతున్న కండెలమీదనుంచి మనస్సును త్రిప్పుకోలేక పోయాడు. అందులో ఆకలిగా వున్నప్పుడు మనస్సు చెప్పినమాట వినదు. ఎటుపడితే అటే పోతూ వుంటుంది.

కండెలవాసన అతని నాసికాపుటాలను గిలిగింతలు పెట్టినై. లేత కండెలు అవటంవల్లా, కాలం చలిగావుండటం వల్లా, చాలామంది కండెలు కొనుక్కుంటున్నారు. ఆస్త్రీ వొచ్చినవాళ్ళతో కబుర్లు చెపుతూ, కుంపటిమీద కండెలు పెడుతూ, విసనకర్రతో రివ్వున రివ్వున విసురుతూ, కాలుస్తూ వుంది. ఆ మెపక్కన వొక పల్లెటూరి మనిషి కూర్చుని వున్నాడు. అతను ఏమీ చేస్తున్నట్లు కనపడటంలేదు. చిరిగిపోయిన చారల గొంగళి కప్పుకు కూర్చున్నాడు. చుట్ట కూడా కాల్చటంలేదు. తలవొంచుకొని నేలమీద వేలితో ఏదో రాస్తున్నాడు. అతను కండెలు అమ్మేస్త్రీ భర్త అయివుంటాడనుకున్నాడు నారాయణరావు. తన భార్య

సంపాదిస్తుంటే సిగ్గువేసి అట్లా కూర్చున్నాడు అను కున్నాడు. అహంకారం అనే పాముయొక్క పడగ దెబ్బ తిన్నది. ఆదెబ్బ నసాళానికి అంటినట్లువుంది.

ఆ పరిస్థితుల్లో తానుంటే మహోల్లాసంగా వుండే వాణ్ణి అనుకున్నాడు నారాయణరావు. సంపాదించిపెట్టే వాళ్లుంటే పెట్టిందితిని హాయిగా పరుండక వీడికెందుకో ఇంత దిగులు?

తను ప్రయత్నించకుండానే ఆ స్త్రీ దగ్గరకు వెళ్ళాడు నారాయణరావు.

"వాక్కాక్కకండే ఎంత?" అని అడిగాడు. అతని గొంతు అతనికే నీరసంగా వినిపించింది. ధ్వనికంటే గాలి ఎక్కువగా వచ్చింది.

ఆమె అతనిని ఎగాదిగాచూచి, "ఆరుపైసలు," అన్నది.

"అంటే అణేగా?"

"మీకే తెలవకపోతే సదువురాని దాన్ని నాకు తెలుస్తదా?" అన్నది ఆమె.

తను హాస్యం ఆడుతున్నాడని ఆమె ఆవిధంగా మాట్లాడిందని గ్రహించాడు. అసహ్యం వేసింది.

గుట్టలోనుంచి తనకు మంచిదనితోచిన వాక కండె తీసి, "ఇది కాల్చివ్వు" అన్నాడు.

ఆకండెతీసుకొని మళ్ళీ గుట్టమీదకు విసిరివేస్తూ, "మీరు వూరుకోండి బాబుగారూ, మీకు తెలియదు.

మీకు నేను మంచికండె తీసి ఇస్తాగా," అని వొక కండె తీసి వొలిచి అతనినిచూచి విజయవంతంగా నవ్వింది.

అది నిజంగా మంచి కండే. కండెనిండా గింజలు న్నాయి. పాలుపోసుకొని తెల్లగావున్నాయి.

"యెవరికి ఏది ఇవ్వాలో నాకు మస్తుగా తెలుసు," అంటూ కుంపట్లో వేసింది.

మనొకడువచ్చి కుంపటిదగ్గర కూర్చున్నాడు. "ఇయ్యాళ ఎన్నికండెలు ఇస్తావు?" అన్నాడు.

"నువ్వు తిన్నన్ని" అన్నది కుంపట్లోనికండెలు మాడ కుండా ఇనప పటకారుతో మలుపుతూ.

"సరే కాలువు," అన్నాడు అతను.

కొత్తగా వచ్చినవాణ్ణి కండెలగుట్ట దగ్గరగా కూర్చున్న ఆమెభర్త క్రీగంట చూడటం ఆమె గమనిం చింది. పరచిన బస్తాకిందవున్న వొక అర్ధరూపాయి ఇచ్చి, "సిల్లర తీసుకురా," అని పురమాయించింది.

"నాకెవళ్లిత్తారు!"

"నోరుంటే ఎవ్వాళ్ళయినా ఇత్తారు," అని ఆమె విసురుకుంది.

అతను అయిష్టంగా లేచాడు.

"అత్తమానం ఎదురుగాం కూకుంటాడు. వొక్కపని సెయ్యటం శాతగాదు. ఆ సిల్లర తీసుకొచ్చేనాటికి తెల్లారు తుంది" అన్నది.

"ఆలిస్సెంగా నేరాసీ, దగ్గడగేమొచ్చె," అన్నా డతను.

"అంత కాక!" అన్నది "నువ్వు కూసేపు వోపికపట్టు. ఈయన్ని అంపించి వత్తాం."

త్వరత్వరగా కాల్చి నారాయణరావుకి కండె ఇచ్చి డబ్బు తీసుకుంది.

అది తింటూ అతను బయలుదేరాడు. అతను వీపు తిప్పగానే, "ఇక సెప్పయ్యా, నీ సొదేందో," అని కుంపటి దగ్గర కూర్చున్న అతన్ని అడిగింది వొక కండె అందిస్తూ.

అందరికీ వున్న సొదే. అతని ప్రత్యేకసొద ఏముంది? క్రిమి కీటకాదులనుంచి దేవతలదాకా వున్న సొదే. కాని ఎవ్వరిసొద వాళ్ళకి గొప్పది. ఎవ్వరిసొద వాళ్ళకి యింపు.

ఆసొదలో పడ్డారు వాళ్ళిద్దరూ. ఆమె భర్తకు చిల్లర ఇప్పట్లో దొరుకుతుందా పాడా! చిల్లర తీసుకోకుండా తిరిగి వచ్చే ధైర్యం అతనికి ఏకోశానా లేదు. అలాచేస్తే ఆమె అతనితో కండ్లముందే లేచిపోతుందేమో అనే భయం కూడా అతన్ని కుంగదీస్తూవుంది. ఆసంగతి ఆమెకు తెలుసు. అయినా మంచివాడని అతన్ని విడిచిపెట్ట దలచ లేదు.

కొంతమంది కండెనుంచి సుతారంగా గింజలు వొలుచుకొని తింటారు. అలాతింటే తిన్నట్టు వుండదు నారాయణరావుకి. గింజలు పళ్ళతో పీక్కుతింటేనే అతనికి బాగుంటుంది. అలాగే తింటూ బజార్న బయలుదేరాడు. గింజలేకాక కండెమీదవున్న పైపొరకూడా నోట్లోకి వస్తూ

వుంది. అది వొకందుకు మంచిదే అనుకున్నాడు. చిన్నప్పుడు గింజలుతిని కండె పగులగొట్టి అందులో వుండే తెల్లని పూసకూడా తినేవాడు. అప్పటికదీ బాగానే వుండేది. అప్పటికేమిటి, తినేధైర్యం వున్నవాళ్లకి ఇప్పటికీ బాగానే వుంటుంది.

ఆ వీధిమలుపు తిరిగాడు నారాయణరావు. ఇంకొక వీధిమలుపు తిరిగితే అతని వీధి వస్తుంది. కండె లోపలికి వెళ్లటంతో మళ్ళీ ఆకలి ప్రజ్వరిల్లింది. నూనె పకోడీల మీదకు మనస్సు వెళ్ళింది.

హైదరాబాద్‌లో కారపుసరకూ, తీపిసరకూ తోపుడు బండ్లమీద వేసుకొని అమ్ముతూ వుంటారు. అటువంటి బండి ఎక్కడన్నా కనుపిస్తుందేమో అని చూశాడు. ఆ బండివాళ్ళు మిరపకాయ బజ్జీలుకూడా అమ్ముతూ వుంటారు. ఆ బజ్జీలు అతనికి మరీ కారంగా వుంటాయి గాని, అతని స్నేహితుడొకడున్నాడు అతనికి బలేమోజు. రోజుకుంటూ ఎన్నయినా తింటాడు.

కాని అటువంటిబండి కనుచూపుమేర దూరంలో నారాయణరావుకి ఎక్కడా కనుపించలేదు. అప్పుడతనికి ఇంకొక కండె కొనుక్కున్నా బాగుండేది అనిపించింది. అతనికి అన్నీ అంతే, అవకాశం దాటిపోయిన తరువాత తడుతూ వుంటై.

"చల్, చల్ నవజవాన్, చల్, చల్ బేటా."

'ఎవరది?' ఆ మాటలు బాకులుగా అతని మనస్సు లోకి దిగబడినై. అసలే ఆకలితో మండుతున్న అతనికడుపు సెగలను క్రక్కింది.

'ఎవరు?'

మతిమంతు.

మతిమంతు తను వుండే ఇంటికి పక్కబజార్లో తిరిగే పిచ్చివాడు. అప్పుడప్పుడూ తన బజారుకికూడా వొస్తుంటాడు. అతనిని చూచినప్పుడల్లా పిచ్చివాళ్ళు గంపెడు మురికిగుడ్డలు కప్పుకునేది ఎందుకా అని కారణంకోసం వెతకబుద్ధి అయ్యేది నారాయణరావుకి. వాళ్ళకి వంటిపైన ఏదో ఒక మోత లేకపోతే ఎగిరిపోతామని భయమేమో? ప్రతి పిచ్చివాడికీ గుడ్డలంటే ప్రేమే. బజారున కనుపించే వొక్క గుడ్డపీలికను వాళ్ళు వూరికినే పోనీయరు. అది ఎక్కడపోతుందో నని వొంటిమీదవున్న గుడ్డలకు కలిపి కుట్టుకుంటారు. బర్మావాళ్లు తలకు కట్టుకున్నట్టు ప్రతి పిచ్చివాడూ కాలికి వొక గుడ్డపీలిక కట్టుకుంటాడు.

అంతా అదేవిధంగా ప్రవర్తించటంవల్ల, మానవులకు వర్తించినట్లే ఈ పిచ్చివాళ్లందరికీ వర్తించే సార్వజనీనిక సూత్రాలు కొన్ని వుంటాయి కాబోలు అనుకునేవాడు నారాయణరావు.

మతిమంతు ఇతరులకు అపకారం చేసే పిచ్చివాడు కాడు. తనదారిన తాను వెళ్తుంటాడు. ఎవ్వరిజోలికీ వెళ్ళడు. అయితే ఎప్పుడూ తన మనోవీధిలో కనపడే భార్యా భర్తలను (ముఖ్యంగా భార్యలను) నోటికి వచ్చిన బూతులు

తిడుతుంటాడు. అవికూడా వినలేని బూతులు. వర్ణించి వర్ణించి తిడుతుంటాడు. అవి ఏమిటి అని మీరు అడగనూ గూడదు, నేను చెప్పనూ గూడదు.

ఆ తిట్లనుబట్టో ఏమో, అతని పూర్వజీవితాన్ని గురించి ఒక కథ వ్యాప్తిలోవుంది.

అతను వస్తుతః వున్నవాడనీ, అయితే ఒక దుర్మార్గుడు మిత్రునిగా నటించి అతని భార్యను లేపుకుపోయాడనీ, అప్పటినుంచీ అతను పిచ్చివాడై తిరుగుతూ వున్నాడనీ చెప్పుకుంటూ వుంటారు.

ఇప్పుడు అతని ఆస్థి అతని భార్యా,ఆమె ప్రియుడూ అనుభవిస్తున్నారట. ఇంటికి వెళ్ళినప్పుడు అతనికి ఇప్పుడింత ముద్ద వేసేదికూడా వాళ్లేనట.

మతిమంతు తరచు నారాయణరావుకి కనుపిస్తూ వుంటాడు. ఆఫీసునుంచి వొచ్చేటప్పుడో, వెళ్ళేటప్పుడో ఎప్పుడో ఒకసారి అతను తారసిల్లుతూ వుండేవాడు. మకుటంలేని మహారాజులాగు బజారుమధ్య నిలబడి భార్యలను ఊహించుకొని బూతులు కూసుకుంటూ వుండేవాడు.మధ్య మధ్య తన బూతులకు తానే నవ్వుకుంటూ వుండేవాడు.

అతనిని చూస్తే నారాయణరావుకి భయంగా వుండేది. అతను కొడతాడూ, తిడతాడూ అని కాదు. ఎందుకో! అతనిలాగు తనుకూడా ఒక పిచ్చివాణ్ని అవుతానని శంకకొద్దీ నేమో? జీవితారంభంలో అతనూ తన లాంటివాడే గదా !

మనుష్యుల అందరిలోనూ పిచ్చిగుణాలు వుంటై. ఆ పిచ్చిగుణాలు మెదలకుండా వుంటే మనుష్యులౌతారు. ప్రకోపిస్తే పిచ్చివాళ్ళవుతారు. ఎందుకు, ఎప్పుడు ప్రకోపిస్తాయి అని అడిగితే చెప్పటం కష్టం.

మతిమంతు అడుక్కునేవాడు కాదు. కాని నూటికోటికి ఎవ్వర్నో అడిగేవాడు కాఫీ తాగాలని. అంతకు ముందెన్నడూ అతను నారాయణరావుని డబ్బు అడిగి వుండలేదు. ఒక రోజు ఎందుకు అడిగాడో అడిగాడు. వెంటనే ఎవర్నో అడగదలచి అతన్ని అడిగినట్లు బిత్తరపోయాడు. వెంటనే "వాడు అడగమన్నాడు. (వాడు అంటే భగవంతుడని మతిమంతు ఉద్దేశం) అడిగాను. నేను అందర్నీ అడగను. వాడు అడగమంటే అడిగాను" అన్నాడు.

నారాయణరావు బేడ ఇచ్చాడు.

"చాలు, చాలు" అన్నాడు మతిమంతు.

కాని మళ్ళీ ఎప్పుడూ అతను అడగనూలేదు, నారాయణరావు ఇవ్వనూలేదు.

ఇప్పుడు మళ్ళీ అడగటానికి దగ్గరకు వొచ్చినట్లు వొచ్చాడు.

"కండ తిన్నావా కొంటె నాయాలా?" అన్నాడు. అని తనమాటకు తానే నవ్వుకున్నాడు. అంతలో మనో వీధిలో ఎవ్వరు మెదిలారో ఏమో, భార్యలను బండబూతులు కుయ్యనారంభించాడు.

అదే అదనని తన ఇంటివైపు గబ గబ నడిచాడు నారాయణరావు. ఆకలితో అతని నరాలు జివ్వున లాగినై. ఎవ్వరితోనైనా పోట్లాడితే బాగుండుననిపించింది. ఎవ్వరితో పడితే వాళ్లతో పోట్లాడాలనిపించిది. ఆ అవస్థలో కూడా భార్య జ్ఞాపకంవచ్చి భయం వేసింది.

ఏమంటుందో !

ఇంతసేపు ఎక్కడున్నావంటే ఏమి చెప్పేటట్టు?

అన్నానికి ఎందుకు రాలేదంటే ఏం చెప్పేటట్టు?

అప్పుకోసం వెళ్ళానంటే, 'ఏది ఇట్లా పడెయ్' అని చెయ్యి జాపితే ఏం చేసేటట్టు?

చేతులు పూగించుకుంటూ వచ్చి అప్పుకోసం ప్రయత్నించటంలో ఆలస్యం అయిందంటే ఆమె నమ్మదు. ఎక్కడికో వెళ్ళి ఈ వంక పెడుతున్నాడనుకుంటుంది.

'ఎక్కడికి వెళ్ళావో చెప్పండి' అని కూర్చుంటుంది. ఏ అబద్ధమో చెప్పేదాకా వదలదు. మళ్ళీ ఆ వెళ్ళినచోటు ఆమెకు కోపం తెప్పించేదిగా వుండకూడదు. అటువంటి స్థలాలు తక్కువే వుంటై.

'సినిమాకు వెళ్లాను' అన్నాడు వొక్కసారి.

'డబ్బెక్కడిది?' అని అడిగింది.

'ఒక స్నేహితుడు తీసుకువెళ్లాడు' అన్నాడు.

'ఇవ్వాళ వెళ్ళగానే కాదు. మళ్ళీ రేపు అతన్ని తీసుకువెళ్ళవద్దూ?' అని అడిగింది.

'అతను అటువంటివాడు కాదు' అన్నాడు.

'మన మొహానికి అందరూ మంచివాళ్ళే' అన్నది. అంతటితో ఆగినా బాగుండేది. తటాలున ఏదో జ్ఞాపకం వచ్చి, 'అన్నీ అబద్ధాలే! ఎక్కడికి వెళ్లారో చెప్పండి. ఈ వయస్సులో ఇంత రాత్రి అయ్యేదాకా ఇంటికి రాకపోవటం ఏమిటి? ఎవ్వరన్నావింటే ఏమనుకుంటారు. మీరు చేసే చేష్టలవల్ల ఈ వీధిలో తలెత్తుకు తిరగలేకుండా వున్నాను. చెప్పండి, ఎక్కడికి వెళ్ళి వచ్చారో' అని బోల్డు చెయ్యేసి నిలవేసినట్లు అడిగింది.

'ఛీఫ్ సెక్రటరీగారు పిలిచి, అర్జంటుపని అప్పజెప్పారు. ఈ పని నీవల్లతప్ప కాదన్నారు. పెద్దాయన చెప్పినప్పుడు ఎందుకు కాదనటం అని కూర్చొని ఆ పని పూర్తిచేసి వచ్చా' అంటే ఆమె సంతోషించేది. ప్రశ్నలు వేసేది కాదని కాదు దాని అర్థం.

అయితే అప్పుడు ఆ ప్రశ్నలు ఇంకొక రకంగా వుండేవి.

'మీరుతప్ప ఆ పని ఇంకెవ్వరూ చెయ్యలేరన్నారా?'

'అవును'

'వారి సొంతనోటితోనే అన్నారా? ఎవ్వరితోనైనా కబురు పెట్టారా?'

అబద్ధం ఆడదలచినప్పుడు తడికెలాగు కాక గోడకు మల్లే వుండాలన్నారు పెద్దలు. వాటిసలహా మనస్సులో వుంచుకొని, 'సొంత నోటితోనే' అనేవాడు.

'మిమ్మల్ని తమ గదికి పిలిపించారా, ఆయనే మీ గదికి వచ్చారా?'

'ఆయనే నా గదికి వచ్చారు.'

'ఆయన్ని చూచి అంతా ఏమన్నారు?'

'లేచి నుంచున్నారు.'

'వారు ఇంకా ఏమన్నారండీ?'

'నన్ను పెంచుకుంటా నన్నారు' అని అందామని అతనికి నోటిదాకా వచ్చింది గాని భార్య నోటికి జడిసి, "మంచివాడవోయ్. నీ లాంటివాళ్ళు ప్రభుత్వానికి ఒక ఎసెట్' అన్నారు అని చెప్పాడు.

'ఎసెట్ అంటే ఏమిటండీ?'

'అండ'

'ఎవ్వరికి?'

'ప్రభుత్వానికి'

'ఎవ్వరు?'

'నేను'

'వారే అన్నారా?'

'వారే, వారి సొంతనోటితోనే'

అలా పెరిగిపోయేవి ప్రశ్నలూ, వాటికి సమాధానాలూ.

'అవసిన్నసరే, ఇప్పుడేం చెప్పేటట్టు?' అనే మథనలో పడ్డాడు నారాయణరావు ఇల్లు దగ్గరకు వస్తున్నకొద్దీ.

'ఇవ్వాళ ఆఫీసులో ఒక పెద్ద పార్టీ వుందనీ, దానికి మిని స్టరుగారు కూడా వచ్చారనీ, ఆ పార్టీలో తినక తప్పలేదనీ, అందువల్ల ఆకలి కాలేదనీ, సాయంకాలం మినిస్టరుగారు తమ ఉపన్యాసం వ్రాసిపెట్టగలందులకు కబురు పెట్టారనీ, అది పూర్తిచేసి వచ్చేటప్పటికి ఈ టైమ్ అయిందనీ' చెప్ప టానికి నిశ్చయించుకున్నాడు.

ఇల్లు తలుపు వేసివుంది. తట్టాడు. అరుంధతి వొచ్చి తలుపు తీసింది. పరిస్థితులు ఎలావున్నాయో తెలుసుకో గలందులకు ఆమె ముఖంగా పరీక్షగా చూశాడు నారా యణరావు. ఆమె ముఖాన్నిబట్టి అతనికి ఏమీ తెలియ లేదు.

"ఇంత ఆలస్యంగా వొచ్చావేం నాన్నా" అని అడి గింది అరుంధతి.

"పని వుందమ్మా" అంటూ అడుగుపెట్టాడు.

ఇల్లు నిశ్శబ్దంగా వుంది.

"అంతా ఏమయ్యారు!"

"నిద్రపోతున్నారు"

"అమ్మకూడా."

"అమ్మ లేదు నాన్నా"

ఈ మాటకు అతనిగుండె పగిలినంత పని అయింది. ఏమయి వుంటుంది? అతనికి ముచ్చెమటలు పోసినై. 'ఎక్క డికి వెళ్ళింది.' అని అడిగాడు.

"మధ్యాహ్నమే నర్సింగ్ హోమ్‌లో జేరింది."

ఎందుకు అని అతను అడగలేదు. ఆ పిల్ల చెప్పలేదు. కాని అతనికి అర్థమైంది. ఆమె ధైర్యం చేసింది. ఆ నిశ్చయానికి రాబట్టే ఉదయం ఆమె సంతోషంగా ఉండగలిగిందని అప్పుడాతనికి తట్టింది.

"ఆ నర్సింగ్ హోమ్ ఎక్కడో నీకు తెలుసా !"

"నేనుకూడా వెంట వెళ్లాను."

కాసేపు మెదలకుండా వుండి, "డబ్బెక్కడిది ?" అని అడిగాడు.

"అది ఏమంత పెద్దదికాదు. రిటైరయిన వొక నర్సు నడుపుతూవుంది. ఆమె ఇంట్లోనే ముందు రెండు గదులూ రోగుల కోసమని వుంచింది. కాస్తో కూస్తో డబ్బు అమ్మ ఎవ్వరిదగ్గరో పుచ్చుకుంది."

"అక్కడ వసతిగా వుందా ?"

"వుంది," అన్నది అరుంధతి 'లేదు' అని చెప్పటం ఇష్టం లేక.

ఆ పూటకి అరుంధతే అన్నం పెట్టింది. అన్నం కూరలూ అన్నీ చల్లారిపోయి వున్నాయి. ఎంతో తిందామని ఆశపడ్డ నారాయణరావు తినలేక పోయాడు. అన్నం తినక పోవటం శరీరం అలవాటు చేసుకుంటున్నట్లు వుంది. శరీరం ఎదురు తిరిగింది. నెమ్మదిగా నాలుగు మెతుకులు కొరికాడు. అతని స్థితి కనిపెట్టిన అరుంధతి, తండ్రికి మజ్జిగ ఎక్కువ పోసింది. మజ్జిగ అన్నం తేలిగ్గానే లోపలకు వెళ్ళింది. అతను అన్నం ముగించి చేతులు కడుక్కుంటున్నప్పుడు, "రేపు

ఉదయం అమ్మ నిన్ను వొకసారి రమ్మన్నది నాన్నా," అన్నది అరుంధతి.

"అలాగే నమ్మా, ఇద్దరం కలిసి వెళ్దాం."

మరునాడు తొమ్మిది గంటలకు తండ్రీ కూతుళ్లు ఇద్దరూ రాజమ్మని చూడటానికని బయలుదేరారు. పిల్లలు తాము కూడా వస్తామని గోల పెడుతుంటే, రెండో కూతురికి ఇచ్చి, వాళ్ళని బజారు పంపాడు. లక్ష్మీదేవికి తనకు కూడా అక్కతోనూ, తండ్రితోనూ వెళ్ళాలని వుంది. కాని తండ్రికి భయపడి పిల్లలను తీసుకొని బజారు వెళ్లింది.

ఆ నర్సింగ్ హోమ్ బొగ్గులగుంటలో వుంది. బొగ్గులగుంట నారాయణరావు ఇంటికి కాస్త దూరమే. తాను నడువగలడు. కాని అరుంధతి నడువగలదా ?

"రిక్షా ఎక్కి వెళ్దామమ్మా."

తండ్రి ఆర్థిక పరిస్థితి తెలిసిన అరుంధతి, "ఎందుకు నాన్నా, నెమ్మదిగా నడిచి వెళ్దాం" అన్నది.

"నువ్వు నడువగలవా అమ్మా ?"

"ఎందుకు నడువలేను ?"

"పోనీ బస్సులో వెళ్దాం. తొందరగా వెళ్తాం"

"వొద్దు నాన్నా"

"డబ్బు వున్నదమ్మా నా దగ్గర."

"వుండనియ్ నాన్నా, ఎందుకైనా పనికివస్తుంది."

నడిచి వెళ్లటం మంచిదే కావచ్చు. కాని డబ్బు లేక నడిచి వెళ్లటం అంతబాధ ఇంకొకటి వుండదు. బస్సుమీద వెళ్లేవాళ్లమీదా,రిక్షాలమీద వెళ్లేవాళ్లమీదా కసిపుడుతుంది.

పిల్లమీదా వాళ్లమీదా ఏమిటి ? భగవంతుడి మీదే కసి పుడుతుంది. భగవంతుడు ప్రపంచం అనే పానకపు కుండను తయారుచేసి అందులో డబ్బు అనే ఈ పుడకను వేశాడు. అది తాగదలచిన వాళ్ళ గొంతుకు అడ్డుపడుతూ వుంటుంది. అందరికీ తగులుతుందా ? తగలదు. కొందరు దానిని తొలగించి నేర్పుగా తాగుతారు. కొందరికి ఆ పుడక తాగటానికి ఉపకరించే గొట్టంగా వినియోగపడుతుంది.

ప్రపంచంలో బ్రతకటానికి ముఖ్యమైంది నేర్పు. అదే తనకు లేదు.

'సరి సరి,' అనుకున్నాడు. 'ఎంత సేపు ఆలోచించినా చివరికి ఈ ముగింపే గదా నీకు తట్టేది' అని తన్ను తాను నిందించుకొని సంబాళించుకున్నాడు.

అరుంధతి తన ప్రక్కనే ఆలోచిస్తూ నడుస్తూ వుండటం అతని స్పృహలోకి వొచ్చింది. ఏదో మాట్లాడుతూ వుంటే కొన్ని దిగుళ్లు బయటపడి గాలిలో కలిసిపోతూ వుంటై. అప్పుడు మనస్సుకి కొంత తెరిపి కలుగుతుంది. కాని ఆ పిల్లకు ఆ గుణం ఎక్కడనుంచి వచ్చిందో! ఎప్పుడూ ఆలోచిస్తూనే వుంటుంది. ఆలోచించే పురుషుడే బాగుపడడు. ఇక స్త్రీ సంగతి చెప్పాలా ?

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు" అని అడిగాడు.

"ఏం లేదు నాన్నా."

అంతే. ఎప్పుడూ ఆ పిల్ల అంతే. ఎక్కువగా ఆలోచిస్తుంది. తక్కువగా మాట్లాడుతుంది. అందుకనే ఆమె నోటివెంట ఏ మాట వొచ్చినా, ఆ మాట అందరూ వుపయోగించేవాటే

అయినప్పటికీ) అతి బరువుగా వుంటుంది. వొక మహాసముద్రం నుంచి పొంగి వచ్చిన అలలాగు వుంటుంది. సెగల పొగలాగుంటుంది. సూర్యగోళంనుంచి బయటపడిన కిరణంలాగుంటుంది.

"వెళ్ళేటప్పుడు అమ్మ ఎలా వుంది?"

"కులాసాగానే వుంది నాన్నా."

"క్లేశంగా వుందా?"

"లేదు. పైగా ఉల్లాసంగా వుంది."

ఇక ఏమి మాట్లాడాలో అతనికి తోచ లేదు. ఇటీవల ఇంట్లో వాళ్లతో ఎవ్వరితో ఏం మాట్లాడటానికీ అతనికి పాలుపోవటం లేదు. పిల్లలంటే అతనికి మక్కువే. అందులో ఈషణ్మాత్రం సందేహం లేదు. వాళ్ళందరినీ అతను అల్లారు ముద్దుగా పెంచాడు. అతను పెంచిన రీతికి బంధువులంతా ఎగతాళి చేసేవారుకూడాను. వొక్క బంధువు లేమిటి? 'వాళ్ళను గారాబం పెట్టి మీరు చెడగొడుతున్నారు,' అని భార్యే విసుక్కునేది. 'ఆడపిల్లల్ని నగ్గరకు జేర్చటం మంచిది కాదండీ. వాళ్ళు యితరుల ఇళ్ళల్లో కాపురాలు చెయ్యవలసినవాళ్ళు. ఇక్కడ గారాబం పడితే వాళ్ళ మనస్సులు ఎప్పుడూ కన్నవారి ఇళ్ళను అంటిపెట్టుకునే వుంటై. అక్కడ ఎంతమంచి జరిగినా వాళ్ళకు అసంతృప్తిగానే వుంటుంది. కాపురాలు చెయ్యటం కష్టం అవుతుంది' అనేది.

అలా పెరిగిన పిల్లలు పెద్దవాళ్ళయ్యేటప్పటికి తలిదండ్రులకు విచిత్రంగా కనుపిస్తారు. అంతకుముందు వాళ్ల మధ్య వర్ధిల్లే ఆప్యాయత తెగి పరిచయస్తులుగానో, స్నేహితులుగానో కనుపిస్తారు.

అప్పుడు వాళ్ళతో మాట్లాట్టం కష్టం అవుతుంది. పూర్వపు విషయాలూ, మాటలూ సరిపోవు. సరిపోవటం ఏమిటి? పనికిరావు. క్రొత్త విషయాలు వాళ్ళదగ్గర ఎత్తటానికి తలి దండ్రులకూ, వినటానికి వాళ్ళకూ బెరుకుగా వుంటుంది.

ఇక మాటలు వుండవు. మధ్య ఏదో అగాధం తెరుచుకున్నట్టు అనిపిస్తుంది. లోపల ఆప్యాయతలు వుండవచ్చు. కాని వాటిని బహిర్గతం చేసే మార్గాలు కట్టుబడతై. ఎవ్వరి దారిని వాళ్ళు బ్రతుకుతుంటారు.

ఇటీవల ఇదే విధంగా వుంది తన కుమార్తెకూ తనకూ వున్న సంబంధం. ఎల్లప్పుడూ కలిసి వొకే ఇంట్లో వున్నప్పటికీ, వాళ్ళు హృదయ పూర్వకంగా మాట్లాడుకొని ఎన్నాళ్ళయిందో! కొన్ని ఆపదలనుంచి మనలను మనం కాపాడుకోటానికి కొన్ని నియమాలను ఏర్పరచుకుంటాం. కొన్ని సంబంధాలను నిర్వచించుకుంటాం. కాని వొకప్పటికి ముదిరి అవి సిమెంటు గోడలుగా లేస్తవి. మనుష్యులు వొకరి కొకరు కనుపిస్తూనేవున్నా మధ్య గోడలు వుంటూనే వుంటై. మానవ ప్రకృతి వికృతి అవుతుంది.

ఉండి వుండి తన ప్రక్కన నడుస్తున్న కూతురు వైపు తిరిగి, "అమ్మా, మనం దురదృష్టవంతులం," అన్నాడు నారాయణరావు, అతని కంఠం గాద్గదికమయింది.

"ఎందుకని నాన్నా?"

"ఇన్ని కష్టాలు మనకు ఎందుకు రావాలమ్మా?"

ఆ పిల్ల కొంచంసేపు ఆలోచించింది. చివరికి "ఇవన్నీ

కష్టాలని నేను అనుకోవటం లేదు నాన్నా. ఒకవేళ ఇవన్నీ కష్టాలే అయినా, కష్టాలుగా వుండి పోతవనిగానీ, అంతమవుతవని గానీ నేను అనుకోవటంలేదు. మనం జీవిత గమనంలో కొంచెం వెనక పడ్డాం నాన్నా. అంటే దాని స్వభావాన్ని తెలుసుకుని మనం నడుచుకోవటం లేదు. అందువల్ల కాస్త ఒరిపిడికి లోనవుతున్నాం. ఇప్పుడు మనం కష్టాలు అనుకునేవన్నీ ఈ విషయం జ్ఞాపకం చెయ్యటానికి గాను వచ్చిన మిత్ర బృందమే. అంతకంటే ఏమీ లేదు. వాటి సలహాను పాటిస్తే మనకే ఇబ్బందీ వుండదు," అన్నది.

ఆమె మాటలు వింటూ వుంటే అతని మనస్సు గోపీకృష్ణ మీదకు వెళ్ళింది. అతను తనతో ముచ్చటించిన సంగతులన్నీ జ్ఞాపకం వచ్చినై. 'సరే, అతను చదువుకున్నాడు. లోకానుభవం వుంది. పెద్ద పెద్ద వాళ్ళతో తిరుగుతుంటాడు. ఎన్ని విషయాలైనా మాట్లాడగలడు. ఈ పిల్లకు ఈ భావాలు ఎక్కడనుంచి వొచ్చాయా ?' అనే మీమాంసలో పడ్డాడు.

"అయితే మనం చేసిన తప్పేమిటమ్మా ?"

"ఉన్న చోటునుంచి కదలకపోవటమే" అన్నది అరుంధతి.

"కదలాలి అనుకుంటే మాత్రం, ఇప్పుడు మనవల్ల అవుతుందా ?"

"ఎందుకు కాదు నాన్నా ? కదలదలచుకున్న వాళ్ళు ఎప్పుడైనా కదలవచ్చు. కాటికి కాళ్ళు చాచుకున్న వాళ్ళు కూడా కదలవచ్చు."

"అందుకు పరిస్థితులు అనుకూలంగా వుండొద్దా తల్లీ ?"

"పరిస్థితులను గురించి నాకు భయం లేదు నాన్నా," అన్నది అరుంధతి. ఇటీవల చాలామంది 'పరిస్థితుల ప్రభావం' 'పరిస్థితుల ప్రభావం' అంటున్నారుగాని, దానికంత విలువ ఇవ్వనక్కర లేదు అనుకుంటాను. మానవుడు పెరిగినకొద్దీ పరిస్థితుల ప్రభావం క్షీణిస్తుంది. మనిషి ఇవ్వాళ యిక్కడా, రేపు ఇంగ్లండులోనూ, ఎల్లుండి రష్యాలోనూ వుండే ఈ రోజుల్లో, పరిస్థితులకు ప్రాధాన్యత నశించిపోతూ వుంది నాన్నా. పరిస్థితులకు లోనయి నడువ వలసిన అవుసరం జంతువులకు వున్నంత మనుష్యులకు లేదు. మనుష్యుల్లో కూడా ఆటవికులకు వున్నంత నాగరికులకు లేదు. మీ ముత్తాతకు వున్నంత మీకు లేదు. రెండు తరాలు గడిస్తే ఇంకా తగ్గిపోతుంది. తరువాత పూర్తిగా నశిస్తుంది. మనం, సంకల్పంలో ఏదో లోపం వుండి, చీటికీ మాటికీ పరిస్థితులను సాకుగా, డాలుగా వాడుకుంటున్నామేమో నని అనిపిస్తూ వుంది నాకు" అన్నది అరుంధతి.

ఆ పిల్ల మాటలను చెవులు అప్పగించి వింటున్నాడు నారాయణరావు. ఆ పిల్ల అంతే. ఏ విషయాన్ని గురించి అయినా అలాగే చెప్పుకుపోతూ వుంటుంది. కదిలిస్తే అలా మాటలు దొర్లుకు వస్తయి ఆ పిల్లకు. ఆ పిల్ల పెద్ద పెద్ద మాటలు చెపుతున్నానని అనుకోదు. మామూలు మాటలు చెప్పినట్లే అతి సహజంగా చెపుతుంది.

అతను కుమార్తెను ఇంకా ఏమేమి అడిగేవాడో! చాలా విషయాలు అడగాలనే కుతూహలంలోనే వున్నాడు. అంతలో వొక వూరేగింపు మలుపు తిరిగింది.

అది ఫ్యాక్టరీ కార్మికుల వూరేగింపు. దానిని కార్మికులు లేవదీసారు. చంకన పిల్లలను వేసుకున్న స్త్రీలుకూడా నడుస్తున్నారు. చిన్నపిల్లలు కూడా ఉత్సాహం కొద్దీ ఎర్ర జెండాలు పట్టుకొని మిగిలిన వాళ్ళతోపాటు నడుస్తున్నారు. 'కార్మికుల జీతాలు హెచ్చించాలి,' 'లైసెన్సు రాజ్యం నశించాలి' అని నినాదాలు చేసుకుంటూ వాళ్ళు అరుంధతీ నారాయణరావుల ముందునుంచి సాగిపోయారు.

వాళ్లను చూస్తుంటే అరుంధతి కండ్లలో నీళు తిరిగినై "వీళ్లకంటే మనం అదృష్టవంతులమేగా నాన్నా ?" అన్నది.

"ఎవరి దురదృష్టం వారిది," అన్నాడు నారాయణ రావు."

"ఎవ్వరి దురదృష్టం వాళ్ళకి గొప్పదైతే కావచ్చు గాని, వాళ్ళకంటే మనం నిస్సంశయంగా అదృష్టవంతులం."

"కావచ్చు. కాని వాళ్ళు జీవితంలో అవకాశాలు లేక బాధ పడుతున్నారు. నేనో జీవితం ఇచ్చిన అవకాశాలను వినియోగించుకోలేక బాధ పడుతున్నాను. వాళ్ళ బాధకంటే నా బాధ గొప్పదమ్మా."

"మనదృష్టిలో అహం మిళితమై వుండటమే దీనికి కారణం. వాళ్ళ జీవితాలకుమల్లేనే వాళ్ళ బాధలు సహజమైనవీ, నిరాడంబరమైనవీనీ. మన బాధలు కృత్రిమమైనవీ ఆడంబరపూరితమైనవీనీ. అయితే వాళ్ళూ మనం అనుభవించే బాధల్లో ఇంతకంటే పెద్ద తేడా వొకటివుంది. వాళ్ళు తమ బాధల నివారణకై ప్రాణాలను త్యజించటానికి సైతం సిద్ధపడి కృషిచేస్తున్నారు. మనం మన బాధలను జీర్ణించుకొని వాడిపోతున్నాం."

"వాళ్ళకు పోయేది ఏంలేదు తల్లీ."

"మనకుమాత్రం ఏముంది?"

"నాకు వొక ఉద్యోగం ఏడ్చిందిగదా?"

ఆపిల్ల నడుస్తూనే కాసేపు ఆలోచించింది. "వాళ్ళకి వుండే ఉద్యోగాలు వాళ్ళకీ వున్నాయి నాన్నా. కాకపోతే ఉద్యోగాలుపోయినా బ్రతకగలమనే ధైర్యం వాళ్ళకివుంది, మనకు లేదు."

నారాయణరావు మాట్లాడలేదు. ఇద్దరూ ఎవ్వరి ఆలోచనలు వారు తర్కించుకుంటూ ముందుకు అడుగులు వేస్తున్నారు.

"వాళ్ళవిషయం మన విషయం ఇంకొక రకంగా చెప్పుకుంటే బాగుంటుందేమో నాన్నా."

"ఏమిటమ్మా అది?"

"వాళ్ళకి తమ ఉద్యోగాలనూ, అవుసరం అయితే ప్రాణాలనూ త్యాగంచేసే సాహసంవుంది. మనకది లేదు.

ఎంత అవమానం కలిగినా ఎంత అపాయంవచ్చినా 'కావు కావు' మంటూ అరుస్తూ తాముకట్టుకున్న గూళ్ళచుట్టూ ఎగిరే కాకులవంటివి నాన్నా మనబ్రతుకులు. గూళ్ళు మార్చే ధైర్యంకూడా మనకులేదు."

"ఆమార్పువల్ల పరిస్థితి ఇంకా అధ్వాన్నం కావచ్చు."

"అదొకభయం."

"ప్రాణాలే పోవచ్చు."

"చావు భయపడవలసిన విషయంకాదు నాన్నా."

ఆపిల్ల నోటినుంచి వచ్చిన ఆమాటకు కంపించి పోయాడు నారాయణరావు.

"చచ్చి సాధించేదేముంటుంది తల్లీ," అన్నాడు.

"ఎందుకువుండదు నాన్నా?" అన్నది అరుంధతి. అని వూరుకుంది. లోపల చెలరేగుతున్న భావాలను అదిమి పెట్టటానికిగాను పెదవులు బిగించింది.

ఇక ఆమెను పలకరించటానికే భయం వేసింది నారాయణరావుకి. ఇటీవల ఆపిల్ల తనకు అర్థంకావటం లేదనే భావం అతనికి క్రమక్రమేణా బలపడుతూ వచ్చింది. ఎంత అర్థంకాదో ఇప్పుడు అర్థం అయింది

ఇద్దరూ నర్సింగ్‌హోమ్ దగ్గరకు వెళ్ళారు. నర్సింగ్ హోమ్ అంటే వాకరికం భవనం మనస్సులోవున్న నారాయణరావుకి ఆయిల్లు చూసేటప్పటికి వొళ్ళు ఝల్లు మన్నది. అది బాగ్గులగుంటలో చివరవుంది. ఆ పరిసర ప్రాంతాల్లోవున్న ఇళ్ళన్నీ పడిపోటానికి సిద్ధంగావున్న పెం

కుటి కొంపలే. వొక ఇంటికి గోడ కూలింది. వొక ఇంటికి కప్పు లేచివుంది. వొక ఇంటి దరవాజాలు ఖామందే పీకి, అవుసరానికి అమ్ముకున్నాడు. వొక ఇంటి ప్రహరీ పడిపోతే యజమాని దాని రాళ్ళ మీద కూర్చొని ముఖం కడుక్కుంటూ, ఎదురు ఇంటిముందు కసువు వూడుస్తున్న వొక భాగ్యశాలితో బాతాఖానీ కొడుతున్నాడు.

అక్కడ నివసిస్తున్నవారికి తాము దారిద్ర్యంలో నివసిస్తున్న స్పృహేవున్నట్లు లేదు. చైతన్యస్పృహను కోల్పోయిన మనుష్యులు వాళ్ళు.

దారిద్ర్యం దానంతట అది భయంకరమైంది. అలవాటైన దారిద్ర్యం ఘోరమైంది. అది మనుష్యులను జిడ్డు పట్టుకున్నట్లు పట్టుకుంటుంది. అది వొదలదు వొక పట్టాన. దానిని వొదిలించుకోటానికి ప్రయత్నిస్తున్న మానవులు జీవించివున్నట్లు. దానిని అలవాటు చేసుకున్న మానవులు మరణించినట్లు; దారిద్ర్యాన్ని అలవాటుచేసుకున్న మానవుడు వెనుకకుజరిగి పశుదశకు వెళ్తాడు. అతడు పైకి నవ్వవచ్చు, ఏడువవచ్చు. కాని అవి మానవలక్షణాలు కావు.

ఆదశలో మరొకరకం జీవితం కోసం అర్రులుచాచటం అనేదేవుండదు. ఏదోవొక నెపంతో కట్టుగొయ్య చుట్టూనే తిరుగుతూంటాడు మానవుడు.

అటువంటి మానవుల నివాసస్థలం అది. దానిని చూసేటప్పటికి నారాయణరావు గుండె బేజారెత్తింది. ఇక్కడా తన భార్య వుంటున్నది! ఎక్కడపుట్టిందో ఎట్లా పెరిగిందో ఇప్పుడీస్థితికి వొచ్చింది. దానికి కారణం ఎవ్వరు?

తనే! తనను జీవితం పాము తరుముతూవుంది. నిజమే కాని దానికాటుకు అందకుండా పరుగెత్తటం కంటే తాను చెయ్యగలిగింది ఏముంది? చివరికి జీవితానికి అందకుండా పరుగెత్తటమే తన పని అయింది. తన జీవితలక్ష్యం అయింది.

"ఈ ఇల్లేనా అమ్మా?"

"ఇదే నాన్నా"

ఇద్దరూ ఆఇంట్లో అడుగు పెట్టారు. ఆ ఇంటికి వొక పక్కన కోళ్ళగుడిసెవుంది. రకరకాల కోళ్ళు దొడ్డంతా చిందరవందరగా తిరుగుతున్నాయి. వాటిల్లో వొక గుంపు వాకిట్లోనే వున్నాయేమో వాళ్ళు అడుగు పెట్టగానే భయపడి, 'కెకెకె' అని అరుస్తూ, రెక్కలు రెప రెప కొట్టుకుంటూ ఎగిరిపడినై. మరొకపక్క రెండు సీమపందులు వున్నయి. అవి బలిసినఖడ్గమృగాల లాగు వుండి కదలలేకుండా వొకచోట నిలబడివున్నయి. కండలు పెరిగి వాటికి కండ్లుపోయి వున్నయి. వాటినిచూస్తుంటే భూమిలోనుంచి చెట్లపాదులలోకి నెర్రలుచేసుకుని వచ్చే ఎర్రలు జ్ఞాపకం వచ్చాయి నారాయణరావుకి. అతనికి ఎందుకనో ఎర్రలంటే భయం. తగనిజుగుప్స. వాటిని తలుచుకుంటేనే అతనికి కంపరం పుడుతుంది. ఇక ఆ సీమపందులను చూచినప్పుడు అతనికి కలిగిన ఏహ్యాభావం వర్ణించటానికి అలవికానిది.

అది వొక జంతుప్రదర్శనశాలేమో అనే భ్రాంతి అతనికి కలగకపోలేదు.

"ఎవ్వరూవున్నట్లులేరు," అన్నాడు కుమార్తెతో.

"అడుగో," అని, ఆ ఇంటి వరండాలో వొక విరిగిన కుర్చీలో కూర్చునివున్న వ్యక్తిని వేలుపెట్టి చూపింది అరుంధతి.

ఆవ్యక్తి సూటులో వున్నాడు. కాని ఆసూటు సోల్జర్లు చనిపోయినప్పుడు అమ్మేసూటు. ఎందరి శరీరాలో మారి, అతనిదగ్గరకు వొచ్చి వాలివుంటుంది ఆసూటు. ఇక అక్కడనుంచి కదిలే వోపిక లేక, అతనిశరీరం మీదే వుండిపోయింది. వాలింది వాలినట్లేవుంది. ఆ వాలిన రోజు మొదలుకొని ఈ నాటివరకూ, దానిని మార్చవలసిన అవసరం ఆవ్యక్తికి కనపడ్డటులేదు. అతను ఆకుర్చీలో కూర్చుని తల వేలవేసి నిద్రపోతున్నాడు. బట్టతల, కాళ్ళకు బూట్సులువున్నయి. అవికూడా చచ్చిన సోల్జర్ల బూట్సులకు మల్లేనేవున్నయి. అవి అతనికాళ్ళకు కలిపి కుట్టివేయబడినట్లు వున్నయి. వొకచెయ్యి కుర్చీమీదనుంచి వేల్లాడుతూవుంది. అతన్నిచూస్తే అతను ప్రాణంతోవున్న మనిషికాదేమోనని అనిపించింది నారాయణరావుకి. బ్రతికివుంటే, రాత్రి అదేవిధంగా పడుకొని అప్పటినుంచీ ఇంకా లేవుండడు.

"ఎవ్వరతను? అని అడిగాడు.

"నర్సుభర్త"

"రామ రామ ఇతని భార్య ఇప్పుడు మీ అమ్మకు మందిచ్చేది!"

"పాపం మనిషి మంచివాడే," అన్నది అరుంధతి.

"నిన్న నువ్వు మాట్లాడావా?"

"ఆ"

"ఇతనితో మీ అమ్మకూడా మాట్లాడిందా?"

"మాట్లాడింది నాన్నా"

"ఏభాషలో మాట్లాడుతాడు?"

తండ్రిమాటలకు అరుంధతి చిరునవ్వు నవ్వుకుంది. అంతలోకి అతను కదిలాడు. మెట్లు ఎక్కి వస్తున్నవాళ్ళని చూశాడు.

"ఎవరు?"

"నేనే నండీ" అన్నది అరుంధతి.

"ఓ, నువ్వా? నువ్వు నిన్న వచ్చావుకదూ?"

"వచ్చాను"

"నిన్న ఆగదిలో జేరింది మీ అమ్మేనా?"

"మా అమ్మే"

"ఈయనెవ్వరు?"

'నేను గవర్నమెంట్‌లో పనిచేసే యు. డి. క్లార్కుని,' అని చెపుదాం అనుకున్నాడు నారాయణరావు. అతను వొక నిశ్చయానికి రాకముందే, "మా నాన్న" అన్నది అరుంధతి.

"సయాం నాన్నేనా?"

"అవును"

"అంటే ఇప్పుడాగదిలోవున్నామెభర్త అన్నమాట"

"అవును." ఈసారి నారాయణరావు సమాధానం చెప్పాడు.

"ఆవిడగారిని పిలుచుకువస్తాను వుండండి" అని లోపలకు వెళ్ళాడు ఆవ్యక్తి. వెళ్తూ వెళ్తూ వెనక్కితిరిగి, "బ్రేక్‌ఫాస్ట్ చేస్తూవుంది," అనేవార్త విడిచివెళ్లాడు, రైలు పొగను విడిచినట్లు.

నారాయణరావుకి భార్యను చూడాలని చాలా ఆతురతగావుంది. ఈవాతావరణం అతని మనస్సును భార్యపట్ల గాఢంగా ఆర్ద్రపరిచింది. కుమార్తె మనస్సులో ఉప్పతిల్లుతున్న భావాలను గ్రహించటానికి ఆమెను పరికించాడు. అక్కడి పరిస్థితుల ప్రభావానికి ఆమె ఏ మాత్రం చలించటంలేదు. 'ఈ పిల్లకు ఇంత నిబ్బరం ఎక్కడనుంచి వచ్చిందా!' అని తనలో తాను ఆశ్చర్యపడ్డాడతను.

"నేనే బాగాడబ్బు సంపాదించగలిగితే, నాకే డబ్బు సంపాదించే నేర్పువుంటే అమ్మను ఈ దుర్భర వాతావరణంలో జేర్చవలసిన అగత్యంవుండేది కాదు గదా!" అన్నాడు. అది నిజానికి అనటంకాదు, మొరపెట్టుకోవటం.

"ఇక్కడైనా జేర్చగలిగినందుకు సంతోషించటం మంచిది నాన్నా," అన్నదాపిల్ల.

అంతలో భార్యాభర్తలిద్దరూ ఇంట్లోనుంచి బయటకు వచ్చారు. అరుంధతిని ఆమె అంతకుముందే చూడటంవల్ల, నారాయణరావుని తనభార్యకు పరిచయంచేశాడు జకరయ్య.

జకిరయ్యా ఆ నర్స్ భర్త పేరు. అతనే అరుంధతీ నారాయణరావులు ప్రవేశించినప్పుడు తల వేలాడ వేసుకొని నిద్రపోతూ కూర్చుంది. భార్యకు నారాయణరావుని పరిచయంచేసి వెళ్ళి మళ్ళీ కుర్చీలో కూర్చొని తల వేలాడ వేసే ప్రయత్నంలో వున్నాడతను.

ఆ నర్స్‌ని చూడటంతో అంతకుముందున్న కాస్త ధైర్యం, గవర్నమెంట్ ఆఫీసుల్లో నడిచే ఫైళ్ళ వారిపిడికి నామమాత్రావశిష్టమైన సత్యానికివలె, హరించుకు పోయింది నారాయణరావుకి.

ఆ నర్స్ పేరు ఈవమ్మ.

ఈవమ్మ యవ్వనంలోవున్నప్పుడు గవర్నమెంట్ హాస్పిటల్లో నర్స్‌గా పనిచేసిందని ప్రతీతి. అది ప్రతీతేగాని చూచినవారు ఎవ్వరూలేరు. ఆరోజుల్లో జాగీర్దారు భార్యలు అనేకమంది ఆమె సహాయం అర్థించి, ఆమె దగ్గరకు వస్తూ వుండేవారట. హాస్పిటల్లో వసతి కుదరక వాళ్ళే ఆమెతో ప్రయివేట్ ప్రాక్టీసు పెట్టించారట. అప్పటినుంచీ ఆమె గర్భస్రావాలమీదే పనిచేస్తూవుండట. ఆ రోజుల్లో ఆ పట్టణంలో జాగీర్దార్ల ఇళ్ళల్లోని స్త్రీలందరూ ఆమెదగ్గరకే వొస్తూవుండేవారట. ఆరోజుల్లో ఆమె యిల్లు ఎల్లప్పుడూ అతిలోక సౌందర్యవతుల వదనాలతో మిల మిల మెరిసి పోతూ వుండేదట. ఆమె నైపుణ్యానికి మెచ్చి చాలా మంది జాగీర్దార్లు ఆమెను తమ జనానా డాక్టరుగా నియమించారట. ఆమెకూడా వారికి ఏపరిస్థితులలోనూ ఆశాభంగం కలుగ

కుండా ప్రవర్తించిందట. ఆమె తన హస్తలాఘవంవల్ల ఎన్ని జాగీర్‌దార్లనో అపవాదుల లోను కాకుండా గీజార్లను దాసీపుత్రుల హక్కులతో ఛిద్రంకాకుండానూ రక్షించిందట.

కొంతమంది ఆరోజుల్లో ఆమె యిల్లు ప్రణయకలాపాలకు కేంద్రంగావుండేదనీ, ఆమె సంపాదించిన డబ్బంతా ఆ విధంగానే సంపాదించిందనీ అంటారుగాని, అది నవాబు పరిపాలనలోని న్యాయాన్ని కనిపెట్టలేనివారు పుట్టించినవార్త అని మనం నిర్మొగమాటంగా కొట్టివెయ్యవచ్చు. మత దృష్టిని ఆపాదించినాకూడా ఎవ్వరూ కాదనరు.

నిజాంరాష్ట్రం భారతదేశంలో విలీనం అయినపిదప జాగీర్లుకూడా అంతరించినై. అప్పటినుంచీ ఈవమ్మ పలుకుబడి తగ్గిపోయింది. ఇప్పుడు చెదురు బదురుగా మాత్రమే ఆమె ఇంటికి మనుష్యులొస్తున్నారు. వాళ్లుకూడా బహిరంగంగా చెప్పుకోటానికి వీల్లేనిరోగాలతో బాధపడేవారే!

ఆమె యవ్వనంలో ఎలావుండేదోగాని ఇప్పుడు చూడటానికి భయంకరంగావుంది. ఇన్నేళ్ళుగా ఆమె చేస్తున్న వృత్తియొక్క దుర్గంధం ఆమెలో జీర్ణించి, ఆమె శరీరం రంగును పొగచూరువర్ణానికి దింపింది. ప్రతికండరం అవుసరానికిమించిన బలంతో బిర్రబిగిసివుంది. ఆమె చేతి వేళ్ళు ఆమనిషికి వుండవలసినంత నిడివిగాలేవు. సగానికి వొచ్చి ఆగిపోయి అక్కడ గోళ్ళు మొలిచినట్లు వున్నాయి.

రెండు కండ్లూ రెండు దిగుడు బావులులా వున్నాయి. చెంపలు బిరుసెక్కి, గరుకెక్కి, కత్తులను సానపెట్టే రెండు రాళ్ళవలె చూచినవాళ్ళకు కంపరం పుట్టిస్తున్నయి.

ఆమెను చూస్తూ నుంచున్న నారాయణరావుకి భయం వేసింది. ఆమెను చూడలేక తలవంచుకున్నాడు.

అప్పుడే బ్రేక్‌ఫాస్టు ముగించుకు వచ్చిందేమో, పండ్లలో ఇరుక్కున్న మాంసంచీలికలు వేలితో తీసివేసుకుంటూ మాట్లాడింది ఆమె.

నారాయణరావు ఆమెకు కొత్త. అయినప్పటికీ అతను 'ఎవ్వరు' అని అడగలేదు. అతని పరిచయాన్ని ఆశించలేదు–

"ఏం పని?" అని అడిగింది.

'అమ్మని చూడటానికి వచ్చాం' అని సమాధానం చెప్పింది అరుంధతి. ఆ పిల్ల ఈవమ్మతో మామూలు మనిషితో మాట్లాడినట్లు మాట్లాడటం నారాయణరావుకి వింత అనిపించింది.

"ఏముంది చూస్తానికి. ఇవ్వాళికి రెస్టు తీసుకోమన్నాను. రాత్రిగ్గాని పని మొదలెట్టను" అన్నది ఈవమ్మ.

'పని మొదలుపెట్టటం ఏమిటి?' అని కంగారు పడ్డాడు నారాయణరావు. ఈమె ఇచ్చేది మందు కాదా? కనీసం యింజక్షనైనా కాదా? ఏదో కొయ్యకు చిత్రిక పట్టే వడ్రంగి లాగూ, దొంగ బంగారాన్ని కరిగించే కంసాలి

లాగూ, రాళ్ళను చితుకకొట్టించే మేస్త్రీ లాగూ, బండి పట్టాలను సాగగొట్టే కమ్మరిలాగూ మాట్లాడుతుందేమిటి ?

"చూస్తానంటే చూడనివ్వరాదా?" అన్నాడు తల వేలాడవేసి కుర్చీలో కునికిపాట్లు పడుతున్న ఆమె భర్త.

"సీ పనేందో నువ్వు చూసుకో" అని గద్దరించిందామె. ఒక ఆంబోతు మరొక ఆంబోతు మీదకు మోహరించినట్లు మోహరించింది.

అతను ఇక మాట్లాడలేదు. తాను విడిచిన బాణం యొక్క శక్తిని తెలిసిన నిపుణునికివలె 'దానిపని అది చేసుకుంటుందిలే' అనే ధీమాతో వూరుకున్నట్లు వూరుకున్నాడు.

దానికి తగినట్లు ఈవమ్మ ఇక మాట్లాడకుండా రాజమ్మ వున్న గదివైపుకి దారి తీసింది. అరుంధతీ, నారాయణరావులు ఆమెను అనుసరించారు.

వాళ్లు వెళ్ళే దారిలోనే వున్నయ్యి ఈవమ్మ పెంచుతున్న సీమ పందులు. వాసననుబట్టి అవి ఈవమ్మను గుర్తుపట్టగలవు కాబోలు. మోరలు ఎత్తలేక ఎత్తలేక ఎత్తి ఆమెను చూచినై. వాటి చూపులను అర్థంచేసుకునే శక్తి ఈవమ్మకు వుంది. డబ్బాలోవున్న తవుడు వాటిముందు గుమ్మరించింది. అవి గుర్రుపెట్టుకుంటూ తిననారంభించినై—

'ఈమె పందులను పెంచటం ఎంత సహజంగా వుంది.' అనుకున్నాడు నారాయణరావు.

'అయితే సీమపందులను ఎందుకు పెంచుతూ వుందో!' అని ఆశ్చర్యపడ్డాడు.

పుటకవల్లా, స్వభావంవల్లా, నాటులో నాటైనా ఆమెకు సీమ వస్తువులంటేనే మక్కువ. ఆమె పెంచే కోళ్లల్లో సైతం 'వైట్ లెగ్ హార్న్స్', 'రోడ్ ఐలెండ్ రెడ్స్' మొదలైన సీమకోళ్ళే ఎక్కువ వున్నాయి. తొంగిచూస్తే ఇంట్లో ఒక సీమకుక్క కనుపించకపోదు. ఆమె అంత లావుగావుండీ ఇంగ్లీషు పద్ధతి దుస్తులే ధరిస్తుంది. హెయిర్ డ్రెస్సింగ్ కూడా ఆ నమూనా మీదే నడుస్తుంది.

మతం పుచ్చుకోవటంవల్ల వచ్చిన రుచి ఇది. 'రుచి ఇది' అనుకున్న దానికంటే 'చిక్కు ఇది' అనుకోవటం సమంజసంగానూ, యుక్తా యుక్తంగానూ వుంటుంది.

నారాయణరావు ఇటువంటి ఆడమనిషిని అతని జీవితంలో ఒకే ఒకసారి చూశాడు. అదీ ఒక ఇంగ్లీషు చిత్రంలో. ఆ చిత్రంలోని నీగ్రో నర్స్ ఆమె. అయితే ఆమె ముఖంలో వున్న అమాయికత్వానికీ, నిర్మలత్వానికీ బదులు ఈ ముఖంలో దుర్మార్గం, క్రౌర్యం తాండవిస్తున్నాయి

రాజమ్మ మంచంమీద పడుకొని వుంది. పక్కన వున్న టేబిల్ మీద ఖాళీ కాఫీ కప్పులు వున్నాయి. వచ్చేటప్పుడు పక్కబట్టలు తెచ్చుకొన్నట్టు వుంది. అవి శుభ్రంగానే వున్నాయి.

కుమార్తెతోపాటు భర్త రావటంచూచి, ఉలిక్కిపడి లేచింది రాజమ్మ.

"మీరెందుకు వచ్చారు?" అని అడిగింది.

నారాయణరావుకి సమాధానం తోచక వూరు కున్నాడు.

"నేను వస్తుంటే నా వెంట వచ్చాడు నాన్న" అన్నది అరుంధతి.

"రేపు సాయంకాలానికల్లా నేనే వొచ్చేదాన్నిగా."

"అప్పటిదాకా ఆగలేకపోయాడల్లే వుంది బిడ్డ !" అన్నది ఈవమ్మ.

ఆమె జోక్యం కలుగజేసుకోవటంతో జరుగుతున్న సంభాషణ టక్కున ఆగిపోయింది. కొందరిజోక్యం ఎప్పటి కప్పుడు ప్రకృతికి విరుద్ధంగా వుండి మనస్సులను బిగ దీస్తయి. పైగా ఆమె మాటల్లో ఎద్దేవ వినిపించింది నారా యణరావుకి. ఆ మాటల్లో తన భార్య ఈ స్థితికి ఆపుకో లేని తన కాంక్షే కారణమనే ధ్వని మ్రోగింది. అయితే ఈవమ్మ శరీరంలో హాస్యానికీ, ధ్వనికీస్థానం ఎక్క డుంది అనేది వేరే ప్రశ్న.

బయటనుంచి పందుల గుర గుర ధ్వని వినిపించింది. అప్పుడు వాటికి నీరు పెట్టలేదనే సంగతి జ్ఞాపకం వచ్చి ఈవమ్మ బయటికి వెళ్ళింది.

"ఇంకెక్కడైనా జేరితే బాగుండేది" అన్నాడు నారా యణరావు.

"ఇక్కడ బాగానే వుందండీ" అన్నది రాజమ్మ.

అంతకంటే ఆమె ఏమి అనగలుగుతుంది?

ఇక నారాయణరావు ఆ ప్రస్తావన తేలేదు. తప్పని సరైన పరిస్థితిని గురించి విచారపడిందానికంటే, 'బాగున్నది' అనుకోవటమే మనస్సుకి మంచిది.

"ఎంతకాలం ఇక్కడ వుండాలి అంటూ వుంది?" అని అడిగాడు నారాయణరావు.

"రేపు ఒక్కరోజే. ఎల్లుండి ఉదయం వెళ్ళిపోవచ్చు అన్నది"

నారాయణరావు కాసేపు మౌనంగా కూర్చున్నాడు. చాలా విషయాలు ఆమెను అడిగి తెలుసుకోవాలని వుంది అతనికి. కాని మామూలుగా వాళ్ళు మాట్లాడుకునే విషయాలు కావు అవి. అలవాటులేని విషయాలు అవటంవల్ల అభిలాషవున్న నాలుక కదలలేదు. మడత పడింది.

"ప్రమాదం ఏమన్నా ఉన్నదన్నదా?"

"ఏమీ లేదు. ఏదో స్నానం చేయిస్తుందట. అంతే."

అంతటితో నారాయణరావు నోరు బిగుసుకుపోయింది. భార్యాభర్తలైవుండీ, నిరంతరం కలిసి బ్రతకవలసి వుండీ, జీవితంలో భాగస్వాములైవుండీ అన్ని విషయాలూ మాట్లాడుకునే ప్రాప్తం లేకపోవటం అతనిని బాధపెట్టింది. కొన్ని విషయాలు దాచుకోవలసిన అవుసరం ఈ మానవాళికి ఎందుకు వచ్చిందో!

వెంటనే ఈ దాచుకున్న విషయాలన్నీ ఏమవుతవో అనే అనుమానం వచ్చింది అతనికి. అవి ఎక్కడికీ పోవనీ, మనస్సులో అంతర్గతంగా వుండి కుత కుతలాడుతూ అనేక రోగాలకు కారణభూతాలౌతాయనీ, ఎక్కడో చదివినట్లో, ఎవ్వరి నోటివెంటో విన్నట్లో అతనికి జ్ఞాపకం వుంది. 'హిస్టీరియా', 'న్యూరోసిస్' మొదలయిన జబ్బులు ఈ దాచుకున్న మూటనుంచే వూరతాయట. మరెందుకు దాచుకోవటం? కనీసం ఒక కుటుంబంలోని సభ్యులైనా అన్ని విషయాలూ చర్చించుకోగలిగితే ఎంత బావుండును! అనేకమైన చిక్కులు ఇట్టే విడిపోతయి. పెద్ద పెద్ద సమస్యలసంగతి అటుంచి, ఒకరినిగురించి ఒకరు కూర్చొని ఊహించుకోవటంవల్ల సంభవించే అపార్థాలకైనా ఆస్కారం లేకుండా పోతుంది. లోకంసంగతి ఎలావున్నా కుటుంబంలోనైనా ప్రశాంతత నెలకొల్పబడుతుంది.

"పథ్యం ఏమైనా చెప్పిందా అమ్మా?" అని అడిగింది అరుంధతి.

"పథ్యం ఏమీ లేదు. తేలిగ్గా తింటే సరిపోతుంది అన్నది."

"ఇంటిదగ్గరనుంచి బ్రెడ్ టోస్టూ, కాఫీ పంపుతాను."

"వొద్దు వొద్దు" అన్నది రాజమ్మ. "అన్నం చారూ పంపు. బ్రెడ్ అంగిలికి గుచ్చుకుంటుంది. నేను తినలేను."

ఖర్చు తక్కువ అవగలందులకు ఆమె అలా అంటున్నదని నారాయణరావుకీ, అరుంధతికీ తెలుసు. ఎక్కడికక్కడికి జీవితంతో రాజీ పడుతూ పోవటమే వాళ్ల బ్రతుకుకు ఆదర్శం అయింది.

నారాయణరావు కండ్లలో నీరు గిర్రున తిరిగింది.

తండ్రీ కూతుళ్ళ ఆలోచనలు రాజమ్మ కనిపెట్టలేక పోలేదు.

విషయం మార్చుదామని, "ఇక మీరు వెళ్ళండి. నేను కాసేపు నిద్రపోతాను" అన్నది. "చారులో చింత పండు వేస్తే చాలు. నిమ్మకాయ పిండవద్దు" అని కూతురికి సలహా చెప్పింది.

"నిమ్మకాయపులుసు నాకు పడదు. జలుబు చేసుకు వస్తుంది" అన్నది.

అప్పుడు మార్కెట్‌లో నిమ్మకాయలు చాలా గిరాకీగా వున్నయి. చిన్నకాయ అణాకి ఒకటి. ఆ సంగతి రాజమ్మ మరచిపోలేదు. మరచిపోవటం ఏమిటి? ఆమె మనస్సును కలవర పెడుతూనే వుంది. ఈవమ్మకి ఇచ్చుకునేది ఎట్లాగూ ఇచ్చుకోవాలి. దానికి మినహా తనకోసం దమ్మిడీ ఖర్చవకూడదని ఆమె పట్టుదల.

ఇక కూర్చుని కూడా చేసేది ఏమీ కనపడక వెళ్లటానికి తండ్రీ కూతుళ్ళు ఉద్యుక్తులయ్యారు.

భర్త పరిస్థితిచూస్తే జాలివేసింది రాజమ్మకి. అతనికి

వెళ్ళాలనీ లేదు, ఉండాలనీ లేదు. భార్యను ఒంటరిగా వదలి పెట్టి వెళ్ళటం అతనికి కష్టంగా వుంది. కాని ఉండి చేసేది ఏమీ కనపడలేదు. తాను ఆమెకు ఏవిధంగానూ సహాయ పడలేకపోవటం అతనికి తీరని వ్యథను కలిగించింది. ఇద్దరు మనుష్యులమధ్య ఇన్ని గోడలు! ఏమన్నా అర్థం వుందా? కసాయికొట్టు ఈ లోకం. బండకత్తి ఒకటి చేత్తోపట్టుకొని మనుష్యులను ఎముకలతో సహా చితకగొట్టటమే దీనిపని!

"నిన్నామె మర్యాదగా చూస్తూవుందా?" అని అడిగాడు ఈవమ్మని ఉద్దేశించి.

"బాగానే చూస్తూవుంది. నా కిక్కడ ఏ ఇబ్బందీ లేదు. మీరు ఎటువంటి అనుమానాలూ పెట్టుకోకండి" అన్నది రాజమ్మ.

"ఏదన్నా వుంటే చెప్పు. దాచుకోకు" అన్నాడు.

"వుంటే ఎందుకు చెప్పనూ?" అన్నది రాజమ్మ.

"వొస్తామమ్మా" అన్నది అరుంధతి.

తండ్రీ కూతుళ్ళు ఇద్దరూ బయలుదేరారు.

"చూడమ్మా" అన్నది రాజమ్మ.

"ఏమిటమ్మా?"

"రాత్రి ఎనిమిది గంటలముందు ఒకసారి వస్తావు గదూ"?

ఎందుకో అరుంధతికి తెలియదు. కాని ఆమె అడగ

దలచలేదు. చెప్పదగిన సంగతైతే తల్లే చెపుతుందని ఆమె ఉద్దేశం. "అట్లాగేనమ్మా" అన్నది.

"పనేం లేదు. వెంటనే వెళ్ళిపోదువుగాని" అన్నది రాజమ్మ.

ఎంతో పనిలేక కుమార్తెను రమ్మని పిలవదు తన భార్య. బహుశా ఈవమ్మ రాత్రికే మందిస్తుందేమో? అది ఏం మందో! మామూలు మందైతే కుమార్తెను తోడుగా రమ్మని ఎందుకు అడుగుతుంది తన భార్య? అందులో ఇంట్లో పనంతా ఆ పిల్లే చేసుకోవలసిఉంటుందని తన భార్యకు తెలియని వ్యవహారంకాదు.

పైకి నిబ్బరంగా కనపడుతున్నా, లోలోపల తన భార్య భయపడుతూవుందేమో అని అనిపించింది నారాయణరావుకి.

"అమ్మాయి ఎందుకు?" అని అడిగాడు ఆమె మనస్సులోని కలవరం బయటపడవచ్చు అనే ఆవేశంతో.

"ఎవ్వరూం అక్కర్లేదనే ఈవమ్మ అంటూ వుంది."

"వాస్తా అమ్మా! ఏడు గంటలకల్లా భోజనాలు పూర్తవుతై. తరువాత నాకూ ఏమీ తోచదు."

"అమ్మాయి రాత్రి ఇక్కడే వుండవలసివస్తుందా?" అని అడిగాడు నారాయణరావు.

"ఆ అవుసరం లేదు."

అవుసరం వుందనే అనిపించింది నారాయణరావుకి. కాని ఇంకేమీ అడగలేకపోయాడు. బయటకు నడిచాడు. ఉరుంధతి అతనిని అనుసరించింది.

బయటకు నాలుగు అడుగులు వెయ్యగానే, "మిమ్మల్నే" అని పిలిచింది రాజమ్మ.

నారాయణరావు హడావుడిగా భార్యదగ్గరకు వెళ్లాడు. అమ్మ, తండ్రితో ఒంటరిగా ఏదో మాట్లాడ దలచిందని నిశ్చయించుకొని అక్కడే నిలిచిపోయింది అరుంధతి.

భర్తనుచూచి ఒక్కక్షణం మెదలకుండా వూరుకుంది రాజమ్మ. ఆమె ఏదో చెప్పదలచి చెప్పలేక ఇబ్బంది పడుతూ వుందని గ్రహించాడు నారాయణరావు.

"పిలిచావా?" అని అడిగాడు.

రాజమ్మ అతని ముఖంలోకి చూచి, చిటుక్కన తల వంచుకొని, "మీరు నన్ను క్షమించాలి" అన్నది.

ఆ మాటలో ఆమె ఎంత వేదనను కూరిందో, ఎంత బాధ నారాయణరావుకి స్ఫురించిందో, అతని కండ్లు చెమ్మగిల్లినై.

"అట్లా అనకు" అన్నాడు.

"మీరు క్షమించానంటే తప్ప నా మనస్సుకు శాంతి లేదు" అన్నది రాజమ్మ కన్నీరు ఒత్తుకుంటూ.

"దేనికి నిన్ను క్షమించటం? నువ్వేం చేశావని?"

"ప్రశాంతంగా నడిచిపోతున్న మన కుటుంబ జీవితంలో నిప్పులు చెరిగి పోశాను. మీ మనస్సును ముక్కలు

ముక్కలుగా తరిగాను. మీ మంచితనం తెలియక చెయ్యలేదు. తెలిసే చేశాను. అయితే ఎందుకు చేశానో నాకే తెలియదు. మిమ్మల్ని గురించి నేను అనే మాటలన్నీ అన్యాయంగా అనేవేనని, అనేటప్పుడే నాకు తెలుసు. కాని ఎందుకో అనబుద్ధి అవుతుంది. అనకుండా వుండలేను. అట్లా అంటే తప్ప నా ఆరాటంతగ్గ మనస్సుకి శాంతి లభించదు. మీరు నన్ను క్షమించాలి" అని బోరున ఏడ్చింది.

"ఇప్పుడా సంగతులన్నీ ఎందుకు?" అన్నాడు నారాయణరావు.

"మంచి చెడులు ఆలోచించుకునే అవకాశం ఇప్పుడు నాకు దొరికింది. నేను మిమ్మల్ని అన్న మాటలన్నీ తలుచుకుంటే గుండె బేజారెత్తుతూ వుంది. ఆ మాటలన్నీ మిమ్ముల్ని ఎలా అనగలిగానో నాకే అంతుపట్టటంలేదు. నన్నేదో దయ్యం పట్టుకున్నట్టుంది."

"తప్పు నీదికాదు రాజీ."

"మీ మంచితనం మీతో అట్లా అనిపిస్తూ వుంది. తప్పంతా నాదేనని నాకు తెలుసు. నాకు మీరేం తక్కువ చేశారని నేను మిమ్మల్ని రాపాడాను! ఖర్చుకు సరిపోయే డబ్బు మీరు సంపాదించటం లేదనా? అందులో మీ తప్పేమి ఉంది? అదీ కాకుండా ఖర్చుకు మితం అనేది ఏముంది? ఎంతలోనైనా సరిపెట్టుకోవచ్చు. ఎంత వచ్చినా లేమితో కుములుతూనే వుండవచ్చు. ఈ చిన్న విషయం నాకు ఎందుకు తెలియదో బోధపడటంలేదు. నిజంగానే నన్నేదో దయ్యం పట్టుకొని ఆడించింది."

"అదేమీ లేదు. ఇటువంటి ఆలోచనలను రానీయకు. మెదలకుండా పడుకో. ఇంటికి వచ్చింతరువాత నీ ఇష్టం వొచ్చిన విషయాలు, ఇష్టం వచ్చినంతసేపు మాట్లాడుదువుగాని."

"క్షమించాను అనండి" అని అడిగింది కన్నీరు పమిట చెంగుతో తుడుచుకుంటూ.

"నేను నిన్ను క్షమించాను, నీవు నన్ను క్షమించు"

నారాయణరావు అన్న చివరిమాట ఆమె వినిపించుకోలేదు. "ఇంకా స్పష్టంగా రూపం అయితే ధరించలేదుగాని, నా మనస్సుకి వొక కొత్త నడక స్ఫురిస్తూ వుంది. ఆ నడకను అందుకోగలిగితే ఎవ్వరికీ ఇబ్బంది వుండదని అనిపిస్తూవుంది. నడక తప్పి మనం బాధపడుతున్నాం గాని, నిజానికి బాధపడవలసిన అవసరం ఈనాడు నాకేమీ కనపడటంలేదు. మనకంటే బీదవాళ్లూ, దురదృష్టవంతులూ ఎంతమంది లేరు. వాళ్ళకు లేని వేదన మనకు ఎందుకు వుండాలి? ఎవ్వరి బ్రతుకు వారిది. వొకరితో పోల్చుకొని వ్యథపడటం ఎందుకు? మనం చూడగలగాలేగాని ఏ నడకలోవున్న మాధుర్యం ఆ నడకలో వుంది. అడుగు తప్పకుండా పడితే సరి" అన్నది.

"ఇక్కడకు వచ్చేముందు అమ్మాయికూడా ఇటువంటి మాటలే అంటూ వుంది" అన్నాడు నారాయణరావు సాలోచితంగా.

"ఎవ్వరు? అరుంధతేనా?"

"అవును."

రాజమ్మలో వచ్చిన ఈ పరివర్తనకు మొదట్లో ఆశ్చర్యపడ్డాడు నారాయణరావు. కాసేపటికి అతని మనసు కుదటపడ్డది. ఇంకాసేపటికి ఎక్కడ లేని ప్రశాంతతా ఆవహించింది. అంతకుముందు పెనుభూతాలకుమల్లే అతనిని ముసురుకొని వున్న సమస్యలు ఆ ప్రశాంతతను ఎదుర్కోలేక హరించుకు పోయినై.

తాను దేనికోసం ఆరాటపడింది?

తనకు ఏది లేక హైరానపడింది?

తనకు కుటుంబం నరకంగా ఎందుకు కనుపించింది ?

తనకు పిచ్చెత్తే పరిస్థితిని కల్పించిన సమస్యలు ఏవి?

తనకు కావలసింది ఏమిటి?

అప్పుడతని మనస్సు నిర్మలాకాశంవలె వున్నది. అక్కడ ప్రశ్నలు లేవు, సమాధానాలు లేవు, సమస్యలు లేవు, పరిష్కారం లేదు. అక్కడ వున్నది నిర్మలమైన జీవితమే. అక్కడ మానవుడు చేసేది జీవించటమే. అక్కడ సరాగమూ లేదు, వైరాగ్యమూ లేదు, వున్నది ఒక్కటే. అందులో మునగడమూ లేదు, దానినుంచి తప్పించుకోవటమూ లేదు.

అతను ఒక్క నిట్టూర్పు విడిచాడు.

"ఏం జరిగింది?" అని అడిగింది రాజమ్మ.

"ఏమీ జరగలేదు"

"మరి నా మనస్సు ఎందుకు ఇంత నిర్మలంగా వుంది?"

"మనం కాస్త పెరిగాం"

"పెరగటంలో ఇంత ఆనందం వుందా?"

"వుంది" అన్నాడు నారాయణరావు.

అతనికి కూడా అంతకుముందు వరకూ ఆ సంగతి తెలియదు. ఆమె అడిగిందానికి సమాధానాలు చెప్పటం లోనే ఆ సంగతి తెలిసింది. మొదట్లో ఆమెను ఊరడించ టానికి అందుకు అనువైన సమాధానాలు చెపుతూ వచ్చాడు. మొదలు పెట్టినప్పుడు ఆ సమాధానాల ప్రయో జనం ఆమెను ఊరడించటం వరకే పరిమితమై వుంది. కాని మాటమీద మాట పెరిగినకొద్దీ, వాటితోపాటు తానూ పెరిగినట్లయింది. ఆ స్థాయినుంచి చూస్తే సూర్యరశ్మికి కరిగి పోయిన మంచుకిమల్లే తన కష్టాలు విరిగి పోయినట్లనిపిం చింది.

ఆ దృష్టితో చూచినప్పుడు మంచంమీద పడుకొని వున్న అతని భార్య రాజమ్మ అతనికండ్లకు అతి మనో హరంగా కనుపించింది. ఆమె ముఖం అంత నిర్మలంగా ఆనందంతో తొణికిసలాడుతూ వుండటం తమ వివాహం అయిన ఏ మొదటి రోజుల్లోనో చూశాడు.

"అమ్మాయితో కూడా ఒకమాట అనండి" అన్నది రాజమ్మ.

"ఏమని?"

"ఏ తల్లీ అనని మాటలు అన్నాను ఆమెను. యిక నా నోటివెంట అటువంటి మాట వొక్కటికూడా రాదని చెప్పండి. జరిగిందానికి మనస్సు కష్టపెట్టుకోవద్దనండి."

"అలా కష్టంపెట్టుకునే పిల్లకాదు అరుంధతి."

"నిజమే. తల్లినైవుండి ఆ పిల్లకు వున్న వోర్పులో సహస్రాంశం కూడా నాకు లేకపోయె" అని విచారించింది రాజమ్మ. "ఆ పిల్లదగ్గర ఇతరులు నేర్చుకోవలసిన గుణాలు చాలా వున్నయి" అన్నది.

తను నేర్చుకోవలసిన గుణాలే చాలా వున్నాయని అందామని, అలా అనలేక ఆ అభిప్రాయాన్ని అస్పష్టంగా వెలువరించింది.

ఆ రాత్రి పెందలాడే పిల్లలందరికీ భోజనాలు పెట్టి. వాళ్ళని చెల్లెలు లక్ష్మీదేవికి అప్పగించి, తండ్రితో చెప్పి తల్లిదగ్గరకు బయలుదేరింది అరుంధతి.

"ఏదన్నా అవుసరం అనుకుంటే నాకు కబురు చెయ్యమ్మా" అన్నాడు నారాయణరావు. 'ప్రమాదం జరిగితే' అని అందామనుకొని ఆ మాటను ఉచ్చరించటానికే భయపడి 'అవుసరం అనుకుంటే' అన్నాడు.

"అవుసరం ఏమీ వుండదులే నాన్నా. నేనున్నాగా" అన్నది అరుంధతి.

వెళ్తున్న ఆమె దగ్గరకువచ్చి, "నాకు భయంగా వుందక్కా" అన్నది లక్ష్మీదేవి దీనంగా.

"భయం ఎందుకే పిచ్చినాన్నా? రేపీపాటికి అమ్మ ఇంటికి వస్తుంది" అని ధైర్యం చెప్పింది అరుంధతి.

"ఈ రాత్రి నువ్వక్కడే వుంటావా అక్కా ?"

"ఎట్లా చెప్పటం ?"

"వీలుంటే మాత్రం వొచ్చెయ్ అక్కా ?"

"తప్పకుండా వస్తాను"

"వీళ్ళల్లో వొక్కళ్ళు నా మాట వినరు. తెల్లవారే టప్పటికి నువ్వు ఇక్కడ వుండకపోతే నేనే అక్కడకు వస్తాను."

"అమ్మకి తోడుగా వుండాలని తప్ప, నాకేం పనుం దక్కడ ? వెంటనే వొచ్చేస్తాను."

"అమ్మకి ప్రమాద మేమీ లేదుగా అక్కా ?"

"ఏ ప్రమాదమూ లేదు."

తల్లి 'నర్సింగ్ హోమ్' లో ఎందుకు జేరిందీ పిల్లలిద్ద రికీ తెలుసు. కాని ఫలాని దానికని వారు చెప్పుకోలేదు. ఎప్పుడయినా మాట్లాడుకున్నా ఆ విషయం ఎత్తకుండానే మాట్లాడుకునే వారు. అదేదో పిల్లలు మాట్లాడుకోవలసిన విషయం కాదని వారి ఉద్దేశం.

అరుంధతి వెళ్ళిపోయింది.

తన గదిలో పడుకొని వున్న నారాయణరావు పిల్లలు మాట్లాడుకున్న మాటలు విన్నాడు. అతని మనస్సు పరి పరి విధాల నర్తించింది.

తన భార్యకు ఏమన్నా అయితే తన బ్రతుకు ఏం కాను ? ఈ పిల్లలందరూ ఏం కావాలి ? అతను ఎక్కువ దూరం ఆలోచించలేకపోయాడు.

టేబిల్ మీద వున్న ఫైళ్ళలోకి తల దూర్చటానికి ప్రయత్నించాడు. యమపాశంలాంటి ఎర్రని గుడ్డపీలికలతో (పేగులతో) కట్టబడి, ఆ ఫైళ్ళలో కూరుకుపోయివున్న శత కోటి జీవాలు వొక్కుమ్మడిగా మూలిగాయి. ఆ మూలుగులు తన పేగుల కూతలవలె వినిపించాయి నారాయణరావుకి. ఆలోచిస్తే అవి చిట్లుతున్న నరాలేమో అనిపించింది అతనికి. పగులుతున్న హృదయాలయినా అవవచ్చు. అంతేకాదు. ఆకలి మంటల ఆక్రందనాలైనా కావచ్చు.

వొక జీవి లేచింది. దాని రొమ్ములో బాకు దిగబడి వుంది. నెత్తురు వరదలై పారుతూ వుంది.

"ఏమిటిది ?"

"మంత్రిగారు పొడిచారు."

"అంటే ?"

"నా క్రింద పనిచేసేవాణ్ణి ప్రమోట్ చేసి, నన్ను రివర్ట్ చేశారు."

"ఎందుకు ?"

"నేను తన కులం వాణ్ణి కానని !"

"ఏ విధంగా చెయ్యగలిగారు ?"

"నాకు వచ్చే సంవత్సరం ప్రమోషన్ రావలసి వుంది. అందుకని గత రెండు సంవత్సరాలనుంచీ మా అధి కారిని కట్టుకొని, నా మీద రిపోర్టులు రాయించారు. ప్రస్తుతం నన్ను రివర్ట్ చేసి నా స్థానంలో నా క్రింది అతన్ని ప్రమోట్ చేశారు. అంతేకాదు. నాకు రావలసిన ప్రమో షన్ అతనికి రాగలందులకు గ్రౌండ్ సిద్ధం చేశారు కూడాను."

మరొక జీవి లేచింది. వాని వీపులో బాకు దిగబడి వుంది.

"ఏమిటిది ?"

"మా ఎం. ఎల్. ఏ. పొడిచాడు"

"ఎట్లా ?"

"గత ఎన్నికల్లో నేను అతనికి వోటివ్వలేదు. అది మనస్సులో పెట్టుకున్నట్టున్నాడు. నేనా గమనంలో లేదు. ఎందుకంటే పైకినాతో బాగానేవుండేవాడు. ఆ మధ్యమాఫూరి ప్రక్కన వున్న అడవిలో వొక వంద ఎకరాలు అమ్మకానికి వస్తే నన్ను ప్రోత్సహించి నాతో కొనిపించాడు. నన్ను నమ్మించి ఆ భూమినంతా బాగుచేయించాడు. తీరా పెట్ట వలసిన ఖర్చంతా పెట్టించతరువాత అడవి నేను ఆక్రమించు కున్నానని పిటీషన్ పెట్టించాడు. ఎవ్వరికేం చెప్పాడో, ఏం చేశాడో ఆ భూమిని ప్రభుత్వం అడవిలో కలుపుకుంది. ఎంతమందితో మొర పెట్టుకున్నా నాగతి ఆలోచించిన వాళ్లులేరు. నేను కొన్నది అంతకుముందు పట్టా వున్న భూమే. అందులో కొంత భూమి సేద్యంకూడా అయివుంది. ఎట్లా అడవిలో కలుపుకున్నాడో నాకు తెలియకుండా వుంది. నాకు అంతకు ముందున్నది కాస్తా అమ్మి దానిమీదే పెట్టాను. ఇప్పుడు నా భార్యా బిడ్డలకు గడవటమే కష్టంగా వుంది."

ఇంకొక జీవి లేచింది. దానికి ఎవ్వరో వురివేసి దూలానికి వేలాడదీశారు. అది వయసులో వున్న జీవి.

నారాయణరావు చూడలేక కండ్లు మూసుకున్నాడు.

"నీకు పబ్లిసిటీ డిపార్టుమెంట్ తెలుసుగా ?" అని అడిగిందా జీవి.

"తెలియకేం ?"

"నేను అందులో మంచి ఉద్యోగంలోనే వుండేవాణ్ణి"

"మరి ఇదేమిటి ?"

"ఆ మధ్య లీడర్ ఎలక్షన్స్‌లో వొక నాయకుని సహాయం ఇప్పుడు ఛీఫ్ మినిష్టరు అయిన భద్రాచలంగారికి కావలసి వచ్చిందట. ఆ నాయకుడేమో తన కుమారునికి మంచి ఉద్యోగం ఇప్పిస్తే సహాయం చేస్తానన్నాడట. అందుకు వొప్పుకున్న మీదట తండ్రీ కొడుకులు తెగబడి సహాయం చేశారుట. దానిమీదట ఈ నాయకుడు లీడరు అవటం, ఛీఫ్ మినిష్టరు అవటం జరిగింది. యిక తనకు సహాయంచేసిన నాయకుని కుమారునికి ఉద్యోగం యిప్పించటమే మిగిలివుంది. వొక్క పబ్లిసిటీ డిపార్టుమెంట్‌లో తప్ప ఏ డిపార్టుమెంట్‌లోనైనా క్రిందనుంచి రావలసి ఉంటుంది. అందుకని నన్ను డిస్మిస్‌చేసి ఆ ఉద్యోగం ఆ కుర్రవాడికి ఇచ్చాడు."

"నిన్ను ఎట్లా డిస్మిస్ చేశాడు."

"ఇప్పుడున్న పరిస్థితుల్లో అదేమంత కష్టమయినపని కాదు. ఆ నాటి ఎలెక్షన్‌లో నేను కాన్వాస్ చేదామని నలుగురు పెద్దమనుష్యులతో వొక పిటీషన్ పెట్టించి, ఇన్క్వెయిరీ క్రతువు నడిపి దానిమీద నా డిస్మిస్ ఆర్డరు వేశారు"

"నువ్వు ప్రచారం చెయ్యలేదుగాని, ఇప్పుడు ఉద్యో

గంలోవున్న కుర్రవాడు మాత్రం ఇప్పటి చీఫ్ మినిస్టరుగారి తరఫున చేశాడు."

"చీఫ్ మినిష్టరు అయిన నాయకుని తరఫున చేసిన ప్రచారం, ప్రచారం కాదు. అది పెద్దపెద్ద ఉద్యోగాలు సంపాదించటానికి తిరుగులేని క్వాలిఫికేషన్."

ఇలాగే ఆ ఫైళ్ళలోనుంచి అనేక జీవులు లేచినై. చివరికి వాళ్ళమీద ఆధారపడిన కుటుంబాలు లేచినై. "మేము చేసిన తప్పేమివుంది ? మా పొట్టలమీద కొట్టటం ఎందుకు ? మా ఉసురు వాళ్ళు ఎప్పుడు పోసుకుంటారు ?" అనే ఆక్రందనాలతో కన్నీటి ధారలతో నారాయణరావు మనస్సు నిండిపోయింది.

కానివాళ్లతో పాటు కన్నీరు పెట్టుకోవటంకంటే తాను చేయగలిగింది ఏముంది ? ఈ యమపాశం నుంచి తప్పించుకునే శక్తి ఎవ్వరికి వుంది ? అసలు మార్గం ఏది ? పెదవి కదిపిన వాడి నెత్తిన అపవాదులు చుట్టుకుంటై. ఆ అపవాదులను మోసుకుంటూ బ్రతకటం అతనికి దుర్ఘటం అవుతుంది.

పోనీ ఈ హింస అతనితో అంతమైతే అదొకరకం. అతను చచ్చినా వొగిలి పెట్టదు. అతని పిల్లలను వెనవేసు కుంటుంది. వాళ్ళకు ఉద్యోగాలు లేకుండా చేస్తుంది. అంతే కాదు. వాళ్ళను జీవితపర్యంతం వొక కంట కనిపెట్టి వుంటుంది. వాళ్ళు చచ్చిన తండ్రిని ఆడిపోసుకోక మానరు.

ఏదన్నా దురన్యాయం జరిగినప్పుడు ప్రభుత్వానికి ఎదురు తిరుగుదాం అనుకొని పిల్లల ఆలోచనవచ్చి గుటకలు

మింగి వూరుకున్న సమయాలు అతని జీవితంలో అప్పటికే ఎన్నో గడచిపోయినై. ప్రస్తుతం, 'కొద్ది రోజులు కన్ను మూసుకుంటే సరిపోయె, ఇప్పుడెందుకు లేనిపోయిన బెడదలు కొని తెచ్చి పెట్టుకోవటం," అనే వైరాగ్య దృష్టిలో పడ్డాడు.

ఆ దృష్టిలో పడ్డ నారాయణరావుకి ఫైళ్ళల్లోని జీవుల కథలు జ్ఞాపకం రావటం చీకాకును కలిగించింది. వాళ్ళకు తాను సానుభూతిని కూడా చూపలేని స్థితిలో వుండగా ఎందుకు వాళ్ళట్లా తన్ను తరుముతారు ? తన దగ్గర నుంచి ఏమి ఆశించి ? తానేం కావాలసి ?

ఫైళ్ళన్నీ గబగబా మూసివేశాడు నారాయణరావు మనస్సుకి శాంతి దొరకగలందులకు ముసుగు పెట్టుకొని పడుకున్నాడు.

ఇంట్లో పిల్లవాడు, "అమ్మా ?" అంటూ ఏడుస్తూ లేచాడు. వాడికి అమ్మే జ్ఞాపకం వచ్చిందో! నల్లే కుట్టిందో' లక్ష్మీదేవి ఎంత వోదార్చినా ఆగటంలేదు. ఇంకాసేపు అలాగే వుంటే మిగిలిన పిల్లలుకూడా లేవగలరు. అప్పుడొక బ్యాండు మేళం తయారవుతుంది. అంతా కర్నాటక సంగీతము ప్రారంభిస్తే వాళ్ళను ఆపడం భగవంతుడి తరంకూడా కాదు. ఆ భయంతో, "వాడిని ఇట్లా తీసుకురా అమ్మా," అని లక్ష్మీదేవిని పిలిచాడు.

అరుంధతి కొంచం నయంగాని, లక్ష్మీదేవికి పిల్లలను ఆడించటం అసలే చేతగాదు. ఆ పిల్లవాడిని రెండు రెక్కలూ పట్టుకొని నీళ్ళ బిందెను మోసుకువచ్చినట్లు మోసుకు వచ్చి తండ్రికి అప్పగించింది.

"అమ్మ కావాలి," అని బిగ్గరగా ఏడుస్తూనేవున్నాడు పిల్లవాడు. వాడిని సముదాయించి నిద్ర పెట్టేటప్పటికి నారాయణరావుకి తల ప్రాణం తోకకు వచ్చింది.

తన భార్య లేని యిల్లు ఎలావుండేదీ ఆ రోజుచూశాడు నారాయణరావు. అరుంధతీ, లక్ష్మీదేవి ఎన్నిచేసినా ఆమె లేని లోటులోటుగానేవుంది. వొక్క లోటుగావుండటంకాదు. పిల్లలది ఎవ్వరి దారి వారిదే, ఎవ్వరి గోల వారిదే అయింది.

ఆ ఇంట్లో తనతోపాటే పిల్లలూ వుదయం అయిదున్నర గంటలకు లేస్తారు. లేస్తారంటే ముందుఎవ్వరో ఒకరులేచి ఏడుపు ప్రారంభించటంతో మిగిలిన వారంతా లేచి కూర్చుంటారు. అంతా దశ దిశలనుంచీ ఏడుపులు ప్రారంభిస్తారు. అక్కడితో పెద్ద పిల్లలు లేచి కూర్చుంటారు. అందరూ కాఫీగత ప్రాణులే. పిల్లలందరికీ ఎవ్వారికి వాళ్ళకే అందరికంటే ముందు కాఫీ కావాలి. ఎవ్వరికి ముందిచ్చినా మిగిలిన వాళ్ళందరూ ఏడుపులు లంకించుకుంటారు.

ఆ రోజు ఉదయం అయిదున్నర మొదలుకొని ఏడు గంటలవరకూ పిల్లల ఏడుపులతో యిల్లు దద్దరిల్లి పోయింది. వాళ్ళకి ముందిచ్చావంటే వాళ్ళకు ముందిచ్చావని మొత్తం అందరూ ఏడుపే. కొందరు తాగలేదు. కొందరు కోపం వచ్చి చేతుల్లోని గ్లాసులను నేలకు వేసి కొట్టారు. అయిదో పిల్లవాడు తనకు పంచదార తక్కువైందనిఅలిగితే, నాలుగో పిల్ల తనకు పంచదార ఎక్కువైందని అలిగింది. మొత్తం మీద వంటయిల్లు చేపల బజారు కంటే తీసికట్టు అయింది.

'తన భార్య పిల్లందర్నీ ఎట్లా అదుపులో పెట్టేదా!'

అని ఆలోచిస్తూ కూర్చున్నాడు నారాయణరావు. ఆ మాటలూ ఈ మాటలూ చెప్పి అందర్నీ సముదాయించి పంపేది. మరీ చిన్నవాళ్ళకి కాఫీ జబ్బు చేస్తుందని బోరన్ విటా యిచ్చేది. మిగిలిన వాళ్ళకి కాఫీ తరగతుల వారీగా తయారుచేసి యిచ్చేది. వయస్సును బట్టి మరీ లైట్ కాఫీ నుంచి చేదు విషం కాఫీ వరకూ సిద్ధంచేసి యిచ్చేది. తనకు స్ట్రాంగ్ కాఫీ ఇష్టం.

యిక భోజనాల దగ్గర, కాఫీ దగ్గరకంటే ఎక్కువ గోల చేశారు పిల్లలు. వాళ్ళు మొదటివాడు ఏది పెట్టించుకుంటే, మిగిలిన వాళ్ళంతా అదే అడుగుతారు. తిన్నా తినకపోయినా, ఎక్కువ పెట్టమని పోట్లాడుతారు. మళ్ళీ నెయ్యి దగ్గర పోట్లాట. మంచీ చెడూ లేకుండా నేతి గిన్నె వంచమనే వాళ్ళందరూ అడిగేది. అన్నం రుచి చెడిపోతుందంటే వాళ్ళల్లో వినేది ఎవ్వరు ? ఇంటి కప్పు ఎగిరిపోయేట్టు ఏడ్వటం. వాళ్ళ భోజన కార్యక్రమంలో చివరి అధ్యాయం మరీ విచిత్రమైంది. ఆకలి తీరేదాకా తిని, మిగిలిన అన్నం వాకరి మీదకు వాకగు కేరింతలు కొడుతూ విరజిమ్ముకుంటారు. అలా జల్లు కోవటం వాళ్ళకు పూలూ బుక్కాయీలూ జల్లుకున్నట్లు వుంటుందో ఏమో ! ఆ కాసేపూ ఆనందాబ్ధిలో వోలలాడుతారు. ఆ ప్రయత్నం నుంచి బ్రహ్మ రుద్రులుకూడా వాళ్ళను విరమింప జెయ్యలేరు.

ఇక అక్కడనుంచి డబ్బులు అడిగే కార్యక్రమంలో పడతారు. అడిగినప్పుడల్లా పిల్లలకు డబ్బులివ్వటం వాళ్ళను చెడగొడుతుందనే ప్రతీతి వొకటి లోకవ్యాప్తంగావుందని నారాయణరావుకి తెలుసు ఆ సంగతి రాజమ్మ అస్తమానం అతనికి జ్ఞాపకం చేస్తూవుంటుంది కూడాను.

"పిల్లల్ని మీరే చెడగొడుతున్నారు," అంటుంది.

"మీరిట్లానేర్పితే • వాళ్ళు దొంగలూ త్రాడుబోతులూ అవుతారు," అంటుంది.

"వాళ్ళు పెద్దవాళ్ళయి నోళ్ళుకొట్టుకు బ్రతకాల్సిందే" అంటుంది.

ఎన్నన్నా వాళ్ళ గోలపడలేక, డబ్బులు అడిగినప్పుడల్లా వాళ్ళకు ఇస్తూనేవుంటాడు. ఆ కాసేపయినా వాళ్ళగల్లంతు తప్పుతుందని అతనిభ్రమ. కాని అది వొట్టి భ్రమే. ఎందుకంటే వాళ్ళకు డబ్బు వెంటవెంటనే అడగకూడదనీ, రెగ్యులర్ ఇన్టర్వల్స్‌లో మాత్రమే అడగాలనీ తెలియదు. ఆడబ్బు పెట్టుకొనితిని (తింటూ కూడా) మళ్ళీ వెంటనే అడుగుతారు. ఇవ్వకపోతే మళ్ళీ గోలే. మరీ చిన్నవాళ్ళు అతనితోపాటు ఆఫీసుకు వొస్తానని మొండికి వేసుకు కూర్చుంటారు. వాళ్ళను వొదిలించుకోటానికి మళ్ళీ ఏదో వొకటి కొనిపెట్టాలి. కొనిపెట్టింది తింటూ ఆఫీసుకు వాళ్ళు వెంటపడే రోజులుకూడా ఉండకపోలేదు.

తెల్లవారింతరువాత వాళ్ళు అప్పుడప్పుడూ తిండికీ, డబ్బులకూ ఇంట్లోకి రావటంతప్ప, అస్తమానం ఇంటి ముందున్న వీధిలోనే వుంటారు. అక్కడ వాళ్ళుచేసేపనులు వర్ణించటం వొకింతకష్టం. మట్టిలో పొర్లాడటం మొదలుకొని, దారేపొయ్యేవాళ్ళతో పోట్లాట్టంవరకూ చేస్తూవుంటారు. మధ్యమధ్య బయట పిల్లలతో పోట్లాడీ, తమలో తాము పోట్లాడుకొనీ గీపెడుతుంటారు.

వాళ్ళు ఇంట్లోవుంటే ఎవ్వరికీ ప్రశాంతత వుండని మాట నిజమే. కాని బయటవున్నంతసేపూ అంతకంటే అదురుగా వుంటుంది నారాయణరావుకి. ఆ ఇంటి ముందు బజార్లో కార్లూ సైకిళ్ళూ ఎక్కువగా తిరుగుతూవుంటై, పిల్లలు ఆడుకుంటూ ఆడుకుంటూ ఏ ఏక్సిడెంట్ కి లోనవుతారోనని అతనిగుండె నిరంతరం కొట్టుకుంటూనే వుంటుంది. రోడ్డుమీదనుంచి ఏడుపు వినబడితే అతనికి దడగా వుంటుంది. ఏంజరిగిందోనని చేస్తున్నపని విడిచిపెట్టి బయటకు పరుగెత్తుతాడు.

"పక్కింటి పిల్లాడు నన్ను కొత్తి పాలిపోయాలు," అంటాడు వొకడు.

"నాగాలిపటం చింపేశాడు" అంటుంది వొకతె.

"తమ్ముడి నెత్తిమీద దుమ్మోస్సారు," అంటుంది ఉన్నవాళ్ళల్లోకి పెద్దది.

అదేపోసి ఎవ్వరిమీదో పెడుతూవుందని నారాయణరావుకి తెలుసు. తెలిసిమాత్రం ఏం చేస్తాడు? ఎంత అడిగినా వాళ్ళు నిజం చెప్పరు. ఈ కార్యక్రమంలో పక్క

ఇంటివాళ్ళువచ్చి వాళ్ళు తమ పిల్లలను కొట్టారనీ, తమ ఇంటిముందు బంధువు వొకాయన సైకిల్ పెట్టుకుంటే పడ గొట్టి విరగగొట్టారనీ మొదలైన విషయాలతో ఫిర్యాదులు చేస్తూవుండటంకూడా వొక అంశం.

ఎవ్వరిపిల్లలు వాళ్ళకిముద్దు. వాళ్ళు గల్లంతు చెయ్యరు. వొకరిజోలికి వెళ్ళరు. అందుకని, "ముందు మీ పిల్లలే కొట్టారు అంటున్నారు మావాళ్ళు" అంటే, "మా వాళ్ళు అటువంటివాళ్ళు కాదు," అని నిర్ధారణగా చెప్పి వేస్తారు. అంతేకాకుండా, "పిల్లలను కనగానే కాదు. అదు పులో పెట్టటంకూడా తెలుసుకొని వుండాలి" అని సలహో చెపుతారు.

నారాయణరావుకి ఇరుగుపొరుగుతో కజ్జాకు దిగటం ఏమాత్రం ఇష్టంవుండనిపని. అయినా రోజుకొక ఫిర్యాదు వొచ్చిపడుతూనే ఉంటుంది.

ఆనాడు భార్య ఇంట్లోలేదని ఆఫీసునుంచి అయిదు గంటలకే బయలుదేరి వచ్చాడు. పిల్లలు ఎక్కడెక్కడ తిరుగుతున్నారో, ఏంచేస్తున్నారో అని అతనిభయం. భార్య వుంటే అన్నీ ఆమె చూసుకునేది. పెద్దపిల్లలమాట పిల్లలు బొత్తిగా వినరు.

అతను వొచ్చేటప్పటికి అరుంధతి ఇంటిపని హడా వుడిలోవుంది. లక్ష్మీదేవి అంతకుముందే కాలేజీ నుంచి వచ్చింది. చిన్నపిల్లలెవ్వరూ ఇంట్లోలేరు.

"పిల్లలు ఎక్కడ?" అని అడిగాడు నారాయణరావు.

"జారుబండదగ్గరకు ఆడుకోటానికి వెళ్ళారు," అన్నది అరుంధతి.

జారుబండ ఎక్కడో అతనికి తెలుసు. తన ఇంటికి మూడు నాలుగు ఫర్లాంగుల దూరంలో వుంటుంది. పిల్లలనుపిలుచుకు రావటానికి అప్పుడప్పుడూ అతను అక్కడకు వెళుతుంటాడు.

"చిన్నవాడు ఏడీ?"

"వాడిని చంకన వేసుకు వెళ్ళారు"

"ఎందుకు వెళ్ళనిచ్చావు? వాళ్ళు వున్నచోట ఉండేవారా పాడా?" అని ఆతురతగా అడిగాడు.

"ఇంట్లోవుంటే వొక్కపని సాగనివ్వటంలేదు నాన్నా. నేనేమో వంట పూర్తిచేసుకొని అమ్మదగ్గిరకు వెళ్ళాలాయె"

పిల్లలకోసం నారాయణరావు బయలుదేరాడు. అతనికి మనస్సు పీకింది. వొకసారి తాను వెళ్ళినప్పుడు చిన్నవాణ్ణి చంకన వేసుకొని జారుబండ జారుతూవుంది చిన్నది. వాడు దాని చంకన నిలువక జారుతున్నాడు. ఇంకొకసారి వాణ్ణి ఉయ్యాలలో కూర్చోబెట్టి వూపుతూవుంది. మిగిలిన పిల్లలు ఉత్సాహపరచగా ఉయ్యాల వూపు ఎక్కువ చేసింది. వాడు భీతు కుడిచి గొలుసు పట్టుకు కూర్చున్నాడు. తనను చూచి 'నాన్నా' అని బిగ్గరగా అరిచాడు. వాడు ఉయ్యాలమీదనుంచి పడ్డాడే అనుకున్నాడు నారాయణరావు. భగవంతుని దయవల్ల అంత పని జరుగలేదు.

ఈరోజు అటువంటి పని ఏదో జరుగుతుందని భయంవేసి అతను గబగబ జారుబండ దగ్గరకు వెళ్లాడు. అక్కడ చాలామంది పిల్లలు ఆడుకుంటున్నారు. తన పిల్లలూ వున్నారు. చిన్నవాడు దూరంగా వంటరిగా కూర్చొని ఏదో ఆలోచించు కుంటున్నాడు. పెద్దపిల్లవాడు పదిమంది స్నేహితులతో కలిసి చెడుగుడు ఆడుతున్నాడు. చిన్నపిల్లమాత్రం ఎంత వెతికినా కనపడలేదు.

పెద్ద పిల్లవాణ్ణి పిలిచి అడిగాడు. వాడిపేరు రామనాథ్. వాడికి పన్నెండేళ్ళు.

"ఇప్పటిదాకా ఇక్కడేవుంది నాన్నా," అన్నాడు రామనాథ్.

"ఎక్కడోయ్, ఎక్కడ?"

అందరూకలిసి అంతటా వెతికారు కాని ఆపిల్ల కన పడలేదు. ఆపిల్ల స్నేహితుల యిళ్ళకు వెళ్ళి అడిగారు. అక్కడకు రాలేదన్నారు ఆ ఇళ్లవాళ్ళు. పైగా జతపిల్లలతో కలిసి ఎక్కడికైనా వెళ్ళిందేమో అనుకోటానికైనా, జత పిల్లలందరూ ఎవ్వరిఇళ్ళల్లో వాళ్ళు వున్నారు.

వొక ముసలమ్మ "చీకటికూడా పడుతూవుంది. తొందరగా వెతకండయ్యా, రోజులు బాగాలేవు" అన్నది.

అక్కడితో నారాయణరావులో అంతకుముందు అణగివున్నభయం వొక్కసారిగా పైకి వుబికింది; వెల్లువ అయింది. అంతకుముందు అతను విన్న అనేక కథలు మనో వీధిలో తిరుగాడజొచ్చినై.

ఈమధ్యే సికిందరాబాద్ హోటళ్ళదగ్గర వొక గుడ్డి పిల్ల బిచ్చంఎత్తుకుంటూవుంది. వొకామె చెయ్యిపట్టుకొని ఆపిల్లను నడిపిస్తూవుంది. ఆపిల్లకు పదెనిమిది సంవత్సరాల కంటే వయస్సు ఎక్కువలేదు. "అయ్యల్లారా, అమ్మల్లారా కడుపు కాలుతూవుంది, వొక్కపైసా వెయ్యండి," అని దీనంగా ప్రార్థిస్తూవుంది.

అటేవెళ్తున్న వొక యువకుడు ఆమాటలు విన్నాడు. అతను హైదరాబాద్‌లో కాపురం వుంటున్నాడు. అతనికి ఆగొంతు ఎక్కడో విన్నగొంతు అనిపించింది. ఆపిల్లను తేరి పారచూశాడు. ఆ ముఖం ఎక్కడో చూచినట్లు అనిపించింది. అలాగే చూస్తూ నిలబడ్డాడు. ఆపిల్ల అడుక్కుంటూనే వుంది. అతనికి తటాలున అనిపించింది. ఆపిల్ల రెండు సంవత్సరాల క్రిందట తప్పించుకుపోయిన తన మేనగోడలు గౌరికిమల్లే వున్నదని. కాని గౌరికి కలువరేకుల వంటి కండ్లుండేవి. ఈపిల్ల గుడ్డిది. అతనికి వెంటనే అడుక్కుతినే వారి ఘాతుకచర్యలు జ్ఞాపకంవచ్చినై.

గబగబావెళ్ళి అడుక్కుంటున్న ఆపిల్లచెయ్యి పట్టుకొని, "గౌరీ?" అని బిగ్గరగా పిలిచాడు. ఆ పిలుపుకు ఆ పిల్ల తండ బిందలాడింది. ఏడుస్తూ తప్పించుకు పోవటానికి పెనగులాడింది. ఆపిల్ల చెయ్యిపట్టుకొని అడుక్కోటానికి సహాయపడుతున్న ఆమె బండబూతులుకూస్తూ ఆ కుర్ర వాడితో కలియబడింది. అతనికి ఎక్కడనుంచి వొచ్చిందో ఏనుగుబలం ఆమెను పతదొ్రశాడు. గుడ్డిపిల్లను పట్టుకొని,

మామను "గౌరీ! నేను నీమామను ... గౌరీ! గౌరీ! .... నామాట వినపడుతూవుందా? నేను నీ మామను!" అని అదేపనిగా అరిచాడు. ఆ అరుపుల్లో ఆపిల్ల తప్పించుకోవాలనే పెనుగులాట ఎప్పుడు ఆపివేసిందో ఆపివేసింది. ఏడుపు ఎప్పుడు ఆపివేసిందో ఆపివేసింది. ఉండి, ఉండి "మామా" అని, లేగదూడ 'అంబా!' అని అరచినట్లు అరచి అతనిని కావిలించుకుంది.

తరువాత అసలు విషయం తేలింది.

వొకరోజు ఆపిల్ల బడినుంచి వొస్తుంటే లాంకోటు వేసుకున్న వొకవ్యక్తి కనుపించి, 'మీఅమ్మ చుట్టాల ఇంట్లోవుంది, నిన్ను రమ్మంటూవుంది,' అనిచెప్పాట్ట. ఆపిల్ల నమ్మి అతనివెంట వెళ్ళింది. రెండుమూడు సందులు నడిచింతర్వాత, ఆవ్యక్తి ఆపిల్లను బలవంతంగా పట్టణం బయటవున్న వొక పల్లెకుఎత్తుకుపోయి వొక ఇంట్లో నిర్బంధించాడట. అవూళ్ళో వున్నవాళ్ళందరూ దొంగలేనట.

ఆపిల్లను ఆఇంట్లోనేవుంచి నానా హింసలూ పెట్టి సంకల్పశక్తి పూర్తిగా నశించేటట్లుచేసి, కండ్లు పొడిపించివేశాడట. ఆపిల్లకు ఇంచుమించు పూర్వ స్మృతేలేకుండా చేసి అప్పటినుంచీ తన సంపాదనలో భాగస్వామినిగావున్న ఆడమనిషి తోడుతో అడుక్కోటానికి పంపించాడట. ఇటువంటి పిల్లలు అతనికింద నలుగురయిదుగురు వున్నారట.

ఈకథ జ్ఞాపకంవచ్చిన నారాయణరావుకి గుండె పగిలినంతపనయింది.

"మీరు ఇంటికి వెళ్ళండి," అని చెప్పి పిల్లలను పంపించి పిల్లను వెతుకుతూ తాను బజారు వెంట పడ్డాడు. బజార్లో ఏపిల్ల కనుపించినా తనకూతురే అనిపించింది అతనికి. కాకపోయేటప్పటికి ఇంతమంది పిల్లలు ఇలా ఆడుకుంటూ వుండగా తనకూతురే కనపడకుండా పోవాలా అనే దిగులుపట్టుకుంది. ప్రపంచంలో ఇంతమంది జనసంఖ్య వుండగా ఇటువంటి దారుణ సంఘటన తనకే ఎందుకు సంభవించాలో అతనికి అర్థంకాలేదు.

అక్కడకు దగ్గర్లో వొక చిన్నపార్కు వుంది. అక్కడికి సాయంకాలంపూట పిల్లలు జేరుతూ వుండటం నారాయణరావు అంతకుముందు రెండు మూడుసార్లు చూశాడు. తలిదండ్రులు రేడియోవార్తలు వింటూవుంటే పిల్లలంతాకలిసి అక్కడి పచ్చికబయలుమీద ఏదోవొకటి ఆడుకుంటూ వుంటారు.

తనకుమార్తె బహుశా అక్కడికి జేరివుండవచ్చు అనుకున్నాడు. దానికి రేడియో అన్నా యిష్టమే, ఆటలన్నా యిష్టమే. భగవంతుడి దయవల్ల ఆపిల్ల పార్కులో వుండటం తటస్థిస్తే, వెంకటేశ్వరస్వామికి వొచ్చే ఆదివారం డజను కొబ్బరికాయలు కొడతానని మనస్సులో వొప్పుకున్నాడు. వెంకటేశ్వరస్వామికోసం తిరుపతి వెళ్ళవలసిన అవుసరంలేదనీ, చిక్కడపల్లిలో వొక వెంకటేశ్వరస్వామి ఆలయం వుందనీ అక్కడ మొక్కుతీర్చుకుంటే సరిపోతుందనేభావం మొక్కుకున్నప్పుడు అతనిమనస్సులో లీలగా

వుంది. అందుకనే అంత మొక్కు మొక్కుకునే ధైర్యం చేశాడు నారాయణరావు. లేకపోతే తిరుపతి వెళ్ళటం అతని వశమా? అతని తలలోని జేజివశమా?

అంత మొక్కు మొక్కుకున్నా తన కుమార్తె పార్కులో కనపడలేదు అతనికి. అటువంటి సందర్భాల్లో భగవంతుణ్ణి అనుమానించిం దానికన్నా ఆయన ఉనికిని శంకించిందానికన్నా తన మొక్కులోనే ఏదో లోటు వుందని అనుకోవటం శ్రేయస్కరమని అతనికి తెలుసు. అలాగే అనుకున్నాడు.

"ఒక ఎర్రటిపిల్ల, సన్నటిది, ఆరేడు ఏండ్లు వుంటాయి. ఇటేమన్నా వొచ్చిందా?" అని అక్కడ పులి జూదం ఆడుకుంటున్న పెద్ద మనుష్యుల్ని అడిగాడు.

వాళ్ళు, 'మేం చూడలేదు' అన్నారు.

అందులో ఒకతను ఉన్నట్టుండి, "ఎర్రటి అమ్మాయా?" అని అడిగాడు.

"అవును" అన్నాడు నారాయణరావు ఆతురతగా.

"సన్నగా వుంటుంది?" అన్నాడు.

"అవును"

ఒక్క క్షణం ఆలోచించి, "లాభంలేదు. నేను అనుకున్న అమ్మాయికి పన్నెండూ,పధ్నాలుగు సంవత్సరాలుంటాయి" అన్నాడతను.

నారాయణరావు హతాశుడయ్యాడు. ఏదో ఉండ

బట్టలేక అడగటమేగాని, ఎర్రగా సన్నగా వుండే పిల్లలు ఎంతమంది లేరు. ఈమధ్య పిల్లలంతా అట్లానే వుంటు న్నారు. గుర్తుపట్టటం ఎట్లా సాధ్యం?

ఆ పార్కుని జేరుకొని ఒక నది ప్రవహిస్తూ వుంది. అది మురుగుకాల్వ. ఇటీవల ప్రభుత్వంవారు అధికాహా రోత్పత్తి కార్యక్రమ సందర్భంలో ఆ కాలువ గట్లమీద అరటిచెట్లు నాటారు.గట్లమీదే కాదు. కాలువమధ్య వున్న దిబ్బలమీద కూడా ఆ పనే చేశారు.

అటేమన్నా వెళ్ళిందేమోనని పార్కు అంచున నిల బడి తొంగిచూశాడు. అంతా చీకటి గుయ్యారంగా వుంది. చూడటానికే కాక, తలుచుకోటానికే భయం వేసింది. ఇంకా ఎక్కడికి వెళ్ళి వుంటుందో ఆలోచించు కుంటూ బయలుదేరాడు నారాయణరావు. కనుపించకపోతే ఏం చెయ్యాలో కూడా అతనికి ఆలోచించక తప్పలేదు.

'పోలీసువాళ్ళకు రిపోర్టు ఇవ్వాలి' అనుకున్నాడు.

'వాళ్ళకు రిపోర్టుఇచ్చి ఏం ప్రయోజనం? వాళ్ళకు ఎందుకు వుంటుంది శ్రద్ధ?'

'పైగా వాళ్ళ చేతుల్లో పడ్డవాళ్ళు మాన ప్రాణాలకు ఆశ ఒదులుకోవలసిందే'

'పోలీసులతో వ్యవహారం పురిటికంపు వంటిది. పిల్ల చచ్చినా ఆ కంపు వదలదు'

'మరెట్లా ఆ పిల్ల ఎక్కడుందీ కనుక్కోవటం. అందులో చీకటి దట్టమైనకొద్దీ తనకు వెతకటమూ కష్టమే

అవుతుంది. ఆ పిల్లకు తిరిగిరావటమూ కష్టమే అవుతుంది.'

'వొకవేళ ఇంటికి తిరిగి వచ్చిందేమో?'

ఈ ఆశ అతనికి కొద్దిపాటి ఉత్సాహాన్ని కలిగించింది. గబగబా ఇంటికి నడిచాడు. ఇంటి గడపలో లక్ష్మీదేవి నిలబడి ఎవ్వరికోసమో ఎదురుచూస్తూ వుంది. ఆ పిల్లకోసమే అనుకున్నాడు. ఆమె ముఖవర్చస్సును బట్టి తన కుమార్తె ఇంటికి వచ్చిందీ, లేందీ తెలుసుకోవాలని పరీక్షగా చూశాడు. మాటలతో అడగటం అతనికి భయం వేసింది.

'ఇంకా రాలేదు నాన్నా' అంటే?

అతనిగుండె పగులవచ్చు.

అందుకని చూపులతో గ్రహించాలని ప్రయత్నించాడు నారాయణరావు.

"నువ్విటు వెళ్ళావు అటు వచ్చింది"

"ఎవరు?" అని అడిగాడతను, అప్రయత్నంగా.

"మాధవి"—ఆ పిల్లపేరు అదే.

"మాదవి తిరిగి వొచ్చిందా?" అని ఆశగా అడిగాడు.

"అవును నాన్నా" అని సమాధానం చెప్పింది లక్ష్మీదేవి.

"ఎక్కడుంది?"

"ఇంట్లో వుంది. అక్క అందరికీ అన్నాలు పెడుతూ వుంది."

"నేను పార్కు, అవీ వెతికి వస్తున్నానమ్మా. ఎక్కడికి వెళ్ళిందట?"

"ఇంటికి వద్దామని జారుబండ దగ్గరనుంచి బయలు దేరిందట. వస్తూవుంటే పక్కఇంటి పిల్లవాడు కనుపిస్తే అత నితోపాటు వాళ్ళ ఇంటికి వెళ్ళి ఆడుకుంటూ కూర్చుం దట."

"ఏమైపోయిందో అని నా గుండెలు పగిలిపోయినై."

"నీ గాభరా తప్ప ఏమైపోతుంది నాన్నా? అది ఎక్కడికీ వెళ్ళదు. ఈ ఇళ్ళల్లోనే తిరుగుతూ వుంటుంది."

అలా అనుకోనటం తేలికే. అలా అనుకొని వూరు కోవటం సుఖంకూడాను. కాని నారాయణరావుకి ఆ విష యం అంత తేలికవిషయంగా కనపడదు.

రోజూ ఇరుగు పొరుగు ఇండ్లకి వెళ్తుంది గనక ఆ వాళకూడా అక్కడే వుండాలని ఎక్కడవుంది. చీకటి పడ్డాక తానే ఇంటికి తిరిగివస్తుంది గనక అవాళకూడా తిరిగి రావాలని ఎక్కడుంది? ఆ పిల్లని రోజూ ఎవ్వరూ మోసం చెయ్యటం లేదుగనుక, అవ్వాళ చెయ్యలేదు అని ఎక్క డుంది? ఇవ్వాళ మామూలుతప్పి జరగవచ్చు. మన జాగ్రత్తలో మనం వుండకపోతే, తరువాత పశ్చాత్తాప పడవలసి వస్తుంది.

"ఏదైనా చీకటి పడకముందే పిల్లలు ఇంటికి వచ్చే టట్టు చేస్తే బాగుండును" అన్నాడు నారాయణరావు.

"ఆ పని ఎవ్వళ్ళు చెయ్యగలరు నాన్నా? ఇప్పుడే

వస్తాం అంటారు. మళ్ళీ కనపడరు. వాళ్ళని వెతకటానికి ఎవ్వరికి తీరికవుంది? ఎవ్వరికి వుండే పని వారికి వుంటే" అన్నది లక్ష్మీదేవి.

అంటే, తాను జీవితంపట్ల కొంత నిగ్రహదృష్టి ఏర్పరచుకోవటంకంటే వేరుమార్గం లేదనే ఆ పిల్ల ఉద్దేశం కూడా.

వొక్కనాడు రాజమ్మ ఇంటిలో లేకపోయేటప్పటికి ఇంత గంద్రగోళం జరిగింది. ఏదన్నా జరిగి వొక వారం రోజులు ఈవమ్మ యింట్లోనే వుండవలసి వస్తే ఈ పిల్లలను అదుపులో పెట్టటం ఎవ్వరికీ సాధ్యం కాదు? వాళ్ళ అల్లరి తట్టుకోలేక వాడవాడంతా తన యింటిమీదకు దండెత్తే అవకాశం లేదనటానికి వీల్లేదు. వాళ్లను కట్టివెయ్యకుండా బజార్లో విడిచినందుకు పోలీసులు తనను అరెస్టుచేసినా చెయ్యవచ్చు.

పడుకున్న నారాయణరావుకి, నిద్రపట్టక ఇటువంటి జ్ఞాపకాలూ, ఆలోచనలూ ఎన్నో వచ్చినై. తన పక్కలో నిద్రపోతున్న చిన్నవాడు ఏదో గునుస్తున్నాడు. కలవరిస్తున్నట్లు వున్నాడు.

"నేను రాను" అని నిదలోనే సాగుతున్నాడు.

తనను వాళ్ళ అమ్మ దగ్గరనుంచి ఎవరో తీసుకోబోతున్నారని అతను భ్రమిస్తున్నాడని గ్రహించాడు నారాయణరావు.

"రావద్దులే అమ్మదగ్గరే వుండు;" అంటూ జోకొట్టాడు.

పిల్లవాడు మళ్ళీ మాట్లాడలేదు.

కాసేపటికి బయటనుంచి, 'జోర్ గరమ్' అనే కేక వినిపించింది.

అతను ఒక మార్వాడీ. శనగలు వేసి, కారంలో వేయించి అమ్ముతూ వుంటాడు. మొదట్లో ఒక పెద్ద కుండ మెడకు తగిలించుకొని, అందులో వేసిన శనగలు వేసుకొని, అర్ధణాకూ, అణాకూ పొట్లాలు కట్టి అమ్ముతూ వుండేవాడు. ఆ పెద్ద కుండలో చిన్న పిడత వుంటుందట. ఆ పిడతలో నిప్పులు వుంటాయట. అందువల్ల ఆ శనగలు ఎప్పుడూ వేడిగా వుండి రుచిగా వుంటై.

ఆ శనగలంటే పిల్లలకు చాలా ఇష్టం. 'జోర్ గరమ్' అనే కేక వినగానే చిల్లర డబ్బులు పట్టుకొని, పిల్లలు బిలబిలా బజార్లకెక్కి అతని చుట్టూ జేరతారు.

ఆ మాటకి వస్తే పిల్లలకే కాదు, ఆ శనగలంటే పెద్ద వాళ్ళకుకూడా ఇష్టమే. నారాయణరావుకి ఇష్టం. నారాయణరావు కేమిటి? డబ్బు ఖర్చవుతుందని ఎక్కువ కొనుక్కోనేది కాదుగాని రాజమ్మకుకూడా ఇష్టమే. పిల్లలు కొనుక్కుంటే వాళ్ళ దగ్గర నాలుగు గింజలూ, వీళ్ల దగ్గర నాలుగు గింజలూ బెల్లించుకొని తింటూ వుండేది.

"మన పక్కల ఎక్కడా ఇటువంటివి లేవు," అనేది.

"మనవాళ్ళు ఏ పనిచేసినా మోటుగా చేస్తారు. ఇక్కడ అంతా నాజూకు," అనేది.

"జోర్ గరమ్," బయటనుంచి ఆ మార్వాడీ మళ్ళీ కేక వేశాడు.

ఇప్పుడా మార్వాడీ పని బాగున్నట్లు వుంది. ఇదివరకు మల్లే కుండ పొట్లన కట్టుకురాక, సైకిల్ కి కట్టుకువస్తున్నాడు. ఇప్పుడతని పని తేలిక అవడమే కాక, ఎక్కువ వీధులు తిరిగి ఎక్కువ సరుకు అమ్మి, ఎక్కువ లాభాలు గడిస్తున్నాడు.

"కొనమంటావా నాన్నా ?" అని అడిగింది లక్ష్మీదేవి.

"నీకు కావాలంటే కొనుక్కో అమ్మా."

"నాకు అక్కర్లేదు" అన్నదా పిల్ల.

"అక్కర్లేక పోవటం ఎందుకు ? రెండు పొట్లాలు తీసుకో" అన్నాడు నారాయణరావు. తనకు మల్లే ఆ పిల్లకు కూడా తినాలని వుందని అతను గ్రహించాడు.

ఆ పిల్ల కొనుక్కువచ్చి తండ్రికి వొక పొట్లం ఇచ్చి తనొక పొట్లం తీసుకొని, పిల్లలు పడుకున్న హాల్లోకి వెళ్ళింది.

నారాయణరావు వొక్కొక్క గింజా నోట్లో వేసుకుంటూ పడుకున్నాడు.

అతని సంగతి ఆలోచించుకుంటే అతనికే ఆశ్చర్యం వేసింది. ఇంతమంది పిల్లలు కలిగి ఇంత వయస్సు వచ్చినా అతనికి చిరుతిండిమీద మమకారం ఏ మాత్రం తగ్గలేదు. అదికూడా పిల్లలు తినే చిరుతిండిమీద. ఎందుకని ? చిన్నప్పటినుంచీ యిప్పటివరకూ తన రుచులు మారలేదా ? పెరగలేదా ? అలా అయివుంటే దానికి కారణం ఏమిటి ? అందరి రుచులూ క్షణక్షణం మారిపోతుంటే, తన వాటిల్లో ఎందుకు చలనం లేదు ? అదేం జబ్బు కాదు గద !

"జబ్బయితే మాత్రం చేసేది ఏముంది ? తిన బుద్ధి అయినప్పుడు తినక తప్పదు గదా ?" అనుకొని వొక నిట్టూర్పు విడిచాడు నారాయణరావు. 'జోర్ గరమ్' తిని మంచినీళ్ళు తాగాడు.

తెలియకుండానే కూరుకు పట్టిందతనికి.

ఆ రాత్రి ఈవమ్మ ఇంటికి వెళ్ళేటప్పటికి, అరుంధతికి ముందుగా జఖరయ్యా కనపడ్డాడు. రాజమ్మ వుంటున్న గది పక్కన పొయ్యి పెట్టి అతను వేణ్ణీళ్ళు కాస్తున్నాడు.

అరుంధతిని చూచి, అతను పలకరించలేదు. ఆ నీళ్ళు కాచటం తన తల్లికి జరగబోయే చికిత్సలో వొక భాగమని అరుంధతికి అనిపించింది.

"సలసల కాగినయి," అని కేక వేశాడు జఖరయ్యా.

ఆ కేక విని గదిలోనుంచి బయటకు వచ్చింది ఈవమ్మ.

"ఇక నువ్వు వెళ్ళు."

జఖరయ్యా వెళ్ళిపోయాడు.

"గదిలోకి వెళ్ళి మీ అమ్మను స్నానానికి సిద్ధం చేయించు,"అన్నది ఈవమ్మ, అరుంధతిని చూచీచూడగానే.

"జరగబోయే చికిత్సను గురించి ఇప్పటికయినా నాలుగు మాటలు చెప్తుందేమోనని ఆశించింది అరుంధతి. అలా జరుగలేదు."

"ఊ. వెళ్ళు త్వరగా జరిగిపోవాలి."

అరుంధతి గదిలోకి వెళ్ళేటప్పటికి రాజమ్మ స్నానా

నికి సిద్ధంగా వుంది. ఆమెకు దగ్గర్లో వొక పీటా తొట్టీ వున్నాయి. కుమార్తెను చూచి ఆమె సంతోషించింది.

"సమయానికి వచ్చావ్" అన్నది తల్లి.

"ఏదో చెయ్యమంటుంది. ఏం చెయ్యమంటుందో సరిగ్గా చెప్పదు. నీకేమన్నా తెలుసా అమ్మా?" అని అడిగింది అరుంధతి.

"నాతోనూ ఏమీ చెప్పి చావలేదు. మాటలను బట్టి ప్రస్తుతం ఈ తొట్టిలో స్నానం చేయిస్తుందని అనుకుంటున్నాను."

"ముందుగా అన్నీ చెపితే పనిచెయ్యటానికి సుళువుగా వుంటుంది" అన్నది అరుంధతి.

"అడిగితే అరుస్తుంది. ఇంతకు ముందే వొకసారి అయింది. పాపం ఆమెభర్త జోక్యం కలిగించుకొని సర్దాడు," అన్నది రాజమ్మ.

అంతలోకి కడవలతో బయటకాగుతున్న వేణ్ణీళ్ళు పట్టుకొనివచ్చింది ఈవమ్మ. వొక్కొక్క చేత్తో వొక్కొక్క కడవపట్టుకొని వుంది. కడవలలోనుంచి పొగలువస్తున్నాయి. కడవలమూతులను పట్టుకున్న ఆమెచేతులు కాలకపోవటం అరుంధతికి విచిత్రంగావుంది.

కడవలను తొట్టిదగ్గరదింపి, వాటిలోని నీళ్ళను తొట్లోపోసింది. తొట్టినిండా పొగే.

"అట్లాచూస్తావేం? బయటతొట్లో చన్నీళ్ళువున్నాయి. రెండుకడవలనీళ్ళు అందులోనుంచి తెచ్చి, ఈతొట్లో

గుమ్మరించు" అన్నది ఈవమ్మ.

అలాగే తెచ్చిపోసింది అరుంధతి.

తరువాత చెప్పింది చేయగలందులకు అక్కడే నిల బడింది.

"ఇక్కడేవుండు" అని గదితలుపు వేసివచ్చి కూర్చుంది ఈవమ్మ.

"ఈ వేణ్ణీళ్ళల్లో కూర్చో," అన్నది ఈవమ్మ రాజమ్మని.

"అబ్బో, చాలా వేడిగావున్నయి." అన్నది రాజమ్మ చెంబ్యి పెట్టిచూచి.

"అంత వేడీ వుండవలసిందే" అన్నది ఈవమ్మ.

"తాటవూడుతుంది" అన్నది రాజమ్మ.

"అంతమాత్రానికే!" అని కోప్పడింది ఈవమ్మ.

రాజమ్మ గోరువెచ్చనినీటితో స్నానంచేసేమనిషి అవ టంవల్ల, ఆతొట్లోవున్న నీళ్ళు తుక తుక ఉడికిపోతున్నట్లు అనిపించింది. తొట్లోకి దిగకుండా, కేకలుపెడుతూ తొట్టి చుట్టూ తిరుగనారంభించింది.

"మెదలకుండా తొట్లోకి దిగుతావా లేదా?" అని అడిగింది ఈవమ్మ.

"ఇంగకాసిని చన్నీళ్ళు పోయించండి. పోసేవాళ్ళు లేకపోతే నేనే పోసుకుంటా," అన్నది రాజమ్మ.

"ఇంక చన్నీళ్ళుకలిపితే గుణంవుండదు."

"అయితే నేను పోసుకోను" అని మొండికేసింది.

ఆమె వైఖరికి ఈవమ్మకు పట్టరానంత కోపం

వొచ్చింది. నోటికివచ్చిన బూతులుకూస్తూ, రెక్కలు రెండూ పట్టుకొని లేవనెత్తి తొట్లో కూర్చోపెట్టింది.

అందులోవున్న నీటివేడికి తట్టుకోలేక వొక పెద్ద కేక వేసింది రాజమ్మ. కాని ఈవమ్మ ఆమె బుజాలు అదిమి పట్టుకొని లేవనియ్యలేదు.

ఈ దృశ్యం సహించటం కష్టమయింది అరుంధతికి. "భరించలేకుండావుంటే ఎందుకట్లా బలవంతపెడతారు?" అని తల్లిని తొట్లోనుంచి బయటకు తియ్యాలనే ఉద్దేశంతో రెండు అడుగులు ముందుకువేసింది.

"ఆగు," అని గద్దించింది ఈవమ్మ.

"అంతవేడి పట్టలేదండీ మా అమ్మ."

"నీకేంతెలుసు ఊరుకో," అని గద్దించింది ఈవమ్మ.

ఆ వేడి రాజమ్మకు అలవాటయినట్టుంది. ఆమె తల వాల్చి మెదలకుండా కూర్చుంది తొట్లో. "పరవాలేదులే అమ్మా, ఇప్పుడు బాగానేవుంది" అన్నది.

రాజమ్మని అట్లా చాలాసేపు కూర్చోపెట్టింది ఈవమ్మ. తొట్లో నీళ్ళు చల్లారిపోతుంటే, కాసిని వేడినీళ్ళు తెచ్చి పోస్తూవుండేది. రాజమ్మ మొదట్లో వేణ్ణీళ్ళు కలిపి నప్పుడల్లా మూలిగేదిగాని, క్రిమక్రమేణా మెదలకుండా వూరుకుంది. మూలిగేశక్తికూడా లేకుండా పోయిందేమో! సొమ్మసిలిపోయినా, పోయివుండవచ్చు!!

స్నానం పూర్తి అయింది. మళ్ళీ చేతులు పట్టుకొని బయటకు లేవదీసింది ఈవమ్మ. రాజమ్మ ఆమె చేతుల మీద తోటకూరకాడకుమల్లే వేళ్లాడుతూవుంది.

"ఆ పొడిగుడ్డలు ఇట్లా అందించు," అని కేక వేసింది ఈవమ్మ అరుంధతిని.

మంచంమీదవున్న పొడిగుడ్డలు ఆమె అందించింది. ఆ గుడ్డలతో మడిచి, ఆ గుడ్డలే శరీరానికిచుట్టి మంచం మీద పడుకోబెట్టింది ఈవమ్మ.

రాజమ్మ కండ్లుమూసుకు నేవుంది. స్పృహలో వున్నట్లు లేదు. తల్లినిచూచి కండ్లనీరుంచుకుంది అరుంధతి. ఆమెకు ఏమీ అర్థంకావటంలేదు. అలాచూస్తూ నిలబడి పోయింది.

"నాన్నగారికోసం కబురుచెయ్యనా?" అని అడిగింది ఈవమ్మని.

"ఎవ్వరికోసం?" అని ఆశ్చర్యంగా అడిగింది ఈవమ్మ.

"నాన్నగారికోసం."

"దేనికి?" అని అడిగి బిగ్గరగా నవ్వనారంభించింది ఈవమ్మ. "మీ అమ్మను ఈస్థితికి తీసుకువచ్చి వొదిలాడు. చాలదా? ఇంకా ఇక్కడికికూడా ఎందుకు?" అన్నది.

రాజమ్మ కొస్త తెప్పరిల్లింది. కండ్లు తెరచి వోరగా చూసింది.

"ఎట్లావుందమ్మా?" అని అడిగింది అరుంధతి.

"రవ్వంత తేలిగ్గానేవుంది."

"తేలికపడక దాని అబ్బగాడికి అచ్చివున్నానా?" అని, రాజమ్మ ముఖంలోకి తొంగిచూచి, "తాగుతావా?" అని అడిగింది.

ఈవమ్మ ఉద్దేశం రాజమ్మకు వెంటనే అర్థం కాలేదు. ఏ మంచినీళ్ళో అనుకొని, "కాసిని ఇప్పించండి," అన్నది.

"ఆమె అడిగేది మంచినీళ్ళసంగతి కాదమ్మా" అని చెప్పింది అరుంధతి.

అప్పుడర్థమయింది రాజమ్మకి. తను తాగటం ఏమిటి పాడు! మొగవాళ్ళు తాగుతుంటేనే అంతా విడ్డూరంగా చెప్పుకుంటారు. తనకు అదొక్కటే తక్కువ. పోయే రోగం ఏదో వచ్చిగాని లేకపోతే 'తాగుతావా?' అని తనను అడగ టం ఏమిటి? వాళ్ళల్లో ఆడవాళ్ళూ, మగవాళ్ళూ కలిసి తాగుతారు కాబోలు!

వెంటనే, తాగితే 'ఎట్లావుంటుందో!' అని అనిపించింది. తన ఆలోచనకు తనకే నవ్వొచ్చింది. నవ్వుతూనే, "మాకు అలవాట్లు లేవండీ," అన్నది.

"ఇంతవరకూ ఎప్పుడూ తాగలేదా?" అని ఆశ్చర్యంగా అడిగింది ఈవమ్మ.

"లేదండీ. మా ఇళ్ళల్లో త్రాగటం తప్పుగా భావిస్తారు. ఎక్కడయినా మగవాళ్ళు తాగితే తాగుతారేమో గాని ఆడవాళ్ళుమాత్రం ముట్టుకోరు" అన్నది రాజమ్మ. కాని వెంటనే ఆమెకు వొకసంగతి జ్ఞాపకంవొచ్చింది. మూడో కాన్పు అప్పుడు పరిస్థితి కొంచెం గాడితప్పితే ఎవ్వరో బ్రాందీతాగిస్తే మంచిదన్నారు. ఎవ్వరో బ్రాందీ తన నోటికి అందించారు. తను త్రాగింది.

ఈ సంగతి దాచుకోవటం ఎందుకని ఈవమ్మకి తెలియజేసింది రాజమ్మ.

"సరే" అన్నది ఈవమ్మ.

కిటికీలోవున్న బుడ్డినితీసి మూత టప్పున లాగివేసింది. అందులోవున్న ద్రవం బుస బుస పొంగింది.

'ఇదికూడా బ్రాందీయేనేమో' అనుకుంది చూస్తూ పడుకున్న రాజమ్మ. ఏమాటకి ఆమాట చెప్పుకోవాలి. బ్రాందీ తాగినప్పుడు కుంకుడుకాయ రసంలాగుండి అసహ్యంగా వుందిగాని తరువాత అప్పుడప్పుడూ దానిమీదకు ఆమెమనస్సు పోతూవుండేది. ఏదోవొక వంక పెట్టుకొని మళ్ళీ త్రాగాలనిపించేది. కాని ఇంతవరకు ఆ అవకాశం ఆమెకు లభించలేదు

సీసాలోవున్న ద్రవం వొక చిన్నగ్లాసులో పోసుకువచ్చి, "తాగు" అన్నది ఈవమ్మ.

లోపలఅయితే 'బాగుండును' అనుకుంటూ పైకి, "బ్రాందీ అయితే నేనుతాగను" అన్నది రాజమ్మ.

"బ్రాందీకాదు."

"మరేమిటి?"

"జిన్."

జిన్ మద్యంకాక మామూలు మందేమోనని లోపల భయపడుతూ పైకి, "అదీ వొకరకం మద్యమే అయి వుంటుంది" అన్నది.

"మద్యం అయితే త్రాగవా?" అంటూ గిన్నె అందించింది ఈవమ్మ.

"అబ్బొ, ఈ వాసన భరించలేను" అని ముఖం చేతుల్తో కప్పుకుంది.

బలవంతంగా చేతులు పడగీసి నోట్లో పోసింది ఈవమ్మ. 'వొద్దు వొద్దు' అంటూనే, 'తాగను తాగను' అంటూనే గుటక వేసింది రాజమ్మ.

తాగేవరకూ తాగాలనిపించిందిగాని తీరా తాగేటప్పటికి చేదు విషంగావుండి కడుపులో త్రిప్పింది. కాస్త నిమ్మదించగానే మళ్ళీ తాగబుద్ధి అయింది.

"ఇక చచ్చినా నేను తాగను," అన్నది రాజమ్మ, నాలికతో పెదవులమీదవున్న బొట్లు చప్పరిస్తూ.

మరొకడోసు పోసింది ఈవమ్మ.

కండ్లముందు జరుగుతున్నది విచిత్రంగా చూస్తూ నుంచున్న అరుంధతి, "అమ్మకు అలవాటులేదు. ఏదన్నా ప్రమాదం జరుగుతుందేమో, అంతటితో ఆపితే బాగుంటుంది," అన్నది.

"నాకు చెప్పవొచ్చావా? ముచ్చిక మూడుసార్లు పొయ్యాలి," అన్నది ఈవమ్మ.

అప్పటికప్పుడే కైపులోకి దిగుతున్న రాజమ్మ, నాలిక మడతవేసి, "పొయ్యాల్సివుంటే పొయ్యి," అన్నది. అచ్చగా మగవాడన్నట్లే అన్నది.

ఈవమ్మ మళ్ళీ పోసింది.

ఆ మూడవ డోస్‌తో పూర్తిగా వశం తప్పి మాట్లాడ నారంభించింది రాజమ్మ. "చూడు అరుంధతీ, నువ్వు నా కూతురువి. అంతేనంటావా? చెప్పుమరీ. అందుకని నేను నీతో వొకమాట చెపుతా. అది బాగా మననం చేసుకుంటే ఈ లోకంసారం దానంతట అదే నీకు బోధపడు

తుంది. నువ్వు నీ మొగుడుసంగతి ఆలోచించక. మొగుడు సంగతి ఆలోచించి, ఆలోచించి నేను ఎట్లా అయ్యానో చూస్తున్నావుగా. నువ్వు నాకుమల్లే అవ్వొద్దు. నీకు ఏది ఇష్టమనితోస్తే ఆపనిచెయ్యి. మొగుడనీ మొద్దులనీ, పిల్లలనీ, జెల్లలనీ మోటుపనుల్లో వేలుపెట్టకు. కన్నతల్లినిగనక చెపుతున్నా. ఈమాట చెప్పాలని చాలా రోజులనుంచి అనుకుంటున్నా. కాని, యిప్పటికి ఈ ఈవమ్మగారి దయవల్ల అవకాశం దొరికింది. అందుకు ఆమెకు దణ్ణంపెట్టు."

"అట్లాగే," అన్నది అరుంధతి.

"అట్లాగే అంటే కుదరదు. నేను చూస్తుండగా దణ్ణం పెట్టాలి," అని ఆమె చేతులు పట్టుకొని జోడించేటట్లు చేసింది. ఆమె ప్రవర్తనకు 'మందు మహాత్యం' కారణం అని తెలిసిన ఈవమ్మ నవ్వుకుంది.

ఆమెనవ్వు అరుంధతికి వింతగావుంది. కొండ పగులుతున్నట్టూ, చీకటి రగులుతున్నట్టూ, సముద్రం పొంగుతున్నట్టూ వుంది.

"కాసేపు అట్లాగేవాగి పడుకొని నిద్దరోతుంది. నేను వెళ్ళొస్తాను," అన్నది ఈవమ్మ.

"ఇక ఏమందూ ఇవ్వక్కర్లేదుగదా?"

"అక్కర్లేదు."

"అంతా సరిగ్గావున్నట్టేనా?"

ఈ ప్రశ్నకు తాను సమాధానం చెప్పకుండా, "ఎట్లావుందో చెప్పు?" అని రాజమ్మని అడిగింది ఈవమ్మ.

"బలేబాగుంది. నేను పుట్టినప్పటినుంచీ ఇప్పటి దాకా ఇంత బాగా ఎప్పుడూ లేదు. ఆకాశంలో తేలి పోతు న్నట్లు వుంది. ఇంతకముందు మనస్సూ దానిలోనుంచి పుట్టుకువచ్చే ఆలోచనలూ బరువుగావుండేవి. ఇప్పుడన్నీ తేలిగ్గావున్నయి. బలేబాగుంది. నేను త్రాగిందాని పేరే మన్నావు ఈవమ్మా?'

"జిన్."

"దానిపేరు నాకు జ్ఞాపకం వుంటుందో లేదో నువ్వ జ్ఞాపకంవుంచుకో అరుంధతీ. ఎప్పటికయినా దాని అవుసరం రావొచ్చు. అవుసరందాకా ఎందుకు? త్రాగబుద్ధే కావచ్చు," అన్నది రాజమ్మ కుమార్తెతో.

ఈవమ్మ పుసుక్కున నవ్వింది. ఆ నవ్వు దయ్యం తుమ్మినట్లు వుంది.

ఈవమ్మ గదిలోనుంచి బయటకు అడుగు పెట్టగానే, కుమార్తెను వచ్చి దగ్గర కూర్చోమన్నది రాజమ్మ. ఆమె కూర్చోగానే వీపు నిమురుతూ, "వాళ్ళకోసం వాళ్ళు బతక టం అంటారే అది అర్థంలేని మాట అరుంధతీ! అటూ ఇటూ తిరిగి ఆ మాటకు అర్థం పురుషుడికోసం స్త్రీ బతకటం అవుతుంది. ఇప్పుడు మీ నాన్న కోసం నేను బ్రతకటంలా అట్లా. అట్లా బ్రతకటం చాలా తప్పు. నాకుమల్లే మీ నాన్నా, మీ నాన్నకు మల్లే నేనూ తయారయితే ఇక అందం ఏముంది? ఎవ్వరి మొఖం వాళ్ళు అద్దంలో చూసు కొని మురుసుకున్నట్టు వుంటుంది. అందరి ముఖాల్లోనూ

వొకే పోలికల్తో, అందరి మనస్సుల్లోనూ వొకే ఆలోచనలూ వుంటే, మనం బ్రతగ్గలమా? బోర్ కొడుతుంది. (ఈ మాట మామూలుగా లక్ష్మీదేవి ఉపయోగిస్తుంది. తనకు ఎప్పుడు అలవాటయిందో రాజమ్మకు తెలియదు. ఆమెకు తెలియకుండానే అతి సహజంగా ఆమె నోటినుంచి వెలువడింది. వెలువడిన ఆ మాట సవ్వడికి రాజమ్మే ఆశ్చర్యపడింది. కూతురుని చూచి చిరునవ్వు నవ్వింది.) అందుకని వొకళ్ళకు మల్లే వొకళ్లం బ్రతకాలని మనం అనుకోగూడదు. ఎవ్వరి వ్యక్తిత్వం వారిది. వొకళ్ల గొడవ ఇంకొకళ్ల కెందుకు? వొక్కొక్కళ్ళకి వొక్కొక్క పద్ధతి సుఖంగా ఉంటుంది. ఆ పద్ధతినే పోతే సరిపోయె. ఇతరులు వాళ్లని ఆ పద్ధతినే పోనిస్తే సరిపోయె. అందరం హాయిగా, జలసాగా (ఈ మాటకూడా లక్ష్మీదేవి అనే మాటే) బ్రతకవచ్చు" అని, "అవునంటావా కాదంటావా చెప్పు," అని నిగ్గదీసింది అరుంధతిని.

అరుంధతి ఏమంటుంది? తల్లి ధోరణికి ఆమె అయోమయస్థితిలోవుంది. అది జిన్ మహత్యమూ లేక లోలోపల ఏదన్నా ప్రమాద పరిస్థితి ఏర్పడుతూ వుందో, ఆమె తెలుసుకోలేకుండా వుంది.

"మాట్లాడవేం?" అని గద్దించింది తల్లి.

"అవు నవును" అన్నది అరుంధతి.

"ఏమిటి అవునవును? ఏమిటే అవునూ! నీ మొహమా? నా మొహమా? ఏమిటి అవును. లేకపోతే మీ నాన్న మొహమా? మీ నాన్న మొహమే."

తన తెలివికి తానే బిగ్గరగా నవ్వింది రాజమ్మ. కాని ఆనవ్వుసహజంగాలేదు.బీటలువారి వుంది రేవులు వారివుంది.

"నీకు తెలియదు. నే చెపుతా విను" అని మొదలు పెట్టింది రాజమ్మ. కూర్చోబోయి తూలి వెనుకకు పడింది. మోచేతి మీదకు వొత్తిగిలి చెప్పుకుపోయింది.

"మనకు వూరికే నూరిపోస్తారు గాని అసలు ఈ ప్రపంచంలో తప్పనేదే లేదే అరుంధతీ! ఈ సంగతి జ్ఞాపకం వుంచుకో. తప్పనేదే లేదు. వొప్పుకూడా లేదంటావా? అయితే అదికూడా లేదు. ఇక వుందేమిటి? నీకు నువ్వు, నాకు నేనూ అంతే. వుందల్లా సుఖమే. దాని వెంట పడితే ఎవ్వరి బ్రతుకైనా హాయిగా వెళ్ల మారిపోతుంది. అంతేనా అరుంధతీ?"

"అంతేలే అమ్మా. ఇక నువ్వు పడుకో," అన్నది అరుంధతి పక్క చేతుల్తో సర్దుతూ.

"పడుకునే వున్నా" అన్నది రాజమ్మ తనలో తను నవ్వుకుంటూ. ఆమె మనస్సులో భావతరంగాలు ఎన్ని, ఏ రకంగా పొర్లుకు వస్తున్నవో, తరుముకు వస్తున్నవో చెప్పటం కష్టం.

"మాట్లాడకుండా పడుకో అమ్మా."

"కాసేపు మాట్లాడ నివ్వవే? నేను మాత్రం ఎల్లప్పుడూ మాట్లాడుతానా? ఎన్ని మాట్లాడినా ఇవ్వాళ వొక్క రోజే గద. రేపటినుంచి మళ్ళీ యధా ప్రకారమే అమ్మే. ఇవ్వాళ చాలా సంతోషంగా వుంది. ఆ సంతోషంలో ఇన్నాళ్లూ మనస్సులో మరుగునవున్న సంగతులన్నీ

చెప్పినెయ్యాలని వుంది. చెప్ప నియ్యవే. ఈ సంగతులు చెప్పింతరువాత ఇక మళ్ళీ మాట్లాడను. ఒట్టు. నోరు మూసుకుని వూరుకుంటాను. కాసేపు మాట్లాడతాను. నా అమ్మవు గదూ ! నా తల్లివి గదూ ! మాట్లాడనిస్తావు గదూ కాసేపు. కాసేపంటే కాసేపు. నీతో అబద్ధం చెపుతానా ? అమ్మవుగదూ. నను కన్నతల్లివి గదూ," అని గడ్డం పట్టుకొని రకరకాల బ్రతిమాలటం మొదలు పెట్టింది.

అరుంధతికి ఏమనటానికీ తోచలేదు. తను తల్లి అయినట్లూ ఆమె తన కూతురు అయినట్లూ మారాం చేస్తుంటే అరుంధతికి సిగ్గువేసింది.

కాని వెంటనే తాను తల్లి అయినట్లే మాట్లాడింది. "వింటాను గాని నాలుగు మాటలు చెప్పి వూరుకుంటావా?"

"ఓ, అమ్మతోడు."

"తరువాత పడుకుంటావా ?"

"కళ్ళుమూసుకొని బండ నిద్దరోతాను."

"అయితే త్వరగా చెప్పు."

"చెప్పేది ఏముందే తల్లీ ?" అని మొదలు పెట్టింది రాజమ్మ. ఆమె మనస్సులోకి ఏయే భావాలు వచ్చాయో, జీవితంలోని ఏయే సంఘటనలు జ్ఞాపకం వచ్చాయో, వెంటనే వెక్కి వెక్కి ఏడ్వనారంభించింది.

"ఊరుకో అమ్మా. ఏమిటిది ?"

"చెప్పుకోటానికి సిగ్గుగావుందే అమ్మా" అని కూతురు వొళ్ళో తల పెట్టుకొని శోకాలు మొదలు పెట్టింది రాజమ్మ.

ఆమె స్థితికి అరుంధతి కండ్లలో నీళ్ళు తిరిగినై. చీరె

చెంగుతో తన కండ్లనీరు తుడుచుకొని, వొళ్ళో తల పెట్టుకొని ఏక ధారగా ఏడుస్తున్న తల్లి కన్నీరు వొత్తింది. చెంపలు తుడిచింది.

నిజానికి తల్లి ఎందుకు ఏడుస్తూవుందో ఆమెకు తెలియదు. కారణం ఏదయితేనేం? ఏడుస్తూ వుంది. అందులో అంత గడుసుగా నోరుచేసుకోగలిగిన ఆమె వొళ్ళో తల పెట్టుకొని పసిపిల్లకుమల్లే ఏడుస్తూవుంది అది చాలు అరుంధతి మనస్సు కరగటానికి. తనూ ఏడుస్తూ కూర్చుంది. ఆ ఏడుపుకు ఆ కారణమే కావచ్చు. అయితే ఏం? ఏడుపు ఏడుపే గదా ?

ఈ సారి, "ఏడవకమ్మా" అని తల్లి వోదార్చింది. "నా పిచ్చి తల్లి ఎట్లా బ్రతుకుతుందో !" అని కూతురు మేను నిమిరింది. "ఆ ఒక్క మాటా చెప్పి, నీ మాట ప్రకారం నిద్రపోతాను. సరేనా ?" అని అడిగింది.

"చెప్పమ్మా, చెప్పు."

"మీ నాన్నను నేను వివాహం చేసుకోవటంలో అర్థం లేదు అరుంధతీ. పెద్దమ్మవారు నెత్తిన కూర్చుని చేసుకున్నాను. పిల్లదాన్ని అవటంవల్ల నాటకంలో వేషం చూచి మోజుపడి చేసుకున్నాను. సూ వాళ్ళంతా అంటూనే ఉన్నారు. కాని నా బుద్ధి అప్పటికే గడ్డి తిని కూర్చుంటే, వాళ్ళ మాటలు నేను ఎందుకు వింటాను? ఆ తప్పే చెయ్యకపోతే ఈ నాడు ఇట్లా వుండేదాన్నా? పెద్ద రాజభవనం అంత బిల్డింగ్‌లో వుండేదాన్ని. లక్షలమీద అధికారిణిగా వుండి కార్లమీద తిరుగుతూ వుండేదాన్ని.అవన్నీ పోగొట్టు

కొని ఇప్పుడు చావటానికి సిద్ధంగా ఈ కుక్కి మంచంమీద పడివున్నాను," అని ఏడ్చింది. ఏడవటంలో అట్లా ఇట్లా కాదు. గుండె అలసిపోయేటట్లు ఏడ్చింది. కూతుర్ని కావిలించుకొని ఏడ్చింది.

ఆమె ఇప్పుడా సంగతులన్నీ ఎందుకు చెపుతూ వుందో అరుంధతికి అర్థంకాలేదు. ఎప్పటికో ఒకప్పటికి అర్థంకాక పోతుందా అనుకుంటూ వింటూ వూరుకుంది.

"అప్పుడు నేను ఇట్లా వుండేదాన్నా? ఎంత అందంగా వుండేదాన్ననుకున్నావు! చదువుకునే పిల్లలందరూ అస్తమానం నన్నుగురించే చెప్పుకుంటూ వుండేవారు. కొంతమంది మా క్లాసు విడిచిపెట్టేదాకా వుండి నన్ను వెన్నాడి, ఇంటిదగ్గర విడిచి వెళుతుండేవాళ్ళు. నిజం నీ దగ్గర దాచటం ఎందుకు? అందులో విశ్వేశ్వర్రావు అనే కుర్రవాడు వుండేవాడు. అతనంటే నాకు ఇష్టంగానే వుండేది. నేనుసరే నంటే నన్ను వివాహం చేసుకుంటానికి సిద్ధంగా వున్నాడు. పెద్దమ్మారు నా నెత్తిన కూర్చుంటే నేను ఎందుకు అంటాను? ఎందుకు చేసుకున్నానో, ఏం చూసి చేసుకున్నానో మీ నాన్నను చేసుకున్నాను."

"ఇప్పటికీ విశ్వేశ్వర్రావు అప్పుడప్పుడూ జ్ఞాపకం వస్తూనే వుంటాడు. అతన్నే గనక చేసుకొని వుంటే ఇప్పుడు ఇంగ్లండులో వుండేదాన్ని. ఆ అదృష్టం నాకు పట్టలేదు. ఇంకేవ్వతెకో పట్టింది" అని మళ్ళీ కన్నీరు పెట్టుకోసాగింది.

"ఇప్పుడతను ఇంగ్లండులో ఏదో పెద్ద ఉద్యోగం చేస్తున్నాడు. మొన్న అతని బొమ్మ పత్రికల్లో పడితే చూశాను? ఎట్లా వున్నాడనుకున్నావు? అచ్చగా దొరకు మల్లేనే వున్నాడు. అప్పుడతన్ని నేను చేసుకొని వుంటే ఎంత బాగుండేది అనిపించింది. ఏమనిపించి ఏం లాభం ? ఈ గానుగలో పడ్డాను. అది తిరుగుతుంటే నేనూ తిరుగుతున్నాను. నాలో చమురు అయిపోయేదాకా పిండి, పిప్పి అవతల పారేస్తారు. పిప్పి .. ఒట్టి పిప్పి....నువ్వు మాత్రం ఎవ్వరికోసం త్యాగాలు చెయ్యకు తల్లీ! నేను చేసినవి నీకూ నాకూ కనీసం పది జన్మలకైనా సరిపోతయి. నేను కోపం వచ్చి వద్దన్నా నా మాట పట్టించుకోకేం? చక్కగా చదువుకో. ఉద్యోగం చెయ్యి....ఎవరైనా నువ్వు కావాలని ఒస్తే కాపురం చెయ్యి. లేకపోతే లేదు. అంతేగాని భర్త అని అతనేం చేసినా పడివుండటం నీ ధర్మం అని అతగాడి దగ్గరకు వెళ్ళకు. ఈ విషయంలో తలిదండ్రులం మేమిద్దరం కలిసి చెప్పినా మా మాట వినవలసినపని లేదు— ముందే చెపుతున్నాను. వూరికే భర్తలని మనం గౌరవం చూపటమేగాని, ఏం భర్తలు, నా మొహం భర్తలు! వాళ్ళకంటే సినిమా గేట్లల్లో టిక్కెట్టు డబ్బు వసూలు చేసుకునే వాళ్ళు నయం...."

ఆ విధంగా ఆమె చెప్పుకు పోతూనేవుంది. అరుంధతి ఎప్పుడు నిద్రపోయిందో పోయింది. అరుంధతి ఎప్పుడు నిద్రపోయిందో తెలియకుండానే చెప్పినంత సేపు చెప్పి తానూ నిద్రపోయింది రాజమ్మ.

ఆ రాత్రి ఆమెకు గాఢనిద్ర పట్టింది. ఆమెకే కాదు, అరుంధతికి కూడా కలతలేని నిద్రే పట్టింది. ఉదయం ఈవమ్మ కేకలు వేసేవరకూ వాళ్ళు లేవనేలేదు.

*   *   *

ఆలస్యంగా పడుకున్నప్పటికీ, అయిదు గంటలకే మెలకువవచ్చింది నారాయణరావుకి. చెంతనపడుకున్న పిల్లవాడు పక్క తడపటమే అందుకు కారణం.

లేచి పక్క మార్చేవోపిక లేక పక్కగుడ్డ మడిచివేసి పడుకున్నాడు. ఇటూ అటూ కదల్చటంవల్ల పిల్లవాడు గునవటం మొదలు పెట్టాడు.

"పడుకో!" అన్నికసిరాడు నారాయణరావు.

వాడు బిగ్గరగా ఏడవటానికి ప్రూనుకుంటే, మిగిలిన పిల్లలంతా ఎక్కడ లేస్తారోఅని భయపడి బుజ్జగించి ఊరట పెట్టాడు నారాయణరావు.

నిద్ర చాలక కండ్లు మండుతున్నాయి.

'అంతా సక్రమంగా జరిగివుంటుంది, అందుకనే అక్కడినుంచి కబురు ఏమీ రాలేదు,' అని తేల్చుకున్నాడు. వెంటనే కబురు పంపటానికి మనుష్యులెవ్వరూ దొరకలేదేమో అనే అనుమానం కలిగింది. 'ఒస్తే అరుంధతే రావాలి. అరుంధతి కదలటానికి వీల్లేని పరిస్థితి అక్కడ కలిగి వుండవచ్చు!' అనుకున్నాడు.

నెమ్మదిగా తానే ఈవమ్మగారి ఇంటివైపు ఒకసారి వెళ్ళి వద్దామనుకున్నాడు. బయటనుంచి చూచి, సంగతి సందర్భాలు తెలుసుకొని తిరిగి వచ్చివెయ్యవచ్చు.

బయట చచ్చే చలిగావుంది. చలి అంటే మామూలు చలి గాదు. 'ఎముకలు కొరికే చలి' అంటారే అది.

నారాయణరావుకి లేవబుద్ధి కాలేదు. మంచాన్ని అంటిపెట్టుకొని పడుకోబుద్ధి అయింది ఆ క్షణం. 'జరిగేది జరగక మానదు. జరగనియ్' అనుకున్నాడు. జరగవలసిం దేదో జరిగే వుంటుంది. అప్పుడు తాను వెళ్ళి చేసేది మాత్రం ఏముంటుంది? ఇంకొక గంట సేపట్లో అరుంధతి రానే వస్తుంది, విషయం తెలియనే తెలుస్తుంది.

పిల్లవాడు తడి చేసినచోట పక్క మడిచాడు అన్న మాటే గాని తడి తగులుతూనే వుంది నారాయణరావుకి. వొత్తిగిలి పడుకున్నంత సేపూ బాగానేవుంటుంది. ఎప్పుడో మధ్యలో మరచి జరగటం, తడి తగిలి ప్రాణాలు జివ్వున లాగటం జరుగుతూవుంది. అందుకని ఒక ప్రక్కకు వొరిగి పడుకుంటే నిద్ర పట్టటంలేదు.

అంతలో పక్క హాల్లో మిగిలినవాళ్లతో కలిసి పడు కున్న చిన్నది ఏడ్చింది. ఎకాఎకిని 'కాఫీ' అని ఒక పెద్ద కేక పెట్టి చటుక్కున ఏడుపు అందుకుంది.

"పడుకుంటావా, వీపు బద్దలగొట్టమంటావా?" అంటున్నది లక్ష్మీదేవి.

"కాఫీ!"

ఆమాట లేవటానికి మిగిలిన పిల్లలందరికీ సిగ్నల్.

"ఆకలే" అన్నది మరొకపిల్ల.

"శేలకా! లేచి కాఫీ పెట్టు" అన్నాడు రామనాథ్.

గుంయ్‌న గోల చెలరేగింది.

పక్కన పడుకొని వున్న పిల్లవాడు "కాఫీ" అన్నాడు. వాడు తాను పక్క సర్దిందగ్గరనుంచీ మేల్కొనే వున్నాడని అప్పుడుగాని గ్రహింపుకి రాలేదు నారాయణరావుకి.

"నువ్వు మెదలకుండా పడుకుంటే తెస్తా"

"కాఫీ"

"నోరుమూస్తావా, ముయ్యనా?"

వాడు నిజంగా చేత్తో నోరు మూసుకున్నాడు.

"అంతవరదాకా అక్కర్లేదులే. మెదలకుండా వూరుకుంటే చాలు" అన్నాడు నారాయణరావు.

ఆ పిల్లవాడికి ఆ మాటలవల్ల కొంచం ధైర్యం వచ్చినట్లు వుంది. నోటిమీదనుంచి చెయ్యి తీసి, "కాఫీ!" అన్నాడు.

ఆ పిల్లవాడి చేష్టకు నారాయణరావుకి నవ్వు వొచ్చింది. "సరే తెస్తాను. ఇక్కడే వుండు" అని చెప్పి ఏం జరుగుతూవుందో చూద్దామని వంట ఇంట్లోకి వెళ్ళాడు.

వంటఇల్లు హిరణ్యకశిపుని కొలువు కూటం

లాగుంది. చిన్న పిల్ల పీటమీద చతికిలబడి "కాఫీ అక్కా" అని దీనారవాలను వెడల్ర గక్కుతూ వుంది. ఒక పిల్లవాడు క్రింద గచ్చుమీదపడి పొర్లాడుతున్నాడు. రామనాథ్ ఒక కుర్చీలో కూర్చొని, "ఆకలమ్మా ఆకలి" అని పాడుతున్నాడు. మిగిలిన ఇద్దరు పిల్లలు ఒకరిజుట్టు వొకరు పీక్కుంటూ రక్కుకుంటూ పెద్దపెట్టున ఏడుస్తున్నారు.

లక్ష్మీదేవి స్టౌ వెలిగించటానికి ప్రయత్నిస్తూ వుంది.

"ఎంతవరదాకా వచ్చావమ్మా?"

"అక్క నిప్పుపెట్టె ఎక్కడపెట్టిందో కనపడలేదు నాన్నా."

"తెచ్చిపెట్టనా?"

"ఆ అలమరలో వుందేమో చూస్తాను" అని అలమర దగ్గరకు వెళ్ళి వెతికింది. పిల్లల చూపులన్నీ అలమర వైపుకు తిరిగినై.

నిప్పులపెట్టె దొరకనే దొరికింది. కానీ తీరా స్టౌ దగ్గరకు వొచ్చేటప్పటికి స్టౌలో కిరసనాయిలు లేదని తెలిసింది. సీసాలో కిరసనాయిలు అయిపోయింది.

తండ్రిని చూచి కంగారుగా "బాగులపొయ్యి వెలిగిస్తా నాన్నా" అన్నది లక్ష్మీదేవి.

"అది వెలిగినట్టే, నువ్వు మాకు కాఫీ ఇచ్చినట్టే" అన్నాడు రామనాథ్.

"కాఫీ" అని ఏడుస్తూ దీర్ఘం సాగించింది చిన్నది.

అంతలో చిన్నవాడు ఎప్పుడొచ్చాడో, లక్ష్మీదేవి కాళ్ళు వాటేసుకొని గుద్దుతూ, లంగాపట్టుకు లాగుతూ, "కాఫీ.... కాఫీ.... కాఫీ ఇవ్వు" అని అరవటం మొదలు పెట్టాడు.

"ఇప్పుడేం చేస్తావులే అమ్మా! ఆ మరచెంబు ఇట్లా ఇవ్వు. హోటలునుంచి తెస్తాను" అన్నాడు నారాయణ రావు.

ఆ మాట అతని నోటివెంట వొచ్చిందో లేదో 'నేను వస్తా', 'నేను వస్తా' నంటూ చిన్నపిల్ల లిద్దరూ అతనిదగ్గరకు జేరారు.

చిన్నపిల్లవాడు మూలనున్న చెప్పులు వెతికి తీసుకు వచ్చి ముందువేసి "తొడుక్కో నాన్నా" అన్నాడు.

తమ్ముణ్ణిచూచి తనుకూడా ఏదో వొకటి చేస్తే గాని తండ్రితో వెళ్ళే అర్హత రాదనుకొని, చిన్నది పై పంచె తెచ్చి ఇచ్చి "వేసుకో నాన్నా" అన్నది.

"బయట చలిగావుంది, మీ రెక్కడికి?" అని గదమాయించింది లక్ష్మీదేవి.

మళ్ళీ వాళ్ళెక్కడ గొంతు ఎత్తుతారో అని భయపడి నారాయణరావు "పోనీ రానివ్వు" అన్నాడు.

"ఇంతకీ అప్పుడే హోటలు తెరుస్తారా నాన్నా?" అని అడిగింది లక్ష్మీదేవి.

"తియ్యవచ్చు" అన్నాడు నారాయణరావు.

"తీస్తారు నాన్నా" అని నమ్మకం చెప్పింది చిన్నది.

"ఎప్పులో తీశారు" అని చూచి వచ్చినట్టు చెప్పాడు చిన్నవాడు.

మొత్తానికి ఎట్లాగయితేం, వాళ్ళిద్దరినీ తీసుకొని కాఫీ పట్టుకు రావటానికి బయటకు వెళ్ళాడు నారాయణ రావు. ఫ్లాస్కు చాలదని పెద్ద మరచెంబు తీసుకొని వెళ్ళాడు.

నిజంగా బయట చాలా చల్లగా వుంది. ఈమధ్య శరీరంలో కొవ్వు తగ్గిపోవటంవల్ల నారాయణరావు చలికి తట్టుకోలేక పోతున్నాడు.

అతనికి వొణుకు పుట్టింది.

వాళ్ళ ఇంటికి ఎదురుగానే ఒక కాఫీ హోటలు వుంది. వాళ్ళింకా తెరవలేదు. దగ్గర్లోనే అవతల బజార్లో మరొక హోటలు వుంది. అది చిన్న హోటలు. రాబడి తక్కువ. అందువల్ల అక్కడ ప్రొప్రయిటరూ, పనిచేసే వాళ్ళూ సైతం ఇతర హోటల్లోవాళ్ళ కంటే శ్రద్ధగా వుంటారు. వెళ్ళిన వాళ్ళందర్నీ పెద్దా చిన్నా తారతమ్యం

లేకుండా గౌరవంగా చూస్తారు. పదార్థాలూ, కాఫీ కూడా బాగానే వుంటై.

పిల్లలను చెరోక చేత్తో పట్టుకొని, మరచెంబు చంకలో పెట్టుకొని ఆ హోటలుకి దారి తీశాడు నారాయణరావు.



